# శ్రీ దివ్యమాత



సంపాదకులు:
వి. మన్‌మోహన్‌రెడ్డి
సి. నారాయణరెడ్డి

INSTITUTE OF HUMAN STUDY
మానవ పఠన సంస్థ
ఉస్మానియా విశ్వవిద్యాలయ క్యాంపస్
హైద్రాబాదు-7



శ్రీ దివ్యమాత జన్మదిన సందర్భమున,
ఆమె పాదపద్మములకు, మా భక్తి పూర్వక ప్రణామములు.
21.2.1968.

# తొలిపలుకు

ప్రపంచమునందలి అన్ని భాగములయందుండు ఆధ్యాత్మిక తత్త్వాన్వేషకులను శ్రీ అరవిందాశ్రమమునే తమ నెలవుగా చేసికొనియుండిరి. అది ఒక నూత్న చైతన్యమునకును, నూత్న శక్తికిని, నూత్న లోకమునకును ప్రాతినిథ్యము వహించుచున్నది. అది రూపొందుచున్న దివ్య రాజ్యమునకు సనిలుజ్జ్వలరత్నము. దివ్య జీవితాదర్శ కాంతిలో నిచ్చట నొక ఆధ్యాత్మిక సమాజమును, క్రొత్త మానవతయు పరిణామము పొందుచున్నవి. ఆశ్రమము శ్రీ అరవిందుల యొక్కయు మాతృశ్రీ యొక్కయు ఊహలు పొందిన శక్తిమంతమును స్థిరమునైన వ్యక్తీకరణము.

మాతృశ్రీ వర్ధిష్ణులైన సత్యాన్వేషకుల సమాజమునకు బహిరంతర్మార్గదర్శిని. ఆమె శాశ్వత దివ్యత్వముతోడను, ఉజ్జ్వల మానవత్వముతోడను గూడిన మహామూర్తి. ఆ దివ్యమాత మానవాకారమునుదాల్చి, మనలో నొకతెయై, మనయందును మనతోడను వసించి మనలను దివ్యాలోకము వైపునకు నడపించును. తత్పరమును తత్త్వ సౌధారురుక్షువు నైన మానవ సమాజమునకామె చేయూతనిచ్చి తన అనంత ప్రేమేంద్ర జాలముచే నది సంకుచిత సీమల నతిక్రమించి దివ్య చైతన్య స్వభావ రూపము నందుకొనుటకై సాయమొనరించును. ఆమెను నిరంతరము స్మరించుచుండుటచేతను, అత్యుజ్జ్వల సృష్టియు, సహకారిణియు, మధ్యవర్తినియునైన యేక మూర్తిగను, మర్త్యలోకమున నభివృద్ధి నందుచున్న దివ్య చైతన్యముయొక్క అద్భుత వ్యక్తీకరణముగను భావించుటచేతను మాత్రమే మన మత్యున్నతమును, అతి గంభీరమునైన దశ నందుకొని ఆమె యనుగ్రహమున సత్య చైతన్య సమగ్రత ననుభవింప జాలుదుము.

మేము హృదయ పూర్వకముగను, అత్యంత వినయ పూర్వకముగను ఈ వ్యాస సంగ్రహమను ప్రేమ పూజా గుచ్ఛమును జన్మదినోత్సవ సందర్భమున మాతృశ్రీ పాద పద్మములపై సమర్పించుచున్నాము.

ఇన్స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ స్టడీ
హైద్రాబాదు - 7 (ఇండియా)

వి. మధుసూదన్ రెడ్డి

# సంపాదకుల వాఙ్ముఖము

ఈనాడు, ఈ ప్రపంచమునందు, ప్రతి మనుజుడు బలాత్కారముగ కొనిపోబడు చుండు గమ్యమేది ? ఈ గమ్యమునకు, శక్తితో, ప్రమతో, సచేతనతో కొనిపోవు జ్ఞానానంద శక్తియేది, లేక ఎవరు, అని ప్రతియొక్కరును తన్నుదా ప్రశ్నించుకొని, అందుకు తగిన సమాధానమును తనసుండియో, మరియితరులనుండియో తెలిసికొని, ఆ నిజ సమాధానముచే తన జీవితమును తాను నడిపించుకొని నపుడే, అతనికి శాంతి సుఖసంతోషములు కలుగును. ఈ గమ్యమును, దీనిని నడిపించు శక్త్యానంద జ్ఞానమును తెలిసికొనలేనివాని జీవితము దుఃఖము, వ్యర్థము.

ఈ గమ్యము "క్రమానుగతమైన విశ్వగత సామరస్యమును పృథ్విపై స్థాపించుట" యనియు, ఈ గమ్యమునకు ప్రపంచమునందుగల ప్రతిమానవుని కొనిపోవు జ్ఞానానందశక్తి, "అతిమానసిక పరమ సత్యము" అనియు, శ్రీ మాతారవిందులు తమ చిన్నతనమునాడే చెప్పి శ్రీ అరవిందులు 1910, ఏప్రిల్ 4వ తేదీన యున్ను శ్రీ మాత 1920, ఏప్రిల్ 24 వ తేదీన యున్ను, పాండిచ్చేరికిచేరి, పరస్పరము సహకరించి, ఈ గమ్యమునకు ప్రతిమానవుని చేర్చు అతిమానసిక దివ్యసత్యమును ఎట్లు స్థాపించినది, ఈ గ్రంథమునందు పాఠకులకు తెలుపుటయే "శ్రీ దివ్యమాత" ఉద్దేశము. శ్రీమాత తన 90 సంవత్సరముల జీవితమును పృథ్విపై పూర్ణమొనరించి, మానవ జాతికి నెఱవేర్చియు, ఇంకను నెరవేర్చుచున్న శుభమునకు, ఈ మానవ పతన సంస్థ భక్తి పూర్వకముగ నామెకొసంగు కానుక ఈ శ్రీ దివ్యమాత.

ఈ జన్మదినోత్సవ సంచికను వ్యాసములు వ్రాసియిచ్చిన పలువురు మహారచయితలకు ఉచితరీతి కృతజ్ఞత వెల్లడించుటకు మాటలు చాలవు. శ్రీ అరవిందుల యొక్కయు మాతృశ్రీ యొక్కయు రచనలను ఆంధ్రీకరించుటకు దయతో నంగీకరించిన శ్రీ అరవిందాశ్రమ గ్రంథ ప్రకాశకులకు కూడ మా కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాము.

---

# శ్రీ దివ్యమాత

## విషయసూచిక

### 1_వ భాగము

అధ్యాయము | పేజీ

### శ్రీ మాతారవిందుల గురించి వీరి పరస్పర ప్రవచనములు


1. శ్రీమాతను గురించి శ్రీ అరవిందుల ప్రవచనములు 0
2. శ్రీ మాతారవిందుల గురించి శ్రీ అరవిందుల ప్రవచనములు 18
3. శ్రీ అరవిందుల గురించి శ్రీమాత ప్రవచనములు 66


### 2_వ భాగము

### శ్రీ అరవిందుల రచనలు


1. గీతా సందేశము 73
2. సంఘ పరిణామ చక్రము 104
3. మానవ ఐక్యతాదర్శము 116
4. భారతీయ సంస్కృతిపై బాహ్య ప్రభావము 128
5. సావిత్రి 138
6. జాతీయ విద్య 143
7. శ్రీ అరవిందులు ఆంధ్ర విశ్వవిద్యాలయానికిచ్చిన సందేశము 144


### 3_వ భాగము

### శ్రీమాత రచనలు


1. భారత దేశమును గురించి శ్రీమాత 155
2. శ్రీ మాతృ వాక్కులు 4_వ మాల 160
3. అగ్నికుండము 172

## 4_వ భాగము

అధ్యాయము | పేజీ

## అన్యుల రచనలు


1. శ్రీ అరవిందుల అపూర్వ దర్శనము 183
2. పూర్ణయోగము - పరిచయము 193
3. ప్రపంచ సమైక్యము - విద్యా విధానము 198
4. శ్రీ అరవింద యోగస్వరూపము 204
5. శ్రీమాత 208
6. దివ్య జీవితము - అర్థవంతమైన సృష్టి 212

# మొదటి భాగము

## 1–వ అధ్యాయము

## శ్రీమాతను గుఱించి శ్రీ అరవిందుల ప్రవచనములు

శ్రీమాతకు నాలుగు దివ్యశక్తులు, నాలుగు దివ్య ప్రముఖ వ్యక్తిత్వములు, అంశలు, మూర్తులు కలవు; వీనిద్వారా, ఆమె తన జీవకోటిపై ప్రవర్తించును, లోకములందలి తన సృష్టుల నాజ్ఞాపించి, సమరస పఱచును, తన సహస్ర శక్తుల కార్యముల నడిపించును. ఏలయన, శ్రీమాత ఒక్కతియే, అయ్యును మన యెదుట వివిధాంశములతో నేతెంచును; ఆమె శక్తులు, వ్యక్తిత్వములు అనేకము, విశ్వము నందు ఆమె కార్యమునుచేయు, విభూతులు, స్వకీయ ప్రసరణములు కూడ అనేకము,

శ్రీమాత యను పేరుతో మనము పూజించెడు ఆ దివ్యమూర్తి, సమస్త యునికిపై ఆధిపత్యము వహించియున్న దివ్యచిచ్ఛక్తి: ఆమె, ఒక్కతి యయ్యును, అనంత పక్షములు కలది; ఆమె ప్రగతులను తెలిసికొనుటకు, తీవ్ర – తమ మనస్సునకు గాని, స్వేచ్ఛాతమ – అత్యంత – విస్తృత బుద్ధికి గాని సాధ్యము కాదు. పరాత్పర దైవము యొక్క చేతశ్శక్తులే, శ్రీమాత; ఇంతకు, మిక్కుటముగ, ఆమె సృష్టికారిణి కూడ. ఆమె మూర్తుల ద్వారా, ఆమె విధానముల గూర్చి కొంత తెలియ నగును, స్పర్శించ వచ్చును. ఆమె సృజించిన జీవకోటికి, ఆమె తన మూర్తులగు దేవతారూపముల ద్వారా. అభివ్యక్తమగుటకు అంగీకరించుటచే, ఆదేవతల యొక్క పరిమిత స్వభావమును, ప్రక్రియలను పట్టి, ఆమెను కొంత అధికముగ గ్రహించ నగును.

మనలనూ విశ్వమునూ భరించునట్టి ఆమెయొక్క చిచ్ఛక్తితో మనము తాదాత్మ్య స్పర్శను కలిగించుకొన్నపుడు, మనకు విస్పష్టముగా, తెలియునది, శ్రీమాత యొక్క మూడు స్థితి విధానములు. మొదటిది, విశ్వాతీత స్థితి విధానము: ఈ స్థితి విధానము నందామె, మూల పరాత్పర శక్తియై పరాత్పర దైవముయొక్క

శాశ్వత - అనభివ్యక్త - రహస్యముతో జీవకోటికి సంబంధము నేర్పఱచును. రెండవది విశ్వగడ స్థితి విధానము; ఈ స్థితియందామె, విశ్వమహాశక్తియై, ఈ సమస్త జీవకోటిని సృజించి, తనయందె వహించి, ఈ కోటానుకోట్లుగా గల శక్తులను, విధానములను భరించి, నడిపించి, వానిలో అంతర్హితమై యుండును. మూడవది, వ్యక్తిగత స్థితి విధానము; ఈ స్థితియందామె, పైరెండు విస్తృతతర స్థితులను తనయందె, మూర్తిమంత మొనరించుకొని, వాని రెండింటిని, మనకు సమీపమునకు తెచ్చి, సజీవము కావించి, మానవుని వ్యక్తిత్వమునకు దివ్యస్వభావమునకును మధ్య, మధ్యవర్తినిగ పనిచేయును.

ఏకైక - మూల - విశ్వాతీత శక్తియగు, శ్రీమాత, లోకములకు ఉర్ధ్వమున నిలిచి, పరాత్పర దైవమును, తన శాశ్వత చేతస్సునందు వహించును. ఒక్కతియైయ్యును, ఆమె తన అచింత్య దివ్యసాన్నిధ్యమును, ఏకైక దివ్యశక్తిని తనయందే నిలుపుకొని యుండును: అభివ్యక్తపఱచ వలసిన దివ్యసత్యములను తనయందే వహించియు, లేక ఆహ్వానించియు, దాగియున్న ఆదివ్య రహస్యము నుండి క్రిందికి తన అనంత చేతస్సుయొక్క ప్రకాశములోనికి తెచ్చి, వానికి సర్వ - సమర్థమగు ఆమెశక్తిలోను అనంత జీవితములోను, ఒకానొక శక్తి రూపమునున్ను, జడప్రపంచమునందొక శరీరమునున్ను కలిగించును. ఆమెయందు పరాత్పర దైవము సర్వదా శాశ్వత సచ్చిదానందముగ అభివ్యక్తమై యుండును; మఱియును లోకములయందు ఈశ్వరశక్తియొక్క ద్వైతాద్వైత చేతస్సుగను, పురుష ప్రకృతి యొక్క ద్వి-తత్త్వముగను. విజ్ఞాత-అవిజ్ఞాతలోకము లన్నింటియందును గల ఆమె యొక్క లోకములలోను భూమికలలోను దేవతలలోను కూడ అభివ్యక్తమగును, సమస్తము, పరాత్పర దైవముతో ఆమె జరుపు లీలయే; సమస్తము. శాశ్వతుని రహస్యముల యొక్కయు, అనంతుని అద్భుతముల యొక్కయు ఆమె కావించు ఆవిర్భావములే; సమస్తము, ఆమెయె; ఏలయన, సమస్తము, దివ్యచిచ్ఛక్తి యొక్క భాగములే; అంశములే. ఇక్కడకాని. మరెక్కడకాని. ఆపరాత్పరదైవము సమ్మతించనిది, ఈమె నిశ్చయించినిది, యేదియు నుండజాలదు; పరాత్పర దైవముచే ప్రేషింపబడి, ఆమెచే తెలియబడనిది, ఆమె సృష్ట్యాత్మక - ఆనందమునందు బీజముగా వేయబడి రూపమునందనిది, యేదియు నుండజాలదు.

శ్రీమాత రెండవ స్థితియగు, మహాశక్తి, లేక జగన్మాత స్థితియందు, పరాత్పర దైవము నుండి. ఆమె విశ్వాతీత చేతస్సుచే ప్రేషింప బడిన దానినంతటిని, క్రియా

శీలమొనర్చి, తాను సృజించిన లోకముల లోనికి వానితో ప్రవేశించును: ఆమె సాన్నిద్ధ్యము జీవకోటిని, సర్వపోషకమగు దివ్య - శక్తి - ప్రేమ - ప్రకాశములతో నింపును; ఇది జరుగనిదే, జీవకోటి విశ్వమున వసించజాలదు. శ్రీమాతయొక్క బాహ్యక్రియాత్మక - అంశమును, మనము ప్రకృతి యనుపేరుతో పిలుచు చున్నాము. ఆమె తన శక్తుల యొక్కయు, విధానముల యొక్కయు, సామరస్య తను సమూహ పఱచును, వ్యూధ పఱచును; ప్రకృతి ప్రక్రియలను ప్రేషించును. జీవన ప్రగతియందుంచ బడిన, లేక అనుభవింప బడిన, లేక తెలియబడిన సమస్తము నందును వ్యక్తముగనో, లేక అవ్యక్తముగనో, ప్రవర్తించు చుండును. విశ్వము యొక్క, లేక లోకశ్రేణియొక్క ఒక్కొక్క లోకము, ఆ మహాశక్తి యొక్క ఒక క్రీడ మాత్రమే; విశ్వాతీత మాతయొక్క వ్యక్తిత్వముగను, విశ్వాత్మగను, మహాశక్తి ఆ ఒక్కొక్క లోకము నందును నుండును. - ఆమె ఆనందమునందు సృష్టింపబడి, ఆమెశక్తి సౌందర్య ముల యందు సమూహింపబడి, ఆమె దృక్ప థము నందు చూడబడిన అంశమే, ఆ యొక్కొక్క లోకము.

కాని, ఆమె సృష్టించు చేతనా భూమికలనేకములు, ఆమె దివ్యశక్తియొక్క సోపానములు, అనేకములు. మనము వసించునవి మాత్రమే గాక, ఆమె ఆవిర్భ వించు లోకములు మఱితరములు కూడ కలవు. ఈ ఆవిర్భావ శిఖరముననున్న లోకములు, అనంత సచ్చిదానంద లోకములు, - శ్రీమాత, ఈ లోకములపై శాశ్వత దివ్యశక్తిగ మఱుగుపడి అధిష్ఠించి యుండును. ఆలోకములందు వసించు, చరించు సర్వ సత్త్వములు, అచింత్య పూర్ణతను, అవిపర్యాస-యేకత్వమును. కలిగియుండును. ఏలయన, వానిని సర్వదా తన హస్తముల యందే భద్రముగా వహించి యుండును, అంతకన్న, మనకు సమీపమున, అతిమానసిక సృష్టికి సంబంధమైన లోకములు కలవు. ఈ లోకముల యందు, శ్రీమాత, అతిమాన సిక శక్తిగ, దివ్య - సర్వ - జ్ఞాన సంకల్పమును, సర్వ - శక్తి - మంతమగు జ్ఞానమును. తనయందె వహించిన దివ్యశక్తిగ, అపభ్రంశ మందని కర్మలయందు సదావ్యక్తమై, ఒక్కొక్క స్వీయవిధానము నందును స్వయంప్రవర్తిత పరిపూర్ణతను కలదై యుండును. ఆ లోకములయందు సమస్త ప్రవృత్తులు పరమ సత్యముయొక్క ప్రక్రియలే; అక్కడ సర్వసత్త్వములు, దివ్యప్రకాశముయొక్క ఆత్మలు, శక్తులు, శరీరములే; అక్కడ సర్వానుభవములు, దృఢ - కేవల - ఆనందము యొక్క ప్రవాహములు, సముద్రములే; కాని, ఇక్కడ మనము వసించు చోట, ఈ అజ్ఞాన

లోకములు, చేతస్సునందు తమ మూలమునుండి, వేరుపడిన మనః ప్రాణజడలోకములు కలవు; ఈ లోకమునకు మనపృథ్వి, ఒక అర్థ సహిత కేంద్రమై యున్నది; దీని పరిణామమునకు, నిపుణ విధానము కలదు. దీనికి గల మాలిన్యము, పోరాటము, అపరిపూర్ణత లన్నింటితో, నిదికూడ జగన్మాతచే ఆలంబితమై యున్నది. మహాశక్తిచే, ఇదికూడ, ప్రేషితమై, మార్గమున, ప్రణేయమై రహస్య గమ్యమునకు కొనిపోబడుచున్నది.

శ్రీమాత, ఈ అజ్ఞానత్రిలోకములపై అధిష్ఠించు మహాశక్తిగ, అతిమానసిక లోకమునకును, ఈ జడలోకమునకు మధ్యగల మధ్యస్థిత చేతనా భూమికపై నిలిచి అతిమానసిక లోకమునుండి, అతిమానసిక దివ్యప్రకాశమును, దివ్య సత్య జీవితమును, దివ్యసత్య సృష్టిని, భూలోకమునకు అవతరింప చేయును. ఈ అవతరణ, మనః ప్రాణములు చైత్యపురుషుని వికాసముచే దివ్యాత్మను చేరు ఆరోహక - అవరోహక చేతనా భూమికల ద్వారా, పృథ్వి యొక్క జడనిశ్చేతస్సులోనికి. సంభవమగును. పృథ్వీ పరిణామము నందు, ఆమె చూచిన దానిని, స్పృశించిన దానిని, ఆమె తననుండి గ్రుమ్మరించ వలసిన దానిని పట్టి, ఈ విశ్వము నందుండ వలసిన దాని సంతతిని నిశ్చయించి, దేవతలకు ఊర్ధ్వమున ఆమె నిలచి, చేయవలసిన కార్యము కొఱకు తన పురోభాగమున తన దివ్యశక్తులను దివ్య వ్యక్తిత్వములను నిలిపి యుంచుకొని, ఈ నిమ్నతరలోకములోనికి, పరిపాలించుటకు, యుద్ధము చేసి జయించుటకు, ప్రణేత్రియై పరిణామ చక్రములద్వారా పురోగమింప చేయుటకు. వారి శక్తుల యొక్క వ్యష్టిసమష్టి విధానములను నడిపించుటకు వాని ప్రసరణముల పంపును. ఈ ప్రసరణములు, మానవులు యుగయుగములద్వారా వివిధ నామములచే పూజించిన నానా దివ్యరూపములు, వ్యక్తిత్వములే; కాని ఆమెశక్తి - గుణ - సాన్నిధ్యము యొక్క ఒక్కకిరణమును మానవ చేతస్సు అనెడి మారు రూపమున భౌతిక ప్రపంచములో ఆమె ఆవిర్భవింప చేయు, ఈశ్వర విభూతుల కొఱకు మానవ మనస్సును శరీరమును యెట్లు సిద్ధపఱచునో, అదేవిధముగ, తన విభూతుల మనః శరీరములను కూడ తనదివ్య శక్తులు, వాని ప్రసరణములద్వారా సిద్ధపఱచును. తానే మఱుగుననున్న యొక నటియై, విశ్వ దేవతలను సహాయకులుగ కొని, ప్రపంచ క్రీడారంగములన్నియు, ఒకనాటకముగ ఆమెచే వ్యవస్థీకరింపబడి, ప్రణాలింప బడి, నాటక మాడింప బడుచున్నవి.

శ్రీమాత ఊర్ధ్వము నుండి సర్వులను పరిపాలించుటయె గాక, ఈ నిమ్నతర త్రిలోకము నందవతరించును. నైర్వ్యక్తికముగ. ఇక్కడి సమస్తము, అజ్ఞాన

ప్రవృత్తులు కూడ, మఱుగు పడిన శక్తియగు, ఆమెయె, అల్పీయ వస్తువునందు ఆమె సృష్టులే, ఆమె ప్రకృతియందలి శక్తులు, దేహములే, అయ్యావి. ఉనికియందు, వానికి కూడ స్థానము కలదు. ఏలయన అనంతుని సాధ్యతలయందు గల దేనినో ప్రక్రియ గావించుటకు పరాత్పరుని గుప్త ఆజ్ఞచే ఆమే ప్రేషింపబడి, మహాయజ్ఞమున కామె అంగీకరించి, అజ్ఞానము యొక్క ఆత్మను, రూపములను, మాఱువేషముగ ధరించినది. కాని, వైయక్తికముగ కూడ, ఈ తమస్సును దివ్యప్రకాశములోనికిని, ఈ దోషానృతములను పరమసత్యములోనికిని, ప్రణీత మొనరించుటకును, మృత్యువును దివ్యజీవితముగ మార్చుటకును, ఈ నిర్బంధశీల బాధాదుఃఖములను ఆమె మహోన్నత - ఆనందముయొక్క రూపాంతరిక - ప్రహర్షములో అంత్యము కావించుటకును, పృథ్వీ జీవితములోనికి అవతరించుటకు తన్నుదా నమనపఱచుకొన్నది. ఆమె సంతానమునందు ఆమెకు గల, అగాధ - గంభీర ప్రేమలో, ఈ మలిన వస్త్రమును, తానే ధరించ సమ్మతించినది: ఈ అనృత - తమోశక్తుల ఘర్షణలను, బాధాకర ప్రభావములను భరించుటకుతన్నుదా ఆవర్జించుకున్నది; మృత్యు సమానమగు మరణద్వారముల ప్రవేశించు భారమును మోసినది; సృష్టిని కావించుటలో గల బాధా దుఃఖములను తనపై వేసికున్నది; శాశ్వత జీవితము యొక్క దివ్య సత్య ప్రకాశానందముల లోనికి ఈ యంతయు ఉన్నతింపబడు అవకాశము, ఈ విధముగ మాత్రమే జరుగగలదని తోచుట చేతనే, ఇట్లామే చేసినది. ఈ మహాయజ్ఞమునే, కొందఱు పురుషయజ్ఞమని పిలుతురు: కాని దీనిని ఖచ్చితముగ చెప్పవలయునన్న, ప్రకృతి హోమమని. దివ్యమాత స్వీయమహా యజ్ఞమని పిలువవలెను.

శ్రీమాత యొక్క పృథ్వీక్రీడ వ్యవహారము నందు, ఈ విశ్వమును ఆమె నడిపించు మార్గ నిర్దేశనము నందు, శ్రీమాతయొక్క నాలుగు మహోన్నత - అంశములు, ఆమెయొక్క నాలుగు దివ్య ప్రణీత శక్తులు, వ్యక్తిత్వములు, ఆమె యెదుట నిలిచినవి. అందు నొకటి, నిశ్చల విస్తృతిని, సర్వగ్రాహక - ప్రజ్ఞను, శాంత - ప్రసన్నతను, అక్షయ కృపారసమును, సర్వమును పాలించు మహోన్నత గాంభీర్య సామ్రాట్త్వములనుగల, వ్యక్తిత్వము. రెండవది, అత్యంత-సమర్థతగల ఆమెశక్తిని, అనిరాకరణీయ - ఆవేశమును, ఆమె సంగ్రామోద్యమ భావమును, సర్వమును అవరించు ఆమె సంకల్పమును, ఆమె ఉజ్జ్వల వేగమును, ప్రపంచమునంతటిని నొక్కసారి కదలించగల శక్తిని, మూర్తిమంత మొనర్చుకొని యుండును.

మూడవది, సౌందర్య - సామరస్య - కోమల లయత్వముల యొక్క అగాధరహస్య మును, సంకీర్ణ - సూక్ష్మ - సంపన్నతను, ఆమె బలాత్కార ఆకర్షణను, మోహింప చేయు కృపారసత్వములను, విశుద్ధ - మాధుర్య - అద్భుతములను, కూడి యుండును. నాల్గవది, ఆమెయొక్క దృఢ- గంభీర సమర్థతగల సుపరిచిత జ్ఞానమును, జాగృత్తిక - నిర్దుష్ట క్రియాపరతను, సర్వవస్తువుల యందును గల స్థిమిత - స్పష్ట పరిపూర్ణతను కలిగి యుండును. వాని వేర్వేఱు గుణస్వభావ శక్తులివి. - వివేకము, సామర్థ్యము, సామరస్యత, పరిపూర్ణతలు : వీరీశక్తులను. ఈ లోకములోనికి తమ వెంట తెచ్చి, మానవ రూపమున తమ విభూతుల యందు ఆవిర్భవింపచేస్తు శ్రీమాతృ సజీవసరళ-ప్రభావమునకు, తమపృథ్వీ స్వభావమును తెలచుకొను వారియందు. వారివారి ఆరోహకశక్తి క్రమమును పట్టి, స్థాపించును, ఈ నాల్గు వ్యక్తిత్వములకు మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి, యను మహా నామములను మనమిత్తుము.

లోకాధీశ్వరి యగు మహేశ్వరి మానవ మనస్సుయొక్క చింతనా సంకల్పము లకు పైన అవస్థితమై, వానిని బృహత్వ వివేకములలోనికి అధిక పఱచి ఉన్నత పఱచును; లేదా, దాని కావలనున్న ప్రకాశముతో ప్రవహింప చేయును. ఏలయన, ఆమె మనల, అతిమానసిక - అనంతములకు, విశ్వ వ్యాపకతకు, పరమదివ్య ప్రకా శోన్నతమునకు, అద్భుతజ్ఞాన నిక్షేపమునకు, శ్రీమాతృ శాశ్వత శక్తులయొక్క అపరిమిత ప్రగతికి, మనల తెఅచి యుంచును; ఆమె సర్వదా శాంత - మహోన్నత - అక్షుబ్ధ - అద్భుతముల కూడి యుండును, సమస్త వివేకము ఆమె యందు కలదు గనుక, ఆమె నేదియు కదలింప జాలదు; ఆమె తెలిసికొన గోరినదేదియు, ఆమె నుండి దాగి యుండదు; ఆమె, సర్వవిషయములను, సర్వసత్త్వములను, వాని స్వభావమును, ప్రచలింప చేయు దానినంతటిని, విశ్వ ధర్మములను, వానివాని సమయ ములను, సర్వము ఎట్లు యుండినది, యుండునది యుండబోవునది గ్రహించును. సర్వమును నెదుర్కొని ప్రభుతను వహించు సమర్థత ఆమెకున్నది; అంత్యమున, ఆమెయొక్క విస్తృత - దురాలభ వివేకమునకును, ఉన్నత శాంత శక్తికిని నెదుట ఎవ్వరు నిలువ జాలరు. సంకల్పమునందు మార్పు కాంచనిదై, క్షమాసమతలను కలిగి, మనుజులతో వానివాని స్వభావమును పట్టి వ్యవహరించును; అట్లే విషయ సంఘటనలతో కూడ, వానివాని యందుగల సత్యమును, శక్తినిపట్టి వ్యవహరించును. ఆమె కెవ్వరియందును పక్షపాతములేదు: కాని ఆమె పరాత్పరుని ఆజ్ఞలను అనుస

రించి, కొందఱిని ఉన్నత పఱచును, మఱికొందరిని, తననుండి త్రోసిపుచ్చి అంధకారమున పడత్రోయును. వివేకవంతులకు అధికతర-ప్రకాశతరజ్ఞానము లొసంగును; దివ్యదృష్టికల వారికి, తన మంత్రి గణములో ప్రవేశ మిచ్చును; విద్వేషులకు, వారిద్వేష ఫలితముల కూర్చును; మూర్ఖులను అజ్ఞానులను, వారివారి అంధతను పట్టి, నడిపించును. ప్రతి మనుజుని తోడను ప్రతిసంధించి, వానివాని అవశ్యకతను, ప్రేరణను. అభిలాషను వేర్వేఱు స్వాభావిక తత్త్వములను పట్టి వ్యవహరించి, ఆవశ్యకమైన భారమును, వారిపై మోపును, లేదా వారి అజ్ఞాన విధానములందు వారు నశించుటకో, లేక వృద్ధియగుటకో, వారికి కావలసిన స్వేచ్ఛను వారికిచ్చును. ఏలయన, ఈ యన్నింటి కన్న ముఖ్యముగ, విశ్వమునందు దేనికిని ఆమె బద్ధురాలుకాదు. దేని యందును ఆమెకు స్పృహలేదు: అయ్యును, అందరికన్న నధికముగ, ఆమె జగన్మాత హృదయమును కలిగి యున్నది. ఏలయన, ఆమె కృప అపరిమితము, అక్షయము; ఆమెకన్నుల యందు, సర్వులును పరాత్పరుని అంశములే, బిడ్డలే; ఆమెనుద్వేషించి, తిరస్కరించు వారును, పిశాచములు, రాక్షసులు, అసురులు కూడ ఆమే సంతతియే. ఆమె నిరాకరణలు కూడ, నామె విలంఘనములే: ఆమె శిక్షణలు. కృపారసములే, కాని, ఆమె కృప, ఆమె వివేకమును అంధమొనరించదు; లేదా, ఆమెనిశ్చయించిన మార్గమునుకూడ తప్పించదు; ఏలయన, విషయముల సత్యము, ఆమెకు మాత్రమే సంబంధించిననది: జ్ఞానము, ఆమెశక్తికి కేంద్రము; మన ఆత్మను ప్రకృతిని దివ్య సత్యములోనికి నిర్మించుటయె, ఆమె కార్యము. లక్ష్యము.

మహాకాళి స్వభావము, వేరు; ఆమె శక్తి, విశిష్టతా విస్తృతులకు బదులు, యున్నతియందును,- వివేకమునకు బదులు, శక్తి సామర్థ్యముల యందును కలదు: ఆమె యందు, సర్వమును ముంచివేయు తీవ్రత, కార్యసిద్ధిని బడయు ప్రబల శక్తి-ఉద్రేకము, ప్రతి పరిమితిని అవరోధించి విచ్ఛిన్నము చేయుటకై లంఘించు దివ్యత్వము కలవు. ఆమెదివ్యత్వమంతయు ప్రచండ కార్య మహత్త్వముగా ప్రజ్వలించును. ఆమె కార్యమునందు ప్రచండ వేగమును, సద్యః ఫలితమునిచ్చు విధానమును అవలంబించి, తీవ్రముగ క్షిప్రముగ గాయపఱచి, ముఖాముఖి ఎదుర్కొని సర్వమును తనవెంట తీసికొని పోవును, అసురునికి, ఆమె ముఖమును చూచినంతనే, ఆమె భయము కలిగించును: దైవద్వేషుల విషయమున, ఆమె భావము అపాయకరముగ క్రూరముగ వర్తించును; ఏలయన, ఆమె యుద్ధమునుండి వెనుదీయని లోకైకవీరమాత. అపరిపూర్ణతను ఆమె సహింపదు; పరిపూర్ణత కిష్టములేని వానితో

మొఱటుగా వర్తించును: అజ్ఞాన తమస్సులతో నెదురించు వారిపై, ఆమె తీవ్రతను వహించును; అసత్య – ద్రోహ – విద్వేషాదులపట్ల ఆమె తక్షణ క్రోదమును వహించును. అట్లే వైరభావమును తక్షణము నశింపచేయును. దైవకార్యమునందు నిర్లక్ష్యము, అశ్రద్ధ, అలసతలను, ఆమె సహించదు; ఆవశ్యకమగుచో, అకాల నిద్రాసక్తుని, కాల యాపకుని తీవ్రబాధా సహితముగ మేల్కొనునట్లు శిక్షించును, తీవ్ర సరళ – నిష్కపట చిత్తావేగములు, నిశ్శేష – పరిపూర్ణ ప్రవృత్తులు, జాజ్వల్యమానముగ పైకెగయు ఉత్కాంక్ష, యీ యన్నియు మహాకాళి ప్రచలనములు. ఆమె ఆవేశమును మరెవ్వరు వశపఱుచుకొన వీలులేనిది; ఆమె దృక్పథ సంకల్పములు. గరుడపక్షి ఉత్పతనమువలె, ఉన్నతము, దూరగాములు; ఆమె పాదములు, ఉన్నతిమార్గమున బహువేగవంతము; ఆమె హస్తములు, ఒకేసారి రక్షించుటకును, ఆఘాత పఱచుటకును తెలుసుకొని యుండును. ఏలయన ఆమెకూడ, శ్రీమాతయే: ఆమె క్రోధమెంత తీవ్రమో, అమె ప్రేమయు అంత తీవ్రమే. ఆమె కృప, అగాధము. ఆవేశ పూరరితము. ఆమెకుగల సమర్థతతో, ఆమెను పనిచేయనిచ్చుచో. అన్వేషకుని ముట్టడించు వైరులను, లేక అతనిని నిర్వీర్యమొనర్చు అవరోధమును, ఒక్క క్షణములో, అర్థములేని సంగతులుగ విచ్ఛిన్నముచేయను. ఆమె కోపము, విరోధికి భయంకరమైనను, ఆమె ఉద్దండత, దుర్బలునికి, అధీరునికి బాధాకరముగ నున్నను. అభిజనులకు, సమర్థులకు, ఉదారులకు ఆమెపూజనీయము, ప్రియకారిణియు. ఏలయన, తమయందు గల విరుద్ధ వస్తువును, ఆమె ఆఘాతములు, సుస్థిర, పూర్ణ సత్యముగ నొనర్చుననియు, మూర్ఖముగ నున్నదానిని సరళము కావించుననియు, అశుద్ధముగ నిమ్నముగ నున్నదానిని పోద్రోయు ననియు, వారు స్ఫురింతురు, ఆమె ఒకనాటిలో చేయగలిగిన దానికి, ఆమె లేనిచో, నూర్ల సంవత్సరములు పట్టును; ఆమె లేనిచోట, ఆనందము విశాలముగ మృదువుగ మధురముగ సౌందర్యముగ నుండగలదు; కాని అత్యంత పూర్ణ తీవ్రతలకు గల సంతోషము ఉండియుండదు. జ్ఞానమున కామె, విజయ శక్తి నొసంగును, సంతోష సామరస్యతలకు, యొక ఉన్నత – ఆరోహక ప్రగతిని కూర్చును: పరిపూర్ణతకొఱకు గల, మంద – కష్ట – ఉద్యమమునకు, శక్తిని అధిక పఱచి, మందతను తగ్గించు ఆవేగమును కలిగించును. ఆనంద సముద్రములు, ఉన్నతతమ శిఖరములు, గభీరతమ ఆశయములు, విస్తృతతమ దృక్పథములు, – ఇవి, యేకొంచముగ లోపించినను, ఆమె తృప్తిపడదు, అందుచే, ఆమె వెనువెంటనే, దివ్య విజయా శక్తి కలదు; మరెప్పుడో

గాక, ఈ నిమిషముననే, కార్యసిద్ధికిగాను, ఆమె వేగవదావేశ – ఉజ్జ్వల – ప్రసన్నతలే కారణమగును.

శ్రీ పరాత్పర మాత కేవలము, దివ్యజ్ఞానమును, దివ్యశక్తిని మాత్రమె ఆవిర్భవించు చుండుటలేదు; ఆమె స్వభావము యొక్క సూక్ష్మతర రహస్యము, ఇంకను కలదు; ఇది లేనిచో, ఆమె ఋతశక్తులు అపరిపూర్ణము; ఇదిలెనిచో, ఆమె పరిపూర్ణత, అపూర్ణము. ఈ ఋతశక్తుల ఊర్ధ్వమున, శాశ్వత సౌందర్య, – దివ్య సామరస్యతల యొక్క అగ్రాహ్యైక – రహస్యము, నిరోధించ శక్యముకాని విశ్వ గత అద్భుత – ఆకర్షణలయొక్క బలాత్కార – ఇంద్రజాలము, – ఇవియును కలవు. ఇవి, వస్తువులను, శక్తులను, సత్త్వములను పరస్పరము సమీపమునకు చేర్చి, తనయందె భరించి, వానిని బలాత్కారముగ కలిపి, ఐక్య మొనరించి. అందుచే ఒక రహస్యానందముగా, తెరవెనుకనుండి పనిచేసి, వానిని లయాన్విత – సమరస–స్వరములుగను, రూపములుగను మార్చును, ఇవి, మహాలక్ష్మియొక్క శక్తికి గల గుణములు: శరీరధారుల హృదయముల కింతకన్న ఆకర్షణీయమైన దివ్య శక్త్యంశము మరేదియులేదు. పృథ్వీ స్వభావము యొక్క అల్పతకు, మహేశ్వరిని సమీపించుటకు, లెక తనయందే వహించుటకు, శక్యము కానంతటి శాంతముగ, ఉదారముగ, దూరముగ ఈమె తోచవచ్చును; అట్లే ఆపృథ్వీస్వభావాల్పతకు మహా కాళియొక్క అతివేగవత్వమును, భయకంరత్వమును భరించనది దుర్బలమై యుండ వచ్చును; కాని, సర్వులు మహాలక్ష్మి దిశకు, సంతోషముతో ప్రీతితో మఱలుదురు. ఏలయన, దివ్యమదమాధుర్య మంత్రమును, ఆమె వెదజల్లును; ఆమెకు సమీపమున నుండుట వలన యొక మహత్తర సంతోషము కలుగును; ఆమెను హృదయము నందు స్పర్శించుటయన, ఉనికిని ఆనంద – అద్భుతమయ మొనర్చుట యగును; సూర్యుని నుండి ప్రకాశమువలె, ఆమె నుండి, ప్రసన్నతారామణీయకత, – మృదు తలు ప్రవహించును; ఆమె, తన అద్భుత దృష్టిని నిలిపినచోట, లేక మందస్మిత ప్రీతిని కురిపించిన చోట, ఆత్మ, అగాధానందముయొక్క లోతులలో మునిగి, బంధితము కావింప బడును. ఆమె హస్తస్పర్శ, ఆకర్షణీయమై, ఆమెగుప్త సూక్ష్మ ప్రభావము మనః ప్రాణశరీరములను కోమలము గావించును; ఆమె అడుగిడిన చోట. మోహనకర – అద్భుత ప్రవాహములు పరుగిడును.

అయ్యును, ఈ మాంత్రిక దివ్యశక్తి, మన నుండి కోరు నియమమును సాధించుట, లేక ఆమె సాన్నిధ్యమును మనయందు నిలుపుకొనుట, అందఱకు సులభము

కాదు, ఆత్మమనస్సులయొక్కయు, భావావేశ చింతనలయొక్కయు, ప్రతి బాహ్య క్రియా ప్రవృత్తియొక్కయు, జీవిత పరిసరములయొక్కయు, సౌందర్య సామరస్యతలను నిర్మించుకొనుట మహాలక్ష్మి మననుండి కోరు నియమము. విశ్వానందము యొక్క విశ్వ - రహస్య - సామరస్యతకు అనుగుణ్యతయు, సర్వ - సౌందర్య - సామంజస్య ఐక్యతయొక్క పిలుపుకు ప్రతి స్పందనయు, దైవము దిశకు అనేక జీవాత్మల సంతోష పూర్వక జీవిత ప్రవాహము, ఎక్కడకలవో, అట్టి వాతావరణమునందు, ఆమె వసించుట కిష్టపడును. కాని, వికారము క్షుద్రము నీచము నగున దంతయు, దారిద్ర్యము కుత్సితము మాలిన్యము నగువ దంతయు, అసభ్యతాక్రౌర్యమును కలదంతయు, ఆమె ఆగమనమును ఎదిరించును. ప్రేమ సౌందర్యములు లేనట్టి, లేక జనింపబడుట కిచ్ఛగింపని స్థలమున, ఆమె ప్రవేశించదు ; ఇవి మిశ్రమమై, క్షుద్రతర విషయములతో వికృతమైయున్న స్థలము నుండి, కదలి పోవుటకు త్వరలో సిద్ధపడును ; లేదా, అక్కడ తన సంపదలను గ్రుమ్మరించుటకు నిర్లక్ష్యముచేయును. స్వార్థము, ద్వేషము, మత్సరము, క్రోధము, అభ్యసూయత, ఘర్షణలుగల హృదయములందును, మోసము, దురాశ, కృతఘ్నతలు, పవిత్రకంసమునందు మిశ్రమమై, అసభ్య ఆవేశములు, అశిష్టకోరికలు, భక్తిని నిమ్నపఱచునవియైయున్న హృదయములందును, ఈ ప్రసన్న సుందర దైవము వసించదు ; ఒక దివ్య విరక్తి, ఆమెను ఆక్రమించ, ఆమె అక్కడ నుండి తొలగును. ఏలయన, ఇతరుల నామె బలాత్కరించుట, దేనినిగాని స్వయముగ ప్రారంభించుట, ఆమె స్వభావముకాదు ; లేదా, తన ముఖమును తానే కప్పివుచ్చుకొని, మఱల అస్థలమున తన సంతుష్ట ప్రభావములను, ప్రసరింపచేయుటకు మునుపు, ఆసురిక కఠోర విష వస్తువు విసర్జింపబడి, అదృశ్యమగు వఱకు, అక్కడ ఆమె వేచి యుండును. సన్యాసుల విరాగ తీవ్రతలను ఆమె సహించదు ; ఆత్మయొక్కయు జీవితముయొక్కయు సౌందర్యాంశములను అణచియుంచుటకుకాని, సహృదయ - అగాధ - ఆవేశములను నిరాకరించుటకుకాని, ఆమె యిచ్ఛగించదు. ఏలయన, దైవముయొక్క భావమును, ఇతరులపై, ఆమె ప్రేమ సౌందర్యముల ద్వారా మోపును. ఆమె పరమ సృష్టియందు, ఆమె దివ్యకళ, సుసంపన్న ప్రక్రియగను, సర్వ ఉనికియు పవిత్రానంద కవితగను మార్పుగాంచును; విశ్వసంపదలను సంహితమొనర్చి, ఒక పరమ సామరస్యతకు లయబద్ధము కావించును; సరళతమ సామాన్య విషయముకూడా, ఆమె ఐక్యతా స్ఫురణచే, ఆమె ఆధ్యాత్మ - ఉచ్ఛ్వాసముచే, అద్భుతము కావింపబడును. మానవుడు, తన హృదయమునందామెకు తావిచ్చినచో,

జ్ఞానమును అద్భుత శిఖరములకు లేవనెత్తి, సమస్తజ్ఞానమును అధిగమించిన ఆనంద రహస్యము నతనికి తెలియచేయుంచును; భక్తిని, దివ్యావేశ-ఆకర్షణతో ఎదురేగి ఆహ్వానించును; బలసామరస్యతలకు తాలబద్ధమగు సామరస్యతల ప్రబోధించి, కర్మాచరణయందు వానికిగల శక్తిని సమన్వయపఱచి, ప్రమాణము గావించి, శాశ్వతముగా నెలకొనగల పరిపూర్ణతా మోహనత్వముల వానియందుంచును.

మహా సరస్వతి, శ్రీమాతయొక్క దివ్యక్రియా-శక్తిని ఆమె పరిపూర్ణతా-యాథాతథ్వమును రూపొందించును. ఆమె నాలుగు శక్తులలో, ఈమె కడపటిది: నిర్వహణ శక్తియందు అత్యంత కౌశల్యముగలది; భౌతిక ప్రకృతికి అత్యంత సమీపపముగ నుండునది. ఈమె. విశ్వశక్తుల బృహత్-రేఖలను మహేశ్వరి నిర్ణయించును; మహాకాళి, ఆశక్త్యావేశములను ప్రజ్వలింపచేయును; మహాలక్ష్మి, వాని సామరస్యమును, లయ-తాల బద్ధతను కనుగొనును; మహాసరస్వతి, నిర్వాహక-వ్యవస్థీకరణ వివరములపై, అంశముల పరస్పర సంబంధముపై ఆశక్తుల క్రియాత్మక సంశ్లిష్టతపై, ఫలసిద్ధియొక్క ప్రమాదరహిత నిష్కర్షతపై అధిష్ఠించును. వస్తువులయందుగల విజ్ఞత, కుశలత, సాంకేతికతలు, మహాసరస్వతి రాజ్యములోనివి. ఆమె, దివ్య-కృత్స్నకరునియొక్క హృదయంగమ సృష్టి-విజ్ఞతను, సూక్ష్మతను, క్షమను. స్వతః స్ఫురిత మనస్సుయొక్క యథార్థతను, విజ్ఞచక్షువును, సచేతన హస్తనైపుణ్యమును సర్వదా తనయందే వహించి, ఆమె వరించిన వారికి, వీని నన్నింటిని ఇవ్వగలదు. లోకములను నిర్మించు సమర్థ-అవిశ్రాంత-జాగరూక-విచక్షణాయుత నిర్మాణకుడు, వ్యవస్థాపకుడు, పరిపాలకుడు, సాంకేతికుడు, కళాకారి, విభజనకారి, వీరందఱు, ఈ మహాసరస్వతి శక్తికి చెందినవారే. స్వభావమును పునర్నిర్మించి, రూపాంతరమొందించు కార్యమును, ఆమె చేపట్టినపుడు, మనకుగల అక్షమా దృష్టినిపట్టి, ఆ కార్యము, ప్రయాసకరముగను, అతిసూక్ష్మమైనదిగను, మందగతికలదిగను, గమ్యమును చేరజాలనిదిగను తోచును. కాని, ఆమె కార్యము, విశుద్ధము పరిపూర్ణము దృఢయత్నితము గలదిగ నుండును. ఏలయన, ఆమె కార్యమునందుగల ఆమె సంకల్పము, అవిలంబనము, సూక్ష్మము అశ్రాంతము; మనపై ఆమె ఒఱిగి, మనముచేయు ప్రతి చిన్న విషయమును ఆమె గమనించి స్పృశించి, ప్రతి చిన్న లోపమును, అపరిపూర్ణతను, ఛిద్రమును, వ్యావర్తనమును కనుకొని, జరిగిపోయిన దానిని, ఇకమీదట జరుగనున్న దానిని కూడ ఆలోచించును, నిశ్చయించును. ఆమె అవధానమునకు, ఏదియు అల్పముకాదు, లేక నిర్లక్ష్యము చేయబడవలసినదికాదు;

దాగియుండునది, మాఱు వేషమున నుండునది, అగ్రాహ్యమైనది, ఏదియు ఆమె దృష్టి నుండి తప్పించుకొనజాలదు ; కార్యము, నిజరూపము పొందువఱకు. సమస్తమందు ఆ కార్యసిద్ధి దాని ఉచిత స్థానమును పొందువఱకు, నిర్దిష్టకార్యము ముగియువఱకు, ప్రతి భాగముపై ప్రక్రియగావించి, మఱల మఱల దానిని రూపములలోనికి కరిగించి పోతపోయును; విషయములను మఱల మఱల వ్యవస్థపఱచుటలో ఆమె చతురు, ఒకే సమయమున, సకల ఆవశ్యకతలపైనను, అది నెరవేఱగల విధానముపైనను దృష్టిని నిలిపియుండును. దేనిని స్వీకరించవలసినది, దేనిని విసర్జించవలసినది, ఆమెకు స్వతఃస్ఫురితము; ఉపకరణమును, సమయమును, పరిస్థితిని, విధానమును, వీనినన్నింటిని సమ్యక్ విధమున వ్యవస్థీకరించి విజయముగావించును. అజాగరూకతను, నిర్లక్ష్యమును, ఆలసతను, ఆమె అసహ్యించుకొనును. కాపట్యము చాంచల్యముతోకూడిన కర్మలు, గ్రామ్యము దుర్గతి శీలమునగు కర్మలు, శక్తులను పరికరములను అసమ్యక్ – ప్రయోజనముగ దుర్విధానముగావించు స్వభావము, కార్యమును అసంపూర్తిగనో, లేక అర్ధముచేసి విడుచు స్వభావము–ఈయన్నియు, ఆమె స్వభావమునకు బాహ్యము, విరుద్ధము, ఆమె కార్యము ముగిసినపుడు, యేదియు మఱవబడియుండదు; దుష్పరిస్థితియందు, యేదియు విడువబడియుండదు; సర్వము, స్థిరము, నిర్దిష్టము, పూర్ణము, ఆశ్చర్యకరముగ నుండును. పరిపూర్ణ – పరిపూర్ణతయే కొంచెము కొఱపడినను, ఆమెను అతృప్తిపఱచును. ఆమె సృష్టిని పూర్ణమొనరించుట కావశ్యకమయ్యేనేని, అందుకొఱకు, శాశ్వతశ్రమాయాసమునకు సంసిద్ధమైయుండును. అందుచే, శ్రీమాతృ శక్తులన్నింటిలో, నీమె, మానవుని సహస్ర – అపరిపూర్ణతలతో విసుగుపడక, అతనికిగా దీర్ఘకాలబాధాసహిష్ణుతల కలిగియుండును. కారుణ్యము, మందస్మితము, సామీప్యము, సాహాయ్యకమునై, సులభముగ నధైర్యపడక, మఱిమఱి కలుగు అపజయములనుండి వెనుకకు మఱలక, ప్రతి చిన్న కార్యమును మనము సంకల్పించి, మనఃపూర్వకముగ సరళముగ సాధించ నిశ్చయింతిమేని, ఆమె హస్తములు ప్రతి అడుగునను మనల పోషించుచుండును: ఎలయన, ద్వంద్వ మనస్సును ఆమె ఓర్చదు; ఆత్మవంచనా కాపట్యములపై, కేవల నాటక రంగానురూప మిథ్యావిషయములపై, ఆమె నిర్దాక్షిణ్యముగ వర్తించును. ఆమె, మన యావశ్యకతల కొకతల్లి; మన కష్టములయందు మిత్రురాలు; దృఢ – శాంత – ఉపదేశిక, ఆమె; జిగుప్సా– ఉద్వేగ – తమస్సులనెడి మేఘములను, ఆమె ప్రకాశమాన మందస్మితములతో పాఱద్రోలును; శాశ్వత సూర్యప్రకాశము దిశకు మన దృష్టిని మరలించి, ఆమె సార్వకాలిక సాన్నిధ్య సహాయ

ములను సర్వదా మనచే స్మరింపచేయుచు, సుస్థిరయై, మన యున్నతతర స్వభావము యొక్క పరిపూర్ణతదిశకు అగాధ - అవిరళ ప్రేరణను మనలోగావించి, సుదీర్ఘ - ప్రయత్నమునకు, నిశ్చలయై సుస్థిరయై, యుండును, ఇతర దివ్యశక్తుల కర్మ లన్నియు, వాని పరిపూర్ణతకు ఆమెపై ఒఱిగియుండును; ఎలయన, భౌతికాధార మును ధ్రువపఱచునది, వివరణ - విషయములను వ్యావరించునది, నిర్మాణ కవచ మును బంధించి, పూర్తికావించునది, ఆమెయే,

దివ్య శ్రీమాతయొక్క తదితర మహా వ్యక్తిత్వములుకూడ కలవు; కాని, పృథ్వియొక్క ఆత్మపరిణామమునందు, అంత ప్రముఖముగా అవి, ముందు నిలిచి యుండక పోవుటచే, వీరిని క్రిందికి అవతరింపచేయుట, అంత సులభముకాదయ్యెను; వీరియందుకూడ, మానవుని అతిమానసిక రూపాంతరము కొఱకు అత్యంతావశ్యక మగు దివ్యసాన్నిధ్యములు కలవు, - వీరిలో ప్రముఖముగ, పరమ దివ్య ప్రేమ నుండి ప్రవహించు శక్తి మంతమగు రహస్య-ఆనందమయి, శ్రీమాతృవ్యక్తిత్వ మొకటికలదు; అతిమానసిక చేతస్సుయొక్క ఉన్నతతమ శిఖరములకును, జడ ప్రకృతియొక్క నిమ్నతమ అగాధములకును, మధ్యగల ఆఖాతమునకు, సేతువును నిర్మించవలసినది, ఈమెయే. ఇతర విశ్వ శక్తులందఱియొక్క కార్యమునకు, యీ సమయమునకూడ, తన రహస్య శక్తులచే ఆధారభూతయై, అద్భుత దివ్య తమ జీవితమునకు తాళపుచెవిని తనయందే వహించిన ఆనందశక్తి, ఈమెయే; కాని మానవ స్వభావము నిబద్ధమై, అహంపూరితమై, మాలిన్యమై, ఈ మహో న్నత దివ్య సాన్నిధ్యముల నందుకొన శక్తిలేనిదై. వారి కార్యములకు ప్రేరితులగు టకు అసిద్ధముగనున్నది. ఈ నాలుగు శక్తులు, తమ సామరస్యతను. స్వేచ్ఛా ప్రవృత్తిని, మానవుని రూపాంతరిత మనఃప్రాణశరీరములయందు స్థాపించిన తర్వా తనే, ఆయితర దుర్లభ దివ్యశక్తులు పృథ్విపై ఆవిర్భవించును; ఎలయన, శ్రీమాతృ వ్యక్తిత్వములన్నియు. అమెయందు సమాహితమై, ఆవిర్భూతమై. వారి వారి ప్రత్యేక కార్యములు. సామరస్య - ఐక్యతగా మాఱి ఆమెయందు, వారు. అతి మానసిక దివ్యమూర్తులుగా ఉన్నతింపబడినపుడు, - ఆ సయయమున, శ్రీమాత అతి మానసిక మహాశక్తిగ ప్రకటితమై. ఆమె ప్రకాశమాన అతీతత్త్వములను, వాని అనిర్వచనీయ సూక్ష్మతత్త్వమునుండి, ప్రవహింపచేయుచు నేతెంచును. అపుడు మానవ స్వభావము క్రియాశీల దివ్య స్వభావముగా మారగలదు; ఎలయన, అతి మానసిక సత్యచేతస్సు యొక్కయు, సత్య - శక్తియొక్కయు, మూలతత్త్వపు

రేఖలు, కూర్పబడి, జీవితవిపంచి శాశ్వతుని సామరస్యతలకు సముచిత మొనరింపబడును.

నీవీ రూపాంతరమును కోరితివేని, శ్రీమాతయొక్కయు, ఆమెశక్తుల యొక్కయు చేతులలో, ప్రతిరోధించకుండ, వివాదపడకుండ, నిన్ను నీవు యుంచుకొనుము. ఇందు కావశ్యకముగ నీవు కలిగియుండవలసినది, మూడు అంశములు, – నిశ్శేషసమర్పణ, నమన శీలత, సచేతనికత. ఎలయన, నీ మనస్సు, హృదయము, ఆత్మ, జీవితము, నీశరీరమునందుగల ప్రతి జీవకణము, ఈ యన్నింటియందును, నీవు సచేతనుడవై, శ్రీమాతను, ఆమెశక్తులను, వారి కార్యమును సదా తెలిసికొనుచుండవలెను. ఎలయన, నీవు, అచేతనుడవై నీ అచేతన భాగములయందు, సమయములయందుకూడ, నీయందామె పనిచేయగలిగినను, పనిచేయుచున్నను కూడ, నీ అంతరమున నీవు సజీవముగ ఆమెతో సంభాషించుచూ, జాగరూకడవై యున్నపుడు మాత్రమే జరుగు, – శ్రీమాతృ కార్యమునకు, గల ఫలము, అప్పటి కార్యమునకు యుండదు. నీస్వభావమంతయు, ఆమె స్పర్శకు, నమన శీలమైయుండవలెను, – స్వాభిమాన – అజ్ఞ మనస్సు, సందేహించి, ప్రశ్నించి, వివాదపడి, తన రూపాంతరమునకు తన వికాసమునకు తానే ద్వేషియైనట్లు, నీవు కూడ, యుండకూడదు; ప్రతి దివ్య ప్రభావమునకును, మానవుని ప్రాణిక చేతస్సుయొక్క స్వీయ ప్రవృత్తులను. స్వీయ దుస్సంకల్పములను, మరితర కోరికలను దైవముపై నిర్బంధించకూడదు: మానవుని భౌతిక చేతస్సు, అల్పత్వ–తమస్సులందుగల సంతోషమునకు అంటుకొని, దాని అనాత్మక స్వభావకమగు దైనందిన చర్యను. అలసతను, జడత్వమును గాయబఱచు ప్రతి దివ్య స్పర్శను. వ్యతిరేకించి, గోంద్ర పెట్టువానివలె, నీవును, అసమర్థతా–జడతా–తమస్సులందు నిన్ను నీవు ముట్టడించుకొని, దైవ ప్రభావమును ఎదిరించకూడదు, నీ బాహ్యాభ్యంతర విశ్శేష సమర్పణ. నీస్వభావము యొక్క సమస్త భాగములందును నమనశీలతను నేర్పఱచును. ఊర్ధ్వము నుంచి నీలోనికి ప్రవహించు జ్ఞాన ప్రకాశమునకు, శక్తికి, సౌందర్య సామరస్యతలకు, పరిపూర్ణతకు నీవు అనవరతముగా నిన్ను తెఱచి యుంచితివేని నీ యందుగల సర్వ భాగములందును చేతస్సు మేల్కొనును. నీ శరీరముకూడ అందుకు మేల్కొని, ఎంత మాత్రము అనభివ్యక్తముగా నుండక, అంత్యమున అతిమానసిక దివ్య శక్తితో ఐక్యమై, ఆమె శక్తులు పైనుండి క్రిందనుండి, అన్ని ప్రక్కలనుండి నీలో ప్రవేశించి, పరమ ప్రేమానందములతో, నిన్ను హర్షరోమాంచిత మొనరించుట అనుభవింతువు.

కాని, నీవు సావధానుడవై యుండవలెను; నీ అల్ప పార్థివ మనస్సుతో శ్రీమాతను అర్థముచేసికొనుటకు, ఆమె విధానమును నిర్ణయించుటకు యత్నింపకుము; ఏలయన, నీ పార్థివ మనస్సున కావలనున్న విషయములనుకూడ, నీ నియమములకు, నీ స్వకీయ విధానములకు, నీ ప్రమాదకర చిత్తసంస్కారమునకు, నీ పార్థివ మనస్సుయొక్క అగాధహింసాత్మక - అజ్ఞానమునకు, దాని అల్ప - స్వాభిమాన_జ్ఞానమునకు నిన్ను లోనుజేయుటకు, నీ అజ్ఞానము ప్రేమించును. అర్ధ_ప్రకాశిత-తమస్సుయొక్క కారాగారమునందు మూయబడిన మానవ మనస్సు, దివ్యశక్తి - విధానమునకుగల అనంత_పక్ష స్వేచ్ఛను అనుగమించజాలదు. ఆమె దృక్పథము యొక్క_వేగము, సంకీర్ణత, ప్రక్రియలు, ఒడుదుడుకులుగల నీ గ్రహణ సామర్థ్యమును, మించియున్నది: దివ్యశక్తియొక్క ప్రగతి సోపానములు, నీ పార్థివ మనశ్శక్తియొక్క సోపానములుకావు: ఆమె వివిధ - అనైక వ్యక్తిత్వముల శీఘ్ర మార్పులచే, సామరస్యతా - నిర్మూల - నిర్మాణములచే, ఆమెయొక్క అశు సంపదలచే, వేగ నిరోధములచే, వేర్వేరువుర యొక్క సమస్యాపరిష్కార వేర్వేఱు విధానములచే, వేర్వేఱు సమయములందు వేర్వేఱు, రేఖల స్వీకారవిసర్జనలచే, మఱి ఈ యన్నింటియొక్క సమాహితకార్యముచే, పార్థివ మనస్సు విభ్రాంతినొంది, అజ్ఞాన మనెడి దుర్నిర్గమ స్థానము ద్వారా దివ్యప్రకాశములోనికి, పరాత్పరశక్తి అపవహించుకొని, పరివేష్టించుకొని పోవునపుడు, ఆ శక్తి విధానమును తెలిసికొనజాలదు; ఇందుకు బదులుగా, నీ ఆత్మను ఆమెకు తెఱచియుంచుము; నీ చైత్య - స్వభావముతో ఆమెను అనుభవించుటకు తృప్తిపడుము; నీ చైత్య దృక్కుచే, దివ్య సత్యమునకు ఆర్జవముగ ప్రతిస్పందించి, దానిని గ్రహించుము, అపుడు శ్రీమాతయే స్వయముగ, నీ మనస్సు హృదయము, ప్రాణము భౌతిక చేతస్సులయొక్క చైత్యాంశములచే నిన్ను ప్రకాశింపచేసి, వానికి ఆమె స్వభావమును, మార్గమును బహిరంగ పఱచును.

సర్వజ్ఞాన - సర్వశక్తిమత్వమును గుఱించి మనకుగల ఉపరిగత - అశ్లిష్ట భావాలననుసరించి దివ్యశక్తి సర్వదా పనిచేయవలయునని, నీ అజ్ఞ - మనస్సు నిర్బంధముగా కోరే అపరాధములో నీవు పడిపోకుము. ఏలయన, మన మనస్సు, అద్భుత శక్తిచే, సులభవిజయముచే, మిఱుమిట్లు గొలుపు ప్రకాశముచే, ప్రతి సందర్భమున, సంతోషించుటకు, ఉవ్విళ్లూరు చుండును. అవి లేనిచో, దైవ మిక్కడ కలదని విశ్వసించజాలదు, శ్రీమాత అజ్ఞాన క్షేత్రములో, అజ్ఞాన తత్త్వముతో

మన యందు వ్యవహరించుచున్నది: ఆమె సంపూర్ణముగా ఊర్ధ్వమున నుండుటకు బదులు, ఆ అజ్ఞాన క్షేత్రములోనికి అవతరించినది. ఆమె జ్ఞానశక్తులను, కొంత దాచియుంచి, కొంతటిని ఆవిర్భవించును: పలుమాఱు, ఈ జ్ఞానశక్తులను, ఆమె ఉపకరణములనుండియు, వ్యక్తులనుండియు, తిరోభాగమునయుంచి, అన్వేషక మనోవిధానమున, ఆ కాంక్షించు చైత్యుని విధానమున, యుద్ధకారియగు ప్రాణిక సత్త విధానమున, దుఃఖిత-కారాకృత-భౌతిక స్వభావ విధానమున, ఉపకరణములను రూపాంతర మొనర్చుటకు, ఈ విధానముల నామె అనుసరించును. పరాత్పరుని సంకల్పము, విధించిన నియమములుకలవు; అకస్మాత్తుగా విడదీయబడజాలక విప్ప బడవలసిన కఠిన గ్రంధులనేకములుగలవు; ఈ పరిణామక పార్థివ స్వభావము, అసుర రాక్షసుల స్వాధీనమునందున్నది. వాని క్షేత్రములో; వాని రాజ్యములో, వాని నియమములపైననే, వాని నెదుర్కొని, ఓడించవలయును. మనయందుగల మానవత, దానికావలనున్న ఉన్నత రూపమునకు అకస్మాత్తుగా ఉన్నతింపబడుటకు, అది చాల దుర్బలమై, మలినమైయున్నది; అందుచేనది, దాని పరిమితులనుండి దాటింపబడుటకు అది నడిపింపబడి, సిద్ధపఱుపబడవలెను. ఈ ఉద్యమ నియమములకు ఆవశ్యకమైన పనిని అనునిమిషము చేయుటకు, అక్కడ, ఇక్కడ, సర్వత్ర, దివ్య చేతస్సు, దివ్య శక్తి కలవు. ఆ పరిపూర్ణతా మధ్యముననే, రావలసిన పరిపూర్ణతను రూపొందించు టకు, నిర్ణయింపబడిన మార్గమును, సదా దివ్యచేతశ్శక్తులు అనుసరించును. కాని, అతి మనస్సు నీయందు అవతరించిన తర్వాతనే. అతిమానసిక శక్తి, అతి మానసిక స్వభావములతో వ్యవహరించు విధమున, నీతోకూడ నేరుగ వ్యవహరించగలదు. నీ మనస్సును నీవు అనుసరించితివేని, ఆమె నీయెదుట ప్రత్యక్షమైయున్నను, నీ వామెను గుర్తించవు; నీ మనస్సునుగాక, నీ ఆత్మను అనుసరించుము; నీ మనస్సు, బాహ్యదృశ్యములచే ఆకర్షింపబడి, వానిపై లంఘించును; నీ ఆత్మ దివ్య సత్యము నకు ప్రతిస్పందించును: దివ్యశక్తిని విశ్వసించుము; అపుడామె, నీ యందలి దివ్యాంశములను విముక్తపఱచి, నీయందలి సర్వమును, దివ్య స్వభావ - అభి వ్యక్తమునకు రూపొందించును.

పృథ్వీచేతః పరిణామమునందు, అతిమానసిక రూపాంతరము అనివార్యము, నిర్ణయమునైయున్నది: ఏలయన, దాని ఊర్ధ్వారోహణ అంత్యముకాలేదు; మఱి ఈ మనస్సు, పార్థితచేతశ్శిఖరముకాదు, కాని, ఈ రూపాంతరము కలిగి, అది

రూపొంది, స్థిరపడవలయునన్న, దివ్యప్రకాశమును గుర్తించు సంకల్పముతో క్రిందినుండి దానిని ఆహ్వానించి, అది వచ్చినపుడు నిరాకరించకుండుటయు, ఊర్ధ్వమునుండి పరాత్పరుని అనుమతియు, ఆవశ్యకములు. ఈ అనుమతి ఆహ్వానముల మధ్య, పని చేసి, నెరవేర్చునది, దివ్య శ్రీమాతృ శక్తి సాన్నిధ్యములు. మానవుని తపః - ప్రయత్నములుగాక, శ్రీమాతృ శక్తి మాత్రమే, దివ్య సత్యమును కప్పియున్న ముసుగును చీల్చి, దానిని తొలగించి, నీ ఆధారమును రూపొందించి, బాధ, మృత్యువు, అనృతము, తమస్సులతోకూడిన ఈ భూలోకములోనికి, దివ్య సత్యమును, దివ్యప్రకాశమును, దివ్య జీవితమును, అమృతానందమును గొనితెచ్చును.

---

# 2-వ అధ్యాయము

# శ్రీ మాతారవిందుల గుఱించి శ్రీ అరవిందుల ప్రవచనములు

## ప రి ణా మా ధి నే త లు

### పరిణామ పురోగతియందు గుప్తసాహాయ్యకులు

## 1

ప్ర :- సృష్టి ప్రారంభ మైనప్పటినుండి మీరును, శ్రీమాతయు, పృథ్విపై నుంటిరని చెప్పబడుచున్నది. ఇన్నికోట్ల సంవత్సరములుగ మఱుగుపడి మీరేమి చేయుచుంటిరో దయయుంచి చెప్పండి. "మఱుగు" అని నేను చెప్పుటకు గల కారణ మేమన, మీరీజన్మమునందు మాత్రమే ప్రపంచమునకు మీ నిజస్వభావమును మీరు చూపెట్టు చున్నారు.

జవాబు :- పరిణామగతిని ముందుకు నడిపించు చుంటిమి. 25-5-1935

## 2

ప్ర :- దయచేసి, ఈ విషయమును, ఇంకను కొంత ఎక్కువ విశదముగ తెలుపుడు.

జవాబు :- మానవ చరిత్ర నంతటిని వ్రాయుటయని, ఈప్రశ్న కర్థమగును. పరిణామగతిని ముందుకు కొనిపోవుటకు ప్రత్యేకమైన అవతరణలు యుండునట్లుగనే, ఒక్కొక్క దశనుండి యేదో యొక మార్గమునకు ముందుకు పోవ సాహాయ్య పడుటకు, దైవాంశ యేదోయొకటి, సర్వదా యుండునని మాత్రమే నేను చెప్పగలను. 26-5-1935

## అవతార రహస్యము

ప్ర :- "మాదినదిన సాధనలలో దివ్యావతార మహారహస్యమును వ్యక్త పఱచుటకే మేము ప్రయత్నించు చున్నాము" అని శ్రీమాత వచించినది. దీని అర్థమేమి. ?

జవాబు :- మానవ శరీరమునందు దైవము అభివ్యక్తము కాగలదని, అభి వ్యక్తమగు చున్నాడనుట నిజమని తెలుపుటయె మా నిత్య జీవితాచరణ కర్థము.

## దివ్యవ్యక్తియొక్క అభివ్యక్తము

ఇంతటి సులభ - సామాన్య విషయమును నీవు అర్థము చేసికొన లేవనుట ఆశ్చర్యము: ఏలయన, ఈ యోగము యొక్క ఉద్దేశ్యమంతయు సర్వదా అంతే. నైర్వ్యక్తిక దైవమును సాధించుటచే కలుగునది, ఆంతరికానుభవము, లేదా ఇంకను అధికముగ కాగల్గితే, ముక్తి మాత్రమే: పూర్ణ దైవముయొక్క క్రియా శీలత లేనిది, ప్రకృతి యంతయు రూపాంతర మొందదు, నైర్వ్యక్తిక దైవాను భవమే చాలినట్లైతే, శ్రీమాత ఇక్కడ నుండదు, నేను కూడ, ఇక్కడ నుండను.
15-9-1936

## మానవుని కలియుటకు దైవము తన్నుదా మఱుగు పఱచుకొనుట

ప్ర :- శ్రీమాతృ శారీరక - చేతస్సునందు అతిమనస్సు స్థాపింపబడి యుండ లేదేని, అందుకు కారణము, మావలె ఆమె, అందుకు సిద్ధముగా లేకపోవుటచేత కాదు: కాని, ఆమె అట్లు చేయవలెనన్న, సాధకుల యొక్కయు పృథ్వియొక్కయు భౌతికమును కొంతవఱకు మొదలు సిద్ధపఱచ వలసి యున్నది. కాని కొందఱు దీనిని తప్పు విధమున అర్థము చేయుదురు; ఆమె ఇంకను పరిపూర్ణ సిద్ధిని పొందనందున, అతిమనస్సు ఆమెయందు స్థాపితము కాలేదని వారు నమ్ముదురు. నేను చెప్పునది నిజమా ?

జవాబు :- పూర్తిగా నిజమే. ప్రారంభమునుండి అతిమనస్సు నందే మేము భౌతికముగా జీవించి యుంటిమేని, మాదరి కెవ్వరు చేరియుండలేరు, మఱెట్టి సాధన కూడ జరిగి యుండదు. మానవునికిగాని పృథ్వికిగాని మాతో సంబంధ ముండగల ఆశయే ఉండెడిదికాదు. అట్లయ్యునుకూడ, శ్రీమాత స్వీయచేతస్సులో నుండుటకు బదులు నిమ్నచేతస్సులోనికి దిగజారవలసి యున్నది, లేనిచో, "ఎంత దూరము,

ఎంత కఠినముగ నున్నావు, నన్ను నీవు ప్రేమించుటలేదు, నీనుండి నాకేసాహాయ్యము కూడ అందుటలేదు" అని, ఏదేదియో, చెప్పుటకు వారు ప్రారంభింతురు. మానవుని కలియుటకు దైవము తన్నుదా మఱుగు పఱచు కొనవలెను.

## అభివ్యక్తమునకుగా సిద్ధపఱచుట

అవును, అదినిజమే, పృథ్వీచేతస్సును, భౌతికము వఱకు అతిమనస్సు యొక్క అభివ్యక్తము కొఱకు, సిద్ధపఱచుటయే జరుగు చున్నది, అందుచేత నాయొక్కయు శ్రీమాతయొక్కయు భౌతికమును మాత్రమే సిద్ధపఱచుట గాదు.

అతిమనస్సు, మా భౌతికములోనికి ప్రవేశించినదన సర్వభౌతికములోనికది ప్రవేశించినదనుటయే: అందుచే, సాధకుల యందది అభివ్యక్తము కాదనుటకు కారణము లేదు. 15-9-1935

## యుగాంతరముల పని

### 1

ప్ర :- "సంభాషణలు" అను పుస్తకమునందు శ్రీమాత ఇట్లు వచించినది- "మనమందఱము పూర్వ జన్మములలో కలిసి.... దైవముయొక్క విజయమునకు, యుగయుగములుగా పనిచేసితిమి". ఇక్కడికి వచ్చి, ఇక్కడ వసించు వారికందరికి, ఈ సత్యము అన్వయించునా ? ఇక్కడికి వచ్చి వెనుకకు పోవువారి విషయమేమి ?

జవాబు :- వెళ్ళిపోయిన వారుకూడ ఈ వర్గములో నుండిన వారే, ఇంకను యుండగలవారే, ఆత్మ, అన్వేషించు ప్రధాన సత్యమునందు, తాత్కాలిక అభ్యంత రములు విభేదమును కలిగించవు. 18-6-1933

### 2

ప్ర :- "దైవ విజయమునకు యుగయుగములుగా పనిచేసినది" ఏ విధమున ? ఇంతవఱకు నెఱవేఱిన దేది ?.

జవబు :- అజ్ఞాన బంధమునుండి, పృథ్విపై మూర్తిమంతమగు చేతస్సు కడపటికి బహిర్గత మగుటయె, విజయము. ఆధ్యాత్మ పరిణామముచే, యుగయుగ ముల ద్వారా, ఈ కార్యము సిద్దపఱుప బడవలసి యుండెను. స్వాభావికముగనే, ఇంతవఱకు ప్రారంభమునుండి జరిగిన పని, వలననే, గత ఆధ్యాత్మిక ప్రయత్నము,

అనుభవములు సిద్ధపఱుప బడినవి. ఈ కారణముగనే గమ్యమును చేరగల ఈ కడ పటి ప్రయత్నము సాధ్యము కావింప బడినది. 18_6_1933

## నీలివర్ణ పతాకమునకు గల అర్థము

నీవు తెలిసికొన తలంచిన నీలివర్ణ పతాకమనగా, తెల్లని పద్మపుష్పముగల పతాకమే యని నేను తలంతును, అట్లైన అది శ్రీమాత పతాకమే: ఏలయన తెల్లని పద్మము ఆమెయొక్క చిహ్నము, ఎఱ్ఱని పద్మము నాచిహ్నము. పతాకము యొక్క నీలివర్ణము, కృష్ణుని వర్ణము: ఇది, ఆధ్యాత్మిక, లేక. దివ్యచేతస్సును సూచించును; ఈ దివ్య చేతస్సు పృథ్విని పరిపాలించుటకుగా దీనిని పృథ్వియందు స్థాపించుటే ఆమేకార్యము, ఈ చేతస్సును పృథ్వి జీవితము యొక్క అధినేతగా చేసి దీనిని అవతరింప చేయుటయే మాపని. కనుక ఇది ఆశ్రమపతాకముగా ఉపయోగింప బడు చున్నది. 13_3_1947

---

# వా రిరువురి చేతస్సు ఒక్కటే

## వా రిరువురి చేతస్సు మార్గముకూడ ఒక్కటే

### 1

నా చేతస్సుకు, శ్రీమాతృ చేతస్సు విరోధమనుట, పాత రోజులలోని కల్పన. (అప్పటి రోజులలో నుండిన X, Y మఱితరులచే కల్పింపబడి యుండినదది); ప్రారంభములో నుండినవారిలో కొందఱు శ్రీ మాతను గుర్తెఱుంగక అంగీకరించక యుండిన ఆ దినములలో వెలువడిన కల్పన, అది, వారు ఆమె చేతస్సును గుర్తించిన తర్వాతకూడ ఈ అర్థములేని విరోధభావమునే వహించి, తమకును, నితరులకునుకూడ చెడుపును కలిగించిరి. శ్రీ మాతృ చేతస్సు నా చేతస్సు ఒక్కటే; ఒకే దివ్యచేతస్సు రెండుగా నేర్పడినవి; ఏలయన, దైవలీలకది అవసరమై యున్నది. ఆమె చేతస్సు, ఆమె జ్ఞానశక్తులు లేనిదే; యేమియు చేయబడజాలదు. ఎవ్వరేని ఆమె చేతస్సుయొక్క సత్యమును భావించగలుగుచో, దానికి వెనుక నేను అక్కడ నున్నానని అతడు తెలిసికొనవలెను; అట్లే నా చేతస్సుయొక్క సత్యమును భావించగలుగుచో, ఆమె చేతస్సుకూడ నా చేతస్సుకు వెనుక యున్నదని తెలిసికొనును. అట్లు మా చేతస్సులకు విభేదము కల్పించిరేని (ఈ విషయములపై వారి మనస్సులు ఇంత దృఢముగా కల్పించు వివిధ రూపములను త్రోసిపుత్తును) ఇట్టి విభేదములేని దివ్యసత్యము, దాని యంతట నది ఎట్లు స్థాపింప బడగలదు.

**13–11–1934.**

### 2

శ్రీ మాతృ చేతస్సు, దివ్య చేతస్సు, రెండును ఒక్కటే, అందునుండి వచ్చే దివ్య ప్రకాశము, దివ్య సత్యముయొక్క ప్రకాశమే. శ్రీ మాతృ ప్రకాశము నెవ్వరు అందుకొని, అంగీకరించి, అందు వసింతురో, వారు అన్ని భూమికలపైన మానసిక–

ప్రాణిక - భౌతిక - భూమిక లన్నింటిపైన సత్యమును చూడగలరు, దైవముకాని దాని నంతటిని అతడు విసర్జించును: అజ్ఞానము, అనృతము, తమోశక్తుల దౌష్ట్యము, ఈ యన్నియు దైవముకాదు; దివ్య సత్యమును, దాని ప్రకాశమును శక్తిని అంగీకరించని తమోభూయిష్ఠమైన దంతయు దైవముకాదు. అందుచే, శ్రీ మాతృప్రకాశ శక్తుల నంగీకరించుట కిష్టపడనిదంతయు దైవముకాదు. అందులకే, నేను నీకు శ్రీ మాతతో, ఆమె ప్రకాశ శక్తులతో, స్పర్శను కలిగియుంచుకొనుమని సర్వదా చెప్పుచున్నాను; ఏలయన, ఈ విధమున మాత్రమే, ఈ తమస్సునుండి ఈ అసత్వ్యస్తతనుండి బయల్పడి, ఊర్ధ్వమునుండి అవతరించు దివ్యసత్యము నందు కొనగలవు.

శ్రీ మాతృ ప్రకాశము, లేక నా ప్రకాశము, అని మేము ప్రత్యేకార్థముతో వచించునపు డంతయు వానికి ప్రత్యేకముగా గల గుప్త కార్యమును గుఱించి మాత్రమే మేమట్లు వచింతుము - ఇది, అతి మనస్సునుండి అవతరించె కొన్ని వెలుగులను గుఱించి చెప్పుచుందుము. ఈ మార్గమునందు, రూపాంతర కార్యమును సాధ్య మొనరించి సత్యముయొక్క సారమును, శక్తిని క్రిందికి కొనితెచ్చి, విశుద్ధపఱచి, ప్రకాశింపచేయు తెల్లని ప్రకాశము, శ్రీమాతదే. కాని, నిజములో, ఊర్ధ్వతమ దివ్య సత్యమునుండి క్రిందికి అవతరించే ప్రకాశమంతయు శ్రీ మాతదే.

శ్రీ మాతయొక్క యోగ మార్గమునకును నా యోగ మార్గమునకును మధ్య, భేదమేమియులేదు. సర్వదా పూర్వమునందును, మఱి యిపుడుకూడ, మాది ఒకే మార్గమే; అతి మానసిక రూపాంతరమునకును, దైవానుభవమునకును, తీసికొనుపోవు మార్గమది. అంత్యమునందు మాత్రమేకాదు, ప్రారంభమునుంచి కూడ మా మార్గములు రెండు నొకటే.

శ్రీ మాతకును నాకును మధ్య భేదమును వ్యతిరిక్తతను నేర్పఱచే ప్రయత్నమంతయు, దివ్య సత్యమును, సాధకుడు చేరకుండ చేయుటకు అనృత శక్తులు ఇష్టపడినపుడు చేసే ఉపాయము మాత్రమే. నీ మనస్సునుండి ఈలాంటి అనృతముల నన్నింటిని పారద్రోలుము.

శ్రీ మాతయొక్క శక్తి ప్రకాశములు, దివ్య సత్యముయొక్క శక్తి ప్రకాశములేయని తెలిసికొనుము. సర్వదా శ్రీ మాతయొక్క శక్తి ప్రకాశములతో స్పర్శ కలిగియుండుము; అపుడు మాత్రమే నీవు దివ్య సత్యములో వృద్ధికాంచగలవు.

10-9-1931

## 3

ఎవ్వరేని శ్రీమాతనుండి దేనిని పొందుదురో, అదియే నానుండికూడ వారికి చెందును — భేదమేమియులేదు. అట్లే, నే నిచ్చునదంతయు శ్రీమాత శక్తి ద్వారానే సాధకునికి చెందును. 20—8—1936

## 4

శ్రీమాతవలన నీ కేమియు సహాయము కలుగదని నీవు తలంచుచున్నావు... ఆమె సహాయము నీకు ప్రయోజనకారిగా లేకపోతే, నా సాహాయ్యమువలన కలిగే ప్రయోజన మంతకన్న తక్కువయే. కాని, ఏమైనను సరియే. సాధకులందఱు, మిసహాయింపు లేకుండ, వారి ఆధ్యాత్మిక వికాసమునందు, నేరుగా నానుండిగాక, శ్రీమాతనుండియే శక్తి ప్రకాశములను పొందవలెనని, ఆమెచే సాధనయందు నడిపింపబడవలెనని చేసిన యేర్పాటును మార్చతలంచలేదు. నే నీ యేర్పాటును తాత్కాలిక ప్రయోజనమునకు కాదు చేసినది; కాని అది యొక్కటే, మార్గము; సాధకుడు ఉన్మీలితుడై, సాహాయ్యము నందుకొనెనేని, అదియే, కార్యకారియు నిజమైన మార్గము (ఆమెకు గల శక్తిని స్థితినిపట్టి చెప్పగలిగిన దిదియే).

## 5

శ్రీ మాతయు నేనును ఒకే దివ్యశక్తికి రెండు రూపములలో ప్రతినిధులము — అందుచే నీవు కలలో కన్న విషయము సంపూర్ణముగా సహేతుకమే; ఈశ్వర — శక్తి, పురుష—ప్రకృతి, ఒకే దైవము (బ్రహ్మ) యొక్క రెండు పక్షములు. 1933

## 6

శ్రీమాతకును నాకును మధ్యగల ఏకత్వము (మేము ఏకము అనే దర్శనానుభవము). మా రెండు మూర్తులు ఒకటిలో నొకటి కలిసిపోవుట, సర్వసాధారణానుభవమే. 4—11—1935

## 7

ప్ర :— పలుమాఱు, దివ్య సందర్శనములందు కనబడు వివిధ జ్యోతులబట్టి, శ్రీమాతారవిందులు వేర్వేఱు శరీరములందున్నను, వా రిద్దఱు ఒకరేయను దృఢ భావము కలుగుచున్నది. ఈ భావము సరియేనా?

జ :— అవును. 25—4—1933

## 8

శ్రీమాతయు నేనును దేనికి ప్రతినిధులము, మే మెవ్వరము, అను విషయమును నీకల చక్కగా సూచించినది_ఇంతకన్న అధికముగా చెప్పుట అనవసరమని నేను తలంతును. మేము సాధించి, నెరవేర్చవలసినది, దివ్యానందము దివ్య ప్రేమ యని, అదిసూచించును. 1933

## శ్రీమాత రాకపూర్వము చేయబడిన సాధన

## 1

మార్గమధ్యమున కూర్చొనియుంటి నన్ను నీ గురువు మాటయందుగల అర్థము నాకు విశదముకాలేదు ఆర్యపత్రికను నేనువ్రాయుచుండిన 1915 నుండి 1920 వఱకు గల సంవత్సరములలో, ఆమాట నిజమే కావచ్చు. కాని, పనియు సాధనయు శ్రీమాత రాకకు ఎదురు చూచుచుండెను. 1923, లేక 1924 లో యోగమార్గమున కూర్చొనియుంటినని నా సాధనను గుఱించి, చెప్పుటసరికాదు; కాని కార్యముయొక్క బాహ్యరూపము సిద్ధము కానందున, ఆమాట ఈవిషయమునకొక సూచన మాత్రమే కావచ్చును. ప్రపంచమునందు కార్యాచరణ కొఱకు అవతరించుటకు వీలుకానంత ఉన్నతస్థితులకు పోయియున్నానని, మఱియొక యోగికూడ ఇదేమాటలలో చెప్పి యుండెను. ఈ మాటలు, నా అప్పటి పరిస్థితిని మాత్రమే తెలుపును కాని, అంత కన్న వేరుకాదు. 16_9_1935

## 2

ప్ర :_ 1926 లో శ్రీమాత ఆశ్రమకార్యమును చేపట్టకమునుపు, ఇక్కడ నుండిన సాధకులు విశ్వచేతనానుభవములనేకములను పొందియుండిరని, ఇప్పటి కంటె సాధన ఉత్కృష్టముగా, వేగవంతముగా జరిగెనని Y తో X చెప్పెను. ఇదెంతవఱకు సత్యము ?

జవాబు :_ శ్రీమాత రాకపూర్వము అందరుకూడా మనస్సునందే వసించుచు, మానసికానుభవములను మాత్రమే కలిగియుండిరి. వారి ప్రాణసత్త్వయు, వారి సర్వము పునరుజ్జీవనము పొందనివై, చైత్యపురుషుడు వారియందు మఱుగుపడి యుండెను. అపుడు, వారిలో నెవ్వరునుకాని విశ్వగత చేతస్సును అనుభవించినది,

నాకు తెలియదు. ఆ సమయమున, రూపాంతమునకు, అతిమనస్సుకు, నేను దారిని (సాధారణ వేదాంతమునకన్న ఆవలనున్న యోగమార్గము నంతటిని) అన్వేషించుచు, అప్పుడుండిన కొలది సాధకులను వారి మార్గమున వారిని స్వేచ్ఛగ పోనిచ్చితిని. ఇట్లు చేసితినని దుఃఖించువారిలో (X) ఒకడు_వారికప్పుడుండిన ప్రాణిక స్వాతంత్ర్యమును, ఆశిక్షణను గుఱించి అతడు సర్వదా వ్యసన పడు చుండును. 27_9_1934

---

# మార్గాన్వేషకుల కష్టములు

## కష్ట మార్గము

ఈ యోగము చక్కని సులభమార్గమని, (Grand Trunk Road) ఎవ్వరు కాని, X కాని లేక Y కాని, లేక కడకు నేను, లేక శ్రీమాతకాని కనుగొనియుండ లేదు. ఈలాంటి భావము లన్నియు, ప్రేమ-సాహస-కల్పిత-భ్రాంతులు.
ఆగస్టు 1935

## మానుష్యకత భారము

### 1

మాకుగల పోరాటములు బాధలు-వీనితో, నీ కష్టములు పోల్చినచో, నీవి పిల్లల ఆటలుగా తోచును. నీ కష్టములతో మా పడుపాట్లను నేను పోల్చలేదు. మానుష్యకము ఉన్నతచేతస్సునకు పోవుదారిని తెలిచియుంచువాడే అవతారము అని చెప్పితిని-ఈ దారిని మఱెవ్వరు పోజాలని ఎడల, ఈ విషయమును గుఱించి, కృష్ణుడు బుద్ధుడు క్రైస్తుఅవతారములయొక్క భావమువలెనే మా అవతారభావముకూడా తప్పు అనియు, అవతార పురుషునియొక్క జీవితము ప్రవర్తన, అంతయు నిష్ప్రయోజనమని తలంచవలెను. దారి అనునదియె లేదని, దానిని అనుసరించుట సాధ్యముకాదని, అవతారపురుషుని బాధలు పోరాటములు అసత్యములని, కపటమని, దైవమునకు ప్రతినిధిగా నుండగలవానికి, పోరాడవలసిన అవశ్యకత యుండదని, X అనునతడు చెప్పుచుండునేమో. ఈ భావము, అవతారతత్త్వమును అపహసించును; అట్టిచో, అవతారమునకు అర్థముకాని, హేతువుకాని, అవశ్యకతగాని యుండదు. దైవము సర్వ-శక్తిమంతుడు గనుక, పృథ్విపైకి రాకనే ప్రజలను ఉద్ధరించగలడు. కాని, మానుష్యకముయొక్క భారమును, అవతార పురుషుడు తనపైన వేనికొని, దారిచూపవలెననుట, ప్రపంచ విధానము నందొక అంశము, అని చెప్పినపుడే, అవతారతత్త్వమున కర్థముగలదు. 7-3-1935

## 2

ఈ మార్గము నీకుగాని నీటోటివారికిగాని చాల కష్టమనియు, నావలె, లేక శ్రీమాతవలె అవతార పురుషులకే ఇది సాధ్యమని నీవు చెప్పుచున్నావు. ఇదియొక విచిత్రమైన తప్పు భావము; ఈ భావమునకు విరుద్ధముగ నేను భావించునదేమన, ఈ మార్గము, సులభతమము, సరళతమము, ఇతర మార్గాలన్నింటికంటే గమ్యమునకు చక్కగకొనిపోవుమార్గమిది. నీకుగలశక్తిలో పదింట ఒక్కభాగము శక్తి కలిగి, మానసిక-ప్రాణిక చేతస్సును అచల మొనర్చగలవారికెవ్వరికైన ఈ మార్గము సులభము. ఇతర యోగమార్గములకు, పోరాటము, బాధ, కష్టతర ప్రయత్నములతో కూడి గమ్యమును చేరుటకు గొప్పతపశ్శక్తి ఆవశ్యకము. ఇక శ్రీమాతను, నన్నుగుఱించి చెప్పవలసి వచ్చుచో, మేము మార్గములన్నింటిని పరీక్షించి, అన్నింటిని అనుసరించి, కొండలు కొండలుగా ఎదుర్కొన్న కష్టములను దాటి, ఈ ఆశ్రమములోకాని, బయటకాని, నీవును ఇతరులును మోయగల భారముకంటె అధిక భారమును, కష్ట పరిస్థితులను పోరాటములను, గాయములను భరించుచు, అడవులు యెడారులు, బురదనేలల గుండా దారిని నిర్మించి దుష్టశక్తులను నిర్మూలించవలసియుండెను. మాకు పూర్వము ఇట్టి పనిని మఱెవ్వరు చేసియుండలేదు. మేము నియమించుకొన్న ఇట్టిపనియందు నిర్మించవలసిన మార్గమును చేపట్టవలసిన అధినేతలు, దైవమును అవతరింపచేసి మూర్తీభవింప చేయుటయేగాక, మానుష్యకమునందు ఆరోహించు ఇచ్ఛగలవారికి ప్రతినిధులై, వారి కష్టములను కూడ పూర్తిగా భరించి, కేవలమొక లీలాభావమునందె గాక, ఈ మార్గమునందు మెల్లమెల్లగా విజయముగాంచగల పద్ధతులలో, కష్టములను పొందుచు, అపజయములను అనుభవించుచు, ముందుకు కఠిన ప్రయత్నముతో సర్వదా నడువవలసియుండును. కాని మేము నిర్మించిన మార్గమున నడచువారు, ఈ కష్టములను మఱల మఱల అనుభవించ నవసరములేదు. ఏలయన మా అనుభవముచే, మా సహాయమును పొంద నిష్టపడువారికి, చక్కని సులభ మార్గమును చూపెట్టగలము. మహాకష్టముచే మేము పొందిన అనుభవ కారణముగ, నిన్నును ఇతరులనుకూడా, "చైత్య పురుషుని మీ యందు మేల్కొలిపి, చక్కని సూర్యప్రకాశ మార్గమును అనుసరించుడు – ఈ మార్గమున దైవము స్పష్టముగను రహస్యముగను మిమ్ము భరించుచుండును ఇట్లు రహస్యముగ భరించుచుండెనేని, తగిన సమయమున స్పష్టముగ తన్ను దాచూపెట్టును – అభ్యంతరములు గల వేఱు-కష్టదూర-మార్గమే కావలయునని పట్టుపట్టకుడు" అని ప్రోత్సహింతుము. 5-5-1932

## సూర్య ప్రకాశమార్గమును సిద్ధపఱచుట

పూర్వకాలమున యోగులు, అధ్యాత్మాన్వేషకులు ప్రప్రథమమున కోరినది శాంతి. ఈ శాంతి, నిశ్చల-నీరవ మనస్సునందు మాత్రమే సర్వదా దొరక గలదు. దైవానుభవమునకు, ఇదియే ప్రథమ నియమమని వారుచాటించిరి. సంతోష ముతో కూడిన సూర్యప్రకాశమాన హృదయము, ఆనందమునకు తగినపాత్ర; దైవముతోడి ఏకత్వమునకు, దివ్యానందముకాని. లేక దివ్యానందమును సిద్ధపఱచు వస్తువుకాని ఆటంకమని ఎవ్వరుచెప్పగలరు? నిరాశయనునది, ఈ యోగమార్గమున భరించవలసిన భయంకర భారమేయనుట సత్యమే. "యాత్రికుని పురోగమనము" (The Pilgrim's Progress) నందలి క్రైస్తవునివలె, సాధకుడు కొన్నిసమయము లందు, నిరాశ యనెడి బురదలో పడవలసియుండును. కాని ఈ నిరాశలు పలుమాఱు కలుగుట యోగమునకు అంతరాయమే...బాధలు, కష్టములు, పోరాటములు, నిరాశలు ఈ మార్గమునందు కూడా స్వాభావికముగనే నుండుననుట, నాకు బాగా తెలియును: కాని ఇవి అనివార్యములు కావు. ఇవి యోగమార్గమున సాహాయ్యకములనుటచే గాక, మానవ స్వభావమందలి తమస్సుచే మనపై నారోపింపబడినవి; మనము వీని నుండి పోరాడి దివ్యప్రకాశములోనికి ఉద్గమించవలసియుండును...సూర్యప్రకాశ యోగమార్గమిట్టిది కలదని, రామకృష్ణునికి తెలిసియుండెను. అది చక్కని త్వరితమార్గ మని కూడా వారు చెప్పుచుండిరి.

నేను సూర్యప్రకాశమార్గము నందు కూడ నడచితిని; కష్టములు బాధలు అపా యములు కలవని ముందుకిడిన అడుగును వెనుకిడలేదు. ఈ యన్నింటిని నేను భరించితిని; శ్రీమాత ఇంత పదంతలు భరించినది. అదెందుకన, మార్గ నిర్మాతలు వీనిని జయించుటకు వీని నెదుర్కొనవలసియుండెను. సాధకుని యెదు ర్కొను ప్రతి కష్టము, దారియందు మమ్ముల నెదుర్కొనినదే; అనేక కష్టములను నూఱుసార్లకెక్కువగా నెదుర్కొనవలసియుండెను. అప్పటికిగాని విజయము చేకూరుచుండుటలేదు. (మా కష్టములను గుఱించి చెప్పిన దంతయు కించిన్మాత్రమే చెప్పితిని); పరిపూర్ణ సిద్ధికలిగే వఱకు, తాముండుటకు తమకు హక్కుకలదని ఇంకను అనేక కష్టములే, స్వయముగా, మాతో వాదించుచూ ఇంకను నిలిచియేయున్నవి. కాని ఇతరులకు, వీని అనివార్యమైన ఆవశ్యత కలదని మేమెప్పుడును సమ్మతించలేదు. ఇతరులకు సులభతర మార్గమును భద్రపఱచుటకే, నిజముగా మేమాభారమును భరించితిమి. ఏ ఏకష్టములు బాధలు, అపాయములు ఈ మార్గమునకలవో, వాని

నన్నింటిని ఇతరులపైన గాక తనపైననే మోపుమని శ్రీమాత యొకసారి దైవమును ప్రార్థించెను. అనేక సంవత్సరములు, దిన దిన భయంకర పోరాటములామె అనుభ వించిన కారణముగ, ఆమెకు దైవమిచ్చిన వరప్రసాదముగ, ఆమెయందు పూర్ణ హృదయపూర్వక విశ్వాసము నుంచిన వారు, సూర్యప్రకాశ మార్గమును అవలంబించ కలుగుచున్నారు; విశ్వాసముంచలేని వారు కూడ, విశ్వాసముంచినంతనే, అకస్మా త్తుగా తమదారి సులభమగుట కనుగొనుచున్నారు. ఒకవేళ మార్గము మఱల కష్ట ముగ నుండెనేని, అవిశ్వాసము, తిరుగుబాటు, స్వాత్మాభిమానములకు, లేక మఱి తరతామసిక దోషములకు, వారులోనై యుందురు. సూర్యప్రకాశమార్గము, ఒక పిట్టకథకాదు.

కాని, చేతకాని వారి విషయమెట్లు, అని నీవు నన్నడుగుదువు. అవును; వారి కొఱకే, అతిమానసిక దివ్యశక్తిని, చెప్పుకో తగినంత స్వల్పకాలములో అవతరింప చేయుటకే నాప్రయత్నమంతయు. అది అవతరించునని నాకు తెలియును, కాని, ఈ అవతరణను, అసురశక్తులెంత అడ్డగించినను, లేక పృథ్వీస్వాభావిక తమస్సు ఎంత అసిద్ధముగ నున్నను, అవతరణ త్వరితముగా జరుపవలెననియె నేను అన్వేషించుచుంటిని. నీవు ఊహించునట్లుగా, అతి మనస్సు, శీతల-కఠిన-శిలా సదృశ వస్తువుకాదు. అది, దాని యందు దివ్య ప్రేమ సాన్నిధ్యమును దివ్యసత్య సాన్నిధ్యమును వహించియుండును; ఇక్కడ, ఈ పృథ్విపై దాని పాలనయన, దానిని అంగీకరించు వారి కందరికి, పూర్వకాలపు ఋషులు, సుదూర-భవిష్యద్దివ్య-ప్రజ్ఞను, మానవుడందుకొనగలడని చెప్పినరీతిగ, చక్కని నిరపాయమార్గమని చెప్పవలెను.

తమో మార్గముకూడా కలదు; ఆధ్యాత్మిక బాధాకష్టములను, క్రైస్తవులవలె కొందఱు, విజయముపొందుట కవసరమగు పరిహారముగ ప్రవర్తింతురు. ప్రారంభ మున కొందఱి జీవితములందు వలె, లేక అందుకు కొందఱు బుద్ధిపూర్వకముగ కోరుటచే వలె, కొన్ని సందర్భములందీ తమో మార్గము అవసరమే కావచ్చును. కాని అందుకు చెల్లించవలసిన బలిదానములు-వైరాగ్యము, సహనము, ధైర్యము. దుష్టశక్తుల ఆఘాతములను, అవి ఆరోపించు పరీక్షల నిట్టి సహనముతో భరించ గలిగితే, దీనికి కూడ నొక అర్థమున్నదని నేను అంగీకరింతును. వానిపై పొందిన ప్రతి విజయమునకు, అర్థముచేసికొనగలవురోగతియుండును; పలుమాఱు ఈ విజ

యములు మనలోని కష్టములను, మనము జయించవలసినవానిని తెలుపుచు, "నీ వీ విషయమును జయించవలెను" అని చెప్పుచుండును. కాని ఇదంతయు నిజమే అయ్యును, అవసరములేనపుడు, కష్టతర తమోమార్గమును ఎవ్వరును అవలంబించ కూడదు.

అనేకులు తపస్యపైననో, లేక మఱివేఱే దేనిపైననో, ఆధారపడి యోగముచేసి నారేకాని, దైవకృపపైన ఆధారపడికాదు. అవసరమైనవి, ఆయితరములు కాదు; అత్యవసరమైనది, ఉన్నతతర సత్యమును ఉన్నతతర జీవితమును గుఱించిన ఆత్మాకాంక్ష. ఇది యెక్కడకలదో, దివ్యకృపపై నమ్మకముండనీ లేక పోనీ గాక, అక్కడ అది మధ్యస్థముగప్రవేశించి పనిచేయును. నమ్మితివా, కార్యములు సులభముగ త్వరితముగ నగును; నీ వింకను నమ్మజాలక పోతివా, యే యేవి కష్టములు పోరాటములు కలిగినను నీ ఆత్మాకాంక్ష, తనను దాసమర్థించుకొనును, నెఱవేర్చుకొనును.

## సంతోషాత్మక బలిదానము

శ్రీమాతకాని, నేనుకాని, ఆధ్యాత్మిక జీవితమును స్వీకరించిన మఱితరులు కాని, జీవితసుఖసంతోషములను అనుభవించలేదని, అందుచేత సంతోషాత్మక బలి దానమును గుఱించి, శ్రీమాత సులభముగ మాట్లాడ గలిగెనని, నీవు తలంతువా? లేక ప్రారంభ దశలలో అపహరింపబడిన ఈజిప్టు దేశపు fleshpots ను గుఱించి కోరుచు కాలముగడిపితిమనియు, ఆతర్వాతనే ఆధ్యాత్మిక బలిదాన సంతోషమును పొందితిమని తలంతువా? ఇదేమియు మేము చేయలేదనుట నిజము; మేమును ఇతరు లనేకులుకూడా త్యజించుట అవసరమని తలంచిన దానిని, త్యజంచినందుకు బాధపడలేదు, ఆ తర్వాత మఱి దానిని వెనుకకు కోరలేదు. నీవు యేర్పఱచుకున్న నియమము కష్టము; ఇది సర్వత్ర అన్వయించదు. 16-10-1935

## స్వీయారోపిత దీనజీవిత వత్సరములు

(సాధికా సాధకులు ధరించు సుందరదుస్తులను గుఱించి కొందరి విమర్శ.)

ఆధ్యాత్మికానుభవము కలిగినతర్వాత, ఉన్నతతరమగు దివ్యసంకల్పము దేనిని ఇచ్ఛయించునో, అదియే శ్రేష్ఠము—కాని మొదలు. నిస్సంగమమె నియమము—శిక్షణా పురోభివృద్ధులు లేకయే, ముక్తిని పొందుట కొలదిమందికే సాధ్యము. శ్రీమాతయు నేనును, అనేక సంవత్సరములు దీనజీవితమును స్వయముగా ఆరోపించుకొని, కేవల మత్యవసరమగు వానిచే కాలము గడిపితిమి. 15-11-1933

## మానవస్వభావమును గుఱించిన జ్ఞానము

### 1

మానవ స్వభావమునకుగల అజ్ఞాన దుర్బలతలు మఱితర ద్వంద్వముల గుఱించి నీకు తెలిసిన దానికంటె, ఇంకను అధికముగనేకూడ నాకు తెలియునని, నేతలంతును. శ్రీమాతయు నేనును ఆధ్యాత్మికముగా గొప్పవారమే అయ్యును, వ్యావహారిక జ్ఞానము మాకేమియులేదను భావము, ఈ ఆశ్రమములో నున్నవారికి, సర్వ సాధారణముగాకలదు. ఉన్నత-ఆధ్యాత్మిక భూమికయందు వసించుటచే, ప్రపంచమును లేక మానవస్వభావమును గుఱించిన జ్ఞానము తొలగునని తలంచుట తప్పు. మానవస్వభావము నాకు తెలియనిచో, లేక దానిని గమనించనిచో, రూపాంతర కార్యమునందు, ఎవ్వరిని కాని ముందుకు కొనిపోవుటకు, నేను స్పష్టముగ అనర్హుడనే అగుదును. ఏలయన మానవస్వభావము తెలియని, దాని క్రియా విశేషములు చూడజాలని, లేక చూడగలిగినను వానివిలువను గ్రహించలేనివాడు మానవస్వభావమును రూపాంతరము పొందించజాలడు; మానవుని జీవితభూమిక, అనంత దివ్యప్రకాశ-శక్త్యానందముల యొక్కయు, అనుల్లంఘనీయ దివ్యసంకల్ప శక్తియొక్కయు భూమిక, లేక భూమికల వంటిదేయని నేను తలంచుచో, వస్తు ప్రదర్శనశాలలో ప్రదర్శనమునకుగా నుంచబడ నర్హతగల పిచ్చివాడనో, అసమర్థుడనో, అవివేకనోయై నేనుండవలెను. 30-4-1937

### 2

దానిని తెలిసికొనుటకు సహేతుకతా జ్ఞానము అనవసరము: సాధారణ జ్ఞానము చాలును. ఎవ్వరైనను-అతడెంతటి వాడైనను సరియే-ఈ అజ్ఞాన-పరిమిత-బాధా, పూరిత ప్రపంచమును, శాశ్వత-అనంత దివ్య-ప్రకాశ-శక్త్యానందములయొక్కయు అనుల్లంఘనీయ దివ్య సంకల్పశక్తులయొక్కయు భూమికగా తలంచునేని, అతడు స్వీయ భ్రాంతియందు వసించెడు మూర్ఖుడు లేక ఉన్మాదిగాక మరేమి? ఉన్నతభూమికల నుండి దివ్యశక్తి ప్రకాశములతో కూడిన చేతస్సు, పృథ్వియంతట, మనుజ-జంతుసత్త్వములనెడి అజ్ఞాన సమూహ మధ్యమున పనిచేయుచుండెనేని, వానిని పైనుండి అవతరింప చేయవలసిన అవశ్యతయేది? కాని, బహుశా నీకు కూడా X కు గల భావమే కలదేమో ! "దైవమిక్కడకలదు. మరెక్కడనుండియైన ఎట్లు అవతరించగలదు"? దైవమిక్కడ యుండవచ్చు, కాని ఇక్కడ దైవము తన దివ్య

ప్రకాశమును అజ్ఞాన తమస్సుతోను, తన దివ్యానందమును బాధతోను కప్పి యున్నాడు; దీనిని బట్టియే ఈ భూమికకుగల భేదమని నేను తలంతును; చక్కగా మూయబడి ముద్రవేయబడిన ఆ దివ్యప్రకాశములోనికి ఎవ్వరైన ప్రవేశించినను, అందువలన చేతస్సుకు కలిగే స్థితియందు భేదముండగలదు, కాని, ఈ భూమికయందు పనిచేయు దివ్యశక్తియందు ఆ యనుభవముచే కలుగు భేదము చాల స్వల్పము.
3-5-1937.

## జ్ఞానముపై నాధారపడిన విశ్వాసము

నేను కూడ బుద్ధి పరాయణుడుగనే యుంటిననియు. సందేహములు నాపై దాడి జరుపుచుండెననియు నీకు జ్ఞానకము చేయవలసి యున్నది. విస్పష్ట ఫలితము లను పొందవలయుననెడి పట్టుదలగల్గ మానసిక స్వభావము, రస్సెలు వంటి వారి కంటె అధికముగనే శ్రీమాతకు, నాకునుకూడ యుండెడిది. దివ్యసత్యము యొక్క బంగారు నాణ్యములుగా తోచు వెలిగేభావాలతోను, పదజాలముతోను, రోలండువలె, మరితరులవలె మేమెప్పుడును తృప్తిపడి యుండజాలము. ఆంతఃకరణికానుభవ మునకును. క్రియాశీల బాహ్య-గామిక సిద్ధికారక శక్తికిని, మధ్యగల భేదము మాకు బాగా తెలియును. అందుచే మాకు ఆత్మవిశ్వాసమున్నను, మేము కేవల ఆత్మ విశ్వాసము పైననే అధారపడలేదు (ప్రపంచములో యేదెని ఘనకార్యమును ఆత్మ విశ్వాసములేకగాని, తమకు వెనుక సత్యము క్రియాశీలమై యుండక గాని, ఎవ్వరు యేమి చేసియుండిరి?): మా జీవితపర్యంతము, మేమువృద్ధి కావించుచు, పరీక్షించుచు నున్న, జ్ఞానక్షేత్రము పైన, మా కార్యము ఆధార పడియున్నది. భౌతిక విజ్ఞాని తన సిద్ధాంతమును, విధానమును, భౌతికభూమిక పైన, పరీక్షించు స్పష్టతతోకంటే, అధిక ముగ నేను అనేక సంవత్సరములుగా, రాత్రిం పగుళ్ళు పరీక్షించు చున్నానని చెప్ప గలను. అందుచే నాచుట్టుయున్న ప్రపంచ పరిస్థితిని పట్టి నేను భయపడలేదు; లేక, దివ్య ప్రకాశము భూమిపైకి జడపదార్థములోనికి దగ్గఱ దగ్గఱగా చేరినకొల్ల విరుద్ధ శక్తుల క్రోధము అధికమై పలుమారు అవి విజయవంతముగా కలిగించు కోపావేశ మునకుకూడ నేను కలవరపడలేదు.

అతిమానసిక అవతరణకు (అదెప్పుడు జరుగునని నే చెప్పను.) సాధ్యమని మాత్రమే గాక సంభవనీయమని నమ్మితివేని, ప్రత్యక్షముగా నెఱవేర గలదను అనుభవమును నేను పొందుచుంటినేని, ఆకాశములో మేడలు కట్టునట్లు కాజాలని

నావిశ్వాసమునకు కారణములు గలవు; అతిమానసికావతరణ అనివార్యమని నాకు తెలియును. నాకుగల అనుభవమును పట్టి, అది ఎప్పుడో భవిష్యత్తులో గాక సమీపము లోనే సంభవమని నాకు నమ్మకమున్నది. కాని అది ఎపుడో దూరభవిష్యత్తులో జరుగునని నేను తెలిసికున్నను, నామార్గమును నేను వదలను, నా ప్రయత్నమును విడువను. గతకాలములో అట్లుచేసి యుందునేమో కాని ఇప్పుడు మానుకొనను. ఆ మార్గమున ఎంతో ముందుకుచేరిన తర్వాత, ఇపుడు మానుకొనుట సాధ్యము కాదు. దివ్య సత్యావతరణ దృఢమని తెలిసినపుడు, లేక చేపట్టినపనిమాత్రమె సమస్యా పరి ష్కారమునకు మార్గమని నమ్మినపుడు, తక్షణ విజయమున కెవ్వరుకూడ బేర మాడరు: సాహసకృత్యము యొక్క ప్రతి గండమును ఎదుర్కొనుచు, చేయతగిన పనియను భావముతో దివ్యసత్యమునకేసి ప్రయాణించును. అయ్యును, నీవలె నేను కూడ, ఇప్పుడు ఈ జీవితములోనే – మరొక జీవితములోనో. మరెప్పుడోగాక – సిద్ధించ వలెనని గట్టిగా చెప్పుచున్నాను. 30–8–1932

## పురోగతియందు కలిగిన అభివృద్ధి

పరిస్థితిని గుఱించి నీవు చేసికొన్న అర్థముతో, కడకు శ్రీమాతను నన్ను గుఱించియు, మా కార్యమునందు మేమపేక్షించిన ఫలమును గుఱించియు, నీవు గ్రహించిన విషయముతో, నేనేకీభవించజాలను. కొంతకాలము క్రిందట మాకార్యము భారముగ నుండెనని, భౌతిక జడపదార్థ భూమికపై తీవ్ర దండయాత్ర జరిగెనని మాత్రమే ఒప్పుకొందును – కాని ఇట్టి దండయాత్రలకు 30 సంవత్సరములుగా అలవడి యుండుటచే, ఆవశ్యకమగు పురోగతిని కావించుట కవి మమ్ము అడ్డు పఱచవు. నా మార్గము సులభము సుఖప్రదమని నేనెప్పుడును భ్రాంతి పడ లేదు; మేము తలపెట్టిన కార్యము జయప్రదమగుటకుగా, మార్గమధ్యమున ఉత్పన్న ముగా గల ముఖ్యకష్టములన్నియు యుత్పన్నమై మేము ఎదుర్కొన్ననే సాధ్యమని నేను ఎల్లపుడు తెలిసికొని యుంటిని. ప్రకృతి యందుకాని, సాధకుల యందు కాని మాయందుగాని గలకష్టములు, ఎంతపట్టుదలతో మమ్ము నెదుర్కొన్నను, అవి నన్ను భయపెట్టుటకాని, అలసిపోవునట్లుకాని చేయలేవు. నేను అలసిపోలేదు; నేను, నా కార్య మును విసర్జించుట లేదు. గత రెండు మూడు మాసములలో ఆంతరమున పురోగతిని సాధించితిని; కొన్ని సంవత్సరములుగా నుండిన తీవ్రప్రతిరోధనచే ఈ పురోగతి అసాధ్యమని తలంచి యుంటిని. అందుచే ఈ అనుభవము నన్ను నా మార్గమునందు

నిరాశపడనివ్వదు; నా కార్యమును విడువనియ్యదు. ఒక ప్రక్కన ప్రతిరోధ ముండగా, మఱియొక ప్రక్కన అధిక లాభములు యున్నవి. – అంతయు నిరుప యోగ–అంధకారము కాదు. సందేహము అనే భూతముచే మాత్రము నీవు నీమార్గ మున వెనుకకు త్రోయబడినావు; నీ మార్గమున నీవు తెఱచు ఒక్కొక్క ద్వారమును ఈ నీసందేహము మూయుచున్నది; నీవుమాత్రము దృఢసంకల్పముతో నిన్ను నీవు స్థిరపఱచుకొని ఈ రక్కసుని సంహరించవలెను; అప్పుడు మాత్రమే, నీయందు కూడ,–స్వీయ ప్రాణిక–మానసికప్రకృతిచే, – ఇతరులయందు బంధింపబడి యుండిన ద్వారములు తెఱవబడి యుండినట్లుగ, – ద్వారములు తెఱచుకొనును. 12–2–1934.

## అధికాధిక దివ్యావతరణ

ఉన్నతతర దివ్యశక్తి అధికాధికముగ శక్తిపూరితముగ అవతరించు చున్న దనుట సత్యము. శ్రీమాత చుట్టు జ్యోతులను వివిధ వర్ణములను అనేకులు చూచు చున్నారు, – అతిభౌతిక సత్యవిషయములకు, వారి దృష్టి తెఱచుకొనుచున్నదని, దీనికర్థము : ఇదంతయు వట్టి భ్రమకాదు. నీవు చూచు జ్యోతులు, వర్ణములు, వివిధ భూమికల యందలి శక్తులు, ఒక్కొక్క వర్ణము ఒక్కొక ప్రత్యేక శక్తిని సూచించును.

అతిమానపిక దివ్యశక్తి అవతరించు చున్నది. కాని, అది శరీరమునుకాని. జడమునుకాని స్వాధీన పఱచు కొనలేదు, అందుకింకను అధిక ప్రతిరోధము కలదు, అతిమనస్సుగా మార్చబడిన దివ్య అధిమనస్సునే నేనిపుడు స్పృశించునది : ఏనిమిష మైనను, ఈ అధిమనస్సు, స్వకీయ శక్తితోనున్న అతిమనస్సుగా మారవచ్చును. 14–9–1934

## అవతరణయొక్క దీర్ఘ విధానము

నవంబరు 24 వ తేదినాడు, అతిమనస్సు అవతరించ నున్నదని ఎవ్వరికిని శ్రీమాత చెప్పలేదు, అనుట సత్యము; కాని యక్సు అనునాతనికీవిషయము నెవ్వరు చెప్పిరో నాకు తెలియదు. ఈ విధముగ తేదీలు నిర్ణయింప బడజాలవు; అతిమనస్సు యొక్క అవతరణ దీర్ఘ విధానమును అనుసరించును; లేక, కడపటికిది, దీర్ఘ సన్నాహముతో కూడిన విధాన మని యైన చెప్పవలెను; అందుచే, ఈకార్యము ఒక పుడు పూర్ణ సిద్ధికిగా బలమగు భారముతోను, మఱొకపుడు, పురోగతి పొందుట

కవసరమగు స్థితిని చేరుటకుగా, లోతులనుండి ఉత్పన్నమగు అవరోధములతోను, సదా ముందుకే నడచుచున్నదని మాత్రమె దీనిని గుఱించి ఎవ్వరైన చెప్పగలరు. ఈ విధానము ఆధ్యాత్మిక-పరిణామ-పద్ధతిని అనుసరించును; అల్పకాలములో ఏకాగ్రతచే సిద్ధింప బడగల విధాన మిది, - మానవుని మనస్సు, ఇప్పుడుండినట్లుగాక, అజ్ఞానమునకు తక్కువగా అంటు కొని, మఱింత అధికనమ్రత కలిగి యుండునేని, ఇంతకన్న స్వల్పకాలములో (భగవానుడు అద్భుతముగ మధ్యవర్తియై ప్రవేశించుటచే మనుజులు చెప్పుకొనునట్లుగ) జరుగును. మాకుగల అనుభమును పట్టి ఇది ప్రథమము కొందఱిలో, అభివ్యక్తమై, ఆ తర్వాత వ్యాపించ వలెను,; కాని ఒక్క-క్షణములో పృథ్వినంతటిని ముంచివెయ్యదు, అదెట్లు చేయును, ఏమిచేయును అని ముందుగా తర్కించుట బాగుకాదు; ఏలయన, ఈ విషయములను గుఱించి, అతిమనస్సే, దాని యందుగల దివ్య సత్యముననుసరించి నిర్ణయించును: అదుట్లు ప్రవర్తించును, అని మనస్సు నిర్ణయించ ప్రయత్నించ కూడదు. వ్యాధినుండియు, అధశ్చేతనకు గలఅజ్ఞానము నుండియు, విమోచన, స్వకీయ-ఇచ్ఛననుసరించి జీవితమును పెంపొందించుట, శరీరావయవముల క్రియల యందు మార్పు, - ఈ యన్నియు అతిమానసిక రూపాంతరము నందలి అంశములై యుండుననుట స్వాభావికమే; ఈ అంశములయొక్క వివరములు, అతిమానసిక దివ్యశక్తి స్వభావము ననుసరించి పనిచేయుటకుగా, ఆ దివ్యశక్తికే వదల బడవలెను. 18-10-1934

## దివ్యావతరణకు ప్రతిరోధము

## 1

నా లేఖలలో అతిమనస్సును గుఱించి, తీవ్ర అవరోధముల గుఱించి వ్రాసినపుడు, అంతకుముందు చెప్పినదానిని గుఱించే, మఱల చెప్పితిననుట నిజమే. ఈ అవరోధన నేను ఊహించి యుండనిది అనికాని, లేక ముఖ్యాంశమును దేనినైన మార్పు గావించినదనికాని, నేను వ్రాసినదానికి అర్థము చేయలేదు. కాని, ఈ దివ్యావతరణ యొక్క స్వభావమును పట్టి, అదేమియు స్వచ్ఛందముకాదు, అద్భుతము కూడ కాదు; కాని, - అది కొలది సంవత్సరములలోనికి కూర్చబడిన వేగవంత - పరిణామాత్మక - విధానము; అది, వర్తమాన ప్రకృతిని దాని దివ్య సత్యము లోనికి తీసికొని, దాని దివ్యసత్యమును నిమ్నభూమికలలోనికి గ్రుమ్మరించును. ఈ కార్యము, ఒక్కసారిగా ప్రపంచ మంతటిలో జరుగజాలదు; ఈలాటి విధానము లన్నింటివలె,

ఇదికూడ, మొదట తగిన ఆధారములుగల కొందరిమూలమునను, అతర్వాత
విస్తృత పరిమాణములోను చేయబడును. మొదలు మాద్వారానే యున్ను, పృథ్వీ
చేతస్సునందు గల పలురకు స్వభావములకు ప్రతినిధులుగ మా చుట్టు చేరిన సాధ
బృందము ద్వారాయున్ను, ఈ కార్యముకూడ, ఇదే విధానము ననుసరించు ఇత
కార్యములవలె, చేయబడును. కొందరైన ఉన్మీలితులై రేని, విధానము సాధ్యమగ
టకు చాలును. ఇటుగాక, దురభిప్రాయము అవరోధనము అందరియందుగాక, అ
కుల యందు సాధారణముగ నుండెనేని, విధానము, కష్టము, శ్రమతరము అగును
కాని, అసాధ్యముకాదు; ఈ అత్యంత ముఖ్య విషయముపై ఏకాగ్రత వహించుటక
మాకు శక్తిజాలకను, ఇందుకు సంబంధములేని ఇతర కార్యమును అధికముగ
చేపట్టుట చేతను, పరిస్థితులు అనానుకూలమయ్యెనేని, దివ్యావతరణ, త్వరగా సిద్ధించ
టకు బదులు మఱికొంత దీర్ఘకాలము పట్టునేకాని, ఈ కార్య సిద్ధి అసాధ్యమ
నేను సూచించలేదు. దివ్య అతిమానసము, పృథ్వీచేతస్సు యొక్క లోతులలోని
త్రవ్వుకొని ప్రవేశించుటకు, తగినంత శక్తితో పృథ్విని తాకెనేని, ఆసురిక మాయ
విజయమునకు కాని, దాని పునరుజ్జీవనమునకు గాని, ఆ మీదట ఎంతమాత్రమ
అవకాశముండదనుట సత్యము.

దైవమును మానవుని గుఱించి నేను వ్రాసిన మిగత దంతయు ఈ కార్య
సిద్ధికి పూర్వమునగల కాలపరిస్థితికి సంబంధించినది. ఆశ్రమ చరిత్రయందు, కొన్ని
సంవత్సరముల క్రిందట, అత్యంత తేజోవంతముగ ఆకొలదిమాసములు నిరవధిక
ముగా చేసినట్లు వలె, మఱల శ్రీమాత తన శరీరములోనికి, భౌతిక సత్తలోనికి
దివ్యవ్యక్తిత్వములను, దివ్యశక్తులను అవతరింపచేయ శక్తి కలిగి యుండునేని,
విషయములు మఱింత సులభమై, ఇప్పుడు జరుగుచున్న ఈ అపాయకర దాడు
లన్నియు తొలగించబడి, అవి సాధ్య మొనరింప బడును, అని సూచించితిని. ఆరోజు
లలో, సాధకులను ధ్యానము కొఱకు దగ్గర చేర్చుకొను చుండినపుడును, లేక రాత్రిం
బవళ్ళు నిద్రను సకాల భోజనమును విడిచి ఏకాగ్రతతో పనిచేయు చుండినపుడును, ఆమె
యందు అనారోగ్యముకాని, అలసటకాని లేక, విషయములు విద్యుద్వేగముతో జరిగి
పోవు చుండెను. అపుడు ప్రయోగింపబడిన దివ్యశక్తి అతిమనస్సు (Super - mind)
కాదు; కాని, అది అధిమనస్సు (Over - mind) అయ్యును, చేయబడు కార్యమునకు
అది చాలినంత శక్తి కలదై యుండెను. సాధకుల నిమ్న ప్రాణిక-భౌతికములు,
ఈ విధానమును అనుసరించలేక పోవుటచే, ఆతర్వాత శ్రీమాత తన కార్యమునకు

ప్రయోగించిన దివ్యవ్యక్తులను, తెరచాటున యుంచి, తానే మానవుని భౌతిక సమ - స్థితికి దిగి, అచ్చటి పరిస్థితులను పట్టి పనిచేయవలసి యుండెను. ఈ విధానము నందు, కష్టము, పోరాటము, వ్యాధి, అజ్ఞానము, తమస్సు కూడి యుండును. సర్వము, దీర్ఘకాలికము, మందము, కష్టము, బాహ్యదృష్టికి, నిష్ఫలముగ నుండెను; ఇప్పుడు మరల, పురోగమించుటకు సాధ్యమగు చున్నది. కాని విధానమునందు పురోగతి సర్వసాధారణము శీఘ్రము కావలయునన్న - సాధకుల ఆంతరిక వైఖరి, కొందటి యొక్క మాత్రమె కాదు. అధికులయొక్క వైఖరి - మారవలెను. వారు, తమ భౌతిక - బాహ్యచేతస్సు యొక్క స్థితులకు భావాలకు తక్కువగా అంటుకొని, సాధకుని యోగ చేతస్సునకు తెరచుకొనవలెను. వారది చేసినచో, వారి అంతః చక్షువు తెరచుకొని, మరల శ్రీమాత పూర్వమువలె దివ్యవ్యక్తులను శక్తులను బాహ్యముగా ఆవిర్భవింప చేసినచో, భయపడక కలవరపడక యుందురు. తమతో సమానముగ శ్రీమాతను సర్వదా నుండుమని వారపుడడుగరు; కాని, శీఘ్రముగా లేక క్రమముగా ఆమె భూమికకు ఊర్ధ్వబడుటకు సంతోషింతురు, కష్టములు పదంత లుగా తక్కువై, అధికతర సులభతర పురోగతి సాధ్యమగును.

నేను తెలపినదిది; మానవ స్వభావమునందు అసామంజసముగా నున్నదాని నంతటిని తొలగించి, సామరస్యముగానున్న దానినంతటిని, మానవ పరిణామ మునకు లోపించిన దానినంతటిని, విశుద్ధతరముగ, ఉన్నత తరముగ, మహత్తర ముగ, సౌందర్యతరముగ నొనర్చి. దాని దివ్య సమస్థితికి రూపాంతర మొందించు. మాయొగము యొక్క ఈ ప్రథమ సిద్ధాంతము సహేతుకమై యుండియు, దీనిని గ్రహించుటకు అనేకులు కనపరచిన మందతను గురించి, అసహిష్ణతను నేను నాలేఖ యందు వ్యక్తపరచితినని తలంతును. ఈ గమ్యమును చేరుటకు, విషయములు మరింత వేగముగ ముందుకు నడుచుటకు, సాధకుల అంతరికవైఖరి తక్కువ అజ్ఞానముతో కూడి యుండవలెను; కాని వారంతటి స్థితికి రాలేనిచో, అతిమాన సిక-అవతరణ భౌతిక భూమికకు చేరువరకు, మేమెట్లో ముందుకుపోవలయుననుట సత్యము.

కడపటి అంశమేమన, నిర్నిమిత్తముగా నిరాశచెందే ప్రవణతను నీవు తొల గించు కొనవలెను. "నీవు నిర్మించుకొన్న భావానికి నీవుఇచ్చే స్వచ్ఛందత(చొరవ)యె నీకు కష్టము కలిగించు చున్నది; దానిని కడపటిసారిగా తొలగించితే", నీకష్టము

మాయమగును; ప్రథమమున అభివృద్ధి మందముగనే యుండవచ్చు; కాని అభివృద్ధి తప్పక కలుగును; కొంతకాలము తర్వాత అభివృద్ధి శీఘ్రతరమై, ఇచ్చటగల అతి మానసిక శక్తి సహాయముతో, ఇతరులకు వలె, నీకును సిద్ధి సత్యముగనే అతివేగ ముగ కలుగును. 18-10-34

## 2

"కాని ఇపుడు శ్రీమాత వెనుకకు మఱలినది. తప్పంతయు అతిమాన సమునదే; ఏలయన, అతిమానసమును భౌతికములోనికి కొనితెచ్చుటకే, ఆమె ఏకాంత మునకు మఱలినది" అని నీవుచెప్పుదువు. అతిమానసమును తప్పుపట్టుట తగదు; ఆశ్రమ వాతావరణమునందు, అయుక్త ప్రతిస్పందనలచే, అయుక్త ఆంతరిక వైఖరిచే, ప్రాణిక - భౌతిక స్పర్శకుగా శ్రీమాత సృష్టించిన విధానము మలినపడి యుండనిచో, పూర్వపు పరిస్థితులయందు కూడ అతిమానసము భౌతికములోనికి అవతరించి యుండును; అతిమానసిక శక్తి నేరుగా పనిచేసి యుండలేదు; కాని అతిమానసమునుండి కూర్చుకున్న ఒకవిధమగు దివ్యజ్ఞాన ప్రకాశమును తనయందు వహించిన మధ్యస్థ - సన్నాహకశక్తి పనిచేసి యుండెను. ఇంకను విజయింప బడని నిమ్న (భౌతిక) ప్రాణిక - జడ - భూమికపై ఈ అయుక్త శక్తులు దాడి జరిపి యుండనిచో, మహత్తర కార్యమునకు కూడ దారిని తెఱచియుంచు క్రియకు, ఈ మధ్య స్థసన్నాహకశక్తి చాలినంత బలమును కలదై యుండెను. ఇట్లీ అయుక్త శక్తులు అడ్డుదారి విరుద్ధ ఫలితమును కలిగించె అవకాశమును వీనికి యొసగనివ్వ కూడదు. ఇందుకనే, శ్రీమాత అవలంబించినపద్ధతినివిడచి, ఆమె వెనుకకుమఱలినది, అట్లయ్యును, క్రియాక్షేత్రమును వదలుటయని కాదు; కాని ఇది తాత్కాలిక ఉపాయ ముగ అవలంబించిన తిరోగమనము. అందుచే, ఈ లోపమును సవరించుట అతి మనస్సుయొక్క బాధ్యతయై యుండలేదు; ప్రత్యామ్నాయముగ చెప్పగలిగినదేమన, అతిమానసికావతరణ అన్ని కష్టములను తొలగించును. 14-1-1932

### భౌతికములోనికి సాధనయొక్క అవతరణ

ప్ర :- సాధన భౌతిక భూమికలో జరుగునపుడు, సాధకులందఱు భౌతిక చేతస్సులోనికి దిగవలెనా, లేక, నాయందువలె అపరిశుద్ధతను తమస్సును అధిక ముగా కలవారే దిగవలెనా ?.

జవాబు :— అందఱు పూర్తిగా భౌతికములోనికి దిగవలయునా లేదా యని చెప్పుట కొంతకష్టము. శ్రీమాతయు నేనును దిగవలసి యున్నది. లేనిచో ఈ కార్యము వేరువిధమున సిద్ధింపదు. మేము పైనుండి ఉన్నతతర ప్రాణికము ద్వారా ఆ పని చేయుటకు ప్రయత్నించితిమి; కాని అది సాధ్యము కాలేదు: ఏలయన వారీవిధానమును అనుసరించలేక పోయిరి, — క్రిందికి అవతరించు దానిని అనుభ వించుటకు, వారి నిమ్నప్రాణ భౌతికములు తిరస్కరించెను, లేదా దుర్వినియోగ పఱచి, అతిశయోక్త – ఉగ్ర – ప్రతిఘాతములతో తమ్మఁదా నింపుకొనిరి. అప్పటి నుండియు వారి సాధన అంతయు, మాతోపాటు భౌతిక చేతనలోనికి దిగినది. చాల మంది,' ఈ విధానమును, మనః ప్రాణములందు తగిన సన్నాహము లేకనే తక్షణము కొందఱు, మనః ప్రాణములకును, వీనితోపాటు భౌతికమునకును — అంటుకొని, ఈ మూడింట మధ్య జీవించుచు కొందఱు, పూర్తిగా, మనః ప్రాణములను సిద్ధపఱచికూడ, మఱికొందఱు — అనుసరించియున్నారు. భౌతికములోనికి పూర్ణావ తరణ చాలకష్టతర కార్యము. భౌతికము సాధారణముగా, దివ్య సత్యమును ప్రవే శించనియ్యక, అభేద్యమై, మందమై, గూఢమైయుండును. ఈభౌతికము, అలవాట్లతో కూడుకొనిన వస్తువు; అథశ్చేతనమునకును యంత్ర సదృశ క్రియాప్రతి క్రియలకును బానిసయై ప్రవర్తించును. ప్రాణికమువలె అంత అధికముగా ఉగ్రదాడులకిది లోను గాదు; కాని, ఇది జాడ్యములకును వేఱువిధ ప్రవృత్తులకును లోనై యుండును; దివ్యప్రకాశము, దివ్యశాంతి, దివ్యశక్తి, దివ్యసంతోషము పైనుండి అవతరించి దీనిలో స్థిరపడు నంతవఱకు నిస్సంతోషమును మాంద్యమును కలిగి పాత అల వాట్ల ననుసరించి వర్తించు చుండును. ఈ భౌతిక చేతస్సునందు కష్టమగు కార్య మంతయు మేమేచేసి, సులభతర కార్యమునకు అనుకూల మేర్పఱచిన తర్వాతనే ఇతరమును దిగువకు ఆహ్వానించి యుందుము, కాని ఇది సాధ్యము కాలేదు.

అపరిశుద్ధతతో దానికి సంబంధము కలదని నేను తలంచను. క్రిందికి దిగ వలసిన దానికన్న త్వరగా దిగితివి, అది జరిగినపుడు, ఉన్నతతర చేతస్సునందు, తలపై భాగమున, ఆత్మానుభవము కలిగింప గల ఊర్ధ్వచలనము, ఆత్మయొక్క శాంతియు, నిశ్చల నీరవతయు, తమ్మఁదా స్థాపించు కొనుటకు సిద్ధపడి యుండెను. ఇదే మొదలు జరిగి యుండినచో, ఇది తక్కువ కష్టముగా నుండెడిది. ఈ విషయ ములు నెఱవేఱుటకు జడ స్తబ్ధతతో నీవు గొప్పగా పోరాడవలయునని దీనికర్థము —

నీవు పట్టుదలతో ప్రయత్నించినచో తప్పక అవి నెఱవేరును. నీ కవి చాలసులభ సాధ్యము. 31-12-1934

## ఒక నూతన దివ్యశక్తి

యకృ్న తల్లి యొక్క చికిత్సా విజయము, నిజముగా నొక ఘన కృత్యమే యగును; ఆ వ్యాధికిగల అశమనీయతను దుష్టతనుబట్టి, అది బాగగుట కష్టమే అయ్యును, అది అసాధ్యముకాదు. దివ్యశక్తి అక్కడ పూర్వమే పనిచేయు చుండె ననుట నీవు చెప్పుచున్నది సత్యమే; చాలినంత విశ్వాసము, గ్రహించేశక్తి (ముఖ్యముగా సాధకులు) గల వారి యందును, లేక ఇతర అనుకూల పరిస్థితుల యందును, మాత్రమే తక్షణ వేగముతో, పూర్ణతతో ఆశక్తి పనిచేసెను

ఈ దృష్టాంతములు, దివ్యశక్తియొక్క యొక నూతన సామర్థ్యమును, నూతన విధానమును సూచించునని తోచును. అది ఇతరత్ర వ్యాపకమై పనిచేయునను నీ భావమునకు ఆధారము లేకపోలేదు; ఏలయన పృథ్వీవాతావరణము నందిదివఱకు లేని ఒకానొక దివ్య విషయము వ్యవస్థితమయ్యె నేని, ఊహించని విధముగ అనేక మార్గముల నది పనిచేయును. ఈ విధముగ, ఈ యోగము, కార్య కారియైనప్పటి నుండి దాని ప్రత్యేక వికాసకారి గతులు, మాతో సంబంధము లేనట్టియు, వారికి జరుగుచున్నది ఏమియని తెలియనట్టియునగు అనేకులకు చేకూరినవి. ప్రకృతి ఇంకను పరిణామ గతియందుండుటచే, నూతన దివ్యజ్యోతులు, దివ్యశక్తులు, ప్రకృతి యందు కొనితేబడి, సచేతన పృథ్వీ సత్తయొక్క అంశములుగ చేయబడవలసి యున్నవి. 29-1-1936

## భౌతిక భూమికయందలి పోరాటము

వ్యాధిని గుఱించి నీవు వేసిన ప్రశ్నకు సమాధానముగా, భౌతిక భూమి యందలి పరిపూర్ణత, ఈయోగాదర్శములో నొకభాగమనుట నిజము, కాని ఇది కడపటి అంశము; శరీరమును అంతర్భాగముగా గల భౌతిక చేతస్సునందు ప్రధాన మార్పు కలుగ నంతవఱకు, ఇతర భూమికలయందు కొంత పరిపూర్ణత కలిగినను, శరీరమునందు ముక్తస్థితి లేకపోవచ్చును. ప్రత్యేకముగా మాకొఱకు మేము పరిపూర్ణతను అన్వేషించలేదు: కాని ఈ పరిపూర్ణత సర్వసాధారణముగ - ఇతరుల పరిపూర్ణతకుగా-సాధ్యతను సృష్టించుటకుగా మేము దీనిని అన్వేషించితిమి. ఈపనిని

సాధ్యపడుటకుగా, ఈ సిద్ధిని ఈ రూపాంతరమును మేము మాకుగా అంగీకరించు కొని, అందలి కష్టముల నెదుర్కొని వానిని జయించ వలసియున్నది. ఇతర భూమికలపై చాలినంత మేరకు, ఈ కార్యము చేయబడి యున్నది: కాని భౌతిక భూమిక యొక్క కేవల జడ-అంశమునందు చేయబడలేదు. ఇదిచేయబడు వఱకు, అక్కడి పోరాటము జరుగవలెను. యౌగిక క్రియారక్షణ శక్తి అనునది యొక్కటి ఉన్నది, అయ్యును కష్టములకు మినహాయింపు ఉండజాలదు. శ్రీమాతకు కలుగు కష్టములు స్వకీయములు కావు; రూపాంతర కార్యముయొక్క సర్వసాధారణ కార్యమునందు అంతర్గాతముగా గల కష్టములను, ఇతరుల కష్టములను కూడ అమె భరించును. అట్లుకానిచో, దీని విషయమే వేఱుగ నుండును. అగస్టు. 1936

---

# మార్గమున సాహాయ్యకులు

## ఆశ్రమము ఏర్పడుటకు కారణములు

### 1

ప్రారంభమున ఆశ్రమము లేదు, శ్రీ అరవిందుల సమీపమున నుండుచు, యోగము చేయుటకు కొందఱు వ్యక్తులు వచ్చిరి. జపాను నుండి శ్రీమాత వచ్చిన కొంతకాలము తర్వాతనే అది ఆశ్రమరూపము ధరించెను; ఇదియును, శ్రీమాత యొక్క, లేక శ్రీ అరవిందుల యొక్క ఉద్దేశ్యమును, లేక ప్రణాళిక ననుసరించి గాక, సాధకులు తమ ఆంతరిక-బాహ్య జీవితమును శ్రీమాత చేతులలో నుంచుటకు కోరుటచేతనే, ఇది ఆశ్రమ రూపము వహించెను.

### 2

జరిగిన విషయము లేవన, - ఫ్రాంసు జపాను దేశములలో శ్రీమాత చాల కాలముండి 24-4-1920 తేదీన పాండిచెరికి తిరిగి వచ్చెను. శిష్యుల సంఖ్య వేగముగా వృద్ధియగు సూచన కనబడెను. ఆశ్రమము వృద్ధియగుటకు ప్రారంభించినపుడు, దానిని వ్యవస్థీకరించు బాధ్యత శ్రీమాతకు కలిగెను; త్వరలో శ్రీ అరవిందులు యేకాంతమును ప్రవేశించిరి; ఆధ్యాత్మికముగా, భౌతికముగా దీనిబాధ్యత యంతయు శ్రీమాతపై పడెను.

### 3

ప్ర :- ఆశ్రమము యొక్క పూర్తి బాధ్యత 1926లో నేతేదినాడు శ్రీమాత వహించెను ?

జవాబు :- ఆతేది స్పష్టముగా శ్రీమాత కెంతమాత్రము జ్ఞాపకము లేదు. ఆగస్టు 15, తర్వాత కొన్ని దినముల కుండవచ్చును. నేనేకాంతమును చేరినపుడు ఆ కార్యమును పూర్తిగా శ్రీమాత వహించెను.

## ఆశ్రమ హద్దులు

ఆశ్రమ హద్దు లేవి ? ఆశ్రమ సాధకులు నివసించు ప్రతి గృహము ఆశ్రమ పరిహద్దులలలోనే యున్నది. ఈ కాంపౌండులో నున్న గృహములనే ఆశ్రమమని ప్రజలు విచిత్రముగా చెప్పుకుందురు. – దీని కర్థములేదు. ఒకానొక కాంపౌండుకె, శ్రీమాతయొక్క, లేక నాయొక్క ప్రభావము అంటియుండునని వారు తలంతురా ? జనవరి 1935.

సాధకులతో మా వ్యవహార ధర్మము (పద్ధతి)ను అల్లేసర్వులతో కూడ, మేము (శ్రీమాతయు నేనును) దైవధర్మమును పట్టియె వ్యవహరింతుము. ధనికులను దరిద్రులను మానవుని ప్రమాణముల బట్టి గాక, నిమ్నజాతి. యందు లేక ఉన్నత జాతియందు జన్మించిన వాడైనను, అందరిని సమానముగా మేము ఆశ్రమములో చేర్చుకొని, వారికి సమానముగా ప్రేమను రక్షణను అందజేయుదుము – సాధనయందు వారి అభివృద్ధియే, మా ముఖ్యకార్యము. – ఏలయన, వారిక్కడికి వచ్చిన, దందులకే, వారి ఉదరములను, జిహ్వాచాపల్యమును తృప్తి పఱచుకొనుటకు కాదు, సామాన్య ప్రాణిక కామనలను కోరుటకు కాదు, లేక సుఖములకు, పదవులకు గౌరవమునకు పెనగులాడుటకు కాదు, వారు వచ్చినది. వారి అభివృద్ధి, శ్రీమాత ప్రేమరక్షణలకు ఎట్లు వారు ప్రసన్నులగు చుండిరనుటపై, సర్వులపై సమానముగ ఆమె గ్రుమ్మరించు శక్తులను, అందుకొను చుండిరా, ఆమె వారికిచ్చిన వానిని, సువినియోగ పఱచిరా, దుర్వినియోగ పఱచిరా,యను విషయములపై నాధారపడి యుండును. కాని, శ్రీమాత సర్వులను బాహ్యదృష్టికి కనబడు నట్లుగ సమానముగా వ్యవహరించ వలసిన బాధ్యతకాని, ఉద్దేశ్యము కానిలేదు; అట్టి భావన దుర్బలతతో, అవివేకముతో కూడుకొన్నది మాత్రమే. ఆమె అట్లు చేసినచో, దైవధర్మమునకు, ఆశ్రమ సత్యమునకు అమెదూరస్థురాలగును. ప్రతి సాధకుని, స్వభావమును, శక్తులను, ఆవశ్యకతలను పట్టియు (అతని హక్కులను కోరికలలను పట్టికాదు), అతని ఆధ్యాత్మిక శుభమునకు గల ఉత్కృష్టతను పట్టియు, అతనితో వ్యవహరించ వలెను. అదెట్లు అను విషయమున, బయటి నుండి వారికి కలిగే భావాలను పట్టికాని, వారి కామనలను పట్టికాని, న్యాయము సత్యము అనెడి వారి భావాలకు గల ప్రమాణమును బట్టిగాని, శ్రీమాత తమయందు తాను కోరినవిధముగ వర్తించ వలెననెడి సాధకుల అజ్ఞానముతో ఆజ్ఞాపింపబడుటకు గాని, మేము అంగీకరించము. మాయందు

గల దివ్యసత్యమును పట్టియు ఈ పృథ్వీ స్వభావమునందు మేము స్థాపించుటకు ప్రయత్నించుచున్న దివ్య సత్యమును పట్టియు మేము వర్తింతుము. 11_12_1933

## మేము ప్రథమమున కోరునది

మేము అంగీకరించువారు, దైవమును ఒక్క అంశముననేయైన మనః పూర్వకముగా కాంక్షించినను, అట్టివారిని కూడ, మేము అంగీకరింతుమని నీవు చెప్పుమాట, పూర్తిగా సత్యమే. ప్రారంభమున మేము వారినుండి అధికముగ కోరితిమేని, దైవదిశకు ప్రయాణించుటకు ప్రారంభించువారి సంఖ్య చాల స్వల్పముగ నుండును. 24_4_1935

## సాధకులయెడ మా ఏకైక కర్తవ్యము

తప్పులు, వానికి శిక్షవిధించడము అను ప్రశ్నయే లేదు. - ధర్మాధికారివలె సాధకులతో వారి తప్పులను గుఱించి వ్యవహరించి, వారిని శిక్షించుచు, తప్పులు పట్టుచుండినచో సాధన సాధ్యమే కాదు, మమ్ముల గుఱించి నీవు కావించె దండన ఎట్లు న్యాయమో నాకు తెలియదు. సాధకులను ఆధ్యాత్మికానుభవమునకు గొనిపోవుటె మాముఖ్య కర్తవ్యము - కుటుంబ కలహములలో కుటుంబ యజమాని ప్రవర్తించునట్లువలె, ఒకరి పక్షము వహించి మరొకరిని తగ్గుపఱచుట, మా పని కాదు ! X అనునతడు, ఎన్నిసారులు తప్పుదారి నడిచినను, అతనిని చేతపట్టి లేవనెత్తి, మఱల దైవమునకేసి మఱలునట్లు చేయవలెను. నీతోకూడ అట్లే వ్యవహరించితిమి. 29_3_1933

## ముంచివేయు మీ కృప

ప్ర :- మాకాపత్యములు అవిధేయతలు, చెడునడతలు. ఈ యన్నింటిని ఓర్చుకొన్న మీ కృపానహనములు నన్నుముంచి వేసినవి.

జవాబు :- మానవ స్వభావము, దాని సాంద్రత యందిట్టిదే; మాకు సహనము లేనిచో, అదిమారునను ఆశయే లేదు. కాని, మానవునియందు, మార్పునకు శక్తి నివ్వగల మనః పూర్వక వస్తువు వేరొకటి కలదు. యెక్కువంటి వారియందు ఆవేరొక వస్తువు (అది అంత దట్టముగా కప్పబడి యున్నది) ను కనుకొని, దాని నాచరింప చేయుట కష్టము. 8_7_1934

## సాధకులతో మమ్ము పోల్చుకొనుట

### 1

ఇక్కడ ఎవరైన నాతోను శ్రీమాతతోను సమానమగుదురనికాని, మా స్థానమునాక్రమించగలరనికాని నేను భావించలేదు.........కాని X, Y, and Z రూపాంతర మొందుటకు నిజముగా సాధ్యమే, వారి ప్రస్తుత వ్యక్తిత్వములను పరిధులను పోద్రోచి, ఇప్పుడున్న దానికన్న, ఇంకను సమీపమునకు రాగలుగుట సాధ్యమే, కాని అందుకు మనః పూర్వక సంకల్పముతో ప్రయత్నించవలెను. 10-8-1935

### 2

శ్రీమాతయు నేనును తప్ప, ఎవ్వరును కూడ అధిమనస్సును అనుభవించ లేదు. దాని ప్రభావమును మాత్రమే వారు అనుభవించుచున్నారు, అదియును అంతర్ముఖముగనే. 24-3-1934

## సాధకులు చేయవలసిన పనులు

### 1

సాధకులకు గాను పనిచేయుట, నీగౌరవానికి లోపమా ? ఈ వైఖరితో కూడిన అహంకార పూరితము, సాధకునికి తగదు. భోజనశాలలో, గృహనిర్మాణ సేవలో, గిడ్డంగులలో, వడ్లపనిశాఖలో, కమ్మరిపనిశాఖలో, సాధకులందఱు, ఇతర సాధకులకే పనిచేయుచున్నారు; దినమంతయు శ్రీమాత సాధకుల కొఱకే పనిచేయుచున్నది; ఈ జవాబు వ్రాయుటయందు కూడ సాధకుని కొఱకే, నాకాలమును, వ్యయపఱుచు చున్నాను. భోజనశాల వంటశాలలలో చేయువారు "సాధకుల కొఱకు వంటచేయము, వడ్డించము; అట్లుచేయుట మాకు గౌరవలోపము. శ్రీమాత కొఱకు మాత్రమే, మేము వంటచేయుదుము" అని చెప్పిన, అది సరియందువా? నేను శ్రీమాతకే జాబులు వ్రాయుదును. మరెవ్వరికి వ్రాయనని తలంచి, సాధకుని కొఱకు చేయుచున్నానను నెపమున, నీ జాబులకు బదులు వ్రాయకుండ నిలుపుదునా ?

వంటశాలలో సాధకులకు వంటచేయుటతప్ప, X ఇన్ని సంవత్సరములేమి చేసెను ? సాధకులకుగాను గిడ్డంగులలో Y ఏమిచేయుచుండెను ? ఈ భావాలన్ని

బుద్ధిహీనములు. శ్రీమాతచే నివ్వబడిన ప్రతి పనియు శ్రీమాత కొఱకు చేయు పనియే. నవంబరు 1938

## 2

పుస్తకములు జాబులు వ్రాయు పనిమానుకొనబడదు – కాని వారమున కొక దినము (ఆదివారము) ఈ పనిచేయకుందును. ఉత్తర ప్రత్యుత్తరముల పని చాల అధికమగుచున్నది: రాత్రి యంతయు, పగటిలో ఎక్కువ భాగము ఇందులకే వ్యయమగుచున్నది: శ్రీమాతకూడ తన పనిని పగలున్ను, రాత్రిలో కొంత భాగము చేసికొని, రాత్రులలో అధిక భాగము ఇందుకే వ్యయపఱచుచున్నది. ఇందుచే నానాటికి ప్రణామము, ఆలస్యమగుచున్నది, ఏలయన ఈ పనులు 7–30 గంటల వఱకు, ఇంకను ఆలస్యముగనే ముగియును. ఈ పనికూడా, కొదవబడి, వీని కొఱకు మిగతా ముఖ్య పనులకు భంగము కలుగుచున్నది. కొంత విశ్రామ మవసరము. 19–12–1933

### ఆధ్యాత్మిక విషయమునందు గల రెండు అంశములు

సహాయము (దైవముయొక్క మధ్యస్థమును గుఱించి నే చెప్పుటలేదు, కాని శ్రీమాతయొక్కయు నాయొక్కయు సహాయము) నీకు తప్పక యుండును. నీ మనస్సు భౌతికమే అయ్యును, మా సహాయము క్రియాశీలమై పనిచేయును; కాని దీని ఉపకరణముగా, నేను చెప్పునట్టి క్రియాశీల దృఢసంకల్పము కూడా అక్కడ యుండునేని, మా సహాయము మరింత కార్యకారి కాగలదు. అధ్యాత్మ విజయమునందు సదా రెండు అంశము లుండును,–ఒకటి స్వకీయ దృఢ సంకల్ప ప్రయత్నములు, రెండు, ఏదోయొక విధముగ సహాయపడి, ప్రయత్నమునకు ఫలమునిచ్చుదివ్యశక్తి. 26–1–1934

### వ్రాత మూలకముగ సహాయమును పొందుట

## 1

ప్రశ్న: మాయందేమి జరుగుచుండునది, మేము దేనిని ఎట్లు ఆకాంక్షించు చుండునది మా స్వభావము, మీ సహాయ్యమును, నేతృత్వమును ఎట్లు అందుకొని ప్రతి క్రియ కావించుచున్నది. శ్రీమాతకును మీకును తెలియునని భావింపబడు చున్నది. అట్లైనచో మీకిదంతయు వ్రాయవలసిన పనియేమి?

జవాబు: నీవు వీనిని ఎఱింగి నీ స్వీయ పరిశీలనను మా యెదుట పెట్టవలసిన అవసరమున్నది. మేము పని చేయగలుగునది. దానిపైననే. అపుడు సాధకుని భాగమును మేము పరిశీలించిన భాగమున, సాధకుడు చేయవలసిన సచేతన కార్యమును చేసిననే, మా కార్యము దానిపై ప్రయోజన పడగలదు. 7-1-1936

## 2

సాధకులు తమ కష్టములను మాకు స్పష్టముగా చెప్పుకొనుటచే సదా తక్షణ నివారణకానప్పటికిని, పలుమారు తక్షణనివారణోపాయమై శ్రేష్ఠమయ్యెననుటకు నూరాఱ్లు ఉదాహరణములు కలవనుట నిస్సందేహము. ఇక్కడనున్న సాధకులే కాదు, దూరముగనున్న వారు కూడ, తమ ఆంతరిక కష్టములను గుఱించి మాత్రమే గాక, ప్రతికూల బాహ్యపరిస్థితులను, వ్యాధుల గుఱించికూడ మాకు తెలుపుటచే ప్రయోజనమును పొందిరి. కాని, అందుకు తగిన ఒక విధమగు వైఖరి - ప్రాణిక మానసికమునందు బలమగు విశ్వాసము, లేదా ఆంతరికసత్తయందు ప్రతి స్పదించి గ్రహించు అలవాటు - అతనియందవసరము. ఈ అలవాటు స్థిరపడిన తర్వాత, విశ్వాసమంత నిశ్చాయకముగ లేకున్నను, లేదా మనస్సునందు బాహ్యాభి వ్యక్తము అజ్ఞానముతోకూడి అస్పష్టముగనున్నను, లేదా, దాని రూపమునందు విభిన్నముగ నున్నను, జాబు వ్రాయుటచేత ప్రయోజనమే తప్పక కలిగియుండెననుట నేచూచితిని. ఇంతేకాక, లేఖకుడు, తనయందలి ప్రవృత్తులకు సాక్షియై, వానిని నిష్పక్షపాతముగ, ఖచ్చితముగ తన స్వభావమునందలి దృగ్విషయముగ, లేక ఒకానొకశక్తి తనను బాధించుటచే, దానినుండి విముక్తినికోరు ప్రవృత్తిగ, దానిని గమనించి స్పష్టముగ చెప్పెనేని, ఈ విధానము తప్పక విజయము గాంచును. ఇటుగాక, తాను వ్రాయ తలంచిన విషయము, తన ప్రాణికసత్తను లోబఱచుకొనుటచే, ప్రాణికసత్త అతని కలమును తీసికొని, సందేహమును, నిరుత్సాహమును, నిరాశను, తిరుగుబాటును ప్రోత్సహించుచు, (వ్యక్తపఱచుచు) అతనికి మారుగ వ్రాయుచో, విషయము తారుమారగును. ఈ విధముగ జరిగినను, కొన్ని సమయముల నది దోషమును పాఱదోలును; కాని ఈ అవస్థను లోబడి వ్రాయబడు కథనము, ఘర్షణకు శక్తినిచ్చుటకు తోడ్పడవచ్చు - కడకు తాత్కాలికముగనైన - అధికపఱచునట్లుగ దీర్ఘపఱచు నట్లుగ తోచవచ్చు బహుశః ఆ సమయమునకే యైనను దాని ప్రచండతచేతనే దానిని పరిహరించుకొనుచు, అందుచే, కడపటికి స్వాస్థ్యమును కొనితెచ్చును; కాని అధిక సంకుల సంక్షోభముల ఫలితముగ, - మఱల మఱల నిట్టిదే జరుగునను

సంశయాస్పదముగను – ఈ అవస్థయుండును. ఎలయన, ఈ వియోచనము ఘర్షణా శక్తియొక్క తాత్కాలిక వ్యయముచే కలిగినదేకాని, సాధకుని నిర్మల సమ్మతి సహకారముల కారణముగ, దైవశక్తి మధ్యస్థముగ ప్రవేశించి పనిచేయుటచే కలిగిన పరిశుద్ధతచేకాదు. దుష్టశక్తుల ప్రభావమును త్రోసిపుచ్చుటచేకాదు. ఒక అస్తవ్యస్త పోరాటము, తొందర తొందరగా గలిగిన మధ్యస్థ ప్రభావము, మాత్రమే యుండెను కాని, శక్తులు స్పష్టముగ నొక పక్షమున పనిచేయుటచే కలిగినదికాదు. ఈ అవస్థలో కలిగిన సంక్షోభ భ్రమణలయందు సాహాయ్యక శక్తియొక్క మధ్యస్థ కార్యము కనుగొనబడక జరిగి పోవును. నీకు కలిగిన విషమ పరీక్షలలలో జరిగిన దంతయు నింతే, నీ యందలి ప్రాణశక్తి గాఢవికృతిని పొంది, నీపై అభియోగము కావించు దుష్టశక్తియొక్క హేతుకతలను బలపఱచుచు, వానిని వ్యక్తపఱచ ప్రారంభించెను. క్లిష్టపరిస్థితులపై ఉన్నత తర దివ్య ప్రకాశ శక్తులు పనిచేయుటకుగాను మేల్కొనబడిన మనస్సుచే విశుద్ధ పరిశీలనా నిరూపణలకు బదులు, ఎదుటిపక్షమును బలపఱచుటయె జరిగినది. అనేక సాధకులు, పురోగాములుకూడ, తమ కష్టముల నిట్లు నిరూపించే అలవాటుకు లోనైయున్నారు; కొందఱింకను ఈ అలవాటును కలిగించుకొనుచున్నారు ; ఇది మార్గముకాదని వారి కింకను అర్థముకాలేదు. ఒకానొక కాలమున, ఈ ఆశ్రమము నందిది ఇట్లు జరుగవలె ననెడు దివ్యసత్యముగ దీనిని భావించెడివారు ; వారట్లు ఎందుకుచేసిరో నాకుతెలియదు ; ఏలయన ఈ యోగమును గుఱించి నా ప్రబోధమునందు ఇట్టి దెప్పుడును లేదు. కాని, ఇది మార్గముకాదని ఇపుడిపుడు అనుభవముచే తెలసికొన్నారు ; ఈ పద్ధతి వలన పోరాటము అంత్యము లేనిదై, చుట్టి చుట్టి భ్రమించుటయే జరుగును. విజయమునకుచేర్చు ఆత్మోన్మీలన విధానము(అవశ్యకముగ తక్షణమే ఫలితము నివ్వకున్నను, క్రమముగ వివేక పూర్వకముగా జరుగునట్టి ఈ విధాము) నకును మఱియా అస్తవ్యస్త విధానమునకు భేదముకలదు. గురువుయొక్క సహాయము ఫలకారియగుటకు తన సర్వస్వమును గురువుకు తెఱచియుంచ తలంచిన వారి విధానమిది. 17–12–1932

## రక్షణయందు విశ్వాసము

శ్రీమాతయు నేనును ఇచ్చేరక్షణయందు శరణ్యమును పొందు అలవాటును శక్తిని నీవు వృద్ధిపఱచుకొనవలెను. ఇందుకొఱకే, నీ బాహ్య మనస్సుచేత విమర్శించి నిశ్చయించే అలవాటుగాని, లేక ప్రాగ్ – కల్పనలను భావాలను పోషించె అలవాటుగాని మాయమైపోవలెను. అవి ఉదయించినపుడెల్ల, – "శ్రీమాతార విందు

లకు నాకన్న బాగుగా తెలియును - నాకు లేని జ్ఞానానుభవములు వారికున్నవి - సామాన్యమానవుని జ్ఞానమునకన్న ఉన్నతతర ప్రకాశములో సర్వోత్కృష్టమునకు వారు పని చేయుచుండవలెను," అని మఱల మఱల నీవు నీకు చెప్పుకొనవలెను. నిన్ను మబ్బులు ఆవరించినపుడుకూడ మఱవకుండునట్లు, నిన్ను ఈ భావమునందు నీవు స్థిరపఱచుకొను నెడల, అసురమాయ సూచనలను నీవు చాల సులభముగా నెదుర్కొనగలవు.

## ముక్తపఱచు బలాత్కారశక్తి

నీవింత బాధపడినందులకు మేము దుఃఖించుచున్నాము. నిన్నుగాయ పఱచుటకు కాదు, శ్రీమాత నీపై నింతభారమును వేసినది. కాని నిన్ను విముక్తపఱచుటకే; గాఢ ప్రేమచే సానుభూతిచే, నీ పోరాటముల యందు నీపైన, నీకు సహాయము చేయుటకు శ్రీమాత ప్రయత్నించినది. నీ శాంతిని మన స్స్వస్థతను త్వరలో నీవు కోల్కొందువని నమ్ముచున్నాను. సాధ్యమైనంత సాహాయ్యమును నీ కివ్వ ప్రయత్నింతును. 23-1-1935

## గురువుతో - వ్యక్తిగత స్పర్శ - దివ్యశక్తికి - ప్రతి స్పదించుట

### 1

అతనిని నాకు పరిచర్యచేయువారితో చేర్చవలయుననికోరు, X సూచనను అంగీకరించుట సాధ్యముకాదు. వారి సాధనకు సాహాయ్యకముగా వారి కాపని ఇవ్వబడలేదు. కాని వేఱుప్రయోజనముల కొఱకు వారి కాపని ఇవ్వబడినది. నిజములో ఇక్కడకూడ కొంత దురభిప్రాయముకలదు. అవిరామ వ్యక్తిగత స్పర్శచే దివ్యశక్తియొక్క ప్రభావము అవశ్యకముగా చేకూరదు. శ్రీ రామకృష్ణునితో అట్టివ్యక్తిగత స్పర్శ హృదయునికుండెను. రామకృష్ణునికి స్వయముగా సేవచేసే అవకాశమతనికి యుండెను. కాని ఒక సారితప్ప, అతడు పొందిన ప్రయోజన మేమియులేదు; అతని ప్రభువు అతనికిచ్చిన అనుభవమును, శక్తిని, ఆయొక్కసారికూడ అతడు భరించలేక పోయెను. శ్రీమాతకు ప్రణామము, దర్శనము, - ఈ ప్రత్యేక సమయములందు తాను విలీనమైపోవు అనుభవము, X కు కలుగుచుండెను. అతనియందు గల ఈ ప్రతిస్పందనాశక్తి ప్రత్యుత్తరాత్మకతాశీలతచే అతడు దివ్యశక్తికి ప్రతిస్పందించగలడని తెలుపును. మా భాషలో మేము చెప్పునట్లుగ, అతని

యందు గ్రహణ శీలతయున్నది : ఇదియొక గొప్ప విషయమే ; ఏలయన అందరికిని, ఇది యుండదు ; దీనిని కలవారు, సర్వదా కారణమును తెలిసికొనకున్నను, దాని ఫలమును పొందుదురు. కాని అతడు, తర్కించుట తక్కువచేసి, ఈ సమయములందువలె, ఉన్మీలితుడై యుండవలెను. ఈ దివ్యశక్తిని గురించి వ్రాయుచుంటినేని, అందుకుగల కారణము, శ్రీమాతయు నేనును దీనిని అనుభవమును అనేక వేలసార్లుపొంది, అది ఫలింపచేసిన నానావిధ ఫలములను తెలిసికొని యుండుటచేతనే. ఈ దివ్యశక్తిని గురించిన భావమునకు, తత్త్వశాస్త్రముతో గాని తర్కముతోగాని సంబంధములేదు ; కాని ప్రతియోగియు అనవరతముగా దీనిని అనుభవించుచుండును. ఇది, అతని యోగిక చేతస్సులోని అంశము, అతని అనవరత ఆధ్యాత్మికానుభవము. 28-5-1945

## 2

ప్రశ్న : నీతోకాని, శ్రీమాతతోగాని అధిక బాహ్యసాన్నిధ్య, పరిచయముల వలన, ఆకాంక్ష, ఆంతరికాభివృద్ధి తక్కువ కాగలవా ?

జవాబు :- అది వ్యక్తిపైన ఆధారపడును: కొందఱు ప్రయోజనమును పొందుదురు; మఱికొందరు పొందజాలరు; అందరకును ఒకే సాధారణ ప్రతిపాదన అన్వయించదు. 18-8-1933

## సూక్ష్మ శరీరముపై దివ్యశక్తి ప్రభావము

నీవుకలయని వ్రాసినది, కలకాదు: అది స్వప్నసమాధి యొక్క అనుభవము; అంతరిక సత్త చే తన స్వప్నస్థితియందు గలుగు అనుభవమది. జడతాభావము, చేతస్సు తరలిపోవు చున్నదను భావము, ఇవి శరీరమున కలవాటులేనియు, బలాత్కారముగా పొందు దివ్యశక్తి యొక్కయు అవతరణచే, లేక బలాత్కార భారముచే కలుగునవి. నీకు, నేరుగా భౌతిక శరీరముపై భారము కలుగలేదు. కాని, సూక్ష్మ శరీరముపైన కలిగెను. ఈ సూక్ష్మశరీరమునందే ఆంతరిక సత్త వసించునది; ఈ దీని నుండియే, ఆంతరిక సత్త నిద్రలోను సమాధిలోను, లేక, మృత్యు సమయమునను బహిర్గమించును. కాని ఈ విస్పష్టానుభవములందు భౌతిక శరీరము, తనకే, ఈ అనుభవము కలిగినట్లు భావించును ! శరీరమునందీ భారముయొక్క ఫలమే, జడత్వ భావము. శరీరమంతటిపైన కలిగిన భారమునకర్థమేమన "సమస్త - ఆంతరిక

చేతస్సు కంతటికీ ఈ భారము కలిగెననుట, బహుశః దీనివలన కలుగు ఫలితము. సమస్త చేతస్సును, వేఱొక అనుభవమునకు, లేక ఉన్నత జ్ఞానమునకు సిద్ధపఱచుటకేయై యుండును. మూడవ, లేక నాల్గవ వెన్నెముక యనెడి ప్రదేశము" ప్రాణిక స్వభావమునకు, చెందినది: అక్కడ జరుగ వలసిన మార్పు కొఱకు కలిగిన భారమది.

చేతియొక్క బలము, దానిభారము - ఇవి, ఆవశ్యకముగ, నావియేయని అవి సూచించవు, - ఏలయన, ఈ యనుభవము, భౌతిక హస్తము యొక్కగాని, లేక భౌతిక శరీరమునందుకాని కలిగినది కాదు; కాన సత్తయొక్క సూక్ష్మ ప్రదేశము లందు కలిగినవి: అక్కడ శ్రీమాత స్పర్శయు, భారము నాకు గలవానికంటె శక్తి మంతము భారవంతముయై యుండును. ఆతేదీని, శ్రీమాత జ్ఞప్తియందుంచు కొనలేదు; కావి, ఒకరాత్రి, అదేసమయమున, ఆమెను గుఱించి శ్రీమాత గాఢముగా తలంచుచు ఆధ్యాత్మికోన్మీలనమునకు ఆమెయందుండిన యొకానొక అవరోధమును తొలగించుటకు శక్తిని ప్రాదుర్భవింప చేయుచుండెను. ఆమెయందు కలిగిన అనుభవమునకిదే కారణమై యుండును. ఆమె అనుభవమునకు నేను కారణమై యుంటినేని, నేను వెర్వేఱు ప్రజలకు శక్తిని ప్రయోగింప చేయుటకు ఏకాగ్రత వహించిన కాలములో ఆయనుభవము జరిగి యుండవలెను; కాని నాకేదియు స్పష్టముగ జ్ఞాపకము లేదు. ఆమెను గుఱించి నేమ తలంచి, ఆమెకు సహాయము చేయుటకు శక్తిని ప్రయోగించినది నిజమే.

మాశక్తిచే కావింప బడిన పనిని గుఱించి మేముసర్వదా భౌతికముగా తెలిసి కొని యుండవలసిన ఆవశ్యకత లేదు. ఏలయన, పలుమాఱు మేమునిద్రించు నపుడు కాని, లేక మనస్సు బాహ్య విషయములతో వ్యవహరించు నపుడు కాని ఆ కార్యము జరిగియుండును. శ్రీమాత నిద్రను గుఱించి, అది నిద్రయని చెప్పవీలుకాదు; కాని, అదియొక విధఆంతరిక చేతస్సు. ఈ చేతస్సు నందుండి, ఆమె సర్వత్ర ప్రజల తోను, కార్య కలాపములతోను సంబంధము వహించి యుండును, ఆమెచేతస్సు. పని చేయునప్పుడు గల కార్యము, ఆమెకు గ్రాహ్యమే - కాని అసర్వమును ఆమె సర్వదా ఆమె జాగ్రత చేతస్సు నందు కాని, స్మరణయందు కాని యుండదు. ఒక వ్యక్తియొక్క చింతన శ్రీమాత యొక్క ప్రవృత్త జాగరిత మనస్సునందు, ఒక ఆహ్వానము వలె వచ్చును,- ఆ వ్యక్తి నుండి ఒక సందేశ రూపమున, సామాన్య.

లేక ఏకాగ్రీ కృత స్థితియందు కాని, ఆ ఆహ్వానము ఆమెకు వచ్చును: అగాధతర ఏకాగ్రీకృతమునందు కాని, లేక నిద్రయందుకాని, లేక సమాధియందు కాని, ఆవ్యక్తి సమీపించి, మాట్లాడుట ఆమె తెలిసికొనును: లేక ఆమెయె ఆవ్యక్తి యొద్దకు పోవును. ఇదిగాక దివ్యశక్తి యెక్కడెక్కడ పనిచేయునో, దివ్యసాన్నిధ్య మక్కడక్కడ యున్నది. 28_9_1936

### దివ్యశక్తిని గ్రహించు చున్నానని తెలియకనే దానిని గ్రహించుట

మానుండి నీవు దివ్యశక్తిని అందుకొన లేదనుట అబద్ధము. ఎంతో అధిక ముగ నీవుదానిని గ్రహించితివి, నీకది తెలియకనే అది జరిగినదని దాని కర్థము: కాని, ఇట్లు అనేకుల విషయమున కూడ జరుగు చుండును. శ్రీమాత పంపు దివ్య శక్తి నంతటిని. సాధకులెవ్వరు కాని పూర్తిగా గ్రహించుట కాని, లేక ఉపయోగించుట కాని లేదు; కాని ఇది. నీకు మాత్రమె అసాధారణ మనిగాక, సామాన్యముగ అంద ఱకును జరుగునదియే. 29_5_1936

### సందర్భానుసారముగ దివ్యశక్తి క్రియాశీలమై యుండును.

దివ్యశక్తి విషయము మఱియొకసారి వ్రాయుదును. సర్వకాలము నందును అది క్రియాశీలమై యుండక సందరర్భానుసారముగ అది పని చేయునని నేను చెప్పి తిని. అతిమానస శక్తి మాత్రమే కేవలముగ పనిచేయునది; ఏలయన, విజయమున కవసరమగు సందర్భములనది సృష్టించు కొనును. కాని నేను ఉపయోగించు దివ్య శక్తి అతిమానసిక శక్తికాదు; అది, ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో పనిచేయ గలి గిన దివ్యశక్తి: అట్లని దానిశక్తి తక్కువేమియు కాదు. మూడింటిని తప్ప నావ్యాధు లన్నింటిని నేను బాగు పఱచుకున్నాను. వానిని కూడ, నాకు బాధకలిగించునపుడు, హద్దులోనుంచినాను. ఈ మూడింటి విషయమున నేను పూర్తి విజయము కాంచలే దన్నంతనే, ఇతరమునందు నాకు విజయము లేదనుటకాదు. శ్రీమాత విషయమున. ఇదేశక్తితో, ఇంతవఱకు శ్రీమాత సర్వమును తక్షణమే బాగుపఱచెను. ఇప్పుడా మెకు తన శరీరమును గుఱించి యోచించుట కవధిలేదు. దానిపై ఏకాగ్రత యొనరించు టకును ఆమె కవధిలేదు. ప్రస్తుతము వ్యాధియున్నదనుట నిజము; జడపదార్థ విషయ మున జరుగుచున్నపోరాటములో నిదియొక భాగము. అయ్యును, శ్రీమాతపైన అధార పడి. ఆశ్రమమునందు అనేకులు వ్యాధిని పొగొట్టుకొనుచుందురు. అందఱు బాగుచేసి

కొన లేకున్న, అది దేనిని ఋజువు పఱచును, లేక ఋజువు పఱచకుండును ? దీని వలన ఋజువగునది. ఏమన, దివ్యశక్తి, ఆశ్చర్య కరముగ, కేవలముగ, తప్పని సరిగ పనిచేయదని మాత్రమే; కాని, అది కొన్ని సందర్భములలో, కొన్ని అవకాశ ముల యందు పనిచేయు ననుట, నిజము. నేనీ విషయమును ఎల్లప్పుడును చెప్పితిని; కనుక ఇందులో క్రొత్తయేమియు లేదు; లేక, యోగసత్యమును నిర్మూలించు విష యము కూడ ఇందులేదు. 6-2-1935

ప్ర :- ఆంతరిక చేతస్సు అభివృద్ధి పొందునప్పుడెల్ల, వ్యాధి శక్తులు ప్రవేశించు నది తెలిసికొనుట సులభమనియు సూక్ష్మ భౌతిక కోశమునందు, వ్యాధి చిహ్నములు అనుభవించి, అది వ్యక్తపడుటకు మునుపె, దానిని నిర్మూలించ వచ్చును, అనియు మీరు చెప్పితిరి, అట్టిచో, మీయొక్క లేక సాధకులయొక్క వ్యాధులను, మీరు నిజ ముగా చూడగలిగి నపుడు, మేము బాగుపఱచకొన లేకున్నను, మీరు బాగుపఱచు కొనలేరనుటకు, ఎట్లు సమాధాన మిత్తురు ?.

జవాబు :- ప్రతి విషయమును సదా కెవల అశ్చర్యకర వ్యాఖ్యానముగ మార్చు మూర్ఖమనస్సేనా ఇది ! శ్రీమాతయొక్కయు, నాయొక్కయు అనుభవము ననుసరించి, వ్యాధులన్నియు భౌతికమును ప్రవేశించుటకు మునుపు సూక్ష్మశరీరము సూక్ష్మచేతస్సుల ద్వారా వచ్చును. దీనియెరుక గలవారు భౌతికమునందు ప్రవేశించ కుండ అడ్డుపెట్టగలరు; అట్లు చేయుశక్తిని వృద్ధిచేసికొన గలరు, లక్షలాది సార్లు మేమిట్లు చేసితిమి. కాని, ప్రతిసారి మెమట్లు చేయుదుమని, దాని కర్థముకాదు. మఱియు, ఒకరు గమనించ నపుడు, లేక నిద్రించునపుడు, లేక అధశ్చేతన ద్వారా, లేక, అప్రమత్తుడై యుండనపుడు, అకస్మాత్తు వేగముతో వ్యాధి రావచ్చును, నేను సర్వదా అప్రమత్తుడనై యుందునని ఊహించుదము, నిద్రలో కూడ ఎఱుక కలిగి యుందునని ఊహించుదము, - అయ్యును, నా శరీరము సహజముగనే అన్ని రోగములనుండి విముక్తమని యెట్లు అర్థమగును. నేను చెప్పిన దానికర్థమేమన, అవ్యాధి వచ్చుటకు ప్రయత్నించునపుడు, ఇదియొక ఆత్మరక్షణా బలమని మాత్రమే. ఆత్మ సంరక్షణ శక్తి, కావలసినంత బలమును చేకూర్చు కొనినపుడు, అనేక యోగుల విషయమున జరిగినట్లుగ, శరీరము వ్యాధి నుండి విముక్తమే యగును. అయ్యును, ఈ వ్యవహారిక సత్యము, కేవల సత్యముకాదు. అతిమానసిక రూపాంత రము కలిగినపుడే ఈ కేవల సత్యము చేకూరును. ఏలయన, అతిమానసమునకు

దిగువ, అనేక శక్తులలో, ఈ దివ్యశక్తియు యొక్కటి. దాని కార్యమే, ఈ ఆత్మ సంరక్షణ శక్తి, _ అతిమానసము నందు, ఇది దాని ప్రకృతిని అనుసరించిన ధర్మమేయగును. 26_1_1935

## వ్యాధిని బాగుపఱచుకొనుటలో దివ్యశక్తిని గ్రహించు సామర్థ్యము

### 1

మానసిక ప్రాణిక, భౌతిక, చేతస్సులందు, దేనియందు గ్రహణశక్తి అవసరమో దానియందు గల గ్రహణశక్తిని గుఱించియే నెను తెలిపితిని. శ్రీమాత కాని, లెక నేను కాని ఒకానొక శక్తిని పంపుదుము. ఉన్మీలత లేనిచో. ఆ శక్తి వెనుక త్రోయబడును, లేదా అదియె తిరిగి వచ్చును. (మేము గొప్పశక్తిని వినియోగించనిచో వెనుకకు రాక పోవచ్చును. కాని అది ఉచితముకాదు); కొంత ఉన్మీలత యుండెనేని, ఫలితము ఆంశికముగనో, నిదానముగనో యుండును, ఉన్మీలత, లేక గ్రహణ శీలత పూర్తిగ నుండునేని, తక్షణ ఫలితము కలుగవచ్చును. పూర్వము నుండి స్వభావమునందొక అంశమే, అది అగునేని, తక్షణమే, వానిని తొలగించ వీలుపడదు; కాని గ్రహణ సామర్థ్యమున్న చోట, వీనిని కూడ త్వరితముగా బాగుపఱచ వచ్చు, కొందఱు, వ్రాసినంతనే, వారిలేఖ, లేక గ్రంధము చేరక మునుపే, బాగు పఱచు కొనునంతట ఉన్మీలతను కలిగి యుందురు. 8_6_1933

### 2

ఆంతరిక సత్తఎంతవఱకు జాగృతిని కలిగి యున్నదను విషయముపై గ్రహణ సామర్థ్యము ఆధారపడి యున్నది. లేనిచో, భౌతికావలంబన ఆవశ్యకమగును, (కొందఱికి మేము వారిజాబు చదివిన పిమ్మటనే నెమ్మది కలుగును; మఱికొందఱికి జాబు వ్రాసినంతనే కాని, లేక అదిమాకు చేరకమునుపే కాని, లేక అదిమాకు చేరి మేము చదవక మునుపే, నెమ్మది కలుగును; మఱికొందఱు మానసికముగా తమ విషయమును మాకు తెలిపినంతనే బాగుపడుదురు; విభిన్న దేహస్వభావాలు !) మార్చి—1935.

## వార్త నిర్దోషముగ నుండవలసిన అవశ్యకత

ప్రశ్న :_ మీకు గాని శ్రీమాతకు గాని వ్యక్తిగతముగా తెలియని మనుజుని గుఱించి తప్పువార్త మీకు అందింపబడి, అతని వ్యాధిని గుఱించి ఆధ్యాత్మికముగా మీరు పనిచేయ ప్రారంభించుచో, మీరు పంపే సహాయము గురితప్పునా ?

జవాబు :- మేము కావించు పనిని, సహాయమును అందుకొనుట కివ్వబడు వార్త తప్పుగా నుండునేని, అది సందేహమును కలిగించి, స్పష్ట ఫలితమును కలిగించుట సాధ్యముకాదు. ప్రారంభముననే తప్పుగా వార్త వచ్చుచో, మరింత కష్టము. వార్తలు విశుద్ధముగ నుండవలెననుట, అత్యావశ్యకము. 10-6-1935

## డాక్టర్లద్వారా దివ్యశక్తియొక్క కార్యము

శ్రీమాతకు గాని, నాకుగాని అలోపతి వైద్యముపైన ప్రత్యేకాభిమానము లేదు. మందులను అధికముగను, తప్పుదారిలోను డాక్టర్లు వినియోగించి, వ్యాధిని నిరోధించుటకు ప్రకృతికి గల శక్తిని, రోగియందు తగ్గించి, అతనికి మేలుచేయుటకు బదులు చెడుపే చేయుదురని, శ్రీమాత తలంచును. ఇతర చికిత్సా విధానముల ద్వారా కంటె, యక్సు అనువాని హోమోపథిద్వారా మేము బాగుగా పనిచేయ గలిగితిమి; సచేతన పరికరములుగా నుండని హోమోపథి డాక్టర్లద్వారా, పనిచేయబడిన మాశక్తి ఇతర డాక్టర్ల ద్వారా కంటె, అధికముగా విజయము పొంది యుండక పోవచ్చును.

# సాధన - క్రీడలు

## 1

ఆశ్రమము నందు క్రీడా సేవులు మాత్రమే యుండవలెనని మేము కోరలేదనుట నిజము. ఇది క్రీడా క్షేత్రముకాదు, ఆశ్రమము, క్రీడలు, శారీరక వ్యాయామములు ముఖ్యముగా పాఠశాల పిల్లలకే ఉద్దేశింప బడినవి; కాని వారు కూడ ఆటలు మాత్రమే ఆడరు. చదువులు కూడ చదువవలెను, యదృచ్ఛముగ ఆటలచే వారు ఆరోగ్యము నందును, శిక్షణ నందును, వినయ విధేయత యందును అధిక ప్రయోజనమును పొంది యున్నారు. రెండవ విషయమేమన, యువసాధకులు, క్రీడలయందు చేరవలెనని వారిని బలాత్కరించలేదు. ప్రోత్సహించ లేదు కూడను; ఆటలాడుటకు వారు అనుమతింప బడిరి మాత్రమే; వారు క్రీడా సేవులుగ మాత్రమే ఉండ నుద్దేశింప బడలేదు; వారు చేయవలసిన ఇతరపనులు ముఖ్యమైనవి వారికి గలవు. స్వచ్ఛందముగా నిష్టపడి మాత్రమే క్రీడా సేవిగా నుండుటావశ్యకము; ఇది అతని అభిరుచినిపట్టియుండును. శ్రీమాత చుట్టు నుండు వారిలో అనేకులు - ఉదాహరణమునకు అను X నాతడు, క్రీడాక్షేత్రమునకు పోవలెనని కలలో కూడ తలంచడు; క్రీడలలో పాల్గొనడు; శ్రీమాత కూడ అతడు క్రీడలలో పాల్గొనవలెనని తలంచదు. అట్లే, నీవుకూడ ఆటలలో పాల్గొనని యెడల, నీపై అతృప్తి పడదు. ధ్యానము, అధ్యాత్మికానుభవములు, జీవితము నుండి తప్పించుకొని బ్రహ్మయందు లీనమగు కార్యములలో నిమగ్నులు కావలసిన ఆశ్రమ వాసులకు క్రీడలతో పనయేమి, అని అడుగు దురు. కాని, ఈ సూత్రము, సాధారణ ఆశ్రమముల కన్వయించును. ఈ ఆశ్రమము అట్టి శాస్త్ర సమ్మతమైన ఆశ్రమముకాదు. ఇది, యోగమునందు జీవితమును అంతర్భూత మొనర్చుకొనును, అధ్యాత్మ కార్యములకు వ్యతిరిక్తము కానట్టియు, జీవితము యొక్క ఆది - అంత్య ప్రయోజనములకు ఉపయోగపడు ప్రతి విషయమును, జీవితము నందలి భాగమేగనుక, వీనిని ఈ ఆశ్రమము నిషేధించదు. బ్రహ్మ, ప్రపంచముతో సంబంధమును వదలగా, భౌద్ధమతము దేశమంతట వ్యాపకమై ఆశ్రమములను

సన్యాసుల మతములుగ మార్పుగావించి నపుడు మాత్రమె, శాస్త్ర సమ్మతమైన ఆశ్రమములు స్థాపింప బడుట కారంభమయ్యెను. తత్పూర్వపు ఆశ్రమములు పూర్తిగా నిట్టివికావు; అక్కడ పెంచబడిన బాలురు యువకులు జీవిత సంబంధ కార్యములనేకములందు శిక్షింప బడిరి. ఊర్వశిపురూరవసుల కుమారుడు ఒకానొక ఋష్యాశ్రమమునందు విలువిద్య నేర్చుకొని, అందు మేధావి అయ్యెను; శక్తివంతమగు శస్త్రముల ప్రయోజనము కొఱకు కర్ణుడు గొప్ప ఋషికి శిష్యుడయ్యెను. జీవితమును ఆత్మతో సమన్వయ పఱచుట కుద్దేశింప బడిన మన ఆశ్రమములో, క్రీడలను ఆశ్రమ జీవితమునుండి బహిష్కరించుటకు కారణము లేదు. టేబిల్ టెన్నిసు, ఫుట్ బాల్ ఆటలుకూడ కఠినముగా బహిష్కరింప బడనవసరము లేదు. ఈ దోషారోపణలను ప్రక్కనయుంచి చెప్పుచో ఆడుట, ఆడకుండట, అభిరుచిని పట్టి మాత్రమె యుండగలదు; X అనునాతడు క్రీడాసేవి కానందుకు అతనిపైన శ్రీమాతకు ఆతృప్తి లేనిచో నీపై మాత్రము శ్రీమాతకు అతృప్తి కలిగెననుటకు కారణము లేదు. అందుచే శ్రీమాత నీపై ఈ కారణముగ అతృప్తి పడుననుట అసాధ్యము. అందుచే, నీవేదేని. చేసితివని కాని. చేయలేదని కాని నీనుండి, శ్రీమాత దూరమగు ననుట, ఆధారము లేని ఆయదార్ధ వ్యాఖ్యానము; ఏలయన ఆమె అతృప్తిపడు కారణము నీయందేమియు లేదు. ఆమె మనస్సు నందట్టి అసంతృప్తి యెంతమాత్రము లేదు. కొంత కాలముగ, ఆమె మనస్సునందు, అతృప్తికి బదులుగ, నీపై దయ అధికమైనట్లుగ, ఆమె భావోద్దేశ్యములను వ్యక్తపఱచెను. నీ నుండి ఆమె ఆశించిన మార్పంతయు" నీ చైత్యాత్మక, ఆధ్యాత్మిక, పురోగతి యందు నీవు వృద్ధి కాంచవలెనని మాత్రమే, - నీవీవిషయము నందు తప్పి పోలేదు. ఈ విధానము, లేక అవిధానము ననుసరించి నీవు మారలేనందున, ఆమెకు అసంతృప్తి కలిగిన దనుట తప్పు భావము; ఇట్లు జరుగుచో నిరంకుశము, నిర్హేతుకము, అగును. ఇంతకన్న వేఱేమియు లేదు. 10-7-1948.

## 2

ఎవ్వరికికాని క్రీడలయందభిరుచిలేనిచో. వానిలో పాల్గొనవలెనని శ్రీమాత కోఱదు. ఆటలయందుచేరుట, చేరక పోవుట, ఐచ్ఛికముగ నుండవలెనేకాని, చేరనంత మాత్రాన, వారిపై అసహ్యత ఆమెకెంతమాత్రములేదు; ఆమె అట్టి భావముతో వర్తించుట అసంగతము; ఆమెకు విశ్వాసముతో సేవచేయుటచే, వారి సేవను గుర్తించి, వారిని ప్రేమతోచూచు వారామె సమీపముననేగలరు. కాని, వారికి క్రీడల

యందు అభిరుచిలేకనో, అవధిలేకనో, వారు క్రీడా క్షేత్రమునకెపుడును పోవుట లేదుగా - ఆ కారణముచేత, వారి నుండి ఆమె మఱలి, వారిని త్రోసిపుచ్చునని నీవు ఉహించగలవా ? ఆశ్రమ వాసులకు క్రీడలే ప్రముఖ నిమగ్నతా కార్యములని శ్రీమాత ఉద్దేశించజాలదు ; పాఠశాలలోని పిల్లలునుకూడ, వారి శరీరకాభివృద్ధికే ఈ క్రీడావ్యాయామములుద్దేశింపబడియున్ననను, వారికవి ముఖ్యమేయైనను, వారుచేయ వలసిన ఇతర పనులు, వారి చదువులు, ఇతరవిలాస కార్యములు, వ్యవహారములు క్రీడలతో సమానమైన ముఖ్యవిషయములు కలవు. వారికికూడ, క్రీడలకంటె ముఖ్యమైనవి. - యోగము ఆధ్యాత్మికాభివృద్ధి, భక్తి, సేవ మొదలగునని కలవు.

నేను "క్రీడలకు కాలము ఖర్చుపెట్టుచుంటిననని" నీవు చెప్పుటకుగల అర్థము నాకు బోధపడలేదు. శ్రీమాత కోరికపైన బుల్లెటిన్ పత్రికకు మొదటి సంచిక కొఱకు వ్యాసమున్ను, రాబోవుదానికి మఱియొక వ్యాసమున్ను వ్రాయుటతప్ప, నేనేమిపనియు క్రీడావ్యాయామములకు చేయలేదు. క్రీడా వ్యవస్థకుగాను చేయవలసిన పనినంతటిని శ్రీమాతచేయుచున్నది ; పైనుండి సామాన్య పర్యవేక్షణచేతను, దిన మొకసారి ఆమె ప్రత్యక్షసాన్నిధ్యముచేతను క్రీడావ్యవస్థ చక్కబడువఱకు ఆకార్యమును శ్రీమాత చేయవలసినదే. ఆశ్రమముయొక్క ఆమె ఇతర కార్యములందువలెనే, ఈ కార్యము నందుకూడ, ఆమెకు సహాయ్యకముగా నాశక్తిని ప్రయోగింతును. ఇంత తప్ప, క్రీడలకు నేనేమియు నాకాలమును వ్యయపెట్టుటలేదు. 4-3-1949

## 3

యోగసాధన కత్యవసరమనికాని, లేక శ్రీమాత దయాప్రేమలు సంపాదించుట కనిగాని, ఎవ్వరేని క్రీడలయందు పాల్గొన నవసరములేదు. యోగమునకు యోగమె, ఉద్దేశ్యము, దాని నియమములు, ఉపాయములు దానికికలవు; మఱి క్రీడలు వేఱు; క్రీడాక్షేత్రమునందు అభ్యసించు ఏకాగ్రతయు ధ్యానయోగముకాదు; ఈ ఏకాగ్రత, శారీరక కదలికలను నిర్దుష్టము చేయుటకేగాని, యోగోద్దేశ్యమునకు కాదని శ్రీమాత నీకు స్వయముగా చెప్పినది. 14-3-1949

## 4

శ్రీమాతకాని, నేనుకాని, యోగమునుండి మఱలి, క్రీడా విషయములందె శ్రద్ధవహింతుమనుట సత్యముకాదు; ఆశ్రమముయొక్క ప్రధాన స్వభావమును

మార్చి, దానిని క్రీడా సంఘముగా చేయుట మాఉద్దేశ్యమెంతమాత్రముకాదు. అట్లు మేము చేసినచో, అంతకన్న అవివేక మేమియు నుండదు ; మరెవ్వరైన నీ కిట్లు చెప్పియుండిరేని, అతడు మతిచెడి, మా భావాన్ని తలక్రిందులుచేయు పిచ్చి ఉత్సాహములోనికి తాత్కాలికముగనైన చొచ్చియుండవలెను. శ్రీమాత నీ కొకసారి స్పష్టముగా, క్రీడాక్షేత్రములోని ఏకాగ్రత, యోగమును గురించిన ధ్యానయేకాగ్రతలుకావనియు, భౌతిక వ్యాయామములను గురించి మాత్రమే, ఆ యేకాగ్రత చేయబడుచున్నదని నీకు స్పష్టముగా తెలిపియున్నది. ఈ విషయములను వ్యవస్థీకరించుటలో ఆమె నిమగ్నురాలై యున్నదేని – ఈ ఒక్క విషయమునందు మాత్రమే ఆమె నిమిగ్నురాలైయుండుటలేదు – సాధ్యమైనంత త్వరలో దానిని వ్యవస్థీకరించి, ఆ తర్వాత దానియంతట నదియె చక్కగా జరుగునట్లు చేయ నుద్దేశించినది. మిగతి ఆశ్రమ కార్యములన్నింటిని, ఆమె ఇదే విధానము ననుసరించి చేసినది. యోగమును ధ్యానమును అశ్రద్ధతోచూచి, సాధకులు పరుగిడుట, ఎగురుట, మార్చింగు చేయుటలో నేను నిమగ్నుడనై యున్నాననుట అయుక్తము. బుల్లెటిన్‌కు నేనిచ్చిన రెండవ సందేశమునకు విచిత్ర విపరీతార్థము చేసినట్లుతోచుచున్నది. రాజకీయములు, సాంఘికము, లేక మరే ఇతర విషయమును గురించి నేను వ్రాసియుండినట్లుగనె, క్రీడలు వాని ప్రయోజనముల గురించివ్రాసితిని. రెండవ సందేశములో, ప్రాసంగికముగా నిదేప్రశ్నను తీసికొనుటకుగల కారణమేమన ఆశ్రమములో క్రీడలే ఉండ కూడదను దురభిప్రాయమును ప్రజలయందు తొలగించుట అవసరమయ్యెను. సత్త యొక్క సమస్తభాగములను పరిపూర్ణముచేయుటలో, శరీరము, దాని పరిపూర్ణతయు కూడ నొక భాగమే కనుక, క్రీడలుకూడ మానవుని ఇతర క్రియాకలాపములతో పాటు ఆశ్రమములో అవసరమని చెప్పుటకే వివరించితిని. పృథ్విపై దివ్య జీవితము, దివ్యశరీర ధారణ, సమస్త సత్త ఉన్నత తమ భూమిక కారోహణ, ఆత్మయొక్క పరికరములన్నియు పరమ పరిపూర్ణతచెందుటకు, యోగమువలన మాత్రమే నెరవేరునని, స్పష్టముగా తెలిపితిని. మానవ – భౌతిక విధానములచే – క్రీడల వంటివానిచే – పరిమిత – సందిగ్ధ – మానవ పరిపూర్ణత మాత్రమే కలుగగలదని నేను స్పష్టముగా తెలిపితిని. ఈ యన్నింటియందును, అతి మనస్సులోనికి దుముకుటకు క్రీడయొక సాధనమని సూచించు భావమేమియులేదు ; లేక అతి మనస్సు క్రీడా క్షేత్రములోనికి మాత్రమే అవతరించునేకాని మరెక్కడను కాదని, మరి అట్లే క్రీడా క్షేత్రములోనున్న వారే దానిని అందుకొనగలరను భావముకూడ ఎక్కడనులేదు. ఇదియే నిజమైనచో, నాకు వేరు అవకాశముండదు గనుక, నాకిది

యంతయు ప్రతికూల ఆశాభావమేయగును! వాతావరణమంతయు ఇట్టి దురభిప్రాయములతో కూడియున్నది గనుక, వీనిలో కొన్నింటిచే నీవును క్లిష్టపడితివి కనుక, ఈ విపరీత భావనలను తొలగగలవను ఆశతో నేనీయంతయు వ్రాయుచున్నాను.
27-4-1949

## 5

నీవు క్రీడలయందు పాల్గొనుట, లేక వానిపై నిష్టపడుట, వానినేవిధముగనో అంగీకరించుటకు మేము బలాత్కరించుచుంటిమనుట, ఇట్టి నీ భావమునకు ఆధారము లేదని నీవు తప్పక తెలిసికొనియుండవలెను. నేనెప్పుడును నా జీవితమునందు క్రీడాసేవిగ నుండి యుండలేదు. ఇంగ్లాండులో క్రికెట్ ఆటను దర్శించితిని, బరోడా క్రికెటి సంఘమనందు ఆటయందు పాల్గొనని సభ్యుడుగా నుంటిని. ఇంతతప్ప క్రీడలతో నా జీవితమునందెట్టి సంబంధములేదు. మద్రాసు మల్లయోద్ధులు, నేను బరోడాలోనున్నపుడు నాకు ఆరోగ్యమే యుండినను నా దుర్బల శరీరమునకు బలము నిచ్చుటకుగా దండాలు బస్కీలు నేర్చుకొనియుంటిని. కాని వీనికింతకన్న, అధిక విలువను నేనిచ్చియుండలేదు. అనవసర మనితోచినంతనే, వానిని విసర్జింతిని, వీనిని అంగీకరించుటకాని, విసర్జించుటకాని, నా దృష్టిలో యోగమునకు సంబంధించిన విషయముకాదు. వీనిపై నీ అసూయత, ఇతరుల అభిలాష, సాధనకు నిన్ను కాని, వారినికాని అధికయుక్తులుగా కాని, లేక అయుక్తులుగాకాని చేయవు: అందుచే, నీవు వీనియందు పాల్గొనునట్లు నిన్ను బలాత్కరించుటకు, లేక మేమట్లు బలాత్కరించుచుంటిమని నీవు ఊహించి నిన్ను నీవు పీడించుకొనుటకు, కారణములేదు. ఇట్టి విషయములందు ఇతరులకువలెనే, నీకు కూడ పూర్ణస్వేచ్ఛకలదు. 28-4-1949

## 6

ఆవశ్యకమైనది దైవానుభవ మొక్కటే; ఇందుకు తోడ్పడుటకు సహాయపడునంత వఱకే, ఇతర మంతయు ఆవశ్యకము. లేక, దైవానుభవము కలిగిన తర్వాత, దానిని వ్యాపకముకావించి, అభివ్యక్తము పఱచునంత వఱకె వాని ఆవశ్యకత. నా యోగముయొక్క పూర్ణార్థము, ప్రయోజనము, ఏమన దైవకార్యము కొఱకు జీవితమునంతటిని వ్యవస్థీకరించుట, లేక దైవమును అభివ్యక్తపఱచుట మొదట కార్యము, దైవానుభవమును పొందిన వ్యక్తులు సమిష్టి సహజ జీవనసిద్ధికి ఆవశ్యకమగు వ్యష్టి సమష్టి సాధన రెండవది. ఇట్టి గమ్యమునకు ప్రపంచము

పురోగమించుటకును దివ్యప్రకాశమునందు జీవించుటకునుగా సహాయపడుట. కాని, దైవానుభవము మొదటి ఆవశ్యకత : దీని చుట్టూ, మిగత దంతయు అధిగమించును; ఏలయన, ఇదిలేనిదే, మిగత కంతటికి అర్థములేదు. శ్రీమాతకాని, లేక నేనుకాని దీని స్థానమున మఱిదేనిని యుంచుటకుగాని మఱితరదేనికిగాని శ్రద్ధయిచ్చి దీనిపై అశ్రద్ధవహించుటకుకాని మేము కలలోకూడ తలంచలేదు, అట్లు తలంచజాలముకూడ. శ్రీమాతయొక్క దినదిన కార్యమునందధిక భాగము, సాధకులేదోవిధమున ఈ గమ్యమును చేరుటకు సహాయపడుటకే వినియోగింపబడినది; మిగతకాలములో అధిక భాగము ఆశ్రమ కార్యమునందు వినియోగింపబడినది : ఏలయన ఆశ్రమ పని నిలిచి పోకూడదు, దానియందు అశ్రద్ధ వహించకూడదు, – ఇదియును దైవకార్యమే కదా, వ్యాయామశాల, క్రీడాక్షేత్రము, ఈయన్నింటి విషయమున, ప్రారంభము నుండి, శ్రీమాత వీనికిగల స్థానమును స్పష్టపఱచినది : ముఖ్య విషయముల స్థానమున సహకారికాగల విషయములను నుంచునంతటి దుర్బల కార్యమును శ్రీమాత ఎప్పుడును చేయలేదు. 4–4–1950

## 7

ముఖ్యవిషయమును వివరించుటకుమునుపు దానితో సంబంధముగల వేఱు విషయమును నేను విశద పఱచవలెను; అవి బుల్లెటిన్‌లోని సందేశములు లేక వ్యాసములు; ఏలయన ఈ సందేశములలోని విషయములు, ముఖ్యముగా దివ్య శరీరమును గుఱించిన నా భావనలు నీ మనస్సునందు కష్టమును, సందిగ్ధమును, లేక వైమనస్యతను కలిగించినవి. మొదటి వ్యాసమునందు, క్రీడలు ఆశ్రమ కార్యకలాపమునందెట్లు ఎందుకు చేర్చబడినది వ్రాసితిరి; అందులో క్రీడ, సాధన కాదనియు, విషయముల క్రింది చివరకు సంబంధించనవి మాత్రమే అవియనియు, కాని, అవి వినోద, ఉల్లాస, ఆరోగ్య పరిపోషణలకు మాత్రమే గాక, శరీరము యొక్క ఉన్నతతర నైపుణ్యతకు, కొన్ని శక్తులు గుణముల వృద్ధికి శరీరమునకు మాత్రమేగాక, మానసిక శక్తుల ఉద్దీపనము శిక్షణ నైతిక స్థితులను పోషించుటకును, ప్రయోజన పడునని ఆ వ్యాసమునందు తెలిపితిని; కాని ఈయన్నియు, ఇతర విధముల పోషింపబడ వీలున్నదనియు, ఈ విధ ప్రయోజనమునకు పరిమితికల దనియు తెలిపితిని. క్రింది చివరనుండి అవలంబించే సహజ సాధనల పరిమితులను దాటి పోవుటకు మార్గము యోగసాధనయే ఉపాయము. ఈ విషయమున సందిగ్ధమున కవకాశములేదు; కాని శ్రీమాత క్రీడలకు సంబంధములేని ఇతర విషయము

లను గుఱించి వ్రాయుమని చెప్పుచు, దివ్యశరీర పరిణామావకాశములు అను నట్టి విషయములను సూచించెను ; అందుచే, ఆ విషయమును గుఱించి వ్రాయుచు, అతి మనస్సు, సత్య-చేతస్సు అను వానిని గుఱించి, క్రీడలకెంత మాత్రము సంబంధము లేని వానిని గుఱించి వ్రాసితిని, దీని ఉద్దేశ్యమేమన, వ్యాయామశాలలోని సంభవము లను గుఱించి మాత్రమేగాక యేదో ఉన్నతతర, అధికతర మనోహర విషయము లను గుఱించి పాఠకులకును, తదితరులకును సంతుష్టకరముగా నుండగలట్లు వ్రాయుట. దివ్యశరీరమును గుఱించి చెప్పినపుడు దూరకాలములో అధ్యాత్మశక్తితో శారీరక - భవిష్యత్పరిణామముచే, సాధ్యముకాగల విషయములను, నేడూహించిన విధముగ తెలిపితిని : కాని, ఇవి స్పష్టముగా, ఈ బాధ్యతలు సమీపకాలములో కాని తక్షణమేకాని సిద్ధించునవికావు. ఈ కార్యమును ప్రారంభమునుండి మొదలిడవలయు ననియు, ప్రక్కదారిలో ప్రయత్నించవలసినవి గాదనియు, స్పష్టముగనే తెలిపితిని. ఇప్పటిలోగల పరిమితులను నేను బహుశా నొక్కి చెప్పియుండవలసినదేమో; కాని దానిని గుఱించి నేనిప్పుడు స్పష్టపఱుచవలెను. ఏలయన, నా ప్రయత్నముల యొక్క మొదటి ఉద్దేశ్యము, పృథ్విపై ఆధ్యాత్మిక, జీవితమును స్థాపించుట ; అందుకుగా, మొదటి ఆవశ్యకత సర్వదా దైవమును అనుభవించుచేయగును. అపుడు మాత్రమే, జీవితము ఆధ్యాత్మీకరింపబడగలదు. అపుడు మాత్రమే నేను చెప్పునట్టి దివ్య జీవనము సాధ్యమొనరింప బడగలదు. దివ్య శరీరము అని చెప్పబడగలదానిని సృష్టించుట రూపాంతర కార్యమునందొక భాగముగా దూరకాలములో జరుగగలవని, ఈ ఊహాగానములలో దర్శింపబడిన దివ్య శరీరము, దూరకాల పరిణామ ఫలితముగ మాత్రమే సంభవించగలదు ; దీనిని గుఱించి ఎవ్వరు భయపడవలసినది కాని పెడదారిన పోవుటకాని అనవసరము. ఎప్పుడో కేవల దూరకాలములో సత్యముకాగల నొక భ్రమగనె దీనిని భావించ వచ్చును.

ఇక నీ లేఖలోని ముఖ్యవిషయమును గుఱించి నేనిక చర్చింతును. శాశ్వత ముగా క్రీడలపైననే శ్రీమాత ఏకాగ్రతకావించినదనియు, సాధనకు ఆధ్యాత్మిక ప్రయత్నమునకు సంబంధించిన వానినుండి మఱలిన దనియు చెప్పుట యొకమిథ్య ; అందులో సత్యములేదు. ఆమె స్వీయ శారీరక వ్యాయామమునకుగాను క్రీడా క్షేత్ర మున వినియోగించు రెండు మూడు గంటలు సాయంత్రమునందు తప్ప. మిగత దినమంతయు, ఉషఃకాలము మొదట రాత్రి చాలభాగమువఱకు, ఇతరుల సాధనకు

సంబంధించిన, ప్రణాళికము, ఆశీర్వాదములు, ధ్యానము మెట్లపైన ఇతర స్థలముల లోను సాధకులను కలియుట, ఒక్కొక్కసారి రెండుగంటల కాలము తెరపిలే కుండను. వారు చెప్పునది వినుచు, సాధనను గుఱించిన ప్రశ్నలు, వారి పనులను గుఱించిన ఫలితములు, వారిస్వంత విషయములు, వారి ఫిర్యాదులు, తగాదాలు, కొట్లాటలు, తీర్మానించి చేయవలసిన ఇతర విషయములు, - ఈ అంత్యము లేని ఈ పట్టిలోగల కార్యములనన్నింటిని ఆమె చేయుచున్నది ; ఇవిగాక సాధకుల జాబు లకు, ఆశ్రమ డిపార్టుమెంటులు ఆశ్రమ కార్యములను గుఱించిన వారి రిపోర్టులు, బయటివారితో సంబంధముగల పనులు, వారి కష్టములు, వారి తగాదాలు. ముఖ్యముగా తీర్మానించవలసిన ఇతర పనులు, వీని నన్నింటిని ఆమె చూచుకొనును. ఈ కార్యము లన్నియు క్రీడలకు సంబంధించినవికావు ; సాయంత్రము కొంత కాలము తప్ప, మిగతకాలములో క్రీడలను గుఱించి, ఆమె ఆలోచించుటయైనలేదు. అందుచే, సాధ కులను, వారి సాధనను నిర్లక్ష్యపఱచినదనుటకు, క్రీడా విషయములందే ఆమె నిమగ్నురాలై నదనుటకు, నన్నుకూడ ఆదే విధానములోనికే దింపిన దనుటకు, కార ణములేదు. ఈ సంవత్సరము డిశంబరు 1, 2, తేదీలకు ముందుమాత్రము, ఆమె సాంస్కృతిక ప్రణాళికయగు "భవిష్యద్దిశకు" అను నాటకము, నాట్యములు, "సావిత్రి"నుండి "ప్రార్థనలు ధ్యానము"నుండి పఠనములు,-ఒకటవ తేదీయందు జరి గిన వీనికిని, క్రిడాంశములు, ఘటనలుగల రెండవతేదీ ప్రణాళికకు, ఈ రెండు రోజులు వానికి అధిక కాలము వినియోగపఱచినది. వీనిని గుఱించి కూడ, భవిష్య త్కాలములో ఆమె ఈ విధానమునే నిత్యజీవితముగా మార్చి, ఆశ్రమజీవితమునందు, ఆధ్యాత్మిక జీవితాంశములేకుండ పోవుననికాని, క్రీడాదేవతకు దేవత్వాపాదనము కావింతురని కాని విర్ణయించుటకు కారణములేదు. ఈ భావమును వెల్లడించిన వారున్ను, ఇకమీదట, అందరు క్రీడలలో పాల్గొనక తప్పదని చెప్పినవారును, సత్య దూర భ్రమలనే సేవించిరి. ఇపుడు, ఈ కార్య ప్రణాళియందుగల సంక్షోభ యం తయు ముగిసిపోయి, డిశంబరు రెండవతేదీ తర్వాతనుండి విషయములన్నియు యథాస్థితికి వచ్చినవి ; క్రీడాక్షేత్రమునందలి కార్యకలాపములు సాధారణ దినముల కన్న తక్కువైనవి. భవిష్యత్తునుగుఱించి, నీవు "ఒకసారి జరిగినది, ఎల్లకాలము జరుగదు," అను సామెతను జ్ఞాపకముంచు కొనుము.

కాని, క్రీడాపరత ప్రతి సాధకునిపై బలాత్కారముగ విధింపబడుననియు, అదిలేనిది, శ్రీమాత కృపకాని, సానుభూతికాని యుండదనియు నగు నిష్కారణ

భావము, ఇంకను వాతావరణమునందున్నది, అందుచే ఘంటాపథముగ నేను మఱల మఱల చెప్పునదేమన, – ఇదివఱకే ఈ భావము ఉదయించి నపుడే చెప్పి యున్నాను – మఱల చెప్పుచున్నాను, అతి మనస్సు, క్రీడాక్షేత్రమున అవతరించ నున్నదనియు, అక్కడ నున్నవారికి తప్ప మరితరత్ర నున్న వారికెవ్వరెవ్వరికిని, ఈయబడదు, అందుచే నేనుకూడ దానిని అందుకొనజాలను, అనుటను గుఱించి, అప్పుడు చెప్పినట్లువలె, మఱల ఇప్పుడుకూడ చెప్పునదేమన, శ్రీమాత కట్టిభావ మెపుడును ఉండియుండలేదు, అందులకు కారణముకూడలేదు. నీకుగాని, మరెవ్వరికి గాని, క్రీడల యం దభిరుచిలేనిచో, వాని యందు మీరు పాల్గొనుట కామె కిష్టములేదు. క్రీడాక్షేత్రములో అడుగుకూడ పెట్టనివారు, ఆమెయొక్క కృపను పొందువారు. శ్రేష్ఠ, అమూల్యా సేవకులు, ఆమెకు కేవల సన్నిహితముగ నుండు వారు అనేకులు కలరు. అందుచే క్రీడలయం దిష్టము లేనివారెవ్వరుకాని, క్రీడలలో పాల్గొనక పోవు టచే, ఆమె దయా సానుభూతులను కోల్పోవుటలేదు. ఈ విషయములు వ్యక్తిగత భావములేకాని, మఱేమియుకాదు. శ్రీమాత దృష్టియందు క్రీడ ఇప్పటిలో ప్రాముఖ్య ముగనున్నదని, సాధనకది అత్యవసరమను భావము ఎవ్వరైన చెప్పకున్నను, చెప్పినను, ఈ భావన అత్యంత–అయుక్తము. 6–12–1949

---

3-వ అధ్యాయము

# శ్రీ అరవిందులను గుఱించి, శ్రీమాత ప్రవచనములు

దివ్యచేతస్సు, శ్రీ అరవిందుల రూపమున నిశ్చేతస్సునుండి బహిర్గమించు చున్నది.

*   *   *   *   *

ప్రపంచ చరిత్రయందు శ్రీ అరవిందులకుగల స్థానము - ఒకానొక ప్రభోధముకాదు, లేక ఒకానొక దివ్య సత్య సందర్శనముకూడకాదు; వారు నెరవేర్చ వలసిన నిశ్చితకార్యము, పరాత్పర దైవముయొక్క స్వస్థానమునుండి వచ్చు చుండెడిది, యేదియో, అదియే.

*   *   *   *   *



అవరోహించు ముక్కోణము సచ్చిదానందమును సూచించును.

ఆరోహించు ముక్కోణము, ప్రాణ ప్రకాశ ప్రేమల రూపమున జడము నుండి, ఆకాంక్ష యొసంగు ప్రత్యుత్తరమును సూచించును.

ఈ రెండింటి కలయికయగు కేంద్ర చతురస్రము, పరాత్పరుని అవతార మగు పద్మమును, దాని కేంద్రమునందు గల పరిపూర్ణ - ఆవిర్భావమును సూచించును.

చతురస్రమునందు గల జలము, నానాత్త్వమును, సృష్టిని సూచించును.

*   *   *   *   *

అగాధ తమ అజ్ఞానములో నూర్లకొలది మానవులు మునిగియున్నను నిస్పృహ చెంద నక్కఱలేదు; మేము నిన్నటి రోజున దర్శించిన మహాపురుషుడు పృథ్విపై నున్నాడు; అంధకారము, ప్రకాశముగా రూపాంతరమందు దివసము అరుదెంచుననుటను, పృథ్విపై నీ దివ్య పరిపాలన నిశ్చయముగనే స్థాపింపబడు ననుటను, నిస్సందేహముగా తెలుపుటకు మా మధ్య వసించుచున్న ఆ మహా పురుషుని సాన్నిధ్యమే చాలును.

* * * * *

పృథ్వీ చరిత్ర ప్రారంభమైన నాటినుండి పృథ్వీ రూపాంతర కార్యములపై, ఏదేని యొక రూపమున, ఏదేని యొక నామమున, శ్రీ అరవిందులు అధిష్ఠించి యున్నారు.

* * * * *

(విశ్వ చరిత్రయందు శ్రీఅరవిందుల జన్మ ''శాశ్వతము'' అని మీరు వచించితిరి. "శాశ్వతము'' అను పదమునకు స్పష్టార్థమేమి?)

చేతస్సుయొక్క నాలుగు ఆరోహక భూమికలపై నాలుగు విధములుగ ఈ వాక్యమును అర్థము చేసికొనవచ్చును.

1. భౌతికముగ, వారి జన్మ ప్రపంచమునందు శాశ్వత ప్రాముఖ్యతగల ఫలితములను వహించి యుండును.
2. మానసికముగ, వారి జన్మ విశ్వచరిత్రయందు శాశ్వతముగ స్మరింపబడును.
3. చైత్యకముగ, వారి జన్మ పృథ్విపై యుగయుగమునను సంభవమగుచుండును.
4. ఆధ్యాత్మికముగ, వారి జన్మ పృథ్విపై దివ్య శాశ్వతత్వమునే సూచించును.

* * * * *

సంభూతి (అగుట) యొక్క శాశ్వతత్త్వమునందు, పరిపూర్ణతర భవిష్యదనుభవమునకు దూతయే, ప్రతి అవతారము కూడ.

అట్లయ్యును, భవిష్యద్కాల అవతారమునకు ప్రత్యర్థిగ, గత కాలపు అవతారమునే దైవమునకు ప్రతినిధిగా పూజించే అలవాటు మానవులకు సర్వదా నున్నది.

ఇపుడు మఱల, శ్రీఅరవిందులు భవిష్య దనుభవమును ప్రపంచమునకు చూపుటకే యేతెంచిరి; మఱల వారి సందేశము, పూర్వావతారముల సందేశములకు వలెనే, అదే ప్రతిరోధమును ఎదుర్కొనుచున్నది. కాని, వారు ఆవిష్కరించిన సత్యమును భవిష్యత్తు ఋజువు పఱచును; మఱి వారి కార్యము సిద్ధిలచును.

* * * * *

శ్రీ అరవిందులు మనకిట్లు చెప్పుట కరుదెంచిరి: "దివ్య సత్యమును కనుగొనుటకుగా, ఎవ్వరును పృథ్విని వదలనవసరములేదు: ఆత్మను కనుగొనుటకు జీవితమును వదల నవసరములేదు. దైవముతో సంబంధము నేర్పఱచుకొనుటకు ఎవ్వరు కాని పరిమిత విశ్వాసములనే వహించి యుండుటకాని, లేక ప్రపంచమును త్యజించుటకాని, ఆవశ్యకతలేదు. సర్వత్ర, సర్వ వస్తువులయందును దైవము కలదు; మఱి యా దైవము దాగియుండుచో, ఆ దాగియున్న దైవమును కనుగొనుటకు మనము ప్రయత్నించుట లేదనుటచే మాత్రమే, దైవము దాగియున్నదనవలెను."

* * * * *

శ్రీ అరవిందులు అతి మానసిక చేతస్సును మానవ శరీరమునందు మూర్తిమంత మొనరించి, గమ్యమును చేరగల మార్గమును, ఆ మార్గముయొక్క స్వభావమును ప్రదర్శించుటయేగాక, వారి స్వీయ వ్యక్తిగతానుభవముచేతగూడ మనకు ప్రత్యక్ష-ఉదాహరణమును ఒసంగిరి; ఈ విషయమా సిద్ధి కాంచగలదను ఋజువుగ, తమ్మెదా, ఉదాహరణముగ నొసంగిరి; మఱి యిపుడాకార్యము సాధించు కాల మాసన్నమైనది.

* * * * *

ప్రభూ, ఈ ఉదయమున నీవు పురోగమింపచేయునట్టియు, ప్రకాశింపచేయునట్టియు చేతస్సుగా మాత్రమేగాక, మా కర్మలయందు క్రియాశీల దివ్యసాన్నిధ్యముగా కూడ మా మధ్యమున యుందునని దృఢపఱచితివి. పృథ్వియంతయు రూపాంతరమందు వఱకు పృథ్వీవాతావరణమును విడువక మాతో నుందునని వాగ్దాన మిచ్చితివి. ఈ నీ అద్భుత సాన్నిధ్యమునకు మేము అర్హుల మగునట్లు ప్రసాదించుము; ఇక మీదట మీ యందలి సర్వస్వము నీ పవిత్ర దివ్యకార్య సిద్ధికిగా, అధికాధికముగ ఏకాగ్రీకృత మగుటకు ప్రసాదింపుము.

* * * * *

(శ్రీ అరవిందుల సమాధిపై లిఖింప బడినది)

మా ప్రభువుయొక్క భౌతికావరణముగ నున్న నీకు, మా అనంత కృతజ్ఞత. మాకొఱకెంతో కావించినట్టియు, పనిచేసినట్టియు, పోరాడినట్టియు, బాధపడినట్టియు, ఆశించినట్టియు, ఎంతో సహించి నట్టియు నగు నీయెదుట, మీకొఱకు సర్వము సంకల్పించి నట్టియు, సర్వము ప్రయత్నించి నట్టియు, సర్వము సిద్ధపఱచి. సాధించి నట్టియు నగు నీయెదుట, ప్రణమిల్లి మేమెప్పటికిని నిన్ను మఱువకుండునట్లు నీకు ఋణపడిన దానినంతటిని. ఒక్క నిమిషము కూడ మఱువకుండునట్లు ప్రార్థించు చున్నాము.

*　*　*　*　*

మనతోకూడ సచేతనముగా సజీవముగా ఇక్కడ నున్న, శ్రీ అరవిందులను గుఱించి (వారులేరని) దుఃఖించుట, వారిని అవమాన పఱచుటయే యగును.

*　*　*　*　*

ప్రాతిభాసిక దృశ్యములచే మనము వంచింపబడ కూడదు. శ్రీ అరవిందులు మనల వదలలేదు. శ్రీ అరవిందులు, ఎల్లప్పటివలె, సజీవముగ ససాన్నిధ్యముగ నిక్కడనే యున్నారు; వారి కార్యమును ఆవశ్యకమైన మనః పూర్వకతతో, ఉత్సాహముతో ఏకాగ్రతతో సిద్ధింప చేయుటకది మనకు వదలబడినది.

*　*　*　*　*

ప్రభు, నీ రూపాంతర దివ్యకార్యమును నేరవేర్చుటకే మేము పృథ్విపై నున్నారము. అదియె మా యేకైక సంకల్పము, మాయేకైక పూర్వనిమగ్నతా కార్యము. అదియె మా యేకైక వర్తమాన కార్యముగా నుండునట్లును, మా కార్యములన్నియు ఆయేకైక గమ్యమును చెరుటకు సాహాయ్యకములుగ నుండునట్లు ప్రసాదింపుము.

*　*　*　*　*

శ్రీ అరవిందులకు మన కృతజ్ఞత తెలుపుటకు, వారి ప్రబోధమునకు సజీవ ఉదహరణములుగ నుండుటకన్న అధికము మరేదియు లేదు,

*　*　*　*　*

వారులేనిచో, నాకు ఉనికి లేదు;

నేను లేనిచో, వారికి ఆవిర్భావములేదు.

*　*　*　*　*

## శ్రీ అరవిందులను గురించి శ్రీ మాతృ వచనములు

శ్రీ అరవిందులు గతకాలమునకుగాని, చరిత్రకుగాని చెందువారు కారు.

శ్రీ అరవిందులే, భవిష్యత్తు: మరి యా భవిష్యత్తు, దాని సిద్ధికొఱకు దాని పథమున పురోగమించు చున్నది. ఆ పథమున మనము విలంబులముగ నుండక నావశ్యకమగు వేగముతో పురోగమించు శక్తిని గలిగి యుండుటకు శాశ్వత యెవ్వనత్వమును కలిగి యుండవలెను.

శ్రీ అరవిందులు పృథ్విపై యేతెంచినది, పూర్వపు ప్రబోధములకు మతములకు ప్రత్యర్థిగా తన ప్రబోధమును, మతమును బోధించుటకు కాదు; కాని, గతమును అధిగమించి, సమీపఅనివార్య భవిష్యత్తునకు మార్గమును స్పష్టముగ తెఱచి యుంచుటకు, వారేతెంచిరి.

గత మిందులకు సాధనమై యుండెను; ఇంకను మానుష్యకము నందలి కొంత భాగ మిందుకు సిద్ధపఱుపబడవలసి యున్నది.

శ్రీ అరవిందులు సర్వులకు సమానముగా సహాయము నొనర్తురు; కాని ఒక్కొక్కరు, వారి వారి అర్హతను, స్వీకరించు కొనగల సామర్ధ్యమును పట్టి, ఆ సహాయమును పొందుదురు.

గతమును పోద్రోచి, దాని భారమును విడనాడి, భవిష్యత్తునకు పరుగిడ శక్తి గల వారు గమ్యమును వేగముగ చేరుదురు.

కాని సహాయము అందఱకు కలదు, అందఱు సుస్వాగతులే. 22-2-1967

## శ్రీ అరవిందుల జన్మకు గల అర్థము

శ్రీ అరవిందులు పృథిపై జన్మించిన నాటివఱకు, మతములు ఆధ్యాత్మిక సిద్ధాంతములు గత కాలవిషములపై మాత్రమే సర్వదాకేంద్రీకరింపబడి, "పృథ్విపై దివ్యజీవితము సాధ్యముకాదు" అనెడి గమ్యమునే చూపించిరి. అందుచే మానవునికి యుండినది, రెండే రెండు మార్గములు: అల్పసుఖ దుఃఖములు, బాధా సంతోషములతో కూడినట్టియు, ఋజు ప్రవర్తన లేనిచో నరకము కలుగునను హెచ్చరికతో కూడినట్టియు ఇహలోక జీవనము, లేదా పునర్జన్మలేని పరలోక స్వర్గ జీవనమో, మోక్షమో.... ఈ రెండింటిమధ్య, మనము ప్రముఖముగా నెన్నుకొన వలసినంతటి దేదియులేదు,

ఇదియొక గొప్ప తప్పిదమనియు, ఈ కారణముగనే, భారత దేశము పతనమును దౌర్బల్యమును పొందెనని శ్రీ అరవిందులు నుడివిరి. భారతజాతిని, ఇది నిర్వీర్యము చేయుటకు చాలినంత శక్తి కలదయ్యెను.

భౌతిక పదార్థము మాత్రమేగాక ఆత్మయనెడి పదార్థము కూడ కలదని, ఈ నాటికి కూడ తెలిసికొని యుండునది, ప్రపంచము నందన్ని దేశములలో భారత దేశమొక్కటే. ఐరోపా ఖండము, అమెరికా ఖండము, మరితర దేశములన్నియు, ఈ విషయమును పూర్తిగా విస్మరించినవి. అందులకె, ప్రపంచమును రక్షించగల సందేశమును దానికిచ్చుటకు, ఇంకను భారత దేశమునకు మాత్రమే కలదు. కాని, నాయకత్వమును వహించు మార్గమున. భారత దేశమింకను బాధ పడుచున్నది.

శ్రీ అరవిందులు చూపించుచున్న సత్యము, - పృధ్వీజీవితము నుండి పలాయనమగుటలోకాదు, కాని భౌతిక ప్రపంచమునందు ఇక్కడనే నిలిచి దానిని రూపాంతరమొందించి, దివ్యీకరణ మొనరించి. అందుచే దైవమును అభివ్యక్తము చేయవలెననుట.

---

# మనము మఱవకుండుటకు

## శ్రీ మాతృ కతిపయ వచనములు

ప్రపంచము కొఱకు శ్రీ అరవిందులు, ఎంతటి మహోన్నత బలిదానమును గావించుకొనిరో, ప్రజలకు తెలియదు. ఒక సంవత్సరము వారితో విషయములు చర్చించుచుండ, నేను నా శరీరమును విసర్జించుచున్న స్పృశ నాకు కలుగుచున్నదని తెలిపితివి. "వలదు, ఇట్లెప్పటికిని జరుగకూడదు. ఈ రూపాంతర కార్యమునకు అవసర మయ్యెనేని, నేను వదలవచ్చును, మన అతి మానసిక అవతరణ యొక్కయు, రూపాంతర కార్యముయొక్కయు, యోగమును నీవు సిద్ధింపచేయ వలసినదిగ నుండును" అని దృఢగాత్రముతో వచించెను. 1950

పరమోన్నత నిస్స్వార్థ కార్యముచే, సామష్టిక – అనుభవ – సమయమును శీఘ్రపరచుటకు, స్వీయ శరీరమునందు కలుగగల సిద్ధిని నిరాకరించుచు, శ్రీ అరవిందులు తన శరీరమునే పరిత్యజించిరి. నిశ్చయముగనే, పృథ్వి మఱికొంచెము అధికముగ, సత్య – శక్తిని ప్రతిస్పదించ శక్తి కలిగి యుండెనేని, ఇట్లు చేయవలసిన ఆవశ్యకత ఉండియుండదు. 1953

వారి శరీరమునకు మఱల ప్రాణము కలిగించుమని వారిని నేను కోరగా వారిట్లు ప్రత్యుత్తర మొసంగిరి. "నా శరీరమును ఉద్దేశ్య పూర్వకముగ విడిచినాను. నేను దానిని స్వీకరించను. అతి మానసిక విధానముచే నిర్మింపబడిన ప్రథమ అతి మానసిక శరీరమునందు మఱల నేను ఆవిర్భవింతును. 1950

శ్రీ అరవిందులు, తన శరీరమునుండి ఉపసంహరించుకొన్న తక్షణమే వారు పేరిడిన "ప్రకాశమాన మనస్సు" ఇక్కడ సిద్ధిగాంచెను......

అతి మనస్సు దీర్ఘకాలము – చాల దీర్ఘకాలము క్రిందనే, మనస్సునందును, కడకు ప్రాణమునందుకూడ అవతరించియుండెను; అతి భౌతికమునందుకూడ పని చేయుచుండెను; కాని, నేరుగాగాక మనః ప్రాణములద్వారా పనిచేయుచుండెను. భౌతికమునందు, అతి మనస్సు, నేరుగా పనిచేయవలయుననుటయే, అప్పటి సమస్య. అతి మానసిక ప్రకాశమును, భౌతిక మనస్సు, అందుకొని స్వీకరించిననే, ఆ కార్యము సాధ్యమని శ్రీ అరవిందులు నుడివిరి; అత్యంత భౌతిక పదార్థముపై కూడ సమక్షము పనిచేయగల పరికరము, భౌతిక మనస్సే. అతి మానసిక ప్రకాశమును స్వీకరించు ఈ భౌతిక మనస్సును, శ్రీ అరవిందులు ప్రకాశమాన మనస్సు, అను పేరుతో పిలిచిరి. 1953

---

# రెండవ భాగము

## 1–వ అధ్యాయము

## గీతా సందేశము

కర్మ రహస్యమే ప్రాణికోటుల రహస్య మనియు, నునికియొక్క రహస్య మనియు గీతాసందేశమని, గీతా దివ్యాచార్యుని తుది పల్కని సంక్షేపముగ మనము నుడువ వచ్చును. "స్థితి లేక యునికి ప్రకృతి యొక్క యంత్రకలాపము మాత్రమే కాదు మరియు నాయునికి క్షణికముగనో – యుగ పరంపరగనో – యాత్మ చిక్కని యున్న ప్రకృతి శాసన చక్రము మాత్రమేకాదు. ఆత్మయొక్క సతతావిష్కారమే స్థితి యనబడును. జీవితము కొరకే జీవితముకాదు. కాని యది భగవంతుని కొరకనుట ముమ్మాటికి సత్యము. జీవభూతమైన వ్యక్తిగతాత్మ శాశ్వతమైన భగవదంశము. నీ నిజ స్వరూపమును తెలిసికొనుటకు దానిని యభివృద్ధి పరచుటకు, నుపలబ్ధి పొందుటకు – గర్మాచరణ లక్ష్యముగాని, వర్తమాన భావికాలములందు గలుగబోవు స్థూల ఫలముల నిమిత్తము మాత్రమే కర్మాచరణ విధి కానేరదు. పరమాత్మపైనను, నా విష్కరించిన యాత్మ స్వభావము పైనను నాధారపడిన యంతస్సూక్ష్మ ధర్మసూత్రార్థములు ప్రతిభూతమునం దంతర్హితమై యున్నవి. అట్టి యంతసూక్ష్మ ధర్మార్థము లందే కర్మయొక్క పరమ సత్య మిమిడియున్నది. అట్లు సూక్ష్మ ధర్మార్థములతో గూడికొనిన సత్య తత్త్వ మజ్ఞానముచే బరివృతమై మనో వాక్కాయ స్థూలకర్మల మూలమున సందర్భానుసారముగ నవక తవకలు గల్గి చిత్రింప బడుచున్నది. నీ యునికి యొక్క పరమోన్నత మగు మరియు మిక్కిలి యంతస్థమగు సత్యమును గనుగొని, దాని యందే మనుచు, ఇతర బాహ్య నియమముల గాని ధర్మముల గాని బాటింప కుండుటయే బరమోన్నతమైన దోష రహిత మగు బ్రహ్మాండ కర్మాచరణ సూత్రమని తెలియుము. అట్టి సత్యమును గనుకొను నంత వరకు, సర్వ కర్మలు జీవిత మవక తవకలుగను– గష్టపూరితములు గను– పోరాటముగను ధర్మ సంకటము గను నుండును. నీ నిజాత్మను గనుగొని దాని సత్య తత్త్వాను సరణిగా

దానిని నిత్య సత్యాను రీతిగా నీవు ప్రవర్తించిన నీ ధర్మసందేహము నిశ్శేషముగ నివృత్తిగా గలదు. కష్ట పరంపరలను బోరాటమును నతిక్రమించగలవు. మరియు నీ యాచరణ లన్నియు నీ వన్వేషించి కనుగొన్న యాత్మయొక్క రక్షణలో దోష రహితములై పరిపక్వ మొంది దైవాజ్ఞా నిర్మితాచరణములుగ బరిణమించును. కనుక నీ యాత్మను నీవు తెలిసికొనుము. నీ సత్యాత్మ భగవంతుడే యనియు నితర భూత గణములలో నున్న యాత్మయు నీ యాత్మయు నొక్కటియే యనియు, నెఱుంగుము. నీ జీవాత్మ భగవదంశమని యెఱుకై యుండుము. నీ కెఱుకై యున్న దానిలోనే మని యుండుము. నీ యాత్మలోనే జీవనము కలిగి యుండుము. నీ యొక్క పరమోన్నతమైన యాధ్యాత్మిక స్వభావము లోనే మనుగడ గలిగి యుండుము. భగవింతునితోను భదవద్రూపములతోను నేకీభవించి యుండుము. నీ లోను, ప్రపంచ మంతటను నద్వితీయుడై యున్నతోన్నతుడై వెలుగు నామహా మహునికి నీ యాచరణ లన్నింటిని యాహుతులుగ బ్రప్రథమున నర్పింపుము. కట్టకడపట నిన్ను నీవును నీ సర్వస్వమును భగవంతుని చరణముల కడ సమర్పించు కొని ప్రపంచములో నాతని యిష్టానుసారము కార్యముల పరాశక్తి నీ ద్వారా నాచ రించుటకు వరణొందుము. ఈ మార్గమునే నేను నీకు సూచించు చున్నాను. ఇంతకు మించిన వేరు మార్గము లేదని తుట్ట తుదకు నీవే గనుగొందువు."

ఈ సందర్భములో భౌతికా ధ్యాత్మిక ములకు మూలకందములో గల యన్యోన్య విరోధ విషయమై గీతాభి ప్రాయమును వివరించుట ముఖ్యావశ్యకము. హిందూ దేశములోని యితర మతబోధల వలెనే గీత కూడ యీవిరోధము పైననే తన కాలూదుకొని యున్నది. నిజాత్మ యొక్క యన్వేషణము మలలో వెలయు చున్న భగవంతుని గుఱించిన జ్ఞానోదయము దదితరములు సులభ సాధ్యములైన విషయములు గావు. ఒక వేళ మనోబుద్ధు లిట్టి జ్ఞానము బడసినను దానిని మన చైతన్యాంశముగను పరిణామ మొనర్చుటయు కార్యాచరణ నియమము యొక్క యేకైక నియమముగ నవతరింప జేయుట సులభ విషయములు గావు. మన సత్త యొక్క నిశ్చితాత్మక మైన పరిస్థితియే మన సకల కర్మల నియమితము చేయు చున్నది. సతతము దమ్ముదా ముపలక్షించికొను మనో బుద్ధులు— క్రియా యుక్త మైన చైతన్యము— దాని కాధారభూతమైన రజోగుణ ప్రవృత్తియు— మనసత్తయొక్క నిశ్చితాత్మకమైన పరిస్థితిని— నియమించు చున్నవి. ప్రవృత్త్యాత్మకమైన మన సర్వ స్వభావముతో దేనిని లక్షించి యదియే మన మగుటకును— మరియు ప్రపంచముతోడి

మన సంబంధబాంధవ్యముల కట్టిదియే గొలికి పూస యగుటకు విశ్వసించి శ్రద్ధాభక్తులు గల్గియున్న యెడల నట్టి లక్ష్యమే మన మగుచున్నాము. "యద్భావ స్తద్భవతి" యను శాస్త్రోక్తి దబ్బర కానేరదు. కాని మరియొక విషయము జ్ఞప్తియం దుంచికొనుము. మానవ చైతన్యము ద్వివిధ రూపములు గలది. ఈ ద్వివిధ చైతన్య రూపములు నునికి యొక్క బాహ్యాభ్యంతర సత్య ద్వయములను బోలియున్నది. మనుజుడు బాహ్య చైతన్య సత్యములో నివసించుచున్న యెడల మానవాజ్ఞానములో ప్రవర్తించు మనోమయుడుగ నుండును. అంతశ్చైతన్య సత్యములో మనుగడ కల్గి యున్న యెడల నాతడు దివ్య జ్ఞానములో నెలకొనిన యాత్మస్వరూపు డగును.

ఉనికి యొక్క సత్యము బాహ్య రూపములో విశ్లేషముగ మనము సాధారణ ముగ బేర్కొను నట్టి ప్రకృతియై యున్నది. ఈ ప్రకృతి మహాశక్తి రూపము దాల్చి సత్తయొక్క యంత్రకలాపము దానే యగుచు దానిని సంపూర్తిగ శాసించుచు మన మనో బుద్ధీంద్రియములకు ధ్యేయమైన ప్రపంచమును సృష్టించుచున్నది. ఇది యును గాక జీవ జగత్తులకు సంబంధ బాంధవ్యముల నేర్పరచు నింద్రియములను మనస్సును గూడ సృష్టించు చున్నది. ఇట్టి బాహ్య ప్రకృతిలో మనుజుడు దన మనః ప్రాణ శరీరము లందును– మరియు జీవత్వస్థితి యందును – ప్రకృతియొక్క కీటక ముగ గనబడుచు దన ప్రత్యేక మనఃప్రాణ శరీరముల వల్లను, నందులో విశేష ముగ "నేను, నేనను" మమకారము వల్లను నితర భూతకోటికి భిన్నుడై యున్నాడు – బలోద్దీపితమైన యీ భిన్నభేద భావములను దృఢపరచుటకును. గేంద్రీక రించుటకును బ్రకృతి మనుజునిలో నహమ్మను యంత్రమును సూక్ష్మ రూపముగ నిర్మించి యున్నది. ఆతనిలోనున్న సర్వస్వమును, ముఖ్యాంగమైన మనస్సును దాని ప్రవృత్తులను, బ్రాణ శరీరముల ప్రవర్తనను నాతని స్వభావ ధర్మమే నియ మించుచున్నడి. ఈ స్వభావధర్మము నతిక్రమించ జాలడు. దానికి భిన్నముగ బ్రవ ర్తింప జాలడు. ఆతడు తన వ్యక్తిగత మగు నిచ్ఛాశక్తికి లేక దన యహంకారే చ్ఛకు గొంత స్వాతంత్ర్యమును నారోపించు చున్నాడు. అయితే అట్టి స్వాతంత్ర్యము గగన కుసుమమువలె భ్రాంతి జనితమేగాని వేరుగాదు. ఎందుకన నాతనిలో ప్రకృతి చిత్రించిన సృష్టితోను, నామె నిర్మాణములగు వైవిధ్యముకల మనః ప్రాణ శరీ ములతోను దన్నైక్య మొనర్చు భావనయే యాతని యహము. ప్రకృతి నిర్మితమ లైన చంచలములగు మనోవాక్కాయములు దానేయని భ్రమించు చున్నాడు. అతని యహము సైతము ప్రకృతి క్రీడలయొక్క శిశువుగనున్నది. ఆతని యహంస్వభా

మేలాగున నుండునో దద్విధముగనే యాతని యిచ్ఛాశక్తికూడ నుండును. అట్టి యిచ్ఛాశక్తి కనుసరణీయముగ నాతడు గత్యంతరము లేక ప్రవర్తించి తీర వలయును.

ఇదియే మనుజుని సామాన్య చైతన్యము. ఆతని సత్తాంశములో నాతనికిగల నమ్మిక యిదియే. తాను ప్రకృతియొక్క శిశు వనియు, నితరులతోను బ్రపంచము తోను సంబంధ బాంధవ్యముల నేర్పరచుకొను భిన్నవ్యక్తి ననియు, ప్రకృతి గీచిన గీటుకు బద్ధుడై యామె ఇచ్ఛాను సారముగ నామెపెట్టినదే భిక్షయని, దన కోర్కెలను నాశయములను నామె వ్యూహములో వీలైనంత వరకు నెరవేర్చుకొనుచు నభివృద్ధి బొందవలయు ననియు భావించును. ప్రకృతి దనలో స్థాపించిన ధర్మము నతిక్రమించ జాలనని తలంచును.

అయితే యీ అలంఘనీయమైన ప్రకృతి శాశనమునకు లోను గాని కొంత విశేషము మనుజుని చైతన్యముతో గలదు ఆతనిలో భక్తిశ్రద్ధలు గలవు. తన యునికి యొక్క అంతస్సత్యములో దన యాత్మ ప్రవర్థమానము కాగోలది యీ భక్తిశ్రద్ధలు పెంపొందు చున్నవి. ఈ అంతస్సత్యములో నునికియొక్క నిజ స్వరూపము ప్రకృతి కాదు. కాని యది యాత్మస్వరూపముపురుషుడుకాని ప్రకృతి కాదు. స్వభావము సహిత మాత్మయొక్క శక్తియే. పురుషుని శక్తియే ప్రకృతి. పరమాత్మయు నాత్మయు జీవభూతములు నిజస్థితియందొక్కటే. ఆ యేకైక రూపుడే యందరిలోను వెలయుచు నీజగత్తు కధిపతియై యున్నాడు. ఆతని సాక్షి కావిష్కారమే యీ జగత్తు. ప్రకృతిని – నామె కార్యకలాపములను నా పరమాత్మయే భరించుచున్నాడు. ప్రకృతి ధర్మము లలంఘనీయము లగుటకును, నామె శక్తియు, నాశక్తియొక్క పోకడలు ఫల రూపము దాల్చుటకును నాతడే మూల కారణము. ఆమెలో నున్న యాత్మ జ్ఞాతగనుండుచు – నామెను దేజోవంతము చేయుచు మనలో నామెను ప్రజ్ఞా యుక్తురాలుగ జేయుచున్నాడు. అంతర్భూతమైనట్టియు, మనోబుద్ధుల కతీత మైనట్టియు నగు నాతని యిచ్ఛయే ప్రకృతి నావేశ పూరితము జేయుచు నామె కార్య కలాపములకు మూలకారణమై యున్నది. మనుజునిలో నున్న యాత్మ పైజెప్పిన భగవదంశ మైనందున నాతని స్వభావమున బాల్గొను చున్నది. మన ఆత్మ యొక్క యావిష్కారమే మన స్వభావము. అది యాత్మ యొక్క యనుమతి ప్రకారము బ్రవర్తించుచు దాని రహ స్యేచ్ఛా శక్తులను దన రూపనామ క్రియలలోను మార్పులలోను ప్రతిబింబింప జేయుచుండును.

అంతర్విషయ జ్ఞాన హీనతచే దూషితమైన మన వివేకమునకు నిజాత్మ మఱుగుపడి యున్నది. బాహ్య యంత్రములైన మనఃప్రాణ శరీరములలో నీటిలో బడిన యుప్పుకల్లు చందమున లీనమై యవియే దానిని గొఱ్ఱె మందలోని పులిపిల్ల దీరున భ్రమించుటచే మన వివేకమునకు నంతర్విషయ జ్ఞాన మపహృతమై యున్నది. మనుజునియొక్క ప్రవృత్త్యాత్మకమైన జీవు డొక్కతూరి దన సహజోప కరణములైన మనః ప్రాణ శరీరములతో నేకీభవించక వానికి దూరముగ నిలబడిన మరియు తన యంతస్సత్త్వ సత్యమును గనుగొని దానిలోనే సంపూర్ణముగ మనుగడ గల్గి యున్న నప్పుడాతనికి సర్వము నూతన రూపము దాల్చును. జీవితము యునికియు వేరు రూపము స్వీకరించును. కర్మాచరణ విధానమును దాని తాత్పర్యమును ప్రత్యేకావతారము బొందును. అప్పుడు మన సత్త్వ యహముచే నిర్మితమైన కూపస్థ మండూకము వలె క్షుద్రజీవ భూతముగాక యపారమగు నాశ రహితమైన యాధ్యాత్మిక దివ్య శక్తిగ గాగలదు. మన చైతన్యము మనః ప్రాణ శరీరములతో గూడుకొని గిజ గిజ దన్నుకొను క్షుద్రజంతువు యొక్క చైతన్యముగా గాక, బ్రహ్మాండమైన యాధ్యాత్మిక దివ్య చైతన్యముగ మారగలదు. మన యిచ్ఛా క్రియలు సహితము బంధీకృత మైన యీ మూర్తి మత్వము యొక్కయు దాని యహము యొక్కయు రూపము దాల్చక యాధ్యాత్మిక దివ్యేచ్ఛా క్రియలుగను, మానవుని యుపకరణముగ జేసికొని స్వేచ్ఛగ బ్రవర్తించు పరమాత్మ, పరబ్రహ్మ, పరమేశ్వరేచ్ఛా శక్తులుగను మారును.

పై జెప్పిన యీ ప్రబలమైన పరివర్తనమే, మరియు నట్టి నూతనాత్మావ తరణమే పుణ్యకోటికి చెందిన వారందరికి మనుజులోని భగవానుడు - అవతార మూర్తి - దివ్య బోధకుడు బ్రబోధించు సందేశము. "అజ్ఞానాంధకారములతో నిండిన సహజోప కరణములగు మనఃప్రాణ శరీరముల నుండి యెవ్వరు వారి శక్తిని మరలించి యట్టిశక్తి నగాధమైన యాత్మానుభవమునకు నంతరాత్మ జ్ఞానమునకు, భగవంతుని తోడ నాయాత్మకు గల నిత్య సంబంధమునకు మరియు దానికి గల భగవ దావేశ శక్తికి మన్ముఖము సేయుదురో వారే పుణ్యకోటికి చెందిన మహనీయులు. ఈ భక్తి విశ్వాసములు గలవారే - మరియు నీ విశాల ధర్మమును స్వీకరించినవారే - పుణ్యశ్రేణికి జెందినవారు. మేఘచ్ఛాయల తోను - గ్రుడ్డి వెలుగులతోను నిండిన యజ్ఞానమునకు కట్టుబడిన మానవుని వివేకము యంతకంటె తమః ప్రధానమైన మనుజుని మనఃప్రాణ శరీరముల యలవాటులును - నీ సందేశమును స్వీకరించుట

బహు కష్టతర మనుటలో విపరీత మేమియు లేదు. కాని యొక్కసారి యీ సందేశ మును స్వీకరించిన నదియున్నత మైనట్టియు, భద్ర మైనట్టియు ధరింప జేయు నట్టియు మార్గమగును. ఎందుకన మనుజుని సత్త్వయొక్క నిజ తత్త్వమే యిది. మరియు నాతనిలో మిక్కిలి యంతస్థమైన పరా స్వభావ ప్రవృత్తియే యీ మార్గము.

"కాని యీ మార్పు మహా ప్రబలమైనది. ఈ పరివర్తనము మేరలేనిది. నీ సంపూర్ణ సత్త్వయు స్వభావమున్ను—యీ నూతన మత యవలంబించి తన దృక్పథమును సంపూర్తిగ మార్చుకొనిన గాని యీ ప్రబలమైన మార్పు సాధ్యము గాదు. మరెద్దానికి గాక పరమోన్నతికే, ముమ్మాటికి పరమోన్నతికే నీజీవిత సర్వ స్వమును నీ శ్వభావమును, నీ యాత్మను సహితము సంపూర్ణముగ నర్పించికొన వలెను, ఎందుకన పరమోన్నతికే సర్వమును భరించి శిరమున దాల్చవలెను. భగ వంతునిలో నున్నదాని నెల్లను నాతని రూపాంతరముగ—నాతని కొఱకే స్వీకరించి యంగీకరించ వలయును గాని తదితరముల నంగీకరించరాదు. నూతన సత్య ప్రవేశ మున కవకాశ మియ్యవలెను. ప్రపంచమును గురించియు—నాత్మను గురించియు—భగవంతుని గురించియు—నీ జీవాత్మను గురించియు—నితనాదుల గురించియు—గల్గు నూతన జ్ఞానమును స్వీకరించగలమనో ధోరణి గావలయును. ఎందెందు జూచిన నందందు దొక్కడే గలడను జ్ఞానమును సర్వత్ర భగవ ద్వ్యాపక జ్ఞానో దయమును ప్రప్రథములో మానసికమైన యంగీకారముగ నుండును, కాని యిట్టి మానసిక జ్ఞానము తుట్టతుదకు స్థూల చక్షువులకు సహితము బొడగట్టి నీ చైత న్యాంశముగ మారి శాశ్వతమైన నీ యాత్మ పరిస్థితిగను, దాన ప్రవృత్తుల శాశన ముగను మారవలెను.

"ఈ నూతనజ్ఞాన దృష్టులను, యీ నూతన చైతన్యమును కర్మాచరణమునకు కామ్యముగ జేయగల దృఢ సంకల్ప మత్యవసరము. ఏకాకివలె యీ కామ్యమే సర్వ కర్మలకు గారణముగ నుండవలెను. నిత్య నైమిత్తిక కర్మలకు మాత్రమే గట్టుబడి క్లుప్తమైనట్టియు నొల్లని మగనికి దలబ్రాలు బ్రోయు వధువు ప్రవర్తనకు సరితూగునట్టియు కార్యకలాపము బ్రేరేపించు నట్టి కామ్యముగ నుండదగదు. మరియు మత సాంప్రదాయమునకు లేక వ్యక్తిగత మోక్షమునకు సాధనములైన శాస్త్రయుక్తమగు పరిపూర్ణత కుపకరించు కొన్ని విషయములకే పరిమితి చెందిన కర్మాచరణమును బ్రబోధించు కామ్యముగ నుండ దగదు. భగవంతుని కొరకు మరియు లోకసంగ్రహా ర్థమునకు మానవ జీవితములోని సకల కర్మలను సమ

హితాత్మచే నాచరింపబడ వలెను. పరమోన్నతికై యేకదీక్ష కాంక్షయు, భగవానుని యందు గేవల భక్తియు, నన్య దేవతారాధనలు లేక యేకమైన పరబ్రహ్మా రాధనయు గల హృదయోన్నతి యత్యవసరము. సకల భూతములలో నున్న భగవానుని నాలింగము చేసికోగల ఉద్వేగ రహితమగు జ్ఞానోపలబ్ధి బొందిన విశాలహృదయము నుండి తీరవలయును. మానవునికి ప్రకృతము గల మామూలైని యలవాటు-స్వభావము-మారి పరమోన్నత మైన ఆధ్యాత్మిక స్వభావ మలవడ వలెను. వేయేల "కాలికి పూస" రీతి నొక్కమాట చాలును, ఏయోగము కృత్స్నజ్ఞాన యోగమో, యేయోగము కృత్స్న భక్తి యోగమో యేయోగము కృత్స్న కర్మ యోగమో, యేయోగము యావత్తు సత్తను, దాని భాగములను, నవస్థలను, శక్తులను, ప్రవృత్తులను నన్నింటిన కృత్స్నా ధ్యాత్మిక పరిపక్వద నంతజేయునో యట్టియోగ మత్యావశ్యకము.

"వివేకముచే నామోదింప బడి. ఆత్మ శ్రద్ధాభక్తులు బలపఱచుటచే మనో హృదయ ప్రాణములకు సజీవమైనది గను, నిజమైనది గను జేయబడి విరాజిల్లు యీ జ్ఞాన స్వరూప మెట్టిది? పరమాత్ముని యేకత్వమును పూర్ణత్వమును దెలియజేయు జ్ఞానమే యీ జ్ఞానము, దేశ కాలములకు రూప నామములకు బ్రపంచమునకు నతీతుడుగా నుండియు దన సగుణ నిర్గుణతత్త్వములకు నావల నుండియు, నెవ్వాని నుండి సకల చరాచర ప్రపంచము లుద్భవించు చున్నవో ప్రకృతిలోని యసంఖ్యాకములైన నానావిధ రూపములలోనే యద్వితీయు డావిష్కరించు చున్నాడో నట్టి యేకైక నాధుని దెలియజేయు జ్ఞానమే యీ జ్ఞానము. మనచే నాత్మయని పిలువబడు నా పరంధాము డచలుడు పరిమితి లేనివాడు. మరియు రూపనామ క్రియలు లేని నాశ రహితుడైన సనాతనుడు. ఈ యనిత్య బాహ్య ప్రపంచములో గల యసంఖ్యాకములైన వ్యక్తుల మూర్తుల లోను నాత్మవిభూతుల లోను ప్రకృతి శక్తులలోను రూప నామములలోను గల్గు సతతములగు మార్పులచే జావు పుట్టుకలచే సుఖ దుఃఖములచే నేమాత్రము గలత బెందక, సాధక బాధక బాధకములు పొందక వికారము లొందక నిర్లిప్తుడై కూటస్థుడై పక్షపాత రహితుడై వెలయు నఖండ స్వరూపుని జ్ఞానమే యీ జ్ఞానము. ఆ యఖండ స్వరూపుడు నిరాకారుడు నిర్గుణుడు మాత్రమే గాదనియు బ్రకృతిలో సతతము మార్పుచెందు శక్తి యాతడే యనియు ప్రతిరూప నామముల కనుసరణీయముగ స్వకీయ రూప నామముల దాల్చు నివాసి యనియు దనశక్తియొక్క కార్య కలాపమునకు గక్ష్యలకు ననుసర ణీయముగ స్వకీయ వృత్తులను దాల్చు

వాడనియు చేతనా చేతనములలోను, మానవ, పశు, పక్ష్యాదులలోను నివసించు వాడతడే యనియు జ్ఞాని జ్ఞేయము లాతడే యనియు నాత్మయు మనః ప్రాణ శరీరము లాతడే యనియు స్థావర జంగమము లాదిగా గల సమస్త వస్తువు లాదదేయనియు ఇవన్నియు దానై గూడ వీని కంటె తానెన్నోంతలో నెక్కువయై సర్వదా వెలయు చున్నాడను జ్ఞానమే యీ జ్ఞానము, భగవంతుడు నిర్గుణుడు సగుణుడు మరియు నీ రెంటికి నతీతుడను జ్ఞాన మత్యవసరము.

"కనుక సత్యముయొక్క పక్షములలో నీ పక్షముమీదగాని యీ పక్షముమీద గాని పక్షపాతము వహించి కాలూదు కొనిన యీ యోగ మభ్యసింప జాలవు. ఏ భగవంతుని నీవు గనుగొన వలయునో యే యాత్మను నీ వన్వేషించవలయునో యే పరమాత్మ యొక్క సనాతనాంశముగ నీ జీవాత్మయై యున్నదో యట్టివా డేకకాలమున యీ యన్నిపక్షములై యున్నాడు. ఏక కాలమున వీనినన్నిటిని బరమోత్కృష్ణ మైన యద్వితీయతలో నీవు తెలిసికొన వలయును. ఏక ఘడియలో వీని నన్నిటిలో బ్రవేశించి యన్ని పరిస్థితులలోను నన్ని విషయములలోను నా పరంధామునే వీక్షింపుము. ఆతడు ప్రకృతిలో కేవలము జనన మరణము లొందు పురుషుడు మాత్రమే యైన యెడల నెడతెగని విశ్వగతావిష్కారము మాత్రమే పరమావిధియై యుండును. ఈ యొక్క పక్షమునకే నీభక్తిజ్ఞానముల నిర్ణీతము చేసికొనిన నీవు నీ మూర్తి మత్త్వమును, మరియు దాని సతత చంచల రూపములను దాటి యావలి కేగజాలవు, ఇట్టి సిద్ధాంతము పైన నీ వాధారపడిన యెడల జనన మరణములతో గూడుకొని తుది మొదలు లేక చక్రాకారముగ బరిభ్రమించు ప్రకృతికే బంధీకృతుడ వగుదువు. అయితే నీవు కాలచక్రములో బరంపరగ నావిష్కార మొందు జీవ సంచలనము మాత్రమే కావు, నీలో నిరాకారమైన నిర్గుణాత్మ కలదు. అది నదీ ప్రవాహమువలె ప్రవహించు నీ మూర్తి మత్త్వమును భరించు చున్నది. అది భగవంతుని యొక్క విశాలమైన నిర్గుణ తత్త్వములో చేరియున్నది, ఈ సాకార నిరాకారముల కతీతము గను నిక్కడ నీ మూర్తి మత్త్వమును కాధార భూతములైన యీజోడు బాయని సగుణ నిర్గుణ తత్వముల బాలించుచు చావుపుట్టుకలు లేనట్టియు—ననిర్వచనీయ మైనట్టియు—సర్వోత్కృష్టతలో నీవు నాశ రహితుడవై పరమోత్కృష్టుడుగ నున్నావు.

"క్రియారహితమైనట్టియు సృష్టి నిర్మాణ శూన్యమైనట్టియు సనాతన నిర్గుణాత్మయే పూర్ణ సత్యమని ప్రతిపాదించిన యెడల ప్రపంచము—నీ యాత్మయు

నేలాటి యాధారములేని చిత్త మాయాత్మకములగును. ఇట్టి యేకైక పక్షమునకే నీ భక్తిజ్ఞానముల నర్పితము జేసిన జీవితమును కర్మను సన్యసించుటే పరమావిధి యగును. కాని ప్రపంచములో భగవంతుని యునికియు – నీ యునికియు రెండును సత్యములేగాని కల్పితములు కావు. ప్రపంచము మరియు నీవు నా పరమాత్మ యొక్క నిజమైన విభూతులుగను నావిష్కారములుగను నున్నారు. కనుక జీవితమును స్వీకరింపుము. దానిని నిరాకరించకుము. సనాతనాంశమైన యీ నిర్గుణాత్మ తత్త్వములో భగవంతుని సారూప్య మొంది నీ యాధ్యాత్మిక మూర్తిమత్త్వమునకు స్వకీయమైన యఖండరూపుని యారాధనచే భగవంతున కున్ముఖుడవై దేనికొరకు నిర్దేశింపబడి నీ జీవభూత మవతారము దాల్చెనో దానికొరకు నీ జీవ రథమును కర్మాచరణోప కరణముగ – భగవచ్ఛక్తి యంత్రముగ నుపయోగింపుము. ఈ జీవభూతము నిజతత్వములో నెల్లప్పటికి గర్మాచరణ యంత్రముగనే యున్నది. కాని యపరా ప్రకృతి సంజనితమైన యహముచే నీ నిజసత్త దూషితమై ప్రజ్ఞావిహీనమై మాలిన్య మొంది భగవాను నంగహీనునిగ నావిష్కరింప జేయుచు లుబ్ధపరచు చున్నది. దానిని బ్రజ్ఞాయుక్త యొనర్చి మాలిన్య రహిత మొనర్చుము. నీ యహముచే నీ నిజసత్తను వికారములు జెందనీయక భగవంతుని పరమోన్నతాధ్యాత్మిక స్వభావము యొక్క శక్తిగా నొనరించి యాతని యిచ్ఛాక్రియలకు నుపకరణములుగ జేయుము. ఈ విధముగా నీవు నీ సత్తయొక్క స్వకీయ కృత్స్న సత్యములో మనుగడ కల్గి యుందువు. మరియు కృత్స్న భగవ ద్దైక్యతను బొందగలవు. ఇది యే కళంకము లేని పూర్ణయోగము.

"సర్వోత్కృష్టుడు పురుషోత్తముడు. పరిణామమున కంతటికి నతీతుడుగ నుండు సనాతనుడు. దేశకాల నిమిత్తములచే గట్టుపడక వానికి నతీతుడుగా నుండు నఖండస్వరూపుడు. ఆతని యనంత గుణములచే గాని – రూపనామములచే గాని బంధీకృతుడు గానట్టి యాద్యంత రహితుడు. అట్లని యాతనికి తన పరమోత్కృష్టత రహితుడు. అట్లని యాతనికి తన పరమోత్కృష్ట సనాతనత్వములో నిచ్చట సంభవించువాని నన్నింటితో సంబంధ బాంధవ్యములు లేనట్లును ప్రపంచము నుండియు – ప్రకృతి నుండియు – వేరు పడినట్లును, యీ జీవ భూతముల నన్నింటిని త్యజించి వానికి దూరస్థుడుగ నాత డున్నట్లును దలంచరాదు. ఆత డనిర్వచనీయమైన పరమోత్కృష్ట బ్రహ్మస్వరూపుడు. ఆతడు రూపనామ క్రియలులేని నిర్గుణాత్మ స్వరూపుడు. రూపనామములతో గూడుకొనిన సకల భూతకోటియు నాతడే.

ఇక్కడ గాన్పించు జీవభూతములు, ప్రాణభౌతికములు, పురుష ప్రకృతులు ప్రకృతి యొక్క క్రీడలు నాతని యఖండ నాశ రహితమైన యునికియొక్క యంశములు గను ప్రవృత్తులుగను నున్నవి ఆతడు పరమోన్నత మైన సర్వోత్కృష్టాత్మ స్వరూపుడు. సర్వము నాతని నుండియే పరిణామము లోనికి వెడలు చున్నవి. అఖిల రూపములు దనరూపములు గను, దన యాత్మశక్తులుగను ఉన్నవి, అద్వితీయుడై యాత డంతట వ్యాపించి యెక్కువ దక్కువలులేక నిరాకారుడై మానవ, పశు పక్ష్యాది చేతనములలోను – నచేతనములగు వస్తుగణముల లోను – ప్రకృతియొక్క ప్రతి శక్తిలోను వెలయు చున్నాడు. ఆతడు పరమాత్మ స్వరూపుడు. ఈ యేకై కాత్మయొక్క యెడతెగని యగ్నికరణములే సర్వ జీవాత్మలు, జీవభూతములు వాని వాని యాధ్యాత్మిక మూర్తిమత్త్వము నందలి యా యేకైక పురుషునియొక్క సనా తనాంశములు. పరిణామము పొందిన సకల స్థితికి నాతడే శాశ్వతమైన యధిపతి, సకల ప్రపంచములకు వానలోని జీవభూతముల కన్నింటికి నాతడే సార్వభౌముడు, సర్వ కర్మల నుత్పన్నము జేయునటి సర్వశక్తియుతు డాతడే. కాని తన కర్మలచే నాతడు బద్ధుడుగాడు. సర్వ కర్మలు, ప్రయత్నములు, యజ్ఞములు, నదీ నదంబులు సముద్రుని జేరు నట్లాతనినే జేరుచున్నవి. అన్నిటిలో నాతడున్నాడు. అన్నియు తనలో నిమిడి యున్నవి. అన్నియు దానేయై యుండియు వాని కన్నిటికి నతీతుడుగ నుండుచు దన సృష్టి కలాపముల చేత దన యఖండ స్వరూపము పరిమితము చేయక యున్నాడు– ఆత డనిర్వచనీయమైన సర్వోత్కృష్ట దివ్యమూర్తి, ఆత డవ తారమూర్తిగ క్రింది కవతరించును. విభూతిలోని దనశక్తి మూలమున నాతడు దన్ను దాను వ్యక్తీకరించు కొనును. ప్రతి మనుజునిలో గుప్తమైయున్న భగ వంతు డాడడు, మానవు లారాధించు దేవత లందరు నా యేకైక నాధుని యొక్క మూర్తులు — రూప నామములు — బుద్ధి కల్పిత ములగు శరీర ములుగ — నున్నారు, తన యఖండమగు నునికిలోదన యాధ్యాత్మిక మూల తత్త్వము నుండి యా పరమేశ్వరుడు ప్రపంచమును వ్యక్తీకరించి యున్నాడు. మరియు ప్రపంచములో నానావిధ రూపములుగ దన్నుదానే యావిష్కరింప జేసి కొని యున్నాడు, సకలము నాతని శక్తులే – మరియు నాతని రూపములే. అతని యొక్క శక్తులకు – రూప నామముల కంత్యములేదు, ఎందుకన నాత డనంతుడు, అఖండుడు. అంతట వ్యాపించి భరించుచున్న దన నిర్గుణాత్మయొక్కయునికిచే నే వ్యక్తికిగాని, వస్తువునకుగాని, సంఘటనమునకు గాని, విషయమునకు గాని, పక్ష పాతము చేతను నిచ్ఛా ద్వేషముల చేతను ననురాగము చేతను గట్టుబడక గాల

చక్రములోని ఈ యఖండ పరిణామమును ప్రపంచమును నెక్కువ తక్కువలు లేక ప్రబోధించుచు భరించు చున్నాడు. ఈ యెక్కువ తక్కువలులేని యచ్ఛపు నిర్గుణాత్మ క్రియాచరణ లేని దైనను బ్రపంచములోని వస్తుసముదాయము యొక్క సకల కర్మలకు నాధారమై యున్నది. అట్లేయున్నను నది సర్వోత్కృష్ట మైన పరమాత్మ స్వరూపము. ప్రకృతియని మనచే బిలువబడు నాతని చిచ్ఛక్తి మూలమున బ్రపంచము యొక్క కార్యకలాపము నంతను దానే - విశ్వగతాత్మగను - కాల రూపుడుగను బరిణమించి - తన యిచ్ఛానుసారము నడపించుచు - నియమించు చున్నాడు. సృష్టిస్థితి లయకారు డాతడే ప్రతి జీవభూతము యొక్క హృదయాంతరాళములో నాతడు పవిష్టుడై యున్నాడు. సర్వత్ర వ్యాపించి విశ్వగతుడైనట్టి స్థానమున కన్నను నేమాత్రము దక్కువ కాని నవ్యక్తమగు స్థానము నుండియు - నవ్యక్తశక్తియై దన యిచ్ఛాశక్తి మూలమున దన యభేద్యమగు రహస్యము యొక్క పొరకడల కొన్నింటిని ప్రకృతి గుణములుగను - ప్రకృతి యొక్క కార్య నిర్వహణ శక్తిగను - వ్యక్తీకరించుచు - బ్రతిజీవ భూతమును - వస్తువును - వేరు వేరుగ - దాని జాతి కనుగుణముగ దీర్చి దిద్దుబాటు జేయుచు సకల కర్మల ప్రవేశపెట్టుచు బోషించు చున్నాడు. పరహాత్మనుండి వెడలు నిట్టి విశ్వాతీత ప్రథమ సృష్టియు - జీవగణములలోను వస్తు సముదాయము లోను నాతని విశ్వగత - మరియు వ్యక్తి గత - సతతావిష్కారము - ప్రపంచము యొక్క ప్రవర్తన నతి విగూఢము జేయుచున్నది.

భగవానుని కీ మూడు విధములైన స్థితులనాది నుండియు నెల్లప్పటికి నున్నవి. ఉనికిలో నున్న సర్వమున కాధార భూతముగను - బ్రాపుగను నచలుడగను నిర్గుణాత్మగను నాశ రహితుడగను సనాతనుడగను సనాతనుడ గను నెల్లప్పటికి దుది యెరుంగక వెలయు చున్నాడు. ఈ జీవ భూతము లన్నిటి నావిష్కరింప జేయుచు బ్రకృతిలో సతతము మార్పుజెందుచు నెల్లప్పటికి నంత్యము లేక వెలయు చున్నాడు. ఏక కాలమున నీ సగుణ నిర్గుణాత్మలు గాగల విశ్వాతీత భగవంతుడు యెల్లప్పటికి నాద్యంతములు లేక వెలయు చున్నాడు. ఆతడు క్రియారహితమైన యచ్ఛంపు టాత్మగ నుండగలడు. తత్సమయముననే బ్రపంచ యుగములయొక్క జీవము గను - క్రియా సమేతమైన యాత్మగను - నుండగలడు. ఎందుకన యీ రెంటి కంటెను - మరియు నీ రెంటిని వేరు వేరుగ గమనించినను లేక జోడించి గమనించినను నాత డెక్కువ ముగుటయే గాక భిన్నుడుగా గూడ నున్నాడు. మనలో

నున్న జీవు డీ యాత్మయొక్క ప్రత్య గాత్మగను యీ పరమాత్ముని యొక్క జ్ఞాన యుక్తమైన శక్తిగను నున్నాడు. మన జీవాత్మ తన మిక్కిలి యంతస్థమగు నాత్మలో నంర్భూత మైన భగవంతుని సమగ్రముగ భరించు చున్నాడు. మరియు ప్రకృతిలో విశ్వగత భగవంతుని యందు నివసించు చున్నాడు – తాత్కాలిక మైన సృష్టి కానేరదు. నాశరహిత మైన ఆత్మలో నాశరహితమైన యఖండములో – నాశరహితమైన జీవాత్మ – క్రియా సమేతుడై మెలగు చున్నాడు.

“మనలోనున్న యీ ప్రజ్ఞాయుక్తమైన జీవాత్మ యాత్మయొక్క యీ మూడు పరిస్థితులలో నేదాని నైనను స్వీకరించ గలదు. మనుజుడు సతతములగు మార్పులతో గూడుకొనిన ప్రకృతిలోనే మనియుండ గలడు. తన నిజాత్మను – దనలో నున్న భగవానుని మైమరచి ప్రకృతిని మాత్రమే యెఱుకగల్గి యుండును. ఆతడామెను యంత్ర సమానమగు నిర్వహణ శక్తి గను – మరియు సృజన శక్తిగను జూచుచు దాను నితరాదులు, నామె సృష్టిజాలములో శిశువులుగ దలపోయిచుండును. ఆమె ప్రపంచములోని జీవులందరు భిన్న భిన్నులగను నహంప్రధానులుగను గాన్పింతురు. ఈ విధ మున నుపరిభాగము నందే మనుజుడు జీవనము గడుపుచున్నాడు. ఈ తీరున వాడు ప్రవర్తించు నంతకాలము – మరియు నీ బాహ్య చైతమతిక్రమించి తనలో నంత ర్భూతమైన దానిని తెలియునం వరకు – వాని యాలోచనా పాటవ మంతయు – మరియు వాని వైజ్ఞానిక శాస్త్రము సహితము – తెరల పైనను – నుపరి తలంబుల పైనను – వెదజల్లబడిన జ్ఞానతేజము యొక్క మైనీడల బోలియుండును. ఈ యజ్ఞానము సంభవనీయ మైనది, సంభవనీయ మైనదేకాదు విధించబడినదిగూడ. ఎందుకన నంతస్తులోనున్న భగవాను దన యోగమాయచే మనకు మరుగుపడి యున్నాడు, ఆతనియొక్క విశేషసత్యము మన దృష్టికపహృతమై యున్నది. ఎందుకన నాతడు దన సృష్టిజాలములోను – ప్రతిరూపములోను – బాక్షి కావిష్కరణములో నైక్యమై దనస్వకీయ ప్రకృతియొక్క మాయాచరణలలో మనస్సును లీనము జేసియున్నాడు, ఈ అజ్ఞానము సంభవనీయమగుటకు మరియొక కారణ మేమన చేతనా చేతనముల కన్నింటికి మూలాధారమైనట్టియు – నాశరహత మైనట్టియు నగు నాధ్యాత్మిక ప్రకృతి బాహ్యరూపములందావిష్కరింపలేదు. బాహ్యమందు మనకు గోచరించు ప్రకృతి – మనఃప్రాణ శరీరేంద్రియ ములలో ప్రవర్తించు ప్రకృతి యపరా ప్రకృతి. అది పరాప్రకృతి నుండి వెలువడివన నికృష్టశక్తి, అది యైంద్రజాలకుని వలె నాత్మయొక్క రూపము

లను సృష్టించుచు - దద్రూపములలో నాతనిని మరుగు పరచుచు-సత్యమును దాచుచు సత్యమును దాచుచు - మనుజులను వేషధారులుగ జేయుచున్నది. ఈ నికృష్టశక్తి భగవంతుని సంపూర్ణ శక్తిని, యౌన్నత్యమును, నానందమును. మాధుర్యమును, నావిష్కరింప చేయజాలక తక్కువయైన వికార రూపముల మాత్రమే సృష్టించ గలదు. మనలోనున్న యీ ప్రకృతి యహముయొక్క మాయగను, ద్వంద్వముల యొక్క జిక్కుగను - నజ్ఞానముతోను త్రిగుణములతోను నల్లబడిన సాలీని గూడు గను నున్నది. మనుజుడు తన జీవాత్మను, ప్రత్యగాత్మగను, కనుగొనక మనఃప్రాణ శరీరముల యుపరి భాగముననే నివసించు నంతవరకు తన స్వస్వరూపమును గాని ప్రపంచము యొక్క నిజ తత్వమునుగాని భగవంతునిగాని చూడజాలడు. మరియు నీ మాయను దాటజాలడు. దానిలోనే యాత డీదులాడుచు - దాని రూప నామము లతో దానేమి చేయగల్గునో దానినే యాచరించి తీరవలయును.

ప్రకృతము మనుజుడు నివసించుచున్న తన నికృష్ట స్వభావపు ధోరణి నుండి తిరుగు మొగము దాల్చుటకు - వెలుగుగా కనబడు ఈ యంధకారము నుండి మేల్కాంచుటకు - నాశ రహితమైనట్టియు శాశ్వత మైనట్టియు నచలాత్మస్థితియొక్క దేదీప్యమానమైన సత్యములో మనియుండుటకు సాధ్యమగును. అట్టిది సాధించిన మనుజుడు తన ఇరుకు చెరసాలైని మూర్తిమత్తమునకు బంధీకృతుడు గానవసరము లేదు. క్షుద్రఫలితమునకై యాలోచించు నట్టియు కార్యకలాపము లాచరించు నట్టియు సుఖదుఃఖముల ననుభవించు నట్టియు పోరాటమునసల్పు నట్టియు ప్రయాసపడు నట్టియు నీక్షుద్రాహంకారము దానే యని భ్రమింపడు. విశుద్ధాత్మ యొక్క స్వేచ్ఛా సమన్విత నిర్గుణతలోను విశాలత లోను నాతడు లీనమగును. బ్రహ్మము దానే యగును. సకల జీవకోటిలో నున్న యేకైకాత్మయే దానని యెఱుక కలిగి యుండును. తన యహంజ్ఞాన మంతరించును. ద్వంద్వములచే నేమాత్రము గలత జెందడు. ఒకవేళ యీ విషయ వాసనలు కొద్దిగ దనలో నిలువరమున్నను వానిని ప్రకృతి గుణ విశేషములుగ దిలకించునేగాని తన నిజాత్మకు సంబంధించినదిగ భావింపడు. ప్రకృతి మాత్రమే యంత్రసమానముగ పనిజేయుచు దన బొమ్మల నన్నింటిని యాడించు చున్నది. అచలుడై ప్రకృతి క్రీడలచే లిప్తుడుగాక సంపూర్ణ సమత్వము వహించి వానిని దిలకించుచు నానికంటె తాను భిన్నుడ నని యెఱుకకలిగి యుండును. ఈ యాధ్యాత్మిక స్థితి చలింపని ప్రశాంతిని స్వేచ్ఛను జేకూర్చును గాని క్రియా పూరిత మైన దివ్యత్వముచుగాని కృత్స్నతను గాని చేకూర్చ జాలదు. ఇట్టి యుప

లబ్ధి గొప్పయాధ్యాత్మికాభివృద్ధియని చెప్పనగును. కాని యది సమగ్రమైన భగవత్ జ్ఞానము మరియు నాత్మజ్ఞానము కానేరదు.

"సర్వోత్కృష్టతలో మరియు కృత్స్న భగవానునిలో నివాస మేర్పరచు కొన్నప్పుడే కళంకములేని పరిపూర్ణత చేకూరగలదు. అప్పుడు భగవదంశమైన మనుజుని జీవాత్మ భగవానునితో నైక్య మొంది యభిన్నుడయ్యు నాతడు దన జీవాత్మను సకలము నిశ్శబ్దముగ భరించుచు తన్నుతాను శాశ్వతమగు మార్పుజెందని యాత్మగ దిలకించును కాని ప్రకృతి త్రైగుణ్యాను సారము యంత్రము వలె ప్రవర్తించు శక్తిగ దిలకించక దానిని చిచ్ఛక్తిగను పరిణామములో నున్న భగవచ్ఛక్తిగనుఁ బరిగణించుచును. ఆత్మయొక్క కార్యకలాపమునకు నపరాప్రకృతి మూల కారణము కాదని పరికించును. భగవంతుని యత్యున్నత మైన పరాప్రకృతిని యెఱుక కలిగి యుండును. మనః ప్రాణశరీరములలో నవక తవకలు రూపనామము లొందు వానికన్నిటికి పరాప్రకృతియే మూలస్థాన మని గోచరమగును. నికృష్టమనోభూమిక నుండి యీ పరాప్రకృతి స్థానమున కుద్గమించి యహముయొక్క యన్ని రూపాంతరముల నుండి విముక్తుడగును. ఆధ్యాత్మిక పురుషునిగ దన్నుదా నెరుంగును, మూలాంశ మందు దాను సకల జీవభూతములు నొక్కటే అనియు, దనక్రియా సమేత మైన స్వభావములో దానొక భగవచ్ఛక్తిననియు, సర్వోత్కృష్టాఖండ రూపునియొక్క నాశరహిత మైన యాత్మయనియు నెఱుకగలిగి యుండును. సకలము భగవంతుని లోను భగవంతుని సకలము లోను వీక్షించును. సకలము వాసుదేవ రూపముగ దిలకించును. ద్వంద్వములగు సుఖదుఃఖముల నుండియు, నిచ్ఛా ద్వేషముల నుండియు, నాశా నిరాశల నుండియు, పాప పుణ్యముల నుండియు విముక్తుడగును. ఇంతటి నుండి యాతని జ్ఞాన చక్షువునకు నింద్రియములకు సర్వము భగవదిచ్ఛగను భగవత్ కార్య కలాపముగను గోచరించును. విశ్వగత చైతన్యాంశముగను శక్తిగను నాత్మ స్వరూపుడుగను ప్రవర్తించును. సర్వోత్కృష్టమైన దివ్యానంత సంతోషములతో నిండి నిటిడీకృతు డగును. ఆతని ప్రవర్తన దివ్యప్రవర్తనగ బరిణామ మొందును. అతని స్థితి యత్యున్నతమైన బ్రాహ్మీస్థితి యగును.

"ఎవ్వరు వారిలో నంతర్భూత మైన దివ్యవాణిని చెవియొగ్గి యాలకించ గలరో, యెవ్వరిట్టి భక్తిజ్ఞానములకు శక్తియుతులో వారందఱ కిదియే చక్కని సదుపాయము. ఇదియే ముక్తిమార్గము. ఇదియే పరిపూర్ణతయని నేను ఘంటాపద

ముగ నుడువు చున్నాను ఇట్టి యున్నతోన్నత స్థానమున కుద్గమించుటకు ప్రధమ. నియమము – మూలమైన యాదిమార్గ మేదన – నీ యపరా స్వభావమునకు జెందిన సర్వస్వమునుండి విముఖుడై యేది నీ బుద్ధికంటెను మనోహృదయముల కంటెను శరీరేంద్రియముల కంటెను ఉన్నతమై యున్నదో నట్టిదానిలో మనోబుద్ధుల నేకాగ్రతచే బాదుకొని యుండుము. ప్రధమమున సకల భూతములలో భేధరహితమైన గుణ విశేషములేని శాశ్వతమైన యచల స్వరూపుడగు నీ నిర్గుణాత్మ వైపుకు మరలుము. నీ యహములోను మనోవృత్తులలోను నీవు నివసించు చున్నంత వరకు నిజమైన పర్యవసానమునకు రాకయాడిన యాటయే యాడుచు బాడిన పాటయే పాడుచుదుది యెరుంగక ప్రవర్తించెదవు. నీ హృదయమునకు – దాని యిష్టాయిష్ట ములకు – నీ యింద్రియములకు – వాని నాకర్షించు విషయములకు నతీతముగ నీ బుద్ధిని యంతర్ముఖము జేయుము. మనస్సునకు దాని యాశయములకు ననురాగ ములకు బంధీకృతమైన దాని తలంపులకు నాలోచనలకు నతీతముగ నీబుద్ధిని నూర్ధ్వ ముఖమునకు నారోహణ మొనర్చుము. నీలో సనాతన మైనట్టియు – నెల్లప్పటికి వికారము జెందనట్టియు – స్థిరత గాంచినట్టియు – చలనము లేనట్టియు – సమమై నట్టియు – సకల వస్తువులకు మనుజులకు సంఘటన ములకు నిష్పక్ష పాతముగ నుండునట్టియు – నేకార్యముచేగాని సాధక బాధకరముల నొంద నట్టియు – ప్రకృతి రూపనామములచే నేమాత్రము మార్పు దేందనట్టియు – నగు దానిని గనుగొనుము. ఆదియే నీ వగుము. దాని సారూప్య మొందుము. నాశ రహితమైన యాత్మరూపము దాల్చుము. బ్రహ్మము నీవే యగుము. ఇట్టి యాధ్యాత్మికానుభవము నీలో శాశ్వత ముగ నెలకొని సోహంరూపుటవైన నీ మనో నిర్మితమూర్తిమత్త్వముయొక్క బంధములనుండి విముక్తుడ వగుదువు. నీ ప్రశాంతికి జ్ఞానమునకు భంగము వాటిల్లి కుండ భద్రత గాంచెదవు. నీ యహమంతర్ధానమగును.

“ నీ యహమునకు గాని, దానికి జెందిన దేనికి గాని నీవు కట్టుబడి ప్రాకు లాడుచు దలపోయుచు దోహద మిచ్చు చున్నంతవరకు నీ సత్తను నిర్గుణోపాస కునిగ జేయుట దుస్సాధ్యము. కోర్కెయు, నాకోర్కెనుండి యుద్భవించు కామో ద్రేకములు – నహముయొక్క ముఖ్య సూచనలనియు – విడదీయరాని జటిల బంధ మనియు దెలియుము. “నేను” “నాది” యను బేధ భావములు కల్పించునది కోర్కెయే. మరియు ద్వంద్వములగు తృప్త్య సంతృప్తులకు – యిచ్ఛా ద్వేషము లకు – రాగద్వేషములకు–నాగ్రహ తాపములకు – జయాప జయములకు–నహము

మూలమున నిన్ను బంధీకృతుని జేయునది కోర్కె యేయని యెఱుంగుము. కోర్కె యెల్లప్పటికీ మనో వికల్పమును - బుద్ధి మాంద్యమును - నవక తవకలతో గూడుకొనిన వస్తు సందర్శనమును - నపహృతమైన జ్ఞానవికాసమునుకలుగ జేయును. పాపమునకు - పోరాటమునకు బలమైన మూలకారణము కోర్కెయు. దాని యిచ్ఛాద్వేషములనియు గుర్తెరుంగుము. నీలో కోర్కె యనునదున్నంత వరకు మచ్చలేని భద్రమైన ప్రశాంతి - స్థిమితమైనజ్ఞాన తేజము లరుదై యుండును. సక్రమమైన పురుషుడు నీలో నెలకొన జాలడు. ఎందుకన నాత్మను లుబ్ధవరచునది కోర్కెయే. సక్రమమైన యాలోచనకు - భావనకు క్రియకు పునాది యుండనేరదు. కోర్కె యెటువంటిదైనను - మంచిది కాని - చెడ్డదిగాని బుద్ధిబల సంపన్నులకు సహితము ప్రక్కలో బల్లెమని యెరుంగుము. ఏకక్షణమందైనను సూక్ష్మరూపకముగ గాని - మనస్సుచు దానింతకు పూర్వమే యుపలబ్ధి పొందిన భద్రమైన యున్నతస్థానము నుండికూడ దలక్రిందులుగ పడద్రోయును. ఆధ్యాత్మిక పరిపూర్ణతకు గోర్కెయే ప్రబల శత్రువని తెలియుము.

"కనుక కోర్కెను బరిత్యజింపుము. విషయభోగములను వస్తువులపైనను రాగమును ద్యజింపుము. మనో విషయములు గను - నింద్రియ విషయములుగను - బాహ్యమునుండి నిన్నను సంధానము జేయుచు నాహ్వానము జేయువాని సన్నిటినుండి వేరుపడుము. కామోద్రేకముల యురవడిని బహిష్కరించుటకును సహించు కొనుటకును నేర్పుగలిగి యుండుము. ఆ కామోద్రేకములు నీ యింద్రియములను కలవరపెట్టుచున్నను నీ స్వభావముయొక్క యే భాగము కూడ సాధక బాధకము లొందక విరమించు కొన్నంతవరకు నీవు నీ యంతరాత్మ యందు భద్రముగ నుపవిష్టుడవై యుండుము. తద్విధముగనే సుఖ దుఖములయొక్క బలోపేతమైన దాడులను - వెక్కిరింతలరీతి వాని స్వల్పస్పర్శలను గూడ సహించి వానిని దూరముగ పారద్రోలుము. ఇష్టానిష్టములను గూడ దిగనాడుము. అనురాగద్వేషముల ధ్వంసము. జుగుప్సను - నసూయను నామూలాగ్రముగ నరకివేయుము. ఈ పరిస్థితులన్నింటికి మరియు విషయ వాంఛలన్నింటికి స్థిమితమైన యుదాసీనత నీ స్వభావములో కలిగి యుండుము, గుణవికారములులేని యాత్మయొక్క ప్రశాంతి స్థిమితములుగల దృష్టితో వీని నన్నింటిని బరికించు చుండుము. ఇట్లు యాచరణవల్ల ప్రకృతియొక్క నానావిధ రూపములైన కార్యకలాపమునకు సతతము రొమ్మొడ్డుచున్న విశ్వగతాత్మ తన సృష్టిజాలమునకు యెట్టయెదుట పోషించు చున్న చలింపని స్థిరతను -

నఖండమైన సమత్వమును బడయగలవు. సమదృష్టితో వీక్షించు చుండుము. నీకు సంభవించు దానినెల్ల సమహిత మనోహృదయములతో స్వీకరింపుము. తద్విధము గనే జయాపజయము లందును – మానావమానము లందును – గౌరవా గౌరవము లందును – నిందాస్తోత్రములందును – మనుజులు నిన్ను శ్లాఘించి ప్రేమించినను లేక తూలనాడీ హింసించినను – ఘటనా ఘటములచే నితరాదులకు సుఖము సంప్రాప్తమైనను లేక దుఃఖము వాటిల్లినను సమహిత చిత్తుడువై యుండుము. సజ్జనులను దుర్జనులను – వివేకులను – నవివేకులను – బ్రాహ్మణుని చండాలుని రాజాధి రాజును – క్షుద్రకీటకమును – సమదృష్టితో దిలకించుము, సకల మనుజులను నీతో వారికిగల సంబంధ బాంధవ్య మెట్టిదైనను – శత్రువుగాని – మిత్రులుగాని – ప్రియుడుగాని – యప్రియుడుగాని – సహచరుడుగాని – విరోధికాని – తటస్థుడు కాని – యుదాసీనుడుగాని సమదృష్టితో వీక్షించు చుండుము. ఈ విషయము నీయహమును గలత పరచును. నీయహమునుండి నీవు విముక్తుడవు కావలయును. ఇవన్నియు వ్యక్తిగత సంబంధ బాంధవ్యములు, వీని నన్నిటిని నవ్యక్తాత్మ యొక్క యగాధమైన దృష్టితో బరికించ వలయును. ఇవన్నియు కాలగత వ్యక్తిగత భేదములు. వీనిని నీవు పరికించ వలయునేకాని వీనిచేత సమ్మోహితుడవు గాగూడదు, ఈ భేదములమీద నీ దృష్టిని కేంద్రీకరింపక – యందరిలోను భేద రహితమై సమముగ వెలయుదానిపైనను అన్నియు దానయ్యు నేకమైన ప్రత్యగాత్మ పైనను – ప్రతిజీవభూతములో నున్న భగవానుని పైనను కేంద్రీక రింపుము. మరియు ప్రపంకాముయొక్క శ్రమకు ఫలితార్థ మేవికలిగినను – చేతనా చేతనములలోను – శక్తులలోను – సంఘటనములలోను – మరియు సకల ప్రయత్నములలోను – ఫలితములలోను నెక్కువ తక్కువలు లేని భగవదాజ్ఞ యొక్క ప్రకృతి కార్యకలాపమును వీక్షించు చుండుము.

“నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారము గలిగినను నీలో కర్మకలాప మింకను జరుగుచుండును. ఎందుకన నీలో ప్రకృతి లేక స్వభావ మెల్లప్పటికి గర్మయందే ప్రతిష్ఠతమై యున్నది. కాని నీయాత్మ యట్టి కర్మాచరణమునకు గర్తకాదని ఎఱుక గలిగి భావించు చుండవలెను. కేవలము సాక్షిస్వరూపుడుగ జలనమొందక ప్రకృతి యొక్క కార్యకలాపమును – నామె క్రీడావినోదములను – త్రిగుణముల యొక్క యింద్రజాలమును వీక్షించు చుండుము. నీలో జరగు నీకార్యకలాపము నచలుడవై పరికించు చుండుము. నిన్ను పరివేష్టించి యున్న వారందరిలోను నీ ప్రకృతియే

ప్రవర్తించు చున్నదని గుర్తెరుగుము. నీకర్మాచరణకు మరియు నితరాదుల కర్మా చరణకు ఫలితార్థము నీ విచ్ఛగించిన విధమునకాని - లేక కోరిన విధమున కాని - లేక నితరాదు లిచ్ఛగించిన విధమున కాని - లేక కోరిన విధముగాని - సంభవింప నేరదు. కాని యిక్కడ విశ్వ ప్రకృతిలో నే మహాశక్తి యిచ్ఛాపేతయై ప్రవర్తించు చున్నదో యాశక్తి యిచ్ఛాపేతయై ప్రవర్తించు చున్నదో యాశక్తియే నిరుపమాన బల సమన్వితయై సర్వ ఫలితార్థముల నిర్ణయించు చున్నది, నీకార్యకలాపములోని యిచ్ఛాశక్తి సహితము నీది కాదనియు ప్రకృతి సంబంధించిన దనియు తెలియుము. నీలో నహముయొక్క మిథ్యాభావమునే నీ యిచ్ఛయని భ్రమపడుచున్నావు. ఇది యును గాక ప్రకృతి గత కాలములో నీ స్వభావమందు బెచ్చుగ నభివృద్ధి పరచు టచే ప్రబలత నొందిన గుణ విశేషమే నీ యిచ్ఛను నిర్ణయించు చున్నది. లేక ప్రకృతి యేక్షణమున కేగుణమును ముందునకు దెచ్చుచున్నదో యా గుణతత్వమే నీ యిచ్ఛను నిర్ణీతము చేయుచున్నది. ఆ యిచ్ఛ ప్రకృతినిర్మించిన నీ మూర్తిమ త్త్వము యొక్క క్రీడపైన నాధారపడి యున్నది. అట్లు ప్రకృతి నీలో నిర్మించిన మూర్తిమత్త్వము నీ నిజస్వరూపము కాదు. ఈ బాహ్యమూర్తిమత్త్వమునకు విము ఖుడవై దాని నుండి వేరు పడి ప్రశాంతమైన నీ యంతరాత్మను జేరుము. నీ యంత రాత్మను క్రియా శూన్యమైన పురుషునిగ గనుకొందువు. కాని ప్రకతి తన గుణధర్మ ముల ప్రకారము సతతము కర్మయందు నిమగ్నురాలైనట్లు గూడ గనుగొందువు. ఈ యాంతరంగిక క్రియాశూన్యమైన ప్రశాంతిలో బాదుకొలి యుండుము, కర్త నీవు కావని భావింపుము, గుణముల ప్రవర్తనచే గలుగు తారుమారులకు లోనుగాక ప్రకృతి క్రీడ కుపరిభాగమున నీలో నీ వుపవిష్టుడవై యుండుము, నిర్గుణాత్మ యొక్క పవిత్రతలో భద్రముగ నివసించు చుండుము. నీ మనఃప్రాణశరీరము లలో మాటిమాటికి చెలరేగు ప్రాణాంతకమైన తరంగములెచే కలత జెందక నీ యంతర్మా యందు మనియుండుము.

"ఇట్టిది నీవు చేయగల్గిన గొప్ప విముక్తిని - విశాల స్వాతంత్ర్యమును నగాధమైన శాంతిని బడయ గలవు. అప్పుడు సనాతనమైన నీ యాత్మయొక్క యునికి నాశరహితమైన భగవానునిచే నావేశింపబడి మనఃప్రాణ శరీరములపై నాధారపడక స్వతంత్రత గలిగియున్నట్లు గనుగొందువు. ప్రకృతియొక్క ప్రతి క్రియలచే వికారము లొందనట్టియు - కామోద్రేకముల చేతను - పుణ్య పాపముల చేతను - సుఖ దుఃఖముల చేతను - మాలిన్య మొందనట్టి యాధ్యాత్మిక సత్తనీలో

భద్రమై యుండును, అప్పుడు నీ యానందము కొరకు మరియు కోర్కెల కొరకు నీ వనిత్య మైనట్టి బాహ్యప్రాపంచిక విషయములపై నాధారపడక నాశరహితమైన ప్రశాంత మగు నాత్మయొక్క స్వయంభువువైన నిత్యానందమున పొల్గొందువు. అప్పుడు నీవు మనోమయ కీటకముగాక మేరలేని యాత్మస్వరూపుడవుగను – బ్రహ్మ స్వరూపుడవు గను నగుదువు. నీ మనో ఆకాశమునుండి సంకల్ప బీజ ముల నన్నింటిని మరియు కోర్కెయొక్క పాదుల నన్నింటిని బహిష్కరించి శరీర ముల యొక్క జనన మరణ రూపములను బారద్రోలి మరణకాలమందు నాశరహిత మైన బ్రహ్మమందు నేకాగ్రత వహించి నిర్గుణాత్మ యొక్క సనాతనత్వములో నైక్యమొంది యఖండ చైతన్యమును బొందగలవు...

''ఈ నిర్గుణోపాసనోపలబ్ధులే యోగముయొక్క సంపూర్ణ సత్యము కాదు. ఈ యుపలబ్ధి యున్నత లక్ష్యమైనను, ఆ యుపాసన యున్నత సాధనమైనను నేను నీకు బ్రతిపాదించునది యీ విషయముకాదు, ఎందుకన నేను నీలో శాశ్వతమైన కర్మాచరణ కారకుడుగ నున్నాను, మరియు నీవు కర్మాచరుణడవు గమ్మని నేను ప్రబోధించు చున్నాను. ఏ ప్రకృతియొక్క యంత్రసమాన మగు కార్యకలాపము నుండి నీ యంతస్సత్త వేరుపడి యుదాసీనుడుగ దిలకించు చుండునో యట్టి కార్య కలాపమును బసవన్న చందమున నామోదించుమని నిన్ను నేనాజ్ఞాపించుటలేదు. కాని నీలోను – నందరిలోను వెలయు భగవానుని కొరకు – మరియు లోక సంగ్ర హణార్థము జ్ఞాన తేజోత్సాహములతో గూడుకొనిన భగవంతుని యుపకరణముగ గర్మ నాచరింపుమని నేను నిన్నాజాపించు చున్నాను, ఉన్నతోన్నత మైన యాధ్యా త్మిక స్వభావముయొక్క పరిపూర్ణతలోని కనుగమించుటకు సాధనముగ బ్రప్రథ ములో నీ కర్మాచరణ స్వీకరింపుమని నేను నీకు చేయు నిరూపణలో కొంత సత్యము లేకపోలేదు. అయినను నీ కర్మాచరణ పరిపూర్ణతకు సాధనమేగాక దాని యంగ ముగ గూడ నుండవలెను. భగవంతుని యొక్క సమగ్రమైన జ్ఞానమునకు నాతని నిగూఢ సత్యమునకు భగవంతునిలో నిశ్శేషముగ నివసించుటకు గర్మాచరణ యొక్క యంగమనుట నిస్సందేహము, పరిపూర్ణతయు – విముక్తియు నీకు జేకూరిన తదు పరి కూడ గర్మాచరణ చేయనగును; మరియు దానిని విడువక సాగించవలెను, జీవన్ముక్తుని ప్రవర్తన – సిద్ధపురుషుని కార్యకలాపము – నీ వనువర్తించ వలసి నదిగ నిన్ను నేను కోరుచున్నాను. ఇంతకుముందు వివరించిన యోగమునకు గొంత యను బంధము చేర్చవలసి యున్నది.

"ఎందుకన నది ప్రథమ పాఠమైన జ్ఞానయోగము మాత్రమే. భగవ దను భవము యొక్క తేజములో గర్మయోగముకూడ కలదు. కర్మలు జ్ఞానముతో నేకము గా గలవు. సమగ్రమైన యాత్మ దృశ్యములోను – భగద్దర్శనములోను ప్రపంచ మంతట భగవత్సాందర్శనములోను – భగవంతునిలో నెల్ల ప్రపంచము వీక్షించుట లోను – జేయబడు యావత్తుకర్మలు జ్ఞానము యొక్క నడక యనియుతేజముయొక్క గమనమనియు నెరుంగుము. కనుక యాధ్యాత్మిక పరిపూర్ణతకు గర్మాచరణ ముఖ్యాంగ మనియు నపరిత్యాజ్యమైన సాధన మనియు దెలియుము. ఏ పరంధాముని నీవు క్రియా రహితమైన నిర్గుణాత్మగ సందర్శించు చున్నావో యట్టి పరమాత్ముడు సకల కర్మలకు మూలకారణమైన వాని గను – సకల ప్రంపచములకు నీశ్వరుడుగను – మనుజుని యొక్క ప్రవృత్తులకు ప్రయత్నములకు త్యాగమునకు నధిపతిగను–నింతింత లని నుడువుటకు నలవికాని క్రియా యుక్తమైన యాత్మగనుగూడ నీవు సందర్శించ గలవు. ఇట్టి జ్ఞానమును ఉన్నతోన్నతమైన యవ్యక్తాత్మానుభవమునకు సంధింపుము. చూపునకు మాత్రము ప్రకృతి యంత్రము తనంతకు తాను స్వతంత్రముగ ప్రవ ర్తించుచున్నట్లు గనబడుచున్నది. కాని యీ ప్రకృతి యుద్దేశ్యములను నిర్ణయించుచు దీర్చి దిద్దుబాటు జేయుచు త్రోవ నడపించుచు నంతర్భూతమైన భగవదిచ్ఛ దానిలో మరుగై యున్నది. నీ మూర్తిమత్త్వము యొక్క యిరుకు క్రంతలో నీవు కూపస్థ మండూకమువలె దల దాచుకొని యున్నంతవరకు నీ యహముయొక్క సంకుచిత దృష్టికి – దాని కోర్కెల యొక్క పోకడలకు పాశబద్ధుడవై – మోహాంధకారమం దున్నంత వరకు నీ వాభగవదిచ్ఛను తెలిసికొన జాలవు. మరియు భావింపజాలవు. జ్ఞానోపలబ్ధిచే నీ యహమునశించి యవ్యక్త రూపుడవైనప్పుడు మరియు నట్టి జ్ఞాన విశేషముచే నీ మనోహృదయములు విస్తరించి నీ యాత్మలోను భగవంతునిలోను సకలము జూడగల్గినప్పుడు, సకల విషయములలోను నీ యాత్మను భగవంతుని సందర్శించ గల్గినప్పుడు మాత్రమే భగవ దిచ్ఛను సంపూర్ణముగ ననుసరించగలవు. ఆత్మశక్తిచే నిచ్చట సకలము రూపము దాల్చుచున్నవి. సకల వస్తువులలోను భగ వంతు డంతర్భూతుడై యుండుట చేతను – ప్రతి జీవభూత హృదయాంతరాళ మందును, భగవంతు డుపవిష్టుడై యుండుటచేతను, సకలము వాని వాని కార్యములు నిర్వహించు చున్నవి. ప్రపంచముల సృష్టికర్త యాతని సృష్టిజాలముచే పరిమితికి బద్ధుడు కాలేదు. కర్మ నియామికుడైన జగదీశ్వరుడు దన కర్మలచే బంధీకృతుడు కాలేదు. భగవదిచ్ఛ దాని కర్మాచరణకుగాని నట్టి కర్మాచరణ ఫలములకు గాని యనురాగముచే కట్టుబడలేదు. ఎందుకన భగవదిచ్ఛ సర్వత్ర సకల బలోపేతమై

యున్నది. కొరతలేక సర్వ మది కలిగియున్నది. మరియు నది సర్వానంద మూర్తియైయున్నది. అయినను నా పరంధాముడు తన విశ్వాతీత స్థానము నుండి క్రిందనున్న దన సృష్టిజాలమువంక తన దృష్టులను ప్రసరించు చున్నాడు. అవతార మూర్తిగ నవరోహించు చున్నాడు. ఇక్కడ నీలో వెలయు చున్నాడు. సకల వస్తువుల నాంతర్యమునుండి వాని స్వభావముయొక్క పోకడలలో నాతడు పరిపాలించు చున్నాడు. అనురాగముచేగాని - యాశా పాశములచే గాని వికారములొందక దివ్య స్వభావముయొక్క పోకడల ననుసరించుచు నీవుకూడ భగవంతునిలో కర్మాచరణ జరిపి తీరవలయును. సమస్త జన కల్యాణమునకై కర్మ నాచరింపుము ప్రపంచాభివృద్ధిని పోషించుటకు - సలదలి జనుల మంచి ప్రవర్తనలో నడిపించుటకు వారల నుద్ధరించుటకు కర్మ నాచరింపుము. విముక్తి పొందిన యోగీశ్వరు డెట్టికర్మ నాచరించునో యట్టి కర్మనే యాచరింప వలసినదిగ నిన్ను నేను మందలించుచున్నాను. భగవంతునినుండీ స్వతస్సిద్ధముగ సెలయేటి ధారవలె బ్రవహించు శక్తియే యీ కర్మాచరణయై యున్నది. అది పక్షపాత రహితమై సమబుద్ధితో కూడుకొనిన కర్మ కలాపము, స్వలాభ శూన్యమైనట్టియు - కామ్యరహితయైనట్టియు కర్మాచరణయై యున్నది.

"ఈ బంధరహితమైన - ఈ పక్ష పాతరహితమైన - ఈ దివ్య కర్మాచరణ విధానములో ఫలములం దాసక్తి వర్జించుట - చేయవలసిన కర్మకొరకె కర్మ నాచరించుట ప్రథమ కర్తవ్యము. ఫలములకు హక్కుదారుడవు నీవు కావనియు జగదీశ్వరుడే వానికి హక్కుదారుడనియు నీవు నీలో గాఢముగ భావించావలెను. నీ కర్మల నన్నింటిని భగవంతునికే యర్పింపుము. విశ్వగత కార్యకలాపములో నే పరమాత్మ యావిష్కరించి తన్ను దానుద్ధరించుకొనుచున్నడో యట్టివానికే నీ కర్మ ఫలముల వదలివేయుము. నీ కర్మఫలముల నిర్ణయించునది యాతని యిచ్ఛాశక్తియే. ఆ కర్మఫలితము లెట్టివైనను - మంచివిగాని - చెడ్డవిగాని - జయముకాని - యపజయముకాని భగవంతుడు తన విశ్వగత యెద్దేశ్యమును నెరవేర్చుటకు వానిని యుపయోగించు చున్నాడు. నీ వ్యక్తిగత యిచ్ఛాశక్తియు మరియు నుపకరణమైన నీ బాహ్యస్వభావము నిశ్శేషముగ గామ్యమును వర్జించి ఫలాపేక్షలేక కర్మాచరణ మందు ప్రవర్తించుట కర్మ యోగము యొక్క ప్రథమసూత్ర మని తెలియుము. ఏ ఫలములను గోరకుము. ఏ ఫలితము నీ కియ్యబడుచున్నదో దాని నంగీకరింపుము. జయమందును, అపజయ మందును - భాగ్య భోగ్యములందును ధారి

ద్రవ్యపు కష్టదశ లందును నిట్టనిలువన వోవు కర్మాచరణ త్రోవలో భయమొందక - కలతజెందక - యిటునటు సంశయింపక ప్రయాణము సాగింపుము.

“ఈ మార్గములో నిది ప్రథమ కర్తవ్యము కంటె యెక్కువైన విశేషము కాదు. ఎందుకన నీవు ఫలములయం దనాసక్తుడు వగుటయేగాక నీ కర్మాచరణ యందు కూడ నీ వనాసక్తుడవై యుండవలెను. నీ కర్మలు స్వకీయమైన వను తలంపు విడనాడుము. నీ కర్మ ఫలముల నేరీతి విసర్జించితివో దద్విధముగనే కర్మలకు యజ్ఞములకు నాథుడైనవానికి నీ కర్మలన్నింటిని కూడ యర్పింపుము. నీ కర్మ విధానమును నిర్ణయించుచున్న దని గుర్తెరుగుము. నీ స్వభావముయొక్క ప్రథమ ప్రవృత్తికి నీ ప్రకృతి యధిపతియై దాని కార్య నిర్వహణ శక్తియొక్క మార్గములలో నీ యాత్మ దృష్టిని - దాని యభివృద్ధిని నిర్ణయించు చున్నది. భగవంతుని మార్గ మనుసరించి నీ మనోజాడల కడ్డముగ ఢీకొని గందరగోళము చేయు నీ స్వ యేచ్ఛను ఎంత మాత్రము ప్రయోగింపకుము. నీ స్వభావమున కనుగుణమగు కర్మాచరణమును స్వీకరింపుము. స్వల్పాతి స్వల్పమైన నీ నిత్యకృత్యము మొదలు మహోన్నతమగు నీ యుద్యమముల పర్యంతము - నీ ప్రతి మనోవృత్తిని - నీ ప్రతి హృదయావేశమును - నీ ప్రతి శారీరక చేష్టను - ప్రతి బాహ్యాభ్యంతర మగు పోకడలను - ప్రతి సంకల్పమును - ఇచ్ఛను - భావమును - ప్రతి యడుగును - విరామమును - పోకడను - నీవు చేయు సకల కార్యములను - సకల యజ్ఞములకు తపస్సులకు నాథుడైనవానికి యజ్ఞభావముతో నర్పింపుము.

“తదుపరి నీవు సనాతనుడైనవాని సనాతనాంశమని యెఱుగుము. ఆతడు లేనిదే నీ స్వభావముయొక్క శక్తులు లేవని దెలియుము. అతని సాక్షికావిష్కారము గానిదెల్ల శూన్యమని గుర్తెరుగుము. భగవంతుని యఖండస్వరూపమే నీ స్వభావములో ప్రవర్థమానమగుచున్నది. నీ స్వభావమును దీర్చునట్టియు - నీ స్వభావములో రూపముదాల్చు నట్టిదియు - నా పరమేశ్వరుని శక్తియేమని దెలియుము. కనుక నీవు గర్తయను భావమును ద్యజింపుము. ఆ పరంధాముడే సకల కర్మలకు గర్త యని దిలకించుము. నీ జీవరథమును నిమిత్తము గను ఉపకరణముగను - శక్తి ప్రవాహమునకు బంటకాల్వ గను నొనడ్చుము. నీ యిచ్ఛ నాతనికే సన్యసింపుము. ఆద్యంతములులేని యాతని యిచ్ఛలో దానిని నైక్యముజేయుము. నీ కార్యకలాపము లన్నింటిని నీ స్వభావమునకు ప్రభువైన విశ్వాతీతునికి నీ యంతరాత్మ ప్రశాంతిలో నర్పణజేయుము. నీలో నహంభావ మీషణ్మాత్ర మున్నను - గామోద్రేకము లేశ

మాత్రమున్నను నిట్టి శరణాగతి నీకు లభ్యపడదు. అహంకార తృప్తిచేగాని - యహంకారేచ్ఛా బుద్ధులచే గాని నీ కర్మాచరణ యణుమాత్రమేని దూషితమైన నీ యజ్ఞము బరిపూర్ణవ జెందనేరదు. అస్థిరత నీలో నేమూల నణగియున్నంత వరకు లేక యజ్ఞానభూయిష్టమైన దడవులాటగాని - పక్షపాతయుత మైన సంప్రతి గాని యున్నవఱకును నీ మహాయజ్ఞము సాంగోపాంగముగ నిర్వహించజాలవు. సకల కర్మలకు - ఫలములకు - విషయములకు - ప్రజలకు సంపూర్ణమైన సమత్వము వహించినప్పుడు - నీ కోర్కెలకు నహమునకు ధాసోహము వహించక యా పరంధామునికే దాసానదాసుడవైనప్పుడు - పరివర్తనము చెందిన నీ స్వభావముయొక్క భద్రతలోను పవిత్రతలోను భగవదిచ్ఛ సకల కర్మల నిర్ణయించుచు భగవళ్ఛక్తి యా కర్మల నిర్విఘ్నముగ నిర్వహించును. అప్రతిహతమైన భగవదిచ్ఛ ప్రతి కర్మను నీ మూలమున దీర్చి దిద్దుపాటు చేయుటకు నీ వనుమతించుట పరిపూర్ణత యొక్క యత్యున్నత మైన భూమిక యనబడును. యోగ యుక్తుడవై చేయు కర్మలచే నిట్టి పరిపూర్ణత చేకూరుచున్నది. ఇట్లాచరించిన యెడల పరమాత్మతో సతత సంధానము గల్గి నీ స్వభావము విశ్వ గమనమును ననువర్తించును. మరియు నున్నతోన్నతమైన యాత్మను బ్రదర్శించును. మరియు నీశ్వరాధీన మగును.

"ఈ విధమైన భకవత్కర్మలు జీవిత విముఖత్వము కంటెను - కర్మల బాహ్య సన్యాసము కంటెను నెంతెంతో శ్రేయస్కర మైనది విముక్తిని బ్రసాదించుచున్నది. సంపూర్ణ బాహ్య సన్యాస మెవ్వరికిని సాధ్యముకాదు. ఆత్మయొక్క విముక్తికి సన్యసించుట సాధ్యమైన కర్మల వర్జించుట యపరిత్యాజ్యమైన నియమము కాదు. ఇదియునుగాక ఇట్టి సన్యాసము ప్రమాద మైన యాదర్శముగ బరిణమించుచున్నది, ఎందుకన సామాన్య మనుజులను పెడత్రోవలకు బ్రోత్సహించును. ఉన్నతోన్నతమైన సత్పురుషుల యాదర్శమునే తక్కిన ప్రజాసముదాయము ననువర్తించుటకు బ్రయత్నించును. దేహధారియొక్క స్వభావము కర్మయందే ప్రతిష్టితమై యున్నందునను - అనాదిగా కర్మరుడైన వాని యిచ్ఛ కర్మాచరణ మైనందునను మహాత్ములు బుద్ధిబల సంపన్నులీ యాదర్శమును ప్రకటించవలెను. వారు ప్రపంచ సేవకులుగ నుండవలెను. ప్రపంచముయొక్క కార్యకలాపము లన్నింటిని తారతమ్యము లెంచక చేయుచుండవలెను - సంతోషోత్సాహములతో గూడిన కామ్యరహితులైన విముక్తాత్మ స్వభావములు గల భగవ స్సేవకులుగ నుండవలెను.........

"జ్ఞాన మఖిలషించు మనశ్శక్తియు - కర్మాసక్తమైన యిచ్ఛాశక్తియు మాత్రమే నీవు కావు. ఆనందము కోరు హృదయము నీలో నున్నది. నీ యాత్మ సంతృప్తి కొరకు కానందముకై బరితపించు నీ హృదయా వేదనలో - దాని తేజములో - శక్తిలో - నీ స్వభావమును ముంచి పరివర్తనము గావించి భగవంతుని తోటి ప్రజ్ఞాయుక్తమైన యానందము కొరకు దాని నుద్గమింప జేయుము. నిర్గుణాత్మోపలబ్ధి దానికి తగిన యానందమును జేకూర్చుచున్నది. అవ్యక్తాత్మానందము కలదు. కాని యది స్వచ్ఛమైన యాత్మయొక్క యొకేయొక యానందము మాత్రమే. కాని సమగ్రమైన జ్ఞాన మానందమును త్రిగుణీకృతము జేయును. ఈ జ్ఞానము విశ్వాతీతానందము యొక్క కవాటములను విస్ఫార జేయుచున్నది. విశ్వగత నిర్గుణాత్మ యొక్క మేరలేని యానందమును వెదజల్లుచున్నది. ఈ పరిణామిములోని నానావిధ రూపములయొక్క పరవశతను నీకున్మీలనము జేయును. ఎందుకన ప్రకృతిలో సనాతనుడైన వాడానందమయ పురుషుడు, ఆ సనాతనుని యంశమైన జీవునిలో నీ యానందము ఆతని మూలకారణమైన భగవంతునిలోను నాతని పరమోన్నతమైన యాత్మలోను పాదుకోబడిన భావోన్మాదమై యున్నది. నిశ్శేషమైన భగవత్ప్రేమారాధనలు విశ్వమును - దానిలోని రూపములను - శక్తులను - జీవభూతములను - యాలింగనము జేసికొనును. అన్నింటిలోను భగవంతుని దర్శించెదవు. కనుగొందువు ఆరాధించెదవు, సేవించెదవు. లేక అద్వితీయములో నున్నట్లు భావించెదవు. కర్మ జ్ఞానములకు మరియు త్రివిధ శాశ్వతానందములకు చూడమణియైన భక్తినను సంధింపుము. ఈ భక్తికి స్థాన మిమ్ము. ఈ యారాధన నేర్చుకొనుము. కర్మ జ్ఞానములతో దీని నేకము జేయుము. పరిపక్వమైన సంపూర్ణత కిది శిఖలమువంటిది.

"ఈ భక్తియోగ మాధ్యాత్మిక విస్తరతను - ఐక్యతను - విముక్తిని జేకూర్చగల విశేష శక్తిని నీ కొసంగ గలదు. కాని భగవజ్ఞానముతో నేకీభవించ గల ప్రేమగ నుండవలెను. కష్టపీడితుడై నపు డాదరణ కొరకు సహాయ్యము కొరకు - కష్టముల బారినుండి విముక్తికొరకు భగవంతు నర్థించుభక్తి యొకటి కలదు. బహుమతుల కొరకు - భగవంతుని సహాయ్య రక్షణల కొరకు - గోర్కెల నీడేర్చు నిధి యని భగవంతు నన్వేషించు భక్తియొకటి కలదు. జ్ఞానతేజముల నర్థించు మూఢ భక్తిగూడ నొకటి కలదు. ఈ త్రివిధరూపములైన భక్తికి నీవు కట్టుబడి నంత వరకు నీ భగవదాకాంక్షా భక్తు లెంత యున్నతోన్నత మైనను ఏంత యుదార సంపన్నమైనను త్రిగుణములయొక్క కార్యకలోపము నీలో విడువక యంటుకొని

యుండును. భగవత్ ప్రేమోపాసి భగవజ్ఞాని కూడ యైనయెడల నుపాసకు డుపాసనా మూర్తితో నైక్య మగుచున్నాడు. ఎందుకన నిట్టి భక్తిజ్ఞానములు గలవాడే భగవంతుని ప్రియుడు మరియు నాత్మచే నేరి యెన్నుకోబడిన మహనీయుడు. భగవంతుని లో లీనము జేయునట్టి భక్తిని నీలో బెంపొంద జేసికొనుము. నికృష్ట స్వభావము నుండి విముక్తిబడి. యాధ్యాత్మికముగ మార్చబడిన హృదయ మపారమైన భగవంతుని యునికిలోగల రహస్యముల నీకు బట్టబయలు జేయును. భగవచ్ఛక్తి యొక్క ప్రవాహమును - మహిమను - స్పర్శను - నీలోనికి గొనితెచ్చును. మరియు నాశ రహితమైన పరవశతయొక్క రహస్యముల నీకు వికసితము జేయును. సంపూర్ణమైన జ్ఞానమునకు సంపూర్ణమైన భక్తియేత్రోవ.

"ఈ సమగ్రమైన భగవద్భక్తి నీలోను సకల భూతములలోను వెలయు భగవానుని హితార్థము సమగ్రమైన కర్మ యత్యవసరమని శాసించు చున్నది. సామాన్య మనుజుడు కోర్కెలు పాపభూయిష్టమైనవో - లేక పుణ్యహితమైనవో - లేక యుచ్ఛమైనవో - మనోభిప్రాయములు సాధారణమైనవో - లేక శ్లాఘనీయమైనవో - కామ ప్రవృత్తులు నీచమైనవో - లేక యుచ్ఛమైనవో - లేక మిశ్రితమైన మనః ప్రాణోద్దేశ్యములో విధించిన రీతిగ గర్మల నాచరించు చున్నాడు. కాని నీ వాచరించు కర్మ కామ్యరహితమై స్వేచ్ఛగలిగి యుండవలెను. కాని రహితమైన కర్మ ప్రతిక్రియను గాని బంధములనుగాని గలిగింపజాలదు. భగవదాంశములోను లేక సంపూర్ణమైన సమత్వములోను - చలింపని స్థిరతలోను - ప్రశాంతిలోను - జేయబడు కర్మ ప్రప్రధమములో భాగరహితమైన మోతయనదగు నాధ్యాత్మిక ధర్మముగ గనబడును. ఇదియే కర్తవ్యకర్మ. పిమ్మట నది భగవద్యజ్ఞముగ నుత్తేజమొందును. కర్మయొక్క యత్యున్నత స్థితియందది క్రియాసమేతమైన యద్వితీయతలో శాంత్యుత్సాహ ములతో మిళితమైన దన యామోదమును వెలిబుచ్చునట్టిది యగును. ఏకబద్ధమైన ప్రేమ యెంతెంతో నెక్కువ జేయగల్గును. ప్రతిక్రియలేని స్థిరతస్థానములో బలోపేతమైన పరవశతను నెలకొల్పును. ఈ పరవశత యహంకారేచ్ఛ యొక్క క్షుద్రోత్సాహము కాదు. కాని యది యాద్యంతములు లేని యానంద సాగరము. నిన్ను క్రియావేశునిగ జేయు నీ ప్రియుని సన్నిధానముయొక్క నిష్కల్మషమైన దివ్యావేశమును నీ కర్మలలోనికి గొని తెచ్చును. నీలోను సకల భూతములలోను వెలయు భగవంతుని కొరకు పాటుబడుచున్నా వను సంతోషము మాటి

మాటి కనుభవించ గలవు. కర్మలయొక్క చూడామణి - జ్ఞానము యొక్క మకుటాయమానము భక్తిప్రేమలు.

"జ్ఞానరూపమైన యీ భక్తి - నీకర్మకలాపము యొక్క హృదయనాళమైన యీ భక్తి - నిశ్శేషమైన నివేదనకు మరియు సంపూర్ణతకు ఫలప్రదాయిని యగు గొప్ప శక్తిగ నున్నది. పరిపూర్ణాధ్యాత్మిక జీవితమునకు వ్యక్తిగతసత్త భగవంతుని తోటి కృత్స్న సంయోగము తప్పని విధియనుట నిస్సందేహము. కనుక నిశ్శేషముగ భగవంతున కున్ముఖుడ వగుము. నీ సర్వ స్వభావమును భక్తిజ్ఞాన కర్మలచే నాతనిలో నైక్యము జేయుము. ఆతనికి సంపూర్ణముగ నభిముఖుడవై నీ సర్వచైతన్యమును - నీ యింద్రియములను - శరీరమును సహితము భగవచ్చరణములకడ జంకుకొంకు లేక యర్పింపుము. ఆతని దివ్య చైతన్యముయొక్క నిష్కళంక మైన మూసలో నీ చైతన్యము నామూలాగ్రముగ నాతనిచే పోతబోయబడుట కనుమతింపుము. నీ యిచ్ఛ యాతని దోషరహితమైన యిచ్ఛాశక్తిగ పరిణితము గానిమ్ము. నీ శరీరేంద్రియములు సహిత మానంద పరవశలతో గూడుకొనిన భగవచ్ఛరీరమగు నటుల నాకాంక్షింపుము. నీ సర్వస్వముతోటి యాతనికి క్రతువొనర్చి యాతనినే యారాధింపుము. నీ ప్రతియొక యాలోచనలోను - భావములోను - నావేశములోను - చేష్టలలోను - నాతనినే జ్ఞప్తియందుంచికొనుము. ఈ విషయము లన్నియు సంపూర్ణముగ నాతనివరమగు వరకు సతతము పావన మొనర్చు నాతని సన్నిధానము పవిత్రమైన నీ యాత్మరంగమం దున్న విధమున నీ సర్వ సామాన్య విషయములు - బాహ్య విషయములు సహాయాతడు చేకొను వరకు పట్టువిడువక గృషిసల్పుము.

"ఈ త్రివిధమార్గ మనుష్ఠించిన నీవు నీ నికృష్ట స్వభావమునుండి యాధ్యాత్మిక పరాచైతన్యము లోని కనుగమించ గలవు. ఆ పరాచైతన్యము బాహ్యజ్ఞానమునకు గుప్తమై యున్నది. అట్టి పరాచైతన్యములో నఖండ స్వరూపుడగు భగవదంశమైన జీవుడు భగవత్ స్వరూపముబొంది బాహ్యమందున్న మాయలో సంచరించుటకు మారుగ భగవత్ సత్యములో మనుగడ గలిగి యుండును. ఇట్టి పరిపూర్ణతను - నిట్టి యైక్యతను ప్రపంచాతీత పరమగు నునికిలో నేకాంతముగ భోగించ గలవు. కాని యిచ్చట యీ మానవ శరీరములో మరియు నీ భౌతిక ప్రపంచములో సహితము నీ విట్టి పరిపూర్ణతను - నైక్యతను నుపలబ్ధి పొందగలవు. నీ యంతరాత్మను త్రిగుణములనుండి విముక్తిగావించి నీ బాహ్యేంద్రియములం దా గుణముల కార్యకలాపము నుదాసీనతతో నుపలక్షించుచు - క్రియారహితుడవై - స్థిరత్వ

మొందినంత మాత్రమున నీ యుపలబ్ధి బొందజాలవు. నీ యంతరాత్మనే గాక నీ క్రియాసమేత మైన స్వభావమును సహా భగవంతునికి నర్పింపవలెను. అది గూడ భగవద్రూపముగ మారవలెను. నీలోనున్న సర్వశక్తులచే బురుషోత్తముని నారాధించి యాతని సత్తలోని కనుగమించిన సాదృశ్యముక్తి పొందగలవు. నీలోని సర్వస్వము నాయొక్క ప్రజ్ఞాయుక్తమైన యాధ్యాత్మిక స్వభావముగ మారవలెను. మద్భావమును పొందుము. సంపూర్ణమైన శరణాగతి నీ కలవడవలెను. నీ స్వభావము యొక్క జీవితపు బోకడల కనుసరణీయముగ నానానేకరూపముల నన్ను శరణుబొంది నన్నే ప్రాపుగ జేసికొనుము. ఎందుకన నిట్టి సంపూర్ణ శరణాగతియే యీ ప్రబలమైన మార్పును మరియు సంపూర్ణతను జేకూర్చ గలదు.

"ఇట్టి యోగ పరిపూర్ణత కర్మయొక్క సమస్య నామూలాగ్రముగ బరిష్కరించ గలదు. మానవ కర్మాచరణ కష్టపరంపరల తోను – ధర్మసందేహములతోను నిండుకొనియున్నది. నిబిడారణ్యములోని దురూహ్యములగు త్రోవలబోలె యీ కర్మాచరణ విడదీయ నలవిగాని చిక్కుపరిస్థితులతో గూడుకొని కంపాయమానమును కలిగించుచున్నది. ఈ చిక్కు పరిస్థితులకు – గష్టపరంపరలకు మూలకారణ మేమన మనుజుడు తన యజ్ఞానమయ మనఃప్రాణ భౌతిక స్వభావములో బంధీకృతుడై మనియుండుటే. ప్రకృతి గుణములచే నాతడు బంధీకృతు డగుచున్నను తన కర్మాచరణమునకు తాను బాధ్యుడైనట్లు దిలకించుచున్నాడు. ఎందుకన తనలోనున్న గొంతవిశేషము దాను నాత్మస్వరూపుడనియు – తన ప్రకృతపు పరిణామము దన నిజ స్వరూపము గాదనియు – లేక తన స్వభావమునకు దాను యజమానుడు కాలేదనియు భావించుచున్నది. ఈ పరిస్థితులం దాతడు తన జీవితములో ననుసరించు ధర్మములు సూత్రములు కళంకపూరితములు గను – తాత్కాలిక మైనవిగను – పాక్షిక సత్యములుగను – నుండక తప్పవు. తన్ను దాను తెలిసికొనునప్పుడు – తాను నివసించుచున్న ప్రపంచముయొక్క తత్వము బోధపడి నప్పుడు మీదుమిక్కిలి తన సృష్టిస్థితి లయములకు గారణభూతు డైనట్టి పరంధాముని తెలిసికొనినప్పుడు మాత్రమే తన దోషము లంతరించగలవు. సత్యమైన జ్ఞాన చైతన్యములు సంప్రాప్తమైన వాని కెట్టి సమస్య గాని తటస్థించ జాలదు. ఎందుకన నాతడు దన యాత్మ యొక్క సత్యమున కనుసరణీయముగ – దన పరా స్వభావమున కనుగుణముగను – నప్రయత్నముగ జీవ యాత్రను గడపుచు స్వేచ్ఛతో తన స్వశక్తి మూలమున విహరించ గలడు, ఇట్టి యత్యున్నత జ్ఞానములో కార్యకలాపము జరపునది వ్యక్తి

గత స్వభావముకాదు. కాని యఖండ స్వరూపుడైన భగవంతు డావ్యక్తిలో బ్రవర్తించుచు నాతనియొక్క విముక్తి బడసిన జ్ఞానములోను - శక్తిలోను - మరియు బరిపూర్ణతలోను నాతని మూలమున వ్యవహరించు చున్నాము.

"మనుజుడు దన సహజ సత్తాంశ మందు సత్వరజస్తమోగుణములతో గూడు కొనిన ప్రకృతి కీటకముగ నున్నాడు. ఆ ప్రకృతి గుణములలో నేది దనలో విజృ భించునో దాని కనుగుణముగ తన జీవితధర్మమును మరియు తన కర్మాచరణ విధాన మును నిర్మించుకొని యనువర్తించును. ఇంద్రియ ప్రబోధము గల తమః ప్రధాన మైన తన భౌతక మనస్సు మాంద్యమునకు - భయమునకు - నజ్ఞానమునకు గట్టుబడి తన్ను పరివేష్టించి యున్న వాని నిర్బంధనకు మరియు చాలుమూలలు లేని తన కోర్కెల ప్రవృత్తులకు బానిస పగిది లొంగుచున్నది. లేక సారహీనమైన మామూలు బుద్ధిజాడల చర్విత చర్వణముగ ననువర్తించుటలో తన భద్రతను కనుగొను చున్నది. కోర్కెలతో నిండిన రాజసికమైన మనస్సు దాను నివసించుచున్న ప్రపంచము తోటి పోరాటము సల్పుచున్నది. నూతన వస్తువుల బొందుటకు - దన యనుపు ఆజ్ఞలోనికి దెచ్చుటకు - రణము సల్పుటకు - జయమొందుటకు - హతమార్చుటకు - సంచయము చేయుటకు బ్రయత్నించును. సతత మది జయాపజయ ములకు - సుఖ దుఃఖములకు - నుత్సాహ నిరుత్సాహ ములకు - మధ్య తారుమారగుచు ముందుకు సాగు చుండును. అయితే యది తన కార్యచరణలో నేసూత్ర మవలంబించినను వాస్తవములో నా సూత్రము నికృష్టాత్మకు తన యహమునకు సంబంధించినదిగ నుండును. ఈ నికృష్టాత్మ యహములు తమ్ము తామే గాక సర్వము భక్షించు నట్టి కాళరాత్రి స్వభావము గల మనస్సును కలిగియున్నవి. సత్వగుణోపేతమైన బుద్ధి యిట్టి పరిస్థితి పాక్షికముగ నతిక్రమించి కోర్కెకంటెను నహముకంటెను నుత్కృష్ట మైన విధానము తప్పక యనుసరణీయ మని గమనించి యొక సాంఘిక నైతిక ధార్మిక విధానమును - నొక ధర్మమును - నొక శాస్త్రమును నిర్మించుకొని యట్టి దానికి తనంతకు తాను కట్టుబడును. మనోబుద్ధులకు మార్గదర్శకముగ నిట్టి లక్ష్య మును లేక వ్యావహారిక సూత్రమును నిర్మించుకొనుటయు నట్టి సూత్రము జీవితము లోను ప్రవర్తనలోను శ్రద్ధాభక్తులతో ననుష్ఠించుటయు మానవుని సామాన్య మనస్సు పొందగల్గిన యత్యున్నత స్థితియై యున్నది. ఇట్టి సాత్త్వికమనస్సు ఉన్నతోన్నత స్థానము పొందువరకు దానిని యభివృద్ధిపరచవలెను. అప్పు డహముచే దూషితము గాక ధర్మముకొరకే ధర్మమును నాచరించుటకు వ్యక్తిగతాశాపాశములతో బద్ధము

కాని సాంఘిక నైతిక ధార్మిక లక్ష్యముగ ధర్మమును ననుష్ఠించుటకు నిష్కామకర్మ నాచరించుటకు వీలగును. ఇదియే "కర్తవ్యకర్మ."

"ప్రకృతి యొక్క యీ కార్యకలాపము బాహ్యామనస్సు కంటె నెక్కువగ నంతస్థమై యున్నది. మనుజుడు దేహధారియైన జీవాత్మడై మనోభౌతిక స్వభావములో మెలిగొని తనసత్తయొక్క యంతర్ధర్మము నియమించిన రీతి క్రమాభివృద్ధిని బొందుచున్నాడు. ఆతని యాత్మ స్వరూపమే యాతని మనఃప్రాణములను స్వభావమును నిర్మించుచున్నది. ప్రతి మనుజునికి స్వకీయమైన ధర్మ మున్నది. ఈ స్వధర్మమే తన యంతస్సత్త యొక్క స్వధర్మము. ఇట్టి యంతస్సత్త ధర్మమునే ప్రతి మనుజు డన్వేషించి కనుగొని యనువర్తించవలెను. తన యంతస్స్వభావముచే నియమింప బడిన కర్మ యాతని నిజ ధర్మముగ నున్నది. దీనికి పెడత్రోవ నడచుటచే గందగోళము విఘ్నములు పొరపాట్లు వాటిల్లును. తన స్వధర్మము పాటించుటకు - ననువర్తించుటకు - చేయూత నొసంగునట్టి సాంఘిక నైతిక ధార్మికములు లేక యితర లక్ష్యము లేవియో యవియె నాతనికి మేలొసగూర్చునవి.

"ఇట్టి కర్మాచరణ యెంతయు ఉత్కృష్టత పొందినను మనస్సు యొక్క యజ్ఞానమునకు - గుణముల క్రీడలకు లోబడియున్నది. మానవుని యాత్మ తన స్వ స్వరూపము కనుగొనినప్పుడే గుణముల గందరగోళమును నజ్ఞానమును నతిక్రమించి వానిని తన చైతన్యము నుండి రూపుమాప గలడు. నిన్ను నీవు కనుగొని నీ యాత్మలో మనియున్న తదుపరి సహితము నీ స్వభావము దాని పూర్వపు నికృష్ణమైన జాడల ననుసరించు ననుట సత్యము. కాని యిప్పుడు సంపూర్ణమైన జ్ఞానముతో నా కర్మాచరణమును వెంబడించ గలవు. మరియు నీ యునికియొక్క యధిపతియైన సర్వేశ్వరునికి యా కర్మను యజ్ఞభావముతో సమర్పించ గలవు. కనుక నీ స్వధర్మమును నిర్వర్తించుము. నీ స్వభావము నియమించు కార్యకలాప మెట్టిదైనను లెక్కింపక దానినే యాచరింపుము. సర్వేస్వరునికి సర్వభావములతోడి నీవు సంపూర్తిగ శరణుబొందు వరకు నీ యహంకార ప్రవృత్తులను - నీ యిచ్ఛాశక్తి యొక్క సర్వారంభములను - కోర్కె యొక్క సర్వాధిపత్యమును బహిష్కరింపుము.

"ఇట్టిది త్రికరణ శుద్ధిగ నీవు చేయగల్గిన నాడే నీ యన్ని కార్యాచరణల యారంభమును నీలో వెలయు పరమోన్నత భగవానుని లోనికి సన్యసించ గలవు.

అప్పుడు ప్రవర్తనయొక్క నిబంధనల నుండియు సర్వ ధర్మముల నుండియు పాశ ముక్తుడవు కాగలవు. నీలో వెలయుచున్న భగవచ్ఛక్తి సాన్నిధ్యములు పాప పుణ్య ముల నుండి నిన్ను విముక్తిపరచును. మరియు మానవ నీతి సూత్రముల కతీతునిగ జేయును. ఎందుకన కల్మష రహితమైన యాధ్యాత్మిక సత్తలోను దివ్య స్వభావము లోను మనుగడ కల్గి ధారాళముగ ప్రవర్తించెదవు. నీ ద్వారా నీవు గాక భగవంతుడే తన యిచ్ఛను - కార్యములను - నీ నికృష్టానందము కొరకు - నీ కోర్కెయొక్క సంతృప్తికొరకు గాక - లోక కల్యాణము కొరకు - సకల జన సుఖప్రాప్తి కొరకు ప్రదర్శించును. తేజములో మునిగి తేలుచు ప్రపంచమునం దాతని రూపును కన్ను లార చూడగలవు. ప్రతి సంఘటనములో నాతని యుద్దేశ్యము తెలిసికొన గలవు. నీ స్వభావ మొక యుపకరణముగ నాతని యిచ్ఛను మాత్రమే యది యెట్టిదైనను స్వీకరించి తడవులాడక నిగ్రహించును. ఎందుకన ప్రతి కార్యారంభము నందు నీకు మూర్ధ్వము నుండియు - నంతస్థము నుండియు విధ్యర్థకమైన జ్ఞానమును - భగవద్వి వేకార్థ సూచనలకు మెలకువతో నిండిన సమ్మతిని బడయగలవు. ఆతనిదే రణ రంగము. ఆతనిదే జయలక్ష్మి, ఆతనిదే సామ్రాజ్యము.

"ప్రపంచములోను మరియు నీ శరీరములోను నీ పరిపూర్ణత యిట్టిదియై యుండును. ఐహిక జీవిత ప్రపంచముల కావల శాశ్వతమైన పరాచైతన్యము నీ వనుభవించ గలవు. మరియు పరమాత్మ యొక్క యున్నతోన్నత మైన స్థానములో నీవు యెడతెగని మనుగడ గలిగియుందువు. "పునరపిజననం పునరపి మరణం" యను భీతి నిన్ను బాధించ నేరదు. ఎందుకన జీవితములో భగవంతుని యావిష్కా రము నీవు నెరవేర్చిన వాడగుదువు. మరియు నీ జీవాత్మ మనశ్శరీరములలోనికి యవతరించినను విశాలమైన నాశ రహితుడగు పరమాత్మలో నింతకు పూర్వమే నివశించు చుండును.

"నీ సంపూర్ణాత్మ స్వభావముల యొక్క యిట్టి నిశ్శేషమైన శరణు నీ పర మోన్నతాత్మయగు భగవానునికి యిట్టి నిశ్శేషమైన సర్వధర్మ పరిత్యాగము నీ సర్వేంద్రియముల యొక్క యిట్టి యఖండాకాంక్ష యాధ్యాత్మిక పరా స్వభావోప లబ్ధికి పరమోన్నత మార్గము. ప్రారంభములో కాని లేక మార్గాంతర్దశలందుకాని నీ విట్టిది యొక్కసారి జయప్రదముగ చేయగల్గిన తదుపరి నీవు యే పాత్ర ధరించినను లేక నీ బాహ్య స్వభావమెటులున్నను నీమార్గము భద్రత గాంచును. మరియు నీ పరి

పూర్ణత యనివార్య మగును. నీలో పరమోన్నతమైన సన్నిధానము నీ యోగముచే కొని నీ స్వభావ మార్గముల కనుగుణముగ దాని గమ్య స్థానమునకు నిన్నీడ్చుకొని పోవును. తర్వాత నీ జీవితము యొక్క మార్గము మరియు నీ కర్మాచరణము యొక్క జాడ లేవిధముగ నున్నను నీవు భగవంతునిలో ప్రజ్ఞాయుక్తుడవై నివశించుచు ప్రవర్తించుచు కార్యకలాపము జరుపుచుందువు. ఇదియే పరమోన్నతమైన మార్గము. ఎందుకన నిదియే యుత్తమోత్తమైన రహస్యము. అయినను సంతసాధనలచే ప్రవర్ధమానముగ నందరు నుపలబ్ధి పొందగలగు. నీ యాధ్యాత్మిక స్థితియొక్క మిక్కిలి యంతస్థమైన నిజసత్య మిదియే."

## 2–వ అధ్యాయము

# సంఘ పరిణామ చక్రము

ఆధునిక పదార్థ విజ్ఞాన శాస్త్రము, భౌతికమును మూలతత్వముగ భావించి, భౌతిక శాస్త్రపరిశోధన ప్రయోగముల మహిమచే ప్రస్తుత మావేశము పొంది యున్నది. అందుచే – అన్ని భౌతిక శాస్త్రముల జ్ఞానమువలెనే మానవునియొక్కయు పశువుయొక్కయు మనస్తత్వమును గుఱించిన శాస్త్రజ్ఞానముకూడ మానవుని కవసరమై యుండియు దానిని పాటింపక – పశు మనుజులయందు, మనస్తత్వము యొక్కయు ఆత్మయొక్కయు క్రియలకును క్రియావిధానములకును గూడ మూలము భౌతికమే యని అది ప్రవచించుచున్నది, నాడీమండల మస్తిష్కముల కార్య పరిశీలనా ఫలితముపైనను శరీర వ్యాపారశాస్త్రముపైనను, నది మనశ్శాస్త్రమును ఆధారపఱచు చున్నది. అందుచే సాంఘిక శాస్త్రము మానవచరిత్రము నగు నీరెండింటి పరిశీలన నంతటిని, బాహ్యవిషయములయు, వాని నియములయు ఆచారములయు పద్ధతులయు వ్యవస్థలయు ఆర్థికాంశములయు నగు వీనియన్నింటియొక్క అభివృద్ధిపై నాధారపరచి, మానవునియందలి ముఖ్యభాగమగు మనస్సును, మానసిక క్రియలను చిత్తావేశమును భావనా పరవృత్తులను గుఱించిన జ్ఞానమును నది తృణీకరించినది. చరిత్రకును సాంఘికాభివృద్ధికిని సంబంధించిన ప్రతి విషయము, విశాలార్థముతో కూడిన కేవల ఆర్థికావసర ప్రేరణలచే నడుపబడునని భౌతిక విజ్ఞానశాస్త్రము వ్యాఖ్యానించును. మానవుని వ్యవస్థలపై విచారశీలుని భావ మహిమయు భావ పరిణామము ఎంతమాత్రము వర్తించుటలేదని కొందఱు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇందుకు తార్కాణముగా రూసో, వాల్టేరు (Rousseau, Voltair)లు వ్రాసిన దంతయూ సంఘముపై ప్రభావము పరుచకుండ యుండిననూ, 18 వ శతాబ్దపు భావ విచార ప్రపంచమున తత్త్వశాస్త్రజ్ఞుల భావచలన మత్యంతధైర్యముగా జీవిత సమస్యలపై పనిచేసి యుండకుండిననూ, పరిస్థితుల ఆర్థికావసరములచే ఫ్రాంసు విప్లవ మెప్పుడు ఏ విధముగా జరిగి యుండెనో, అట్లే తప్పక జరిగి యుండునని, చరిత్ర కారు లిప్పటికిని దలంచుచుండుటయే చెప్పనగును.

భౌతికతత్త్వము, మనస్సాత్మలకు సర్వసమగ్రమగు మూలమను వాదము నూతనముగ సందేహింపబడుచున్నది. ఈ భౌతికవాద మహిమనుండి మానవుడు ముక్తుడగుట ప్రారంభమైనది. ఆర్థిక ప్రేరణలకును సాంఘిక — చారిత్రకాభివృద్ధిక కారణములకును వెనుకనిగూఢమగు మనోవైజ్ఞానికాంశములు గలవని గుర్తింపబడు చున్నవి. కడచిన నూటయేబది యేండ్లనుండి శుభాశుభ సుప్రయోజన దుష్ప్రయోజన కారకములగు నూతనోత్పాదన విషయములకు నూతన భావములకు నివాసమైనట్టియు, భౌతిక వాదమునకు దర్క ప్రాధాన్య వాదమునకు దావైనట్టియు నగు జర్మనీ దేశమునందు, మానవజీవిత చరిత్ర, మానవుని మనస్సభివృద్ధి పొందు దశా విషయములను సూచించునను సిద్ధాంతము ప్రప్రథమము విశదీకరింప బడెను. కర్మక్షేత్రమున నూతన సిద్ధాంతము లేనియేనియు నారంభమున దగినంత జయప్రదము కాకున్నను, జర్మను చరిత్ర కారుడైన యీ సిద్ధాంతోత్పాదకుడు "లాంప్రెష్" ఈ యుజ్జ్వల భావము నొకటిని గ్రహించి యుండియు, దానిని తగినంత లోతుగ విశాలముగా వివేచింపలేదు. అతని వివేచనమింకను ఆర్థికాంశ ప్రాధాన్యమై ఐరోపీయ శాస్త్రసముదాయముం బోలి యతని సిద్ధాంతము రూపాత్మక సంభూతికి మూల హేతువును వెదకుటకుబదులు దానిని వర్గీకృత మొనరించుచున్నది. ఐన నతడు గ్రహించిన సత్య మత్యంతోజ్జ్వలమై వివిధసూచనా సమృద్ధమై యున్నది. ఆ సూచనలను ప్రాచ్యానుభవములతో, ప్రాచ్యదృష్టితో మనము గ్రహించి వాని ఫలితములను తేల్పవలయును.



"లాంప్రెష్" అను సిద్ధాంతి ఐరోపాచరిత్రను, అందు ముఖ్యముగా జర్మనీ చరిత్రను నాధారముగా దీసికొని మానవసంఘము వివిధ విశిష్ట మానసికదశలను క్రమానుగతముగా ననుభవించుటచే నభివృద్ధి గాంచినదని నిర్ణయించు చున్నాడు. మానవ సంఘముయొక్క యాదిమ దశను సంకేతప్రధానదశయని పేరిడినాడు. తర్వాత దశను ఆదర్శప్రధాన దశయనియు, నాచార ప్రధాన దశ యనియు పేర్కొనినాడు, కడపటి దశను వ్యక్తి ప్రధానదశయనియు అంతర్ముఖ ప్రధానదశయనియు బిలచియున్నాడు. ఈ దశలను జాతి, లేక దాని నాగరకత యొక్క ప్రగతి పొందు మానసికాభివృద్ధియొక్క చక్రమని నుడువవచ్చును. ఇట్టి విస్పష్టనము వాని ధృఢ నియమ దోషముచేతనే లోపమై యుండగలదు. మానవుని యొక్కయు, మానవ సంఘముయొక్కయు, మానసికాభివృద్ధి విధానము సంకీర్ణ మగుటచే ననేకాంశములతో గూడుకొన్నదగుటచే నిట్టి కఠిన నియమబద్ధ పృథక్కరణమునకది యంగీక

రించదు. ఈ మానసిక ప్రగతి విషయక చక్రమునందలి యంతరార్థమును దాని దశానుక్రమ కారణములను వాని యుద్దేశ్య గమ్యములను "లాంప్రెష్" తన సిద్ధాంతమునందు ప్రవచించియుండలేదు. ఐనను మనో భౌతిక తత్త్వముల సహజ ధర్మములను గుర్తెఱుంగవలయునేని-వాని ప్రత్యేక భూమికల యందు వానిని వేఱు పఱచి వాని కార్యవిధానమును గుర్తెఱుంగజాలకున్నను - వాని ప్రత్యేకాంశము లందు వానిని దెలిసికొనుటకొఱకు, వాని కార్యములను పృథక్కరించవలెను. అందుచే "లాంప్రెష్" యొక్క భావ ఫలితమును గురించి ఆతడవలంబించిన విధానము నతనికే వదలుచు నాతడిడిన పేర్లను గ్రహించి వానియంతరార్థమును ప్రయోజనమును పరీక్షించుటచే మన చారిత్రిక పరిణామ రహస్యము. మన కెంత వరకు వానిచే వెల్లడికాగలదో చూతము.

ఏదేశపు మానవసంఘమునేని, యా సంఘము లేక జాతి, సాంస్కృతిక మైనదో అసాంస్కృతిక మైనదో యైనను, ఆర్థికముగా వృద్ధిని కాంచినదియో కాంచనదియో యైనను - దాని పురాతన ప్రారంభ దశను గమనించినచో నిస్సందేహముగ నది దాని యాచారములందును, వ్యవస్థయందును, విచారమందును దాని మనస్తత్వము సాంకేతిక స్వభావము కలదై యున్నది, ఐనచో దేనిని గురించి యా సంకేతనములని అడుగవలెను. సంఘ మారంభదశయందు పూర్ణ మతావేశము గలదై, మతప్రధాన భావపూరితమై యుండును, తదాదిదశయందు భావపూరితము గనో లేక స్వతఃస్ఫురితముగనో వ్యాప్తిగాంచిన మతావేశములును వాని సంకేతనములును పరస్పరము గలిసియుండుట సహజము; తర్వాత మనుజు డధికముగా నాలోచనాపరుడును సంశయవాదియు దర్కశీలుడును నగుటకు ప్రారంభమయ్యేనేని యతడు సాంకేతికయుగమును దానితర్వాతిదగు నిరూఢాచారానుగతయుగమును. వెనుకకు త్రోసి, వైయక్తిక సంఘమునకు దన్నుదా సిద్ధముచేసికొను చుండును. సాంకేతిక యుగమున, మానవునికిని మానవజీవితమునకును నతని కర్మణభావములకును వెమకగల నేదోయొక సాన్నిధ్యమును - అది భగవంతునో, లేక దైవతములనో లేక అనిర్వచనీయము, గాఢము, అంతర్గతము. జీవాత్మకము, ఆశ్చర్యమునైన వస్తుస్వభావమునో - ఆ సంకేతనము సూచించును. ఆతని మత విషయక, సాంఘికస్థితులు, ఆతని జీవితస్థితులు, దశలు అన్నియు నాతనికి చిహ్నములు; ఆ కర్మలన్నిటికిని వెనుకనుండి వానికి రూపములనిచ్చి వానిని నడిపించు ప్రభావ శక్తులను, ఆ చిహ్నములద్వారమున నతడు వ్యక్తపఱచును.

ఆర్యసంఘముయొక్క ప్రథమదశ యనగా పురాతన వేదయుగమునాటి వారి మన స్తత్వమునకు మన మన స్తత్వమునకును భేదముండుటచే వారిని గుఱించిన విషయములు మనకు బాగుగ నర్థమగుటలేదు. అట్లయును వారి సర్వకర్మలు సాంకేతికములై యుండెనని మనకు దెలియుచున్నది. యజ్ఞప్రాధాన్యమత - నియమము సంఘము నంతటిని సర్వకాల సర్వావస్థలయందు నడుపుచుండెను. ప్రతి సూక్ష్మ విషయము. యజ్ఞార్థముతో యజ్ఞకర్మగా చేయబడు చుండెననియు నది గూఢార్థమైన సంకేతనముగలదియై యుండెననియు బ్రాహ్మణములు - ఉపనిషత్తులు చదివిన వారికి స్పష్టమగును. తర్వాతి యుగపు ప్రజలస్వభావము బుద్ధిపరమై వ్యవహారగతమై, మతమునందును, గుప్తవిద్యయందును, సాంకేతిక పద్ధతియందును గూడ ప్రాపంచిక సంపదను. స్వర్గమును సంపాదించుటకొఱకు ప్రకృతి శక్తులను దైవములుగా భావించి, వానిని తృప్తిపఱచు కొఱకు యజ్ఞములు చేయబడినవని వీరలు పొరపడిరి. మతవిషయక పూజావిషయములే గాక సాంఘిక కర్మలన్నియుగూడ సాంకేతిక భావముతో గూడినవై యుండెను. ఉదాహరణముగ, ఋగ్వేదమునందు వివాహ సందర్భమున స్త్రీపురుషుల యైక్యమును సూచించునట్టియు. తర్వాతి వేదకాలమున వాడుకలో నుంటినట్టియు వేదసూక్తములను గమనించనగును. ఆసూక్తముల యందు. సూర్యుని కుమార్తెయగు సూర్యను వివిధ దేవతలతో వరుసగా వివాహ మొనరించిన విషయము వర్ణించబడినది. అందు మానవవివాహాంశ మప్రధానమై, సూర్యయొక్క దివ్య రహస్యగుణములు ప్రధాన మొనరింపబడి, ఆమె స్వభావ గుణములు వర్ణింపబడినవి. ఈ సూక్తములలో వర్ణింపబడిన పరిణయము - తర్వాతి కాలపు కవులు, మానవుని పరిణయమును కావ్యాలంకారముగ లేక విభూషక ప్రతిబింబముగ వర్ణించుటవలె నుండుటలేదు - అది దివ్యపరిణయము యొక్క అపర రూపము. చిహ్నమునై యున్నది. ఈ భేదముచే ప్రథమదశయందలి మానవుని మనోదృష్టియు. నాధునిక దశయందలి మానవుని మనోదృష్టియు బాగుగా విశదమగును. ఈ సాంకేతిక పద్ధతియే బహుకాలము పరిణయమును గుఱించిన హైందవభావ దృష్టిని నియమించెను. ఇప్పటికిని ఆ సాంకేత మర్థము కాకున్నను. దాని నాచారమునందు వాడుచునే యున్నారు.

ప్రస్తావముగ, స్త్రీ పురుష సంబంధమును గుఱించిన హైందవాదర్శ మెల్లప్పుడును, ఈశ్వరావిర్భావమునందలి దివ్యపుం స్తత్వము దివ్య స్త్రీ తత్వములగు పురుష ప్రకృతుల మధ్యగల సంబంధమునకు, వేదమునందు వర్ణింపబడిన "నృ" తత్త్వ

"జ్ఞా" తత్త్వములకు చిహ్నముగా నున్నదని మనము గమనింపవచ్చును. వేద కాలమునందలి సంఘమునందు స్త్రీకిగల స్థానము, స్త్రీ పురుషుల మధ్యనుండిన వ్యావహారిక సంబంధము, పై భావము ననుసరించియే యుండెను. వేదకాలమునందుండిన సంజ్ఞావిధానమునందు, స్త్రీ పురుష తత్త్వములు సమానస్థాన మాక్రమించినవగుటచే – గొంతవఱకు పురుషతత్త్వమునకే ప్రాముఖ్యత కలిగియుండియు–పురుషునికి స్త్రీ సహచారిణియై యనుబంధమునై యుండెను; ఉత్తరోత్తర కాలమున, పురుష భావమునకు ప్రకృతిభావము తక్కువది యయ్యెను. అందుచే స్త్రీ, పురుషునిపై పూర్ణముగ నాధారపడి, యాధ్యాత్మికముగ ప్రత్యేక స్థానమును గోల్పోయెను. తాంత్రిక మతమునందు స్త్రీ తత్త్వము నత్యుత్తమముగా నెంచియు, తాంత్రిక మతము వేదాంత భావములనుండి విముక్తి కాలేకపోయినట్లుగనే, స్త్రీ నత్యంత పూజ్య వస్తువుగా నెంచియు. సంఘమునందత్త్యున్నతస్థానము నామెకిచ్చు ప్రయత్నమునందది విఫల మయ్యెను.

ఇంతకన్న మఱొక స్పష్టోదాహరణమైన వైదిక సంఘవ్యవస్థయగు నాలుగు వర్ణము లనుదానిని తీసికొందము. ఈ విషయమున, వర్ణమను పదము. వారికి సాంకేతికమైన యాదర్శభావమును సూచించును. మన కది కులమను భావము కలుగ చేయునదియై, రూఢిబద్ధ సమయానుకూలమగు నాచారమును సూచించును సంఘమునందు, ఈ చాతుర్వర్ణములు రాజకీయ కారణములచే, నార్థికాంశముల పరిణామముచే నేర్పడినవని కొందఱందురు. కొంతవరకది, సత్యమే కావచ్చును* కాని ముఖ్య విషయ మేమన ఆకాలపు సంఘమువారెవ్వరును, ఆ విషయము నట్టి భావముతో పరికించలేదు; మనము సంఘ పరిణామమును వ్యావహారిక భౌతికదృష్టితో పరికించి తృప్తిపడి అంతకుపైనగల యితరకారణముల గమనింపక యుండగా పూర్వులు భౌతికాంశములను లక్షించక, సాంకేతికము మతవిషయకము మానసికము నగు భావోద్దేశ్యముల మాత్రమే లక్షించుచుండిరి. వేదమునందలి పురుషసూక్తమునందు చాతుర్వర్ణములు, స్రష్టయగు నీశ్వరుని శరీరముయొక్క శిరస్సు బాహువులు ఊరువులు పాదములనుండి ఉత్పన్నమైనట్లు వచింపబడినది. మనకావర్ణన కావ్యాలంకారమై, బ్రాహ్మణులు కావ్యపరులనియు, క్షత్రియులు శక్తి సంపన్నులనియు

---

*బ్రాహ్మణు డాకాలమందన్నివిధముల వృత్తుల నవలంబించు చుండెననియు, యాజ్ఞిక కార్యములకు మాత్రమే బద్ధుడైయుండ లేదనియు మనకు తెలియుటచే వీరి వాదము సందేహాస్పదమని చెప్పవలయును.

వైశ్యులు వృత్తిశీలురు సంఘమును భరించువారనియు, శూద్రులు సేవకులనియు గన్పట్టును. పూర్వులకీయొక్క విషయమే సర్వమై యుండి నట్లుగను, వారికి బ్రహ్మశరీరమును గుఱించిన లేక సూర్య పరిణామమును గుఱించిన కావ్యాలంకారముల యందంత గాఢ శ్రద్ధగలవారై యుండినట్లుగను, ఆభావములపై మత నియమములను పవిత్రాచారములను దృఢ వ్యవస్థలను సాంఘికాదర్శములను నైతిక శిక్షణలను నేర్పఱచుటయందంత శ్రద్ధాభక్తులు కలవారై యుండినట్లుగను మన మూహింతుము. మన మనస్తత్వ విధానమే మన పూర్వులదై యుండనోపునని తలంచుటచే వారి భావము లనాగరికము లైనవని మనకు తోచుచుండును. మనకు కవిత్వమొక బుద్ధిగత విలాసము భ్రమ; భావకల్పనమొక ఆటవస్తువు, వినోదపడుటకొక విధానము. మన మనస్సు నానందింపజేయునొక నర్తకి. కానిపూర్వులకో కవియొక ఋషి. గుప్తసత్యముల దర్శింపజేయు ద్రష్ట; భావకల్పనము వారికి సత్యమొనర్చుదాసి గాక, భగవానుని గ్రహమునందు బూటకముల నల్లునది గాక, దుర్ఘటగుప్తసత్యములను భావించి కనుగొనగలనొక యాజ్ఞికురాలు: వేదమునందలి ఉపమానము లేక రూపకము, చింతనయొక్క నేర్పరితనమును చూపునది గాక, నెఱవేఱగల సత్యమును తెలుపునదియై యుండెను; వారి భావకల్పన సాక్షాత్కారము కాని దానియొక్కగాక, సాక్షాత్కారము కాగల దాని చిహ్నమై యుండెను. బుద్ధి నిర్మితవచనము భౌతికవస్తురూపమును స్పష్టముగ మనస్సుకు గోచరింపచేయగల్గియు, సత్యమునది యావిష్కరింప లేదు; కాని వేదమునందలి భావకల్పన సత్యము నావిష్కరింపజేయు సామర్థ్యమును గలిగియుండెను. వారికి సృష్టికర్త శరీరమును గుఱించిన సంజ్ఞ, యొక భావకల్పన మాత్రమేగాక దివ్యసత్యమును వెలువరించునదియై యుండెను. విశ్వపురుషుడు తన్ను అతిభౌతిక జగత్తు (Supra-physical–Universe) నందును, భౌతిక జగత్తుయొక్క జీవనమందు నభివ్యక్తమొనర్చుటకు జేయు ప్రయత్నమే, ఆ దాని స్వరూపమే మానవసంఘమని వారి యనుభవము. విశ్వము మనుజుడు రెండునుగూడ ఆ గుప్తమూల తత్త్వమును, భగవంతుని ప్రకటించు సంకేతములే.

ఈ సాంకేతిక స్వభావముచే సంఘమునందు ప్రతి కార్యమునకు మత సంబంధము కలిగించి, దానిని పూజ్యమొనరించిరి. అయ్యును వానిరూపము లన్నింటియందును, అవి విశాల సజీవ స్వేచ్ఛను గలవై యుండెను. ఈ స్వేచ్ఛ, అశిక్షిత సంఘము లందును, వాని యనుల్లంఘనీయాచారములందును మనకు గోచరింపదు;

వేలన, ఈ సంఘములు సాంకేతికదశనుండి. రూఢిబద్ధమగు సాంఘికదశ నధిగమించి యుండియు, నీయధిగమనము ప్రవృద్ధిమార్గమునగాక యవనత మార్గమున నడచినది. ఆర్యసంఘమున, నట్లుగాక, అధ్యాత్మగత మానసికభావము వాని దశాభేదములను శాసించునదై యుండెను; ఆర్యసంఘనియమములను, దాని దశాభేదములయందు కూడ, మతవిషయక సాంకేతిక రూపములు పరిపాలించెను: అందుచే సాంఘిక రూపములు బద్ధముగాక స్వేచ్ఛగలవై యత్యంతాభివృద్ధి కవకాశముగలవై యుండెను. అందుచే నార్యసంఘము దృఢనియమ బద్ధతను సక్రమముగ పొందుట కొరకు, రెండవ దశయందు మానసికాదర్శకత యారంభమయ్యెను. ప్రారంభ దశయందు అనగా సంజ్ఞాప్రధాన దశయందు చాతుర్వర్ణమను సంకేతనము, సచ్చిదానందము యొక్క నాలుగు విశ్వతత్త్వములను, అనగా వస్తునిజస్వరూపమున ధర్మనియతిని గ్రహించిన జ్ఞానమను మొదటిదియు, దీని నంగీకరించి వహించి రక్షించు శక్తియను రెండవదియు, నీరెండింటిని వ్యవస్థీకరించు సామంజస్యతయను మూడవదియు, పై మూడింటిని విధేయతతో నడిపించు కర్మశీలతయను నాల్గవదియు, మానవునియందు దివ్యజ్ఞానమును, దివ్యశక్తిని, పరస్పర సౌఖ్యము నొనగూర్చు దివ్యోత్పత్తిని, విధేయతతో కర్మ నొనరించు దివ్య సేవాశీలతను, సూచించుననియై యుండెను. మన మిపుడీ సాంకేతిక విధానమును వర్ణించినది, వేదకాలపు సంఘము వచించు పద్ధతిలోగాక మన మర్థము చేసికొనగల రూపకభాషలో వర్ణించితిమి. సంజ్ఞా ప్రధాన దశకు తర్వాత సంభవించిన ఆదర్శ ప్రధానదశయందు పైసాంకేతిక భావముచే స్థిరముగ బద్ధముకాని వర్ణములు, స్థిరవర్ణములుగ నేర్పడెను; ఇవి మొట్టమొదటంతగా నియమబద్ధము కాలేదు. ఈ దశయందు, వర్ణములు నైతిక శిక్షణను ప్రధానముగ నుంచుకొని. యార్థికావసరములు ప్రధానములై యుండ, సాంఘికావసరములపై, నాధారపడి యుండెను. క్రమశిక్షణకును ఆదర్శమునకు ననుకూలించినంతవఱకే, సాంఘికార్థికావసరము లంగీకరింపబడెను. సాంకేతికదశ, అత్యంత మత నిష్ఠను, ఆధ్యాత్మికతను కలిగియుండెను. ఈ భావములకు లోనై, మానసిక – నైతిక – ఆర్థిక–భౌతిక అవస్థితులన్నియు వర్తింప వలసియుండెను. రెండవదశయగు, ఆదర్శ ప్రధాన దశయందు మానసిక – నైతిక భావములు ప్రాధాన్యమై, వీని ననుసరించుకొని మత నిష్ఠయు నాధ్యాత్మికతయు వర్తింపవలసినవై యుండెను. ఈ దశయందు నైతికోద్దేశ్యమునకు శిక్షణకు ననుజ్ఞనిచ్చు భావముగ మాత్రమే మతనిష్ఠ నెంచుదురు; సంఘమునందు దాని ప్రయోజనమును నంతేయగును; ఈశ్వరుని మనుష్యునం దభివ్యక్త పఱచు భావమును మతము

కోల్పోవును; క్రమేణ మతనిష్ఠయందు దీశ్వరభావము సన్నగిల్లి యాచరణయందు పూర్తిగా నశించి, కడకు జీవితసిద్ధాంతమునందు జ్ఞప్తి యందుకూడ లేక మాసి పోవును.

ఈ యాదర్శకదశయందు, మహిత సాంఘిక ఆదర్శము లేర్పడును. ఈ దశానంతరము కూడ నీయాదర్శములు మానవుని మనస్సుపై గాఢముగా నొత్తుకొని యుండును. ఈ రెండవదశ యంతరించినను సంఘమునందు వ్యక్తిగత వర్ణగౌరవమును కాపాడుకొను పట్టుదలమాత్రము ప్రతివర్ణమునందును దృఢముగా నిలుచును. శౌచము, ఆస్తిక్యము, స్వార్థరహితమగు నధికార స్వామ్యములు, విద్యాజ్ఞానముల కొఱకనన్య శ్రద్ధాభక్తులు. నివి బ్రాహ్మణ వర్ణగౌరవములుగా దలంపబడును; శౌర్యము, తేజస్సు, ధృతి. సగర్వపూరితాత్మ నిగ్రహము, ఉదార స్వభావము, ఆభిజాత్య గౌరవములు యివిక్షత్రియగౌరవములుగా భావింపబడును; వ్యవహారనీతి, వ్యాపార సత్యవర్తనము, ఉత్పత్తి, నియమవిధానజీవితము, దానము, లోక హితేచ్ఛ యివి వైశ్యగౌరవములుగా భావింపబడును; విధేయత, అణుకువ, భక్తిపూర్వక సేవ నిస్వార్థానురాగము. యివి శూద్రగౌరవములుగా భావింపబడును. కాని యివన్నియూ, మానవుని నిజ ఆంతరిక స్వభావముగాగాక, నిజ మనస్తత్వమునందు సజీవభావముగా నేర్పడినవిగా గాక, సంఘసమ్మతమైన యాచారముగ (అయాచారముదాత్త మైనదియే యయ్యును) మాత్రమే యైయుండును. అంత్యమున, నీగౌరవ గుణములు జీవితమునందలి స్థిరసత్యములుగా గాక, వర్ణసంప్రదాయములుగ మాత్రమైయుండును.

ఏలన, సంఘ మాదర్శకదశనుండి ఆచార ప్రధానదశకు స్వాభావికముగనే మారును. ఆదర్శాంతః సత్యములకన్న బాహ్యాచరణ మాత్రమే ముఖ్యమైనపుడు, బాహ్యవర్తనమే సంఘమునందు ప్రధానమైనపుడు, ఆచార ప్రధానదశ, సంఘము నందంకురించును. అందుచే గుణపరిణామమునందు, జన్మ, ఆర్థికవృత్తి.మతవిషయక నియమము, సంస్కారము, కుటుంబాచారము, అను నీ బాహ్యవిషయములు, వర్ణ నైతిక ధర్మములను పోషించును. ఈ బాహ్యవిషయములలో నొక్కొక్కటియు, సంఘ వ్యవస్థయందు తమ ప్రత్యేకస్థానమును. ప్రాధాన్యమును నతిశయ మొన రించును; ప్రారంభదశలో సంఘవ్యవస్థయందు జన్మ, ప్రాధాన్యము లేనిదై గుణ శక్తులు మాత్రమే పరిగణింపబడుచుండెను; కాని తర్వాత యాదర్శభావము స్థిరమగు కొలది, యా యాదర్శమును నిలుపుకొనుటకు విద్యాసంప్రదాయము లవసరము

లయ్యెను. ఈ విద్యాసంప్రదాయములు స్వాభావికముగనే వంశ పారంపర్యగత మయ్యెను. ఈ విధముగ బ్రాహ్మణుని సంతతిని బ్రాహ్మణుడుగ పరిగణించుట లోకాచారమయ్యెను. జన్మమాత్రమేగాక, వృత్తియు వంశపారంపర్య పద్ధతి కనుకూలమయ్యెనేని, యీ విధానము సంఘమునందు మఱింత బలపడును. ఈ పద్ధతి సంఘమునందు రూఢిగ నేర్పడునంతలో నైతికాదర్శములకుగల విలువ ప్రథమస్థానమునుండి రెండవస్థానమునకేగాక, మూడవస్థానమునకు గూడ దిగుట యయ్యెను. వర్ణవ్యవస్థకు మూలధారమైయుండిన నైతికాదర్శము, దాని విలువ తఱిగి – ఈ నైతిక విహీనత, విచారశీలునిచే, నాదర్శక శాస్త్రనిర్ణాయకునిచే నంగీకరింపబడకున్నను – సంఘముచే బూర్ణాంగీకారము బడసెను. నైతికాదర్శమునకు విలువ తగ్గినంతనే, దానిని గమనించుటయు మానిపోవును. అంత్యమున నీవర్ణసాంప్రదాయమునకుగల యార్థికాశ్రయముకూడ విచ్ఛిన్నమొందె. జన్మయు కుటుంబాచారములు మాత్రమే నెలకొని వానినంటుకొనియుండు వక్రతలు, అర్థములేని మతచిహ్నములు, ఆచారములు, ఆదిసంకేతమును వెక్కిరించు సంప్రాదాయములై, కులమును పోషించునవియై, యార్యసంఘము కలిగియుగమున ప్రవేశించును.

కులములకు ద్రవ్యము ప్రధానముగాగల యుగమునందు, పౌరోహితుడు, పండితుడు, బ్రాహ్మణు లనిపించుకొనును. పరిపాలకులు, వారి సామంతులు క్షత్రియులనిపించుకొందురు; వ్యాపారి, ధనార్జకుడు వైశ్యుడనిపించుకొనును; అర్ధపోషణగల కూలియు బానిసయు శూద్రుడగును. ఈ ఆర్థికపాలనము కూడ యంతరించెనేని చాతుర్వర్ణవ్యవస్థకు వ్యాధి వార్ధక్యము మాలిన్యము పూర్ణముగా తటస్థించెననవలెను. చాతుర్వర్ణమన్నది నామ మాత్రమై, బూటకమై సారములేనిదై సంఘముయొక్క వ్యక్తి ప్రధానదశయను మూసయందు కరిగిపోవలయును, లేదా జాతి యంతయు నిశ్శక్తిచే గపటముచే గ్రుంగిపోవలయును.

ఆచార ప్రధానదశయందు సంఘము, జీవితవిధానమును నిర్ణయించి స్థిరపఱచి దానికి నిశ్చితాకారము నిచ్చి పురోహిత సంప్రదాయముగ మార్చి మతమును రూఢిబద్ధమొనరించి విద్యకు శిక్షణకు, అనుల్లంఘనీయమగు సంప్రదాయమును కలిగించి, వివేకము నధికారపరముగ జేసి మానవజీవితమునకు నిర్దిష్టమగు నంతిమ గతి నేర్పఱచును. ఈ దశయందును ప్రారంభమునను సంఘము విచారమందును నాంతర భావమందును సజీవాత్మకమై, దాని బాహ్యరూపములు జీవకళతో నిండియుండును. ఆకాల విభాగమును సత్యయుగమేయని కొందఱు చెప్పవచ్చును. ఈ సత్యయుగము

చాల సంతోషదాయకమై దూరసంతతి కాకర్షనీయకమై దాని నియమబద్ధతచే సౌష్టవముచే సంఘ నిర్మాణౌచిత్యముచే, నున్నతోద్దేశ్యముల కనుకూలముగ బని చేయు వివిధాంశముల సామరస్యతచే వ్యామోహకమై కనబడును. అందుచే నాధునిక విద్యాపారంగతుడు కళావంతుడు విచారశీలుడు విస్మయముతో గతమును తిలకించుచు మధ్యయుగమునాటి ఐరోపాస్థితిని వాంఛించు చుండును; కాని యాతడు దాని పురాతన కవిత్వోన్నతియందు. దాని యాధ్యాత్మిక దృశ్యతయందు. దాని మూర్ఖత. అజ్ఞానము. కపటము. క్రూరత. ప్రజాపీడనము. క్రింది తరగతుల యందలి మానవుని బాధావిరోధములు బాహ్యసౌందర్యమునకు వెనుకనున్న మాలిన్య దుఃఖ ములు వీని నన్నిటిని మఱచును. ఇతనివలెనే హైందవాచర్య పండితమాని గతకాల మును శాస్త్రనియమానువర్తనంబగు క్రమశిక్షిత సంఘముగ దలంచి దానిని సత్య యుగమని యనుకొనును. మరియు, ఐరోపా మధ్య యుగమునకన్న నున్నతమైన దని తలంచును; కాని యది బంగారముతో గప్పబడిన సత్యయుగము కాదనియు, బంగారముగ గనబడునదంతయు శుద్ధమైనదిగాక, మిశ్రమ స్వర్ణమనియు. అది యును పైపూతకుమాత్రమే యుపయోగింప బడినదనియు గ్రహించుకొన జాలడు. సంఘము యొక్క యాచారప్రధానదశయందలి ప్రథమ భాగమున మానవోన్నతి కనువగునుదార వస్తువు చాలయున్నది; అట్లయ్యు. నది శ్రేష్ఠయుగము మాత్రము కాదు. ఆ యుగమునందు మనము కాంక్షించు సత్య మనుభవసిద్ధమై యుండలేదు; ఆ సత్యము కుశల రూపమున ననుకరింపబడి మాత్రముండెను; ఆ యనుకరణ యందును శేషించిన సత్యము అంత్యభాగమున సూత్రములు నియమములు ఆచార ముల క్రింద కరుడుగట్టి నశించిపోయినది.

ఏలయన నెల్లప్పుడును కాలముగడచు కొలది యాంతరసత్యము దూరమై విలయమగును; బాహ్యరూపము మాత్రము మిగులును. ఆ సత్యము మరల బయట పడి ప్రాతరూపమును సత్యయుత మొనర్చుటకు, మార్పు పొందించుటకు, ప్రబోధిత మగును; తాను స్థిరపడుటకును. తనతోకూడిన రూపమును స్థిరపఱచుటకును ప్రయత్నించును. కాని కాలమహిమ దానికి వ్యతిరేకముగ బలీయమై యుండును. మతవిషయక చరిత్రయందది స్పష్టముగా కనపడుచున్నది; సాధుపుంగవులయు మత సంస్కర్తలయు ప్రయత్నములెంత ప్రాణశక్త్యావేశము కలవై యున్నను — వానిఫలితములయందు అవి దాత్కాలికములై, బలహీనములై యున్నవి ఇట్టి ప్రయత్నములను, హిందూదేశమున, దాని యంధకార బలహీన

తలు పెరుగుసమయమున గడచిన వెయ్యి సంవత్సరములుగా నాధ్యాత్మిక పురుషులు దమ యనవరత దృఢప్రయత్నములచే బూర్వసత్యమును శక్తిని యాచారపూరిత సంఘమునందు మేల్కొలుపుటకు గావించిన ప్రయాస యంతయు మనము చూచు చున్నాము; వారి ప్రయత్నము లెట్లు విఫలమైనదియు గూడ జూచుచున్నాము. ఆ మహాపురుషులు స్థాపించిన నూతన వ్యవస్థలు వారు గడచినతర్వాత నొకటి రెండు వంశముల కాలముగూడ గడువకమునుపే పూర్వ సంఘపు టాచారములు వానినిమ్రింగి వేయుచుండెను. "ఐరోపాలో కాథోలిక్కుల శ్రమణవృత్తి మరల మరలనుద్ధరింపడి మరల మరల నశించుచుండు శోచనీయస్థితిని" జూచుచున్నాము. ఇట్టి ప్రయత్నములు వృద్ధియగుకొలది ఒకానొక సమయమున మరియొక సంఘదశ ప్రారంభ సూచకముగా లోకాచార ప్రాధాన్యతకును సత్యమునకును మధ్యగల భేద మెక్కువై సహించ వీలులేనిదై, యందుచే బౌద్ధిక శక్తిపరు లుత్పన్నమై దృఢముగ భీకరముగ సమస్తనియమములను భక్షించుచు, చిహ్న-ఆదర్శ-ఆచారములను నిర్మించు కొన్న మందిరమును నిశ్చల హేతువాదముచే గూలద్రోయుచును, వ్యక్తిగత సహేతుకబుద్ధిచే నైతిక భావముచే నావేశ పూరితకాంక్షచే సత్యమును మరల శ్మశాన వాటికనుండి లేవదీయును. ఇట్టి సమయమున సంఘమునందు వివేక విషయముననుమతవిషయముననను వ్యక్తిగతయుగము నూతనముగ సృష్టియగును; ఇంతటితో స్పష్టవిరోధ ప్రతిపాదనములుగల యుగము: సహేతుక వాదయుగము, విప్లవ యుగము, వృద్ధి స్వాతంత్ర్యముల యుగము. ప్రారంభమగును. దీని పూర్వ యుగమగు ఆచార ప్రధానయుగము బాహ్యమున సత్యము దొరకుననియు యంత్ర సదృశ విధానముచే సిద్ధి సాధింపవచ్చుననియు తప్పుదారి కీయుగమును దీయ ప్రయత్నించినను, ఈయుగ స్వాతంత్రము ఆంశికమై, బాహ్యస్వరూపమును గలిగి నదిమాత్రమేయయ్యు, నీ వ్యక్తిప్రధానయుగమునకు దర్వాతిదియగు నంతర్ముఖ ప్రధానయుగములోనికి సంఘమును కొనిపోవలయునన్న ఈ నాల్గవదశయగు వ్యక్తి ప్రధానదశను సంఘము తప్పక యనుభవించితీర వలయును; ఈ చక్రమును క్రమముగా చుట్టివచ్చుటచేత మాత్రమే మానవసంఘము తన యంతరాత్మను గడపటికి నుపలబ్ధిపొంది సంస్కృతియొక్క నూతన చక్రమును ప్రారంభించును.

*　*　*　*　*

నీ జడసత్త్వయందు, శాంతిని ఆధారముగను, సరళసత్యహృదయతను సాధనముగను గలిగి, పురోగతి నొందుము; ఇప్పుడే, లేక తర్వాతనో, నీవు దివ్యచేతనతో నైక్యము పొందుట తప్పదు.

* * * * *

దైవమున కొనరించు సమర్పణ, కృత్స్న రూపాంతరము. యివి, వినూత్న పూర్ణసృష్టికి గొనిపోవు రెండు మహోన్నత పథములు.

* * * * *

సర్వాంగపూరిత యోరిమిచే: సమగ్ర మానసిక మార్దవముచే, కృత్స్న వృద్ధికర వ్యవస్థచే, ప్రాణిక శత్రువులపై విజయము గాంచుము.

* * * * *

# 3-వ అధ్యాయము

## మానవ - ఐక్యతావశ్యము

ప్రపంచములో నెప్పటికైన క్రమ మేర్పడవలె ననిన నూతన ప్రపంచ క్రమారంభ మొకటి శాశ్వతావసరమని ప్రభుత్వములు ప్రపంచ ప్రజానీకము తహతహలాడుచుండ సంశయములతో కూడుకొనిన ప్రథమప్రయత్నచర్చలు, ఈ పుస్తకము ముగియుకాలమున రేకెత్తెను. కాని దాని కెట్టిరూపకల్పనయు చేయబడలేదు. చివరకు 'జాతులకూటమి'తో నొకశుభ ప్రారంభము కావింపబడెను. (League of Nations)

2. దీనిపుట్టుక యంత సంతసింపదగినది కాదు; దాని నిర్మాణమూ ప్రబోధాత్మకము కాదు. దీనికి చిరజీవితముకాని, ఘనవిజయచిహ్నములుకాని ద్యోతకము కావు. కాని యిట్టి వ్యవస్థ యొకటి ప్రారంభమై పురిటిలోనే సంధికొట్టక కొంత కాలము మనగలుగుట ప్రపంచచరిత్రలో నూతనాధ్యాయమే. ఏలయన నిది విఫలమైనను మరల దీని నింకొకరూపములో సాధించు బీజ మిందులో కలదు. ఇది విఫలము కాగానే మరియొకరూపములో నీప్రయత్నము తల యెత్తి నిరంతరకల్లోల కలుషితమై, మారణాస్త్రవిధ్వంసములవలన మొత్తమునాగరికతకే కాకుండ మానవజాతి యాత్మహత్యకే దారి తీయు దురితములనుండి రక్షించి మానవభవిష్యత్తును భద్రపరచు విజయవంతమైన పరిష్కారము సాధింపబడువరకు నీ ప్రయత్నమాగునది కాదు. అనుకొనట్లే 'జాతులకూటమి' యంతరించెను. కాని ఐక్యరాజ్య సమితి యనునది నేడు ముందుకు వచ్చి యొకవిధమగు శాశ్వతభద్రతకొరకు కృషి చేయుచున్నది. ప్రపంచభవిష్యత్తు ఈ మహత్తర ప్రయత్న విజయముమీద నాధారపడియున్నది.

3. ప్రకృతి తన విధాయక ప్రయోజనమును నెరవేర్చు కొనుటకే సర్వప్రపంచపోకడల పుంజీభూతిసారముగా నిట్టి గొప్పసంఘటనను సమకూర్చెను. మానవయత్నములోనున్న నిరంతరదోషములు, మానసికతికమకలు, విజయావ

కాశములను కొంతకాలము భంగించును. లేదా ఆలసింపజేయు వక్రతలెన్ని యున్నను నీప్రయత్నముమీదనే ముందుగతి నిశ్చయింపబడవలెను. మానవజాతియభివృద్ధికే కాక బహుశః దానిమనుగడకే యవసరమైన యిట్టిప్రయత్నములో సంభవించు ననేక యవాంతరము లింకను సంభవింపనున్నవి. ఎన్నియున్నను నీయత్నము విజయ వంతమగువరకు నాగునది కాదు. రెండు బ్రహ్మాండమైన ప్రపంచవిధ్వంసక యుద్ధము లీగోళమును తుడిచిపెట్టినవి. వాటితోపాటుగ నీప్రపంచరాజకీయపటమును, అంత ర్జాతీయసమతను చిందరవందర చేసిన విప్లవము లొకప్పు డైదు ఖండములలో స్థిర తరసమత ననుభవించిన ప్రపంచమును తారుమారుచేసి దాని భవిష్యత్తును మార్చినది. మూడవయుద్ధము ముసళ్లపండుగ ముం దుండనేయున్నది. ఇందులో పూర్వ మెన్నడు నెరుగని నవీనశాస్త్రాభివృద్ధిజన్యములగు నణుబాంబులతో మానవహననకర్మ ప్రారంభమై యీనాగరికతయే కూలిపోవు సూచనలు కలవు. ఇంకొక చిత్రము! ఇట్టి దెద్దియో సంభవించునని జాతులన్నియు నిరంతరము భయపడుచు దానితో యుద్ధప్రయత్నములను మరింతగా సాగించుచో సంఘర్షణ లేకపోయినను నిరంతర వైర భావమును పెంచుకొనుచు యుద్ధములేని శాంతికాలములోనే "చలియుద్ధము" ననుభవించుచున్నవి. కాని రెండుయుద్ధములు జరిగినను ఐక్యతకొరకు జరుగు ప్రయ త్నము లాగిపోలేదు. అది మరింత యవసరమై మొదటియుద్ధముతో వచ్చిన 'జాతుల కూటమి' రెండవయుద్ధముతో "ఐక్యరాజ్య సమితి" యయ్యెను. మూడవ యుద్ధము రాక తప్పనిచో దానితోపాటే మరియొక తుదిప్రయత్నముకూడ జరుగును. ప్రకృతి తన ప్రయోజనముకొరకే యిట్టిపరస్పర విరుద్ధ పద్ధతులను సహించి తన పనిని నెరవేర్చుకొనును. ఆధ్యాత్మిక శాస్త్రయోగ కళాభ్యాసములవలె నిచ్చటను ప్రకృతిలోనేయున్న మానసిక ప్రవృత్తుల కుద్వాసము చెప్పి వాటిస్థానే యాధ్యాత్మిక భావములను ప్రతిష్ఠించవలెను. ప్రకృతి ప్రయోజనముల కడ్డువచ్చు విఘ్నము లన్నియు నిట్లే తొలగింపబడుచు, విఘ్నములే ప్రకృతి మాతకు తత్ప్రచోదకునకు జయపరంపర లగును.

4. కనుక నింతవరకు సాధింపబడిన దానిని మనము యుక్తముగ గుర్తిం చుచు భవిష్యత్తుపై నాశ పెట్టుకొనవచ్చును. కాని యీయాశచే మనము మానవ ప్రపంచమున సంభవించుచుండు నాటంకములను, అక్రమములను, విధ్వంసకస్వభా వములను, అవాంఛనీయలక్షణములను నెంతమాత్రము విస్మరింపరాదు. నేటిపరిస్థితు లనే చూడుడు. "ఐక్యరాజ్య సమితి'' లో నున్న దోషములచే ననేకమంది విసిగి

యున్నారని యొప్పుకొనవలెను. చాలమంది దీనివిజయమునుగురించి శంకించు చున్నారు. ఇట్టిశంక అనవసరము. అది బుద్ధిలక్షణము కాదు. అట్టిమన స్తత్వము వలన నట్టిఫలితములకే దారి తీయు పరిస్థితు లేర్పడవచ్చును. కాని యీస్థితి కాస్కార మీయరాదు. ఉన్నయుపద్రవమును మనము విస్మరింపనురాదు. విజయమును సాధింప గల యిచ్ఛాశక్తి, వారింపతగిన ప్రమాదములను గుర్తింపవలసిన బాధ్యతయుగల జాతీయనాయకు లేమరియున్నచో ముందుతరమువారు వారిని నిందింపకమానరు. ఈ వ్యవస్థలో లేదా దాని నిర్మాణములోగల సాధకబాధకములకు వెంటనే చికిత్స చేయ వలెను. లేదా వానిని క్రమముగా యుక్తియుక్తముగా తప్పించవలెను. చేయవలసిన మార్పులకు వ్యతిరేకత యున్నచో సంస్థ విచ్ఛిత్తి కాకుండ వాని నెట్లో తరించు మార్గములను కనిపెట్టవలెను. ఎంతటికష్టమైనను నీయత్నము పరిపూర్ణత నొందు పురోభివృద్ధిమార్గమును వీడక ప్రపంచములో జనించుచున్న నిరాశను తొలగింపక తప్పదు. మానవుల కోర్కెలలో దాదా మానవ ప్రకృతిలో నొక శుభోదర్క పరిణామమును కలిగించియో లేదా మానవవిధిని సుఖతరముగ సాధించు మరియొక అమోఘమార్గము చూపగల శక్తిలభించువరకో మానవజాతి కింతకంటె వేరుగతిలేదు.

6. విశ్వైక్యతకు ప్రారంభమైన మొదటిభావము, రూపమునైన 'జాతీయ కూటమి' నిర్మాణములోనే కొన్ని ప్రమాదములు కలవు. ఒకేనమూనా యుండ వలెనను నిర్బంధమువలన నీకూటమియొక్క కార్యాచరణ సాఫల్యత కుంటువడెను. పరిమితమై, నిరర్థక మయ్యెను. అసలు దానిపుట్టుకలోను, రచనలోను దోషము కలదు. అప్పటి ప్రపంచపరిస్థితులే దానికి కారణ మయ్యెను. ఈజాతీయకూటమి నిజ మునకు పెద్దప్రభుత్వములు తమవెనుక కొన్నికొన్ని చిన్నప్రభుత్వములను దాచి పెట్టుకొని కేవలము అందరి శ్రేయస్సుకొరకు, ప్రపంచ కళ్యాణముకొరకుగాక తమ తమ యధికారములకొరకే యేర్పరచిన అధికారకూటమి. ఈస్వభావము రాజకీయ రంగములో సువ్యక్తమయ్యెను. ఆపరిస్థితులలో నడిచిన యెత్తులు, పోట్లాటలు, రాజీలు, సర్దుబాటులు ప్రారంభములో ననుకొన్న పనులను నెరవేర్పజాలకపోయెను. రష్యాయొక్క స్థితి, అమెరికా అందులో లేకుండుటయును ఈ మొదటిప్రయత్నము వ్యర్థ మగుటకు కారణ మయ్యెను. "ఐక్యరాజ్య సమితి" చట్టములో నీ దోషము లను సిద్ధాంత రీత్యా నివారించుటకైనను కొన్ని యేర్పాటులు కావింపబడెను. కాని యీయత్నము నిర్దుష్టము కాదు. పూర్తిగా విజయవంతము కాలేదు. భద్రతాసంఘ ములోనున్న అయిదు పెద్దప్రభుత్వములకు విశేషాధికారములు హస్తగతమై నిరాకరణ

(veto) అధికారమువలన గట్టిపరచబడెను. ఇది యంతయు రెండవ ప్రపంచ యుద్ధానంతర మేర్పడిన వాస్తవిక పరిస్థితుల ఫలితము. ఇది విధిలేక జరిగిన పని. కాని చిక్కును విడదీయుటకు బదులిది యీ నూతన సంస్థకార్యక్రమమునే భంగపరచి విజయమును దూర మొనరించి సంయుక్త కార్య నిర్వహణములో నున్న పుండును పెంచెను. ఈ దోషముల నన్నింటిని తొలగించుట కేదేని తొందరయైన తీవ్రచర్య తీసి కొననిచో నసలుకట్టడమే కూలిపోవును. మార్పులు లేకుండ విడిచిపెట్టినచో వ్యాధి దీర్ఘమగుచు నెంతో కష్టముతో నిర్మింపబడిన యుపయుక్తమగు నీ సంస్థ చెడి ప్రపంచములో శాంతి యనునదియే లేక ప్రపంచనైరాశ్యమునకు, ప్రపంచ పరిస్థితులకు చికిత్సయే యుండజాలదు. క్రొత్త దుస్సంఘటన వలన నీ సంస్థ కూలినచో నింకొకవిధమగు నిర్మాణముగల సంస్థ దీనిస్థానమును తీసికొనును. కొన్ని సందేహాస్పదములగు దుశ్శకునములే తమబెదిరింపులను తథ్య మొనరించినచో మూడవ ప్రయత్నము తలయెత్తి యీసారియైనను వెనుకటి దోషముల నన్నింటిని గుర్తించి మరింత సార్వజనీనమైన నిశ్చయముతో మరెట్టిఘోరము సంభవింపకుండ చేయవచ్చును. కాని రెండు ప్రపంచయుద్ధముల ఫలితముగ నేర్పడిన అంతర్జాతీయ కట్టడమును సమూలముగ దగ్ధ మొనరించు మూడవ సంగ్రామము జరిగిన తర్వాతనే యిది సంభవించును. అట్టి దౌష్ట్యమే సంభవించెనా యది ప్రకృతిమాత యుద్దేశ్యమే. అది తానే తల యెత్తించిన యీ రోగముల నొక్కసారిగా తుడిచిపెట్ట శాశ్వతనివారణ జరుపుటయే యగును. కాని దానికైనను ఫలితార్థముగ నొకయథార్థ ప్రపంచ ప్రభుత్వ మేర్పడ వలెను. ఇందులో మినహాయింపు లుండరాదు. చిన్న–పెద్ద ప్రభుత్వములు, బలము–దుర్బలము అనుభావములు ప్రవేశింపరాదు. ప్రపంచ ప్రజాసామరస్య మును కాపాడు నూతన అంతర్జాతీయ న్యాయమువలన నిట్టినై సర్గికావసరములు తీరి పోవలెను. తిరుగులేని న్యాయము, తాత్త్వికమైన సమత్వము, హక్కులను ప్రయోజనములను సమముగా గుర్తించుట – ప్రపంచ ప్రభుత్వ మిట్టిపునాదిమీద, నిట్టి న్యాయముమీద నిర్మింపబడవలెను. ఐక్యతకొరకు జరుగుచున్న యీ రెండవ యభివృద్ధి స్థాయిలో సంయుక్తజాతుల వ్యవస్థలోనున్న దోషము లంతగా పాటింప దగినవి కావు. కాని ప్రజానీకమును సహజవైరులుగా తయారు చేయునట్టి రెండు ముఠాలుగా చీల్చి యేనిమిషము లోనైనను బహిరంగ శత్రువులుగా ప్రకటించుకొని కలిసి జీవించుటయే దుర్ఘటమగునట్టి పరిస్థితియే నేడు నిజమైన యుపద్రవము. బోల్షివిస్టు రష్యాలో సహజమైన శీఘ్రపరిణామమువలనగాక, అపూర్వమైన క్రౌర్య

ముతో చాలకాలము నడిచిన విప్లవజనితమైన పోరులో వర్గయుద్ధ మేర్పడి "కార్మిక నిరంకుశత్వము"తో నేర్పడిన సహనము నెరుగని పద్ధతియైన కమ్యునిజమే దీనికి కారణము, ఇది సంకుచితము, బలవత్తరమునైన పార్టీ ప్రభుత్వము. ఆ పేరుతో వర్తించిన పోలీసు ప్రభుత్వము. బాహ్య ప్రపంచముతో మరణాంతక సంఘర్షణ. ఈ పోరాట మతిభయంకరమై యీ నూతన ప్రభుత్వ సంస్థాపకుల మనస్సులలో నొక విద్ధూరభావ మేర్పడెను. పూర్వ ప్రభుత్వములన్నియు నశించి యీ నూతన క్రమమే ప్రపంచమంతట వ్యాపింపవలెనని దానికొరకు నిరంతర పోరాటమైనను సాగించి ప్రపంచములో పూర్తిగా కాకపోయినను నధికభాగమైన నారాజకీయ, సాంఘిక సందేశము స్థాపింపబడవలెనని వారియాశయము.

6. కాని యీస్థితి మారిపోవచ్చును. ఇందులోని క్రౌర్యము, మొదటిశాఠ్యము, దౌర్జన్యపాకము, కలిసిజీవించుట యసాధ్య మను సహనరాహిత్యము క్రమముగా తగ్గిపోయి, యాశయముల పేరిట ప్రపంచాధిపత్యమును చెలాయింపవలెనను భావము పోయి రెండు ఆశయములు కలిసి జీవించుటయే పరమగతియను భావ మేర్పడ గలదు. ఈభావ మేర్పడగానే యీ రెండు విరుద్ధ ఆశయములు దగ్గరకు వచ్చి ఆర్థిక ప్రయోజనములను గురించి చర్చించుకొనుట దుర్లభము కాదు. ఏలనన సాంఘిక జీవితముపై ప్రభుత్వమే యెక్కువ బాధ్యత వహింపవలె నను సిద్ధాంత మొకటి నేడు ప్రపంచము నావరించుచున్నది. సాంఘిక జీవితమును ప్రభుత్వములే నిర్వహించుచుండు ప్రభుత్వములు కొన్ని, పెట్టుబడి విధానమును సంస్కరించి దానిని తమ వశములో నుంచుకొని నడుపు ప్రభుత్వములు కొన్ని కలసి మైత్రితో జీవించు స్థితి రావలెను. రాగలదు. ఈ రెండును తమతమ సంస్థలను నిలుపుకొనుచు నొక సామాన్య సభను నిర్మించుకొని తద్ద్వారా ప్రపంచ ప్రభుత్వమును స్థాపించుకొన వచ్చును. ఇది యెంతమాత్రము నసాధ్యముకాదు, సంయుక్త జాతీయ సంస్థయొక్క పరమాశయమే యిది. ఏలనన నిప్పుడున్న సంస్థ పూర్ణరూపము కానేకాదు. ప్రపంచ ప్రజలందరు సమావేశమై సర్వప్రపంచసమస్యలను చర్చించుకొనగల సమాన అంత ర్జాతీయ ప్రపంచసభ యేర్పడువరకు నిది నాందిగా తలయెత్తిన ప్రాతిపదిక సంస్థ. ఇట్టి ప్రపంచ ప్రభుత్వ నిర్మాణమే నేటి ప్రపంచమును చక్కదిద్దగల యేకైక సంస్థ.

7. ఇప్పటి పరిస్థితులనుబట్టి యీ భావిజ్యోతిషము కేవల మూహాగానమని గేలిసేయవచ్చును. కాని నిరాశావాదులు తలపోయు మహోత్పాతముల కెంత యవ

కాశ మున్నదో యట్టియవకాశమే యీ యూహకును కలదు. ఏలనన క్రొత్త యుద్ధమువలననే వారూహించు వినాశము జరుగనక్కరలేదు. తనదోషముల వలననే జనించుచుండు ఘోరప్రమాదములను లేదా ప్రకృతిమాత భీషణ ప్రకోపములను తరించుచుండు శక్తి మానవజాతికి ప్రసాదింపబడినది. మానవజాతి మనుగడ కొకయర్థమే యున్నచో నీప్రపంచ స్వభావము విషయాత్మికముగాక యవిచ్ఛిన్నముగా ప్రయాణించుచున్న పురాణ మానవజాతి యకుంఠిత చరిత్ర హఠాజ్జనితంత్రము గాక తన పరివర్తనమున కతడే ప్రస్తుత యజమాని. యసంపూర్ణ విజ్ఞాన నాయకుడై యీ నిరంతర ప్రస్థానమునుండి తరింపవలెననిన యిది యిట్లే జరుగవలెను. ఆతడీప్రస్తుత సంకుచిత అంతర్జాతీయ జీవితము నుండి బయటపడి విశ్వైక్యతను సాధించు కార్యమును ప్రారంభిపవలెను. ఒకవిధమగు ప్రపంచ ప్రభుత్వము – అది యొకేయొక సంస్థ లేక సమాఖ్య, మిశ్రమ ప్రభుత్వము, మరేది యగుగాక – స్థాపింపబడవలెను. ఇంతకంటె చిన్న ప్రయత్నము లేక గుల్ల వ్యాపారము పనికిరాదు. అప్పుడే యీ గ్రంథములో సూచింపబడిన సిద్ధాంతము నిలుచును. భావిమానవ ప్రజాళి చరిత్రఛాయలను చూపినవార మగుదుము.

8. ప్రస్తుత అంతర్జాతీయ పద్ధతి – దీని నట్లు పిలువగలిగినచో – నిరంతర పరివర్తనలతో లేదా విప్లవములతో సాగుచున్న యీ తాత్కాలిక క్రమము—పోయి దీనిస్థానములో స్థిత ప్రజ్ఞతో స్థిరముగా స్థాపింపబడగల నిజమైన సంస్థకు, ప్రపంచ ప్రజల సామాన్య ప్రయోజనములను కాపాడగల సంస్థకు, నిజమైన యైక్యతను సాధించగల సంస్థకు తావు లేదా యని నిత్యపరిణామమును పొందుచున్న ప్రకృతి, మానవజాతిని ప్రశ్నించు చున్నది. మానవ ప్రజ్ఞ మొట్టమొదట యెక్కడికక్కడ తన నెదుర్కొనిన బాహ్యాగందర గోళమును, శత్రుత్వమును స్థానికముగ నెదుర్కొనుచు చిన్న పెద్దతరహాల నాగరికతను, క్రమముగ సాధించుకొనుచు వచ్చెను. అంతర్జాతీయ న్యాయము. కలయిక. రాకపోకలు. పరస్పర మిచ్చిపుచ్చుకొనుటలు– ఎంత అంతర్జాతీయ వైవిధ్యమున్నను. ఎట్టి సంఘర్షణలు, రక్తపాతము, స్థానిక దారుణ కాండలు, అక్రమము, పైశాచిక తాండవము చివరకు ప్రపంచములో చాల భాగమును తుడిచిపెట్టిన యుద్ధములు సంభవించినను, నిది చిట్టచివర కొక అంతర్జాతీయ సంస్థవంటి సంస్థగా పరిణమించెను. మానవజాతి పరమావధిని పాలించు అంతరంగ దేవత శిథిలమై సంతృప్తి నీయజాలని పాతక్రమమును తీసివేసి దానిస్థానే ప్రపంచములో స్థిరమైన శాంతిని ప్రసాదించు ప్రపంచ పరిస్థితులను

కల్పించి ప్రపంచ భద్రతను రక్షించగలదను నాశ మానవహృదయములలో హత్తు కొనిపోయెను. కొద్దిమంది మహనీయులచే భావింపబడి చాలకాలము 'గొప్పపిచ్చి' మనుకొనబడిన మానవజాతీయైక్యత యథార్థము కాగలదు అప్పుడు శాంతికి, సామరస్యమునకు స్థిరమైన క్షేత్ర మేర్పడి మానవుని మహోన్నత కలలు నిజములగుటకు సావకాశము, మానవజాతి పూర్ణత్వము నందు కొనగలుగుట, పరిపూర్ణత నొందిన సమాజము, మానవ ప్రకృతి, మానవాత్మ యున్నతపరిణామస్థితిని సాధించుట పొసగగలవు. నేటిమానవులు తప్పితే రేపటిమానవు లైనను దీని కుత్తరవాదులు కావలెను. ఏలనన అలస్యమైన కొలది లేదా నిరంతరము విఫలుల మైనకొలది యసంఖ్యాకమైన దోషపరంపర లాపహించి సమస్తమును చిందరవందర చేసి చివరకు పరిష్కారమే దుస్సాధ్యము, అసాధ్యము కాగలదు. చివర కది నేటి ప్రపంచనాగరికతకేగాక మొత్తము నాగరికత కంతకు తీరని యంతరాయముగా నేర్పడవచ్చును. బహుశః పెద్దయెత్తున నొక మహాసంక్షయము జరిగినతరువాతనే యా చితినుండి యొకయుత్తమమానవజాతి, లేదా మానవాతీతజాతియుదయమునకు మార్గము దొరికినప్పుడే జయప్రదము కాగల నూతనసృష్టి జరుగగలదని చెప్ప వచ్చును.

9. ముఖ్యవిషయ మే మన మానవజాతి కలిసి జీవించుటకు సహజసిద్ధమైన జాతీయత – ఇది యతివిశాలమైనది – ఇదియే దీనియంతిమ పరమగమ్యస్థితియా లేక దీనికంటెను విశాలమై పెక్కుజాతులను – చివర కన్నిజాతులను – తనయంతరంగమున నిముడ్చుకొనగల సమాజస్థితి సంభవమా ? అనునదే సమస్య. పెద్దపెద్ద సంస్థలను నిర్మింపవలెను కోరిక, జాతీయతను మించిన సమాజములను నిర్మింపవలెనను చొరవ లేకపోలేదు. అది మానవ జాతిసహజవాంఛ–శాశ్వతవాంఛ. కాని యీకోరిక యితరజాతులను, వారిఖండములను ఆస్తులను, ప్రజలను దోచుకొనుటగా మారెను. ఇంతే కాదు. బలవంతమైన జాతి బహీనమైన జాతిని, వారిసమస్తమును కలుపుకొనుట, జీర్ణించుకొనుట, తమవిజ్ఞానమును వారిమీద రుద్దుట మొదలగున వెన్నియో జరిగెను, రోమనుసామ్రాజ్యమే యిందుకు ప్రబలతార్కాణము. గ్రీకు రోమనుల కలయికలో వైజ్ఞానిక, రాజకీయ, పరిపాలనా సంబంధ బాంధవ్యము లన్నియు నైక్యత నొందెను. భౌగోళిక పరిధులలో నిది యిట్టి మానవైక్యతకు మొదటిరూపము లేక అసంపూర్ణస్వరూపమని చెప్పవచ్చును. మానవ చరిత్రలో నిట్టివే యనేక ప్రయత్నములు జరిగెను. కాని యవి బహుకొద్ది శతాబ్దములు

మాత్రమే నిలిచెను. అని యవలంబించిన పద్ధతియే లోపభూయిష్ఠము. ఏలనన మానవజాతి పరివర్తనకు, చైతన్యమునకు నవసరమగు నితర జీవితస్వభావములకే యవి విరుద్ధముగ పని చేసెను. చివర కిది యభివృద్ధిని స్తంభింపజేసి పల్వలముగ తయారయ్యెను. సామ్రాజ్య సమాజములో జాతీయతను మించిన అజేయమైన ప్రాణశక్తి లేకపోయెను. ఇట్టి సామ్రాజ్యరూపము లింకను నిలిచియున్నవి జర్మనీ, చీనాలుమాత్రమే. నిజమునకివి జాతీయరూపములుకాని జాతీయత నతిక్రమించిన వెంత మాత్రము కాజాలవు. అన్నిజాతులను కలుపగల యేకైక లక్ష్యముగల నూతనాదర్శ మెద్దియో యిప్పటిపరిస్థితుల కనుగుణమైనది — బలమైన కమ్యూనిష్టు రష్యాయాశయము వంటిది — ఈపని చేయవచ్చును. కాని దీనివలన శాశ్వతమైన ప్రపంచ ప్రభుత్వ మేర్పడజాలదు. ఆతరవిధములైన యభివృద్ధులకు, ప్రతిఘటనల కిది తట్టుకొనలేక దీనివినాశమో లేక రూపాంతరములో లేక యిది మృగ్యమగుటయో సంభవించును. మొత్తముమీద నాస్థితిని దాటి యదార్థమైన ప్రపంచ ప్రభుత్వము — ఏక ప్రభుత్వము. ఇందులో కూడ విశాలత యుండదుకనుక నిది చాలదు. కనుక స్వాతంత్ర్యజాతుల కలయికయే శాశ్వతమైన, గంభీరమైన ప్రపంచ క్రమమునకు దారి చూపగలదు.

10. బలవంతమైన యొకేసామ్రాజ్యము లేక ప్రజ ప్రపంచము నంతను జయించి శాశ్వతక్రమము నేర్పరచ లేదను విషయ మీపుస్తకములో నిర్ధారణ కావింపబడినది. ఆధునిక శాస్త్ర ప్రవీణతచే కనుగొనబడు మారణాస్త్రరహస్య ప్రయోగములచే నొకబలమైన జాతి కొంతకాలము విర్రవీగినను యిది సాగునది కాదు. ప్రపంచనాశనము జరుగునను భయముతో ప్రజలు, ప్రభుత్వములు నిట్టి యాయుధములను యుద్ధ కార్యముల కుపయోగింపరాదను నిషేధములను చేసికొనినను మానవ ప్రకృతి మారనంతవరకు లాభము లేదు.

11. ఇంకొకసూచన చేయబడినది. ఈయైక్యత ఖండముల ప్రతిపదికగా జరుగవచ్చునని కలదు. యూరపు ఖండము, అమెరికా ఖండము, ఆసియా ఖండము, ఆఫ్రికా ఖండము — ఇట్టి విశాలమైన ఖండముల ప్రాతిపదిక ప్రపంచ ప్రభుత్వాశయములో నొకమజిలీగా నుండిన నుండవచ్చును. ఇట్టిదశ యిదివరకే తలపెట్టబడి రెండు అమెరికా ఖండములలో కొంత యాచరణ రూపములోనికి వచ్చెను. యూరపు ఖండముల యైక్యత యనునదికూడ కలదు. ఇది కొంత కార్యరూపము దాల్చినను రష్యాయినుపకవచము వెనుకనున్న దానియుపగ్రహములు పశ్చిమ యూరపు విచ్ఛి

న్నాదర్శములచే నెదురుబదురుగా నున్నవి. ఈ చీలిక యూహించ గలిగినంతలో సమసిపోవునది కాదు. మరికొన్ని పరిస్థితులలో యీ కలయిక ప్రాక్పశ్చిమ తగాదాలక్రింద తయారై తూర్పుపశ్చిమ ఖండముల యుద్ధముగా పరిణమించెడిది. మేల్కొనిన ఆసియాఖండమునకు జపాను స్వాతంత్ర్య ప్రదాతగా నటించెను. యూరపు, అమెరికా, ఆసియా దేశవాసుల ప్రబోధమును గుర్తించి క్రమముగా వారందరిస్వేచ్ఛను అంగీకరించుట జపాను పడిపోవుటతో నీయవాంతరము తప్పిపోయెను. కాని యిప్పుడింకొక యుపద్రవ మేర్పడినది. రష్యా, కమ్యూనిష్టుచీనా యొకవంక యూరపు ఆసియాలపై సైనికబలముతోను, రాజకీయ యెత్తులతోను ఇష్టములేని యాసియా యూరవులపై కమ్యునిజమును రుద్దవలెనని ప్రయత్నించుచున్నవి. మరియొకవంక కొంత పెట్టుబడిదారీ విధానము, కొంత మధ్యరక సామాజిక పద్ధతి – స్వాతంత్ర్య భావముల కింకను అంటి పెట్టుకొని వ్యక్తిస్వాతంత్ర్యము నుపాసించువారుగల ప్రజాసముదాయముల కలయిక – ఈ రెండు ఆశయములమధ్య తుముల సంగ్రామము జరుగనున్నది. ల్యాటిను ప్రజలు కల అమెరికాలోని చిల్లర తగాదాలెట్లో సమసిపోగలవు. కానిఆసియా ఖండములో కమ్యూనిస్టుచైనా యుపద్రవ మేర్పడినది. రష్యాచైనాలు రెండును కలిసినచో దక్షిణ పశ్చిమ ఆసియా, టిబెట్టు, ఇండియా సరిహద్దులవరకును, ఇండియా మీదకునుకూడ కమ్యునిష్టులదాడి సంభవము కాగలదు, చైనా సైనికముగా భారతదేశముపై దుమికి అవాంఛనీయమైన తనసాంఘిక రాజకీయ ఆదర్శములను రుద్దుటకు ప్రయత్నించును. ఏమైనప్పటికి నీఖండము రెండుగా చీర్పబడి మున్నెన్నడును యెరుగనట్టి ప్రపంచ సంగ్రామమేర్పడ వచ్చును. యుద్ధమే సంభవింపక పోయినను ప్రపంచైక్యత యనునది సమానప్రయోజనములు, ఆదర్శములులేని కారణముచే నిరవధికముగా వాయిదా పడవచ్చును. తొలుత మూడు నాలుగు ఖండములుగ నేర్పడి చివర కొకేఖండముగ పూర్ణత్వము నొందు నవకాశముగూడ ద్యోతకము కాదు.

12. సామ్యవాదమే యన్నిజాతులకు తరుణోపాయమని యొకప్పుడు భావింపబడు చుండెను. దీనితో జాతీయపరిధులను దాటి జాతీయతను, పోటీభావమును, వేర్పాటుతత్వము నధిగమించి ప్రపంచైక్యతను సాధించుట కిది సహజమైన రాచబాట యని భావింపబడెను. కాని సామ్యవాదముకూడ కొన్ని విషమఘట్టములలో వేరువేరుజాతీయతత్వముల నధిగమింపజాలదని, దాని యంతర్జాతీయత నిలువజాలదని తేలిపోయినది. క్రొత్తసామ్య వాదశరీరములో పాతజాతీయ వాసన మిగిలి

యుండక తప్పదు. పైగా ప్రపంచ ప్రజలందరకును నీసామ్యవాదతత్వము ప్రాకు ననికాని, చిరకాలము నిలుచుననికాని భీమా లేదు. ఉన్న యీ ప్రపంచ స్వభావ ములను డీకొను మరికొన్ని శక్తులు తలయెత్తవచ్చును. ఉదాహరణకు కొంత వరకైనను స్వాతంత్ర్యమును, అంతఃకరణను, భావస్వేచ్ఛను, వ్యక్తిస్వాతంత్ర్య మును మన్నించు సామ్యవాదతత్వమునకును, కమ్యూనిష్టుతత్వమునకును పోరు తప్పదు. ప్రపంచ ప్రభుత్వమును, స్థాపించుట కిది యద్ధము రాకమానదు. వ్యక్తిని వ్యక్తి స్వేచ్ఛను నలిపివేయు రోడ్డురోలరు యాంత్రికమయమైన సామూహిక ప్రభు త్వములో మానవు డొకనిర్జీవపదార్థముగ నుండవలసినదేతప్ప వేరుగతి, సామరస్య మును సాధించు అచారము, చట్టము చేయుట కవకాశములును నందులో లేవు. ఈ రెండిటికిని నేడు ప్రబలవిరోధ మేర్పడెను. కమ్యూనిజము సిద్ధాంతములోనే యిట్టి దున్నదనికాదు. వ్యక్తి కొకవంక సార్థకతను కూర్చుచు సామాజిక శక్తితో సామ రస్యమును సాధింపవచ్చును. కమ్యూనిజముపేర నిదివరకే చలామణి యగుచున్న సంస్థ లేవియు నిజమునకు కమ్యూనిజము కానేకావు. అవియన్నియు సాధారణముగా బిర్రబిగుసుకొనియున్న ప్రభుత్వసామ్యవాదోద్భవములు. కాని మార్క్సిస్టురొంపిని విడిచి సామ్యవాదపు కర్రపడివాటమును తగ్గించుకొని సామరస్యము నవలంబింప వచ్చును. ప్రభుత్వ బలవంతము, పోలీసురాజ్యము ఇత్యాదినిర్బంధములులేని సహ కారసామ్యవాదమువంటిది రావచ్చును. కాని ప్రపంచమంతట నిప్పుడు చలామణిలో నున్న సామ్యవాదములో నీవాసన కాన్పించదు.

12-1. మొత్తముమీద ప్రపంచము రెండుకూటముల క్రింద, రెండుపద్ధతుల క్రింద విభజింపబడు సూచనలే యున్నవి. అవి పెట్టుబడివిధానము, సామ్యవాద విధానము. అమెరికాలో వ్యక్తిస్వేచ్ఛ, పెట్టుబడివిధానము, కమ్యునిజముకే కాక సామ్యవాదమునకుకూడ బలమైన వ్యతిరేకత కాన్పించుచున్నది. దానిలో నెంత మాత్రము సడలింపు కాన్పించుటలేదు. పాత ప్రపంచములో కమ్యునిజము పూర్తిగా జయించుట యనునది ఇంకను సందేహాస్పదమే. ఈ సంఘర్షణలో జయము పూర్తిగా నెదోయొక పక్షమునకు సంక్రమించువరకు నిది తేలునది కాదు. ఉత్పన్నమగు తగాదా యంశముల నన్నింటిని వెన్వెంటనే సమరసముగా చర్చించుకొని బహిరంగ యుద్ధ కాండలోనికి దిగనక్కరలేకుండ ప్రపంచమును చక్కదిద్దు సంస్థయే యిప్పుడు కావలెను. అదియే సంయుక్తజాతీయ సంస్థకు సరియైన వారసురాలై దానిమార్గములో నడవగలదు. రష్యా అమెరికా లింతవరకు తమతమసిద్ధాంతములలోను, ఆశయముల

లోను నెంతభేద మున్నను నీసంయుక్తజాతీయసంస్థ నెట్లు రక్షించుకొనుచు వచ్చినవో యట్లే వాటిమధ్య సామరస్యమును కాపాడుకొటకే యీమూడవ సంస్థనుకూడ మన్నింపక తప్పదు. ఆయాశక్తులే చివరవరకు పని చేయుచు, సారవంతమైన ప్రపంచైక్యతకు పాటుపడుచు చివరకు జాతిసామాన్యావసరముల రక్షణకొరకే, ఆత్మరక్షణార్థమే యిట్టిసమన్వయము కాపాడబడగలదు.

13. కనుక సాన్‌ఫ్రాన్సిస్కోలో ప్రపంచసంస్థగా స్థాపింపబడిన సంయుక్త జాతీయసంస్థ యదార్థమై ప్రపంచైక్యతను సాధించగల దనుటలో మనము నిరుత్సాహ పడవలసిన దేమియు నింతవరకు సంభవించలేదు. అనేకయుపద్రవములు, కష్టములు లేక పోలేదు. భవిష్యత్తు నంధకారములో ముంచెత్తు పోరాటములు సంభవించినను సంభవింపవచ్చును. మానవజాతి నశించుట తప్ప వేరుగతి లేదనువరకు మనము భయపడనక్కరలేదు. ఇంతకు మేము చెప్పదలచినది – ప్రకృతిమాత చిన్నచిన్న సంస్థలను వీడి బృహత్తర సమూహములను సృష్టించి తద్వారా ప్రపంచైక్యతను సాధింపబూనిన దను మావాద మింకను నిలిచియేయున్నదని.

మానవజాతి భవిష్యత్తు ఈమార్గమునే యనుసరింపకతప్పదు. ఎన్ని యవాతరములు, గందరగోళములు వచ్చి యెంత ఆలస్యము సంభవించినను చివర కీఫలితము సిద్ధింపక తప్పదు. యుద్ధము, అధునికశాస్త్రము, మారణాస్త్రములు, సర్వనాశనము – ఏది యెట్లు జరిగినను, ఏవి విఫలమైనను జాతిలోని పరివర్తనశక్తి – ప్రకృతి యని మేముపిలుచు ప్రపంచ శక్తిమాత్ర మూరుకొనక వేయవలసిన ముందడుగువేసి యాత్మ రక్షణనుగావించును. ఈయవసరము కల్పించుచునే యున్నది. అది యిదివరకే కొంత గుర్తింపబడినది. చివర కది యెట్లు రూపొందవలెనో, దానిభావము దానిని నిర్మింపగల సంస్థయొక్క పిలుపు ఏపరిస్థితులలో నేయవకాశములను పురస్కరించుకొని యీనూతన నిర్మాణ మేరూపములో నుండునో మొదలగునవి యీ గ్రంథములో సూచింపబడినవి. ఇందులో ధర్మపన్నములు చెప్పుటగాని, మాస్వంతయభిప్రాయములకు ప్రాధాన్య మిచ్చుటగాని చేయలేదు. ఏయేశక్తులు పనిచేయునో, వాటిఫలితము లెట్లుండునో సూచించుటయే యీ పరిశోధనాలక్ష్యము. ఇట్టి నేటిముఖ్యావసరమును సాధించుకొనగల ఫలితము మానవలోకముయొక్క నైతిక, బుద్ధిమతసంపత్తులను బట్టి యుండును.

14. నేటి ప్రపంచ పరిస్థితులను బట్టి యెదో యొక విధమగు ప్రపంచైక్యత యెట్టిసంకటములు సంభవించినను చేకూరితీరవలెనను మాయభిప్రాయము మార

వలసిన యవసర మెంత మాత్రము లేదు. మానవలోకముయొక్క వర్తమాన, భావియవసరములు, ప్రకృతిసంధానశక్తి దీనినే శాసించుచున్నవి. మేము చెప్పిన సామాన్యసారాంశములు, కార్యకలాపములలో మార్పులు చేర్పులు మొదలగునవి జరుగుచునే యుండును. చివరకు ప్రపంచప్రభుత్వ మొకటి యేర్పడితీరవలెను. ప్రపంచజాతుల స్వాతంత్ర్య సమాఖ్యయే దాని తుదిరూపము. ఒకజాతి నొకజాతి యణచిపెట్టుట, దోచుకొనుట, లోబరుచుకొనుట మొదలగు వికారములన్నియు పోవలెను. కొన్నింటికి సహజమైన యెక్కువ పలుకుబడి సంప్రాప్తించినను అన్నింటికి సమానప్రతిపత్తియే కలుగును. సమాఖ్యయే ప్రపంచకూటమిలో జేరు జాతులన్నిటికిని నత్యంత స్వేచ్ఛ నీయగలదు. ఇట్టి ప్రపంచజాతుల కూటమికే చిరకారము వర్ధిల్లగల యవకాశముకలదు. ఈప్రపంచమే యస్థిర ప్రపంచము. కొంతకాలము కొన్ని చిక్కులు, విఘ్నములు కలుగుచుండవచ్చును. మానవ లోకముయొక్క మనస్సు మారినకొద్ది యేర్పడిన సంస్థయొక్క నిర్మాణములో కొన్ని విప్లవాత్మకమైన మార్పులే కలుగ వచ్చును. ఏది యే మైనప్పటికిని ఇప్పటియస్థిరత, దుర్భరపరిస్థితులు, ఆంతరంగిక కలహములు, ప్రపంచ సంగ్రామము మొదలగు చిక్కులన్నియు పోయి యీనిరంతర అపరిష్కృత, అశాంతయుగము గతించిపోగలదు. మానవైక్యత యను నాశయము ఆశయముగా నుండిపోక కార్యరూపము దాల్చి దాని రక్షణ స్వాతంత్ర్యమును పొందిన సర్వమానవ ప్రజాళి హస్తపరము కాగలదు. దానిభావి దైవాయత్తమై యీ మానవజాతి నిత్యత్వము ప్రయోజనకరమని వారికి తోచినచో నది సురక్షితముగ సాగిపోగలదు.

---

# 4—వ అధ్యాయము

## భారతీయ సంస్కృతిపై బాహ్యప్రభావము

భారతీయ నాగరకతను, దాని పునరుజ్జీవమును ఆ పునరుజ్జీవనమునకు గల అర్థమును, ఈ నాగరికతను సంరక్షించు విధానమును ఆలోచించునపుడు, సమస్త జీవిత క్షేత్రములందును శక్తిమంతమగు నూతన సృష్టి ఆవశ్యకమని సూచించితిని. ఆధునిక చింతనా - జీవితముల బ్రహ్మాండ ప్రవాహముచే నెదుర్కొనబడి, తనకు విరోధము లేక భిన్న ప్రబల నాగరకతచే ముట్టడింపబడి, ఈ అపక్వ - నూతన - సంఘర్షక - శక్తిమంతమగు ప్రపంచమును, తన వినూత్న దివ్యతర స్వకీయ - ఆత్మ నుండి ఆధ్యాత్మికరూపములలో ఉద్భవించిన జ్ఞాన శక్త్యానందములతో అభిముఖమైనపుడు మాత్రమే, భారత దేశము తన నాగరకతను సంరక్షించు కొనగలదు. ఇతర నాగరకతలను ఎదుర్కొనుటకు ముందు, తన బృహత్ సమస్యలను తాను పరిష్కరించుకొనవలెను. ఈ సమస్యలను తప్పించుకొనుట, అవసరమని తలంచినను, అది వాని నుండి తప్పించుకొనలేదు. తన ఆగాధతర - బృహత్తర జ్ఞానముతో, తన స్వీయ సత్తనుండి ఉత్పన్నమగు పరిష్కారములతో, తన జీవిత విధానమున కనుగుణ్యముగ, తన సమస్యలను, తానే భారతదేశము పరిష్కరించుకొనవలెను. ఈ సందర్భమున, దాని నిజ స్వభావమున కనుగుణ్యమగు దానిని, ఆదర్శములతో సామరస్యముగల దానిని తన నవజీవనవిధానమునకు విలువగల దానిని, తాను జీర్ణించుకొనగలట్టి పాశ్చాత్య భావాలను శక్తులను జ్ఞానమును మాత్రమే స్వీకరించవలయునని తెలిపితిని బాహ్యప్రభావము, అనంతరమున నుండి ఉదయించు నూతన సృష్టి, - అను ఈరెండింటి సమస్య, చాల ముఖ్యమైనది; దీనిని దీర్ఘముగ గమనించి తీర్చుకొనవలసిన విషయము. ఇది అందుచే అంగీకరించుకొనుట, జీర్ణించుకొనుట అను పదములకు గల నిజస్వభావమును తెలిసికొనుట ఆవశ్యకము; ఏలయన, ఈ విషయములను విశుద్ధముగా దృఢముగా తెలిసికొన్ననే, మన మాసమస్యకు సరియగు సమాధాన మివ్వగలము.

సర్వుల యందు గల యేకత్వమును కనుగొనినపుడు, వైవిధ్యత్త్వము నిర్మూలింపబడుటకు బదులు, దాని సత్యము మఱింత స్పష్టముగ ఋజువగును. సజీవ - మానవ - ఐక్యతను కనుగొనునది, స్వకీయ ప్రత్యేక స్వభావ శక్తులను తుడిచివేపికొనుటచే కాదు; కాని, వానిని పెంబడించి, వాని స్వేచ్ఛా ప్రక్రియల యొక్క ఉన్నతతమసాధ్యతలగు వానిని ఉన్నతింప చేయుటచే, ఏక విధ్యముచే నిజ - ఐక్యము కలుగుటకు బదులు నిర్జీవ ఐక్యముకలుగునని నేను నొక్కి చెప్పితిని. సమరూపత జీవితమును నశింపచేయును: కాని నిజ - ఐక్యత బాగుగా స్థాపింపబడి నచో, వైవిధ్యబలసంపన్నతచే, జీవితము ఫలదాయకము, శక్తిమంతమునగును. పరనాగరకతయందుగల మంచిని గ్రహించి చెడ్డను త్రోసిపుచ్చుమని కొందఱు వచింతురు; ఇది, వినుటకు బాగుగనే యున్నదికాని, ఈ మంచి చెడ్డలను అట్లు నేర్పఱచుట సాధ్యముకాదు: అవి, ఒకే విషయముయొక్క విడదీయబడరాని మిశ్రమ ఫలితము; అవి, ప్రక్క ప్రక్కననే పెట్టబడి సులభముగా విడదీయబడగల పిల్లల ఆట గృహముయొక్క విడిభాగములుకావు: అందుచే, మంచిచెడ్డలను విడదీసి ఒక్క భాగమును గ్రహించి, మఱొక భాగమును త్రోసిపుచ్చుదమనుటలో అర్థమేమి? ఒక పాశ్చాత్య-అదర్శమును స్వీకరించినపుడు, అందు మన కంగీకారమగు సజీవ రూపము గల దానిని గ్రహింతుము; ఆ రూపమును అనుకరింతుము. దానికిగల అంతర్భావము నకు, దాని స్వాభావిక గుణములకు లోనగుదుము; ఆ సజీవ నిర్మాణమునందుగల మంచి చెడ్డలు రెండును, విడదీయ రానివై, ఐక్యమై, మనల స్వాధీన పఱచుకొనును. నిజము చెప్పవలసినచో, మనము పాశ్చాత్య నాగరికతవలె కొంతగానో, పూర్తిగానో, అగుటకు మనము దానిని అనుకరించి, అదృష్టవశాత్తు, నిరర్థకత పొందితిమి. ఏల యన, అది ద్వి-స్వభావ సంస్కృతిని మనయందు సృష్టించి యుండెడిది; కాని టెన్నిసన్ కవి చెప్పినట్లు, ప్రత్యేక స్వభావములేని జారజసంస్కృతి దృఢ-నిజ-సజీవ సంస్కృతికాదు. మన స్వభావమునకు మనము మరలుట మనకేకైక ముక్తి మార్గము.

ఈభావమునకు అనుకూలముగను, దీనిని మార్పుగావించుటకును, చెప్పవలసిన విషయములనేకములున్నవి. కాన మనము ఉపయోగించు పదముల అర్థమును స్పష్ట పరుతము. ఐరోపానాగరకతను అనుసరించుటకును, మనల మనము నల్లని ఆంగ్లే యులుగ మార్చుకొనుటకు, గత శతాబ్దమున మనముచేసిన ప్రయత్నము, ఈనాటికిని కొన్ని విషయములందు చేసేప్రయత్నము, మన పురాతన సంస్కృతిని విడనాడి,

పాశ్చాత్య విధానమును అంగీకరించె ప్రయత్నమును, దుస్పంపన్నము, విజాతీయము, అనుట నేను మనఃపూర్వకముగా అంగీకరింతును. కొంతవఱకధికముగనెకూడ, ఈ అనుకరణ ప్రాణికముగను, మానసికముగను, పరిస్థితులబట్టి, ఆవశ్యకమైయుండెను. అల్పసంస్కృతి, ఉన్నతసంస్కృతిని ఎదుర్కొనినపుడేగాక, నిద్ర, నిష్క్రియత, స్తబ్ధతలలోనికి దిగజారిన సంస్కృతి, మేల్కొనిన, క్రియాశీల, తీవ్ర సృష్ట్యాత్మక నాగరకతను ఎదుర్కొనినపుడు, నూతన విజయ వంతమగు శక్తులు, ప్రవృత్తులు దానిపై స్థాపింపబడినపుడు, నూతన భావములను, వానిరూపములను పరంపరగా వృద్ధియగుట చూచినపుడు, జీవితప్రేరణచేతనే, ఈ నూతన భావాలను, రూపములను, ప్రవృత్తులను గ్రహించుకొని వృద్ధిచేసికొని అనుకరించి, వానిని పునరోత్పన్నము చేయుటకును, యేదోనొక విధముగ ఆ మొదటి సంస్కృతి, ఈ శక్తులను అవకాశములను గమనించి ప్రయోజనము పొంద నిచ్ఛగించును. సర్వత్ర ఇట్టి విధానము కొలదిగనో, గొప్పగనో, లేక అంశికముగనో పూర్తిగనో సంభవించి నట్లు చరిత్ర తెలుపుచున్నది. కాని, ఇట్టి స్వీకారము యంత్ర సదృశముగనున్నను. సేవా వృత్తిగను, ఆరోపింపబడినదిగను నున్నను, దుర్బల సంస్కృతి వినాశన మంది, బలవత్తరమైన దానిచే మ్రింగవేయబడును. ఇట్టి అస్పృహణీయ విషయ ములపై. ఆ దుర్బల నాగరకతకు ప్రవణత యుండేనేని, దాని నిజస్వభావమును అది కోల్పోయి. నశించును. దాని ఆధారమును తెలిసికొని, దాని కేంద్రమునకుచేరి, దాని బలమునందో, తెలివియందో, చేయవలసిన దానినంతటని చేయగలగిననే, దానికి విముక్తికలుగును. అయ్యుమ, కొన్నిరూపములను స్వీకరించవలసి యుండుట - ఇట్లుచేయుట అనుకరణమే అని చెప్పినను - అనివార్యముగనే యుండును. ఉదాహరణముగ, వాఙ్మయమునందు, నవల, చిన్న చిన్న కథలు, వ్యాసములు, వీనిని, మరితరములను కూడ స్వీకరించినాము; భౌతిక విజ్ఞాన శాస్త్రమునందు, నూతన నిర్మితులను, అవిర్భవములను, అనుమానిక పరిశోధన విధానములును, రాజకీయములందు, ముద్రణ, వేదిక, ప్రచార విధానములు రూపములు, బహిరంగ సభలు, వీనిని స్వీకరించినాము. మన జీవితమునందవలంబించిన. ఈ అధునిక నూతన విషయములను, వీనిని పరనాగరకతనుండి స్వీకరించిన కారణముగ, ఈ యన్నియు మనకంత శ్రేయస్కరముగాకున్నను వీనిని విడనాడవలెనని ఎవ్వరు కూడ చెప్పరు. కాని, నిజమైన ప్రశ్నయేమన, మన స్వభావమున కనుగుణ్యముగ వీనిని రూపొందించుకొని, ఎట్లు ఉపయోగించుకొనగలము, అనునదే. అట్లు ఉప

యోగించకొనకలిగినపుడే, వానిని జీర్ణించుకొని మనదిగా చేసికున్న వారమగుదుము; లేనిచో, నిస్సహాయకముగ వానిని అనుకరించితి మనవలెను.

కాని, పరనాగరకత యందుగల రూపములను స్వీకరించుటయా. లేదాయను నది నిజమగు ప్రశ్నకాదు. స్వీకారము, సమీకరణము, అని నేను వచించినపుడు, ఐరోపానుండి సజీవశక్తితో తేబడిన కొన్ని ప్రభావములు, భావములు, శక్తులు – వీనిని గుఱించి, ఇవి మన సాంస్కృతిక సత్తను, కార్యకలాపములను మేల్కొలిపి, సంపన్నతకావించగలవా, మన జీవిత స్వభావములోనికివి, ప్రయోజనకర విషయ ములుగ తేబడగలవా, యని నేనాలోచింతును. మన పూర్వులు, నిజముగా ఆచ రించిన దీవిధముగనే; వారు నిజస్వభావమును ప్రత్యేకతను, ఎప్పుడుకూడ కోల్పోయి యుండలేదు; ఏలయన, వారు సదా ఆంతరమున నుండియే శక్తిమంతముగ సృష్టించుచు, బాహ్యమునుండి, అవసరమైన జ్ఞానమును కళను గ్రహించుచుండిరి. కనుక, మంచిని స్వీకరించి, చెడ్డను విడనాడుట, అనే సూత్రమును నిరాకరింతును. ఇది ఉపరిగతమనస్సుకు అంగీకారము కావచ్చును; కాని, ఈ సూత్రము ప్రయోజన కరమైనదికాదు. మనము స్వీకరించిన దాని వెనువెంటనే, మంచిచెడ్డలు రెండును కలసివచ్చును. మనము ఉదాహరణముగ, ఐరోపా పారిశ్రామిక సంస్థను, దాని భయంకర, ఘోర, అసుర, దారుణ సృష్టిని, – పరిస్థితులచే మనముకూడ దీనికి బలాత్కరింపబడుచుండుట దురదృష్టము – విమర్శింతము. దానికి గల రూపము ననో, లేక సూత్రముననో, ఈ సంస్థ విధానమును మనము స్వీకరించి, దానిచే మన ఆర్థిక స్థితిని వృద్ధిచేసికొనవలసి వచ్చినపుడు, దానివెంటనె, దాని సాంఘిక – అసా మరస్యతలు, నైతికవ్యాధులు, కఠోరసమస్యలు కలుగును. అందుచే, మన సంస్కృతి యొక్క ఆధ్యాత్మిక–ధర్మమును మఱచి, ఆర్థిక, ప్రయోజన దృష్టికి బానిసలు కాకుండ ఎట్లు తప్పించుకొన గలమో, నాకు తెలియుటలేదు.

కనుక. ఇంత మాత్రముతప్ప, వీనిలోగల మంచి చెడుగులకు గల అర్థము ఏమాత్రము విస్పష్టముకావు; మన కాపదములు నహాయపడవు. వానిని నేను ఉప యోగించవలసి వచ్చిన, నైతిక భావముతోగాక. జీవిత పరస్పర వినియమునందు. నాకేది ఉన్నతముగ, సన్నిహితముగ, ఆత్మాభివ్యక్తమును సృష్టించుకొనుటకు అధికతర అనుకూలతను కలిగించు దానిని, మంచిదనియు, నన్నేది దుర్బలపఱచి అల్పపఱచి, నా ఆధ్యాత్మిక సత్తయొక్క విస్తృతికి, ఉన్నతికి, సంపన్నతకు, శక్తికి, అంతరాయముగ నుండు దానిని చెడ్డదనియు చెప్పుదును. ఇట్టి విచక్షణను

మనము గుర్తించుచో, ఆలోచనా పరుని కెవ్వరికైనను, మనము అంగీకరించుకున్న వస్తువును పట్టి వానికి విలువ నివ్వక, వానినెట్లు మనము ఉపయోగించితిమని గ్రహించి, దానికి విలువనిచ్చును. లేదా, జీవితక్షేత్రమునందుగల రాజకీయ సాంఘిక - ఆదర్శములగు స్వాతంత్ర్యము, సమత్వము, ప్రజాస్వామ్యతలకుగల అంతర్గత విలువలను పట్టి, ఆ ఆదర్శములకు విలువల నివ్వవలెను. ఈ ఆదర్శము లను నేనంగీకరింతునేని, అని ఆధునికమని, ఐరోపీయమని కాదు; కాని అవి మానవత్వమునకు, ఆత్మాభివృద్ధికి ప్రయోజనకర దృష్టిపథమును కలవని, మానవజీవిత భవిష్యాదభివృద్ధికి చాల ప్రయోజనకరమని విలువనిత్తును. ప్రజా స్వామ్యతయను క్రియాశీల భావమును నేను అంగీకరించితిననుటకు గల అర్థము, పురాతన ఐరోపా రాజకీయము నందువలెనే, పురాతన భారతీయ రాజకీయమునందును నుండెననియు, మన భవిష్యజ్జీవిత విధానమునందును, ఆ జీవితాభివృద్ధికిగా యెదెని యొక రూపమున, ఆవశ్యకమనియు, తలంచుటచే మాత్రమే, దానికి విలువనిత్తును. సమీకరణము (assimilation) చేయుటయన, మనము సంగ్రహించిన రూపమును, దానికిగల ఐరోపా రూపములోగాక, జీవితమును గుఱించి మనకుగల ఆధ్యాత్మిక దృష్టితో, మనము దాని కివ్వగల రూపమును, ఆ యాధ్యాత్మిక దృష్టిని ప్రకాశింపచేయు భావమును అరూపమునకు కలిగించి, ఆదృష్టితో, ఆభావముతో, దానికి మనము ఇవ్వగల వ్యాప్తిని, నూతని రూపమును, ఇతర రూపములతో, నుండవలసిన సంబంధమును, ఈయన్నింటిని నిశ్చయించి, గ్రహించగలిగియుండవలెను. మన మితర నాగరకతలనుండి గ్రహించవలసిన వాని కన్నింటికిని, ఇదే సూత్రమును, పద్ధతిని, వాని వానికి తగినట్లుగ, వాని వాని ధర్మమును, ప్రయోజన ప్రాముఖ్యతను, వాని వాని, ఆధ్యాత్మిక బౌద్ధిక, నైతిక, రసాత్మక, క్రియాత్మక ఐక్యతను సమకూర్చు విధమును పట్టి, చేయవలెను.

ఈ విధానము, వ్యక్తికి ఎట్లు అన్వయము అగునో, సమిష్టిగత_ఆధ్యాత్మికతకు కూడ, అన్వయింపచేయు ఫలమును. అందుచే, బాహ్యమునుండి మనము పరనాగరకతల రూపముల సంగ్రహించ కూడదనుట, మంచిదికాదు, పైగా, సాధ్యము కూడ కాదు. అట్లే ఒక సజీవమగు అవయవి, బయటనుండి కలుపుకొను వస్తువులచే వృద్ధియగుటగాక, ఆంతరికాభివృద్ధిచే, సమీకరణచే వృద్ధికాగల అవయవి అంతయు, అది బాహ్యమునుండి గ్రహించు దానినంతటిని, దాని ప్రాణిక_మానసిక_ శరీరములో, వీని స్వభావమును పట్టి, కరిగించి, పోత పోయవలయును. అట్లు

కరిగించి పోత పోయుటకు వీలుకాని యంతటిని, విసర్జించ వలయును. వంగ భాషలో, ఈ విధానమును "ఆత్మసాత్ కర్మా" అని పిలుతురు; అనగా, మన ఆత్మ స్వభావమునకు, దానిని మార్చి, జీర్ణించుకొని స్వంత వస్తువుగ చేసికొనవలెను. "ఐక్యమునందు, వైవిధ్యము" అను సూత్రము చేతనే, మన మితరులనుండి, నిజములో వేఱుగ నుండుటలేదు, కాని మనకు చుట్టుగల దాని నంతటితోను సంబంధమును కలిగియున్నామను విషయముతో, ఈ ఇచ్చి పుచ్చుకొనుటలు తీర్మానింపబడును. ఏలయన సమస్త జీవితము, ఇచ్చిపుచ్చుకొను విధానముపైననే ఆధారపడియున్నది. పరిసరములతోటి వినిమయము, జీవితాభివృద్ధిని, ఆరోగ్యకరముగ నొసంగును; కనుక పరవస్తువును పూర్తిగా త్రోసివేయుట తగదు. సజీవ-అవయని అట్లుచేయుటచే, త్వరలో నిష్క్రియయై వినాశమును పొందును.

భౌతిక-ప్రాణిక-మానసికముగ, నేను ప్రపంచమంతటినుండి వేరుపడి, నానుండియె, నేను సర్వమును గ్రహించి, అభివృద్ధికాజాలను: నేను ప్రత్యేక స్వయంభువుగ, పదార్థమును-గతమునందు నానుండియెపెరిగి, నా లోకమునే ప్రత్యేకముగా నేను అభివృద్ధికావించుచు, బయటనుండి యెయితర వస్తువులను శక్తులను, చింతవలను, సంగ్రహించకుండ,- నుంటిననిగాని, నుండగలననికాని చెప్పుట, అసమంజసము. ప్రతి వైయక్తిక స్థితియందును, రెండు ప్రక్రియలు కలవు; ఒక్కటి, అంతరమునుండి ఆత్మాభివృద్ధి; దీనికి అత్యంత సన్నిహితశక్తికలదు; ఈ శక్తిచేతనే దానియొక్క రెండవ ప్రక్రియను, అనగా బయటినుండి గ్రహించిన దాని నంతటిని, తన వ్యక్తిగత స్వభావమునకు కరిగించి పోత పోసి జీర్ణించుకొని, అది తనదిగచేసికొనును. ఈ రెండు ప్రక్రియలు పరస్పరమును త్రోసివేయవు; మఱియు, మొదట ప్రక్రియకు, రెండవ ప్రక్రియ అపాయకరముకూడకాదు. వ్యక్తియొక్క ఆంతరిక శక్తి దుర్బలమై, బాహ్యమును సమీకరించుకొన లేనపుడు మాత్రమే, పర రూపమును గ్రహించుట చెడుపుగా నుండును: సమీకరించు శక్తి వ్యక్తికి అంతరమున నుండెనేని పరవస్తువులను స్వీకరించుటవలన కలిగే ప్రయోజనము చాల అధికము; తన్నుదా అందుచే బాగుగా పరిపూర్ణమొనరించు కొనగలదు. చేతస్సుయొక్క అధిరోహక శ్రేణియందు పైకి పోయినకొలది, అంతరము నుండి వృద్ధికాగల శక్తి అధికాధికముగ వృద్ధియై తమయందె తాము శక్తిమంతముగ వసించగలవారు, పైకి పోవుకొలది, దివ్య వ్యాప్రవృతిని కాంచుట చూచుచున్నాము. దీనిచే, బాహ్యప్రపంచమునుండి కలుగు తాకిడిని, సూచనలను గ్రహించి సమీకరించు

శక్తికూడ అధికమై, తామువృద్ధి అగుటయేగాక, బయట ప్రపంచమునుకూడ అభివృద్ధికావించి సుసంపన్నముకావించుట చూచుచున్నాము. అంతరమున, ఆత్మను కనుకొని, ఆత్మయందే వసించకలవాడు, ప్రపంచమునంతటిని కౌగిలించుకొని, దానితో ఐక్యముకాగలడు; స్వతంత్రుడు, స్వ-పాలకుడు, ఆత్మ-వశుడు, స్వరాట్టు, తాను వసించు ప్రపంచమును గ్రహించి దానితో, నూతన రూపమును దీనికి కలిగించి సామ్రాట్టుగకాగలడు. ఆత్మయందే సర్వమును స్వీకరించి, సర్వముతోపాటు, సర్వమును తానును వృద్ధికాగలరు. పరిణామాత్మక సత్త మనకు నేర్పు సత్యమిది: గతకాల భారత ఆధ్యాత్మిక జ్ఞాన రహస్యములలో అత్యున్నతమైన రహస్యము, ఇది.

కనుక స్వకీయ ఆత్మయందే వసించి, స్వధర్మముననుసరించియె, తన అభివృద్ధిని నిర్ణయించి, కావించుకొనుట, ప్రథమ అవశ్యకత. దీనిని చేయలేకుండుటచే, జీవిత సంహతిని భేదించుట అగును; దీనిని చాలినంతగా చేయలెక పోవుటయన, పరిపర జీవితముచే ఆక్రమింపబడి, వాని శక్తులకు క్రమక్రమముగ లొంగిపోవు అపాయమును కలిగించుకొనుట అగును; ఈ కార్యమును ఆంతరికశక్తులతో, స్వీయ వస్తువులతో, వివేచననుస్వతఃస్ఫూర్తిని వినియోగించి చేయలేక పోవుటయన, అసామరస్యతను, అస్తవ్యస్తతను కలిగించుకొనుట, కడపటకి ప్రాణశక్తిని కోల్పోయి, నశించుట అని యర్థము. పరిసర జీవితము నందది మనకొసంగు భౌతిక పదార్థమును వినియోగించుకొనలేక, దానిని సమీకరణశక్తితో, దానిపై చేయుదానిని గ్రహించలేక పోవుటయన, మన యునికికే అదియొక లోపము. ఆరోగ్యకర వ్యక్తిత్వమునకు, బాహ్యస్పర్శచే, లేక అంతరమున ప్రవేశించు బాహ్యప్రభావము, శక్తి, ప్రక్రియలచే, కలుగు మొదటి ఫలితము,- అవి అంతఃసత్తను ప్రకోపింపచేసి, అసామరస్యతను, అపాయము కలుగునను భావమును కలిగించును; ఆసమయమున, అంతరమున కొంత ఘర్షణజరిగి, ఆవేశము, విసర్జనలు సంభవమగును; కాని, ఈ ఘర్షణా - విసర్జనలయందుకూడ, శక్తికి, జీవిత వస్తువుకు అంతరమున వృద్ధియెకలుగును. ఈ ఘర్షణచే అంతఃశక్తులు ప్రకోపింపబడి, కడకు సాహాయ్యమునే పొందును. ఈ ఘర్షణచే, స్వీయచేతస్సుయొక్క నూతన కార్యము, నూతనావకాశము జాగరితము కాగలవు: నిద్రించుచున్న శక్తులు మేల్కొని, తాళమువేయబడిన కవాటములను డీకొని పరస్పర తారతమ్యమును పోల్చుకొనుటచే కొత్త సూచనలు కలుగవచ్చు. అందుచే నూతన పదార్థము మనలోనికి జొచ్చి, మన ఆంతరిక సత్తకు అనుగుణ్యముగా, దానికి నూతన రూపమును యిచ్చి,

స్వభావ స్వధర్మములను పట్టి, దానిని సమరసపఱచవచ్చును. పరిసరములకు కలుగు చుండు గొప్ప మార్పునందు, బాహ్యసంఘర్షణల కలియికచే, తాత్కాలిక కష్టములు, సంక్షోభములు, అపాయకర ప్రవృత్తులు కలుగును; కాని, ఇందుచే, ఆత్మాభివృద్ధికర రూపాంతరమో, లేక శక్తిమంతమగు పునరుజ్జీవనమో సంప్రాప్తమగు అవకాశముకూడ కలదు.

సమష్టి - ఆత్మయందు, వేర్వేఱు వ్యష్టి - ఆత్మలు అనేకము కూడి యుండుటచే, సమష్టి - ఆత్మకు అధిక స్వయం - శక్తి - పరిపూర్ణతలుండును, విశ్వ - మానుష్యకమునుండి విడిబడిన సమష్టి - ఆత్మ, దాని యందుగల అనవరత - అంతర-వినిమయముచె, దీర్ఘకాలము, జీవితమును, అభివృద్ధిని, స్వకార్యములను, రక్షించుకొనవచ్చు. గ్రీకునాగరికత - ఈజిప్టు, ఫూనీసియా, మరితర ప్రాచ్య నాగరకతల ప్రభావమునందు వృద్ధి కాంచిన తర్వాత - వీనికి, అనాగరక సంస్కృతులని పేరిడి. వీనినుండి విడిపడి, కొన్ని శతాబ్దముల కాలము, సంపన్న - వైవిధ్యమును, ఆంతరిక వినిమయముచే, కలిగించుకొని, తనయందె అది, జీవించ గలిగెను. ఇట్టిదే పూర్వము భారత దేశమునందుకూడ, దీనిని చుట్టియున్న సంస్కృతుల నుండి వేరుపడి, తనయందే గల వైవిధ్యముచే సంపన్న వినిమయముగావించుకొని శ్రేష్ఠముగ జీవించిన దీర్ఘ కాలము సంభవించెను - ఇందుకు చైనా నాగరికత, మూడవ ఉదాహరణము. కాని, భారతదేశము, యేనాడు కూడ బాహ్య ప్రభావములను అడ్డగించలేదు. భాహ్యప్రభావములను, అది స్వీకరించి, ఆత్మచే మార్పు కావించినది. అది తన్ను ముంచివేయు పరదాడులనుండి సంరక్షించుకొన్నది; కాని దానిపై దండెత్తిన వానియందు తనకుగల ప్రయోజనముల నన్నింటిని, స్వీకరించి, తన ఆధ్యాత్మికతతో సమరస పఱచినది. కాని, ఆధునిక కాలములో, పూర్వమువలె, బయటి ప్రపంచమునుండి పూర్తిగా వేఱుపడి యుండుటకు, యేనాగరికతకు కూడ సాధ్యముకాదు. ప్రపంచమునగల మానవజాతులన్నియు, ఒక దానితో నొకటి సమీపమునకు తేబడి, నిరాకరించరాని జీవితైక్యమునకు లాగబడు చున్నవి. ఇట్టి అధికతర వినిమయము యొక్క పూర్ణ భారమునందు, నివసించవలసిన కఠిన సమస్యను మనమెదుర్కొని యున్నాము; మన స్వభావ స్వధర్మములపై పరభావ పరధర్మములు, ఆరోపింపబడు పరిస్థితి యేర్పడనున్నది.

ఐరోపాదండయాత్రకు మునుపు మన ముండిన పరిస్థితికే మనము మఱల పోవలయుననుటచే కాని, ఆధునికి పరిసరముల ఆవశ్యకతను విస్మరించ వలెననుటచే

కాని. అపజయమె తథ్యమనుట నిజము. పాశ్చాత్యుల దండయాత్ర నాటినుండి, మధ్యకాలమున సంభావించిన చెడుపరిస్థితుల గుఱించి మనమెంత దుఃఖించినను, పాశ్చాత్య ప్రభావమునుండి మనమెంత వెనుకను, మన స్వభావములోకి మఱలినను. అనివార్యముగా స్వీకరించ వలసిన మార్పును తొలగించుకొన లేము. మానవుడు వర్తమాన జీవితమునందు, కొన్ని సంవత్సరముల క్రిందటి మనః తత్త్వమును కలిగి జీవించుట యెంత కష్టమో, జాతి జీవితమునందుకూడ, ఇదికష్టమే. కాలము, దాని ప్రభావములు, వ్యక్తినికాని జాతినికాని, ముందుకే తీసికొని పోగలవు; వెనుకకు మరలించజాలవు. అందుచె, మధ్యకాలిక – అనుభవములను పురస్కరింకొని, మనల మనము సమీకరించుకొని శ్రేష్టతర జీవితమునే కలిగించుకొన వచ్చును. పూర్వపు ఆదర్శములు, వాని సారభూతసత్యమునందె మనము చింతించవచ్చు; కాని, ఈ చేంతనయొక్క బాహ్యరూపములు, నూతన అనుభవముచె, చింతనచే, మార్పు పొందును; వీనిని, పాత – క్రొత్తమిశ్రమ రూపములలో చూడగలుగుదుము; నూతన దృక్పథముతో వీనిని ప్రోత్సహింతుము; పాత శబ్దములు కూడ, నూతన – అర్థమును, సంపన్నతను వహించును, కాని క్రొత్తగా కూర్చబడిన ఈ బాహ్య వస్తువంతయు, మన అంతఃకరణమును. వృద్ధి కావించును. నామనస్సు, అది ఆధారపడిన దాని యంతటితోను, అదిచూచి క్రియాశీల మొనరించు దాని యంతటితోను మార్పుగాంచును; నూతన చింనా వస్తువులను, దీని నుండి స్వీకరించినదాని యంతటితోను అది మార్పుగాంచును; నూతన కార్యములకు, దీనిచే ప్రచోదింప బడిన దాని యంతటితోను, అది మార్పుగాంచును; దీనిని అంగీకరించక విసర్జించిన దానియంతటితోనును, అది, ఆనామనస్సు మార్పుగాంచును. ఏలయన, నేను ఎదుర్కొను భావమును, నా పూర్వ చింతనతో, లేక సత్యముతో దృఢపఱచినపుడు కూడ, నేను దృఢపఱచుటలో కాని, విసర్జించుటలోకాని, నాకు క్రొత్తచింతనయె అగును; క్రొత్తదృశ్యములతో. క్రొత్తసమస్యలతో, నూతనముగ నిర్మించుకొనును. నా జీవితముకూడ, ఇదేవిధముగ, అదియెదుర్కొనవలసిన సంఘర్షించ వలసిన నూతన జీవిత ప్రభావములతో మార్పుగాంచును. అంత్యమున, ఆధునిక ప్రపంచముయొక్క సమస్యలతో. పరిపాలనా శక్తిగల – భావములతో వ్యవహరించక తప్పని పరిస్థితి యేర్పడును–ఆధునిక ప్రపంచము, ఐరోపా ప్రభావమునకు, పాశ్చాత్య నాగరకతకు, ఇంకనులోనై యున్నది. ఈ ఆధిక్యతను లేకుండ, ప్రాచ్య నాగరికతకు, భారతీయులమగు మనము, భారతీయ నాగరికతకుగల విశిష్ట విలువలను జీవితమునకు కలిగించుట మన ధర్మమని తలంతుము. కాని, ఆసియా, లేక భారతీయ

మనస్సు, ఈకార్యమును విజయవంతముగా నెరవేర్చ వలయునన్న, పాశ్చాత్య నాగరకతను ఎదుర్కొని, మన ఆదర్శములకు మన ఆత్మకు అనుగుణ్యమైన సమాధానములను వానికి కలిగించినవుడె, అది సాధ్యమగును.

నేను దృఢపఱచిన ఈ సూత్రము, మన స్వభావ – ఆవశ్యతను బట్టియు, జీవితవస్తువుల – అవశ్యకతను పట్టియు – నూతన యుగమునందు, నూతన పరిసరములయందు. మన స్వకీయ స్వభావస్వధర్మానికి, ఆదర్శాలకు, వీనిచే మనము సృష్టించే రూపాలకు పొందికను విశ్వాస్యత్వమును కలిగి యుండవలెను; అయ్యును పరిస్థితులను బట్టి, బాహ్య ప్రభావములను పూర్తిగా నిరాకరించకుండ. వానిని ఈశాభావముతో వ్యవహరించి దిద్దితీర్చవలెను; ఆకారణముగ. విజయవంతమగు సమీకరణ భావము మనయందుండవలెను. ఈ సూత్రమునకుగల పరిమాణము, విధానము, మార్గదర్శక సన్నివేశముల ద్వారా నూతన జీవితమునకు అన్వయింపచేయు కఠిన సమస్య, ఇంకను శేషించును. దీనిని నిర్ణయించుటకుగా మనము ప్రతి సాంస్కృతిక క్షేత్రమును గమనించి, హైందవస్వభావమును, హైందవ ఆదర్శమును దృఢముగ గ్రహించి, ఈ ప్రతి క్షేత్రమునందును. వర్తమాన పరిస్థితిపై, వర్తమాన సాధ్యతలపై ఎట్లుపని చేయగలుగునది, గ్రహించి, నూతన – విజయవంతమగు సృష్టిని సాధించవలెను. ఈ ఇట్టి చింతనా విషయమున, స్వాభిమాన భావమును త్యజించవలెను. ప్రతి సమర్థభారతీయ మనస్సు కూడ, స్వకీయ శక్తి ప్రకాశదృక్పథములతో వీనిని పరికించి, చింతించి, క్రియా శీలముకావించ వలెను. ఈ విధముగనే, వంగదేశ శిల్పులు, తమ కర్మ క్షేత్రమున సాధించి, వారి కార్యమును ప్రకాశమానము క్రియాశీలము గావించు చున్నారు – భారత పునరుజ్జీవన స్వభావము, మిగత సంతతిని నెరవేర్చును; విశ్వ – అనంతకాల – దివ్యాత్మ, తన శక్తితో, నూతన మహత్తర భారత సృష్టికొఱకు మనమధ్యనే ప్రచలిత మగుటకు ఆరంభించినది.

---

# 5_వ అధ్యాయము

# సావిత్రి

## పౌరాణిక కథ; దీని సంకేతము

గమనిక :_ (పురాణ కాలమునాడు, పృథ్విపై దివ్యజీవితమును, కొంతకు కొంతగానైన, స్థాపించుట కొఱకు, సావిత్రి యమునివెంటబడి సత్యవంతుని యెట్లు బ్రతికించినదో, అట్లే ఈనాడు, శ్రీమాత, శ్రీ అరవిందులను, అతిమానసిక శరీర మునందు పునరుజ్జీవింప చేయుటకు, శ్రీ అరవిందులతో, అతిమానసిక విధానమున సహకరించి పనిచేయు చున్నది. ఆనాడు సావిత్రి యమునివెంట బడెను. ఈనాడు శ్రీమాత యముని వెంటబడ నవసరములేదు. ఈ విషయమును మఱింత స్పష్టముగా అర్థముచేసికొనుటకు "మనము మఱవ కుండుటకు" అను శ్రీ మాతృ వచనములను ఈ గ్రంథమునందే పాఠకుడు చదువ వచ్చును.

పౌరాణిక గాథయగు సావిత్రి, శ్రీ అరవిందుల మేధస్సుచే సాంకేతిక గాథగా మార్పొందినది. ఈ గాథయందలి, సావిత్రి సత్యవంతులకు, సంకేతములు శ్రీ మాతారవిందులే కాజాలరా, యని, పాఠకుడు తన్నుదానే ప్రశ్నించుకొన వచ్చును.)

(అనువాదకులు)

సావిత్రి, – ఈ పౌరాణిక కథ, మహా భారతము ఆరణ్యక పర్వ, 248_వ అధ్యాయము – నందుగల వీరగాథ. మద్రదేశపు రాజగు, అశ్వపతికి సంతానము లేదు. సంతానమును పొందుటకు, అనేక యజ్ఞములను, వ్రతములను, అతడు సలుపును. 18 సంవత్సరముల – యజ్ఞకార్యముల తర్వాత, యజ్ఞాగ్నినుండి, దేవత సావిత్రి ప్రసన్నురాలై, ప్రత్యక్షమగును. అతడు కావించిన యజ్ఞముల కామె తన సంతోషమును వెలిబుచ్చి, సృష్టికర్త యగు బ్రహ్మ, అతనికోర్కెను నెఱవేర్చు నని చెప్పెను. ఆదేవత, తననుండియో, యన తన ప్రసాదముగ, అతని కొక

కూతురు జన్మించునని వచించెను. సకాలమున, అతని కొక కూతురు జనించెను. సావిత్రి ప్రసాదముచె, ఆమె జనించిన కారణము, ఆమెకు సావిత్రి యను పేరును నిడిరి. ఆమె లక్ష్మివలె మహాసౌందర్యవతియై, బంగారు ఛాయను కలిగి, మనుజ పుత్రికవలె గాక దైవపుత్రికవలె నుండెను. ఆమె పెరిగి పెద్దదై, వివాహ వయస్కురాలయ్యెను. కాని ఆమె వ్యక్తిత్వము అత్యంత ప్రకాశ మానముగను, మహోన్నతమునగుటచే, ఆమెను వివాహమాడుశక్తి, రాజపుత్రుల కెవ్వరికిని లేదయ్యెను. తండ్రి, అశ్వపతి ఇందుకు దుఃఖితుడై. తన వరుని తానే వెతకి కనుగొనుమని అమెనడిగెను. ఆమెను వెంబడించుట కొక మంత్రిని నియమించెను. రెండు సంవత్సరముల కాలము, దేశమున సంచరించి. తండ్రి గృహమును చేరునప్పటి కక్కడ నారద మహర్షియుండెను. వనములలో వసించు ద్యుమత్సేనుని కుమారుడగు సత్యవంతుని వరించితినని, ఆమె తండ్రికి చెప్పెను. ద్యుమత్సేనుడు గ్రుడ్డివాడైన కారణముగ, శత్రువులతనిని జయించి, రాజ్యమునుండి పారద్రోలుటచె. వనముల యందు ప్రవాస జీవితము గడుపుచుండెను. అతని కుమారుడు సత్యవంతుడు ధీశాలి, బుద్ధిమంతుడు, ఉదార వంతుడు, క్షమాశీలుడునై యుండెను. అందుచె, తల్లి దండ్రులామె కోరికను మన్నించిరి — కాని, నారదుడు, సత్యవంతుని మృత్యువు సంవత్సరము నాటికి సంఘటిల్లునని తెలిసిన వాడై అందులకు సమ్మతించలేదు. ఈ విషయమును సావిత్రికి తెలిపినను, ఆమె, ఒక్కసారి చేసిన నిశ్చయమును మార్చుకొననని చెప్పెను. అందుచె, తల్లితండ్రులామె కోరికను అంగీకరించుట తప్పనిదై, సత్యవంతునికిచ్చి వివాహము చెసిరి. వివాహానంతరము తక్షణమె, సత్యవంతునితో, అడవులలో, అతని పర్ణకుటీరమున, కష్టజీవితమున కామె వెడలెను. ఆమె తన జీవితమును సుఖసంతోషములతో గడిపినను, నారదుని కఠిన జ్యోతిష — వచనమును, ఒక్క నిమేషమైనను మఱువలేదు. రానున్న సంకట సమయమునకు తన్నుదా సిద్ధపఱచు కొనుచునే యుండి, సంవత్సరాంతమున గల కడపటి మూడురోజులు ఉపవాస దీక్ష వహించి, సర్వదా ఒకే యొక్క స్థలమున నిలుచుకొని యుండెడిది.

కడనాటి ఉదయమున, సత్యవంతుడు. యజ్ఞార్థము సమిధులగా అడవికి పోవ నిచ్చగించెను. సావిత్రి, అతనిని వెంబడించ బలాత్కరించెను; సత్యవంతుడు మరణము నెదుర్కొనుటకు, ఒంటిగా అతనిని పోనిచ్చుటకామెకు ఇష్టము లేకుండెను. అమె ప్రార్థనల నంగీకరించి, సత్యవంతుని తల్లి దండ్రులందుకు సమ్మతించిరి. అడవియందొక స్థలమును వారు చేరిరి: సత్యవంతుడు కట్టెల కొట్టుటకు ఉద్యుక్తు

డయైన. కొంతకాలము కట్టెలు కొట్టిన తర్వాత, సత్యవంతునికి. తలనొప్పి అధిక మగుటచే, ఆమె తన తొడపైన, అతని తలనుంచి పరుండబెట్టెను. సత్యవంతుడు నిదురించెను; ఆమె ఎదుటయముడు ప్రత్యక్షమయ్యెను, యముడు సత్యవంతుని జీవితమును తీసికొని పోవుటకు వచ్చితినని చెప్పి అట్లే చేసెను. యముని పాశమున తగుల్కొన్న సత్యవంతుని సూక్ష్మశరీరమును సావిత్రి వెంబడించెను. త్రోవయం దామె, యమునితో సల్పిన సంభాషణ, యముని సంతోషపఱచుటచె, సత్యవంతుని ప్రాణముతోపాటు, మఱికొన్ని వరముల నామృత్యు దేవత ఆమెకొసంగెను. ఈ విధముగ సావిత్రి, విధివి, మృత్యువును జయించి. సత్యవంతునితోకూడి పర్ణ కుటీర మును చెరెను. పురాణ గాధననుసరించి, సత్యవంతుడు, తనతండ్రి రాజ్యమును మరల సంపాదించి, సంతోషముగ నారాజ్యము నేలెను.

కవి, శ్రీ అరవిందులు ఈ కథాభాగము, అది, యుండినట్లుగనే రచించిరి. ఈ కథ, ఒక సంకేతముగా గ్రహింపబడు వీలును, దావి వ్యభావమునందే కూడ. కలిగి యున్నది; శ్రీ అరవిందులు, దీనిని ఒక సజీవ సంకేతముగ తన కావ్యము నందు రూపాంతరము కావించిరి. ప్రపంచ మూలమును గుఱించి కవికి గల స్వీయానుభవమును పట్టి, అశ్వపతి స్వభావమును ప్రథమ ఖండముయొక్క 1, 3, 4, 5 అధ్యాయములలో వర్ణించిరి. నిస్సంతానుడగు అశ్వపతి, సంతానము కొఱకు గావించిన తపోజీవితమును, మానవాత్మ దివ్య శిఖరములనుండి భూమిపైకి, ప్రపంచము యొక్కయు ఆత్మయొక్కయు జ్ఞానార్జన కొఱకు అవతరించు సంకేతముగా, కవి మార్చి యున్నాడు. రెండవ ఖండమునందు, అశ్వపతి, నిశ్చేతన జడలోకము నుండి, లోకములు తర్వాత లోకములను దాటి, ఉన్నతతమ జ్ఞానలోకమునందు గల విశ్వదైవమునకు చెందువఱకు, ఎట్లు యాత్రగావించి, వానియందుగల జీవిత విధానమును అనుభవించినది. వర్ణించినాడు. దైవమును ప్రపంచమును, తనను గుఱించిన సత్యాన్వేషణయందు, వేలకొలది సంవత్సరములుగ మానవాత్మ అన్వేషణా ప్రయత్నమునందు, మానవుని ఉత్కాంక్షకు అశ్వపతి ప్రతినిధి కావింప బడినాడు. అశ్వపతి, తన తపస్సుచే, చేతస్సుకుగల అగాధతమ లోతులను, ఉన్నత తమ శిఖరములను తెలిసికొను అవకాశములను గ్రహించినాడు. మానవుడును, పృధ్వియు పరిపూర్ణతనీ భూమిపై సృష్టికచగల ఆకాంక్ష, అతని హృదయమునందు జ్వలించును. మూడవ ఖండము నందు, అశ్వపతి విశ్వాతీత చేతనాభూమికల నందు కొని, సృష్టికారిణియగు పరాత్పర ప్రకృతితో ముఖాముఖికలియుటను, కవి వర్ణించి

నాడు. అశ్వపతి ఆధ్యాత్మిక ప్రయాణ గమ్యమున, శూన్యమునకు బదులు, పరాత్పరుని స్వకీయగృహమును, సచ్చిదానందములను అనుభవించగల గృహమును చేరును. ఈ సత్యలోకమును, పృథ్విపైకి కొనితెచ్చి, ఒక నూతన సృష్టిని, దివ్య రాజ్యమును, ఇక్కడనే అభివ్యక్తము చేయుట సాధ్యమని, అశ్వపతికక్కడ అనుభవమగును. మానవుని అజ్ఞాన మధ్యమున, అంధకార - బాధా-తమ :- మృత్యువులకు విరోధముగ సత్యలోకము అవతరింప చేయుటకు అధ్యాత్మిక ప్రయత్నమును సాగించుటకు, పరాత్పర దైవము ప్రత్యక్షముగ అతనిని ప్రేరేపించును. మానవుని జీవితము మధ్య దివ్య జీవనమును తానై స్థాపింప అసమర్థుడననియు. దివ్యమాత తన వ్యక్తిత్వమును పృథ్విపైకి ప్రసరింపచెసి, కాని, లేక స్వయముగ అవతరించినకాని తన కాకార్యము సాధ్యము కాదని సందేహపడును, పరాత్పర మాత, ఆమె ప్రసన్నతయందు, సమ్మతించి. ఆమె ప్రసన్నతయొక్క ఆవిర్భావము పృథ్విపై జనించునని అశ్వపతికి వరమిచ్చును. "ఒకనూతన ప్రకాశము పృథ్విపై ఉదయించును; నూతన ప్రపంచము పృథ్విపై జనించును; వాగ్దత్తము చేయబడిన విషయములు నెరవేర్నబడును" (శ్రీమాత).

పృథ్విపై దివ్యపరిపూర్ణతా - సృష్టికి అవసరమగు సాహాయ్యమును, అశ్వపతి తీవ్రముగ ఆకాంక్షించుటచే, ఇందుకు దైవముయొక్క ప్రత్యుత్తరముగ, సావిత్రి జన్మించెను. మానవాత్మ నిశ్చేతస్సు నుండి దివ్య - అతిచేతస్సు యొక్క కవాటమువఱకు లోకముల తర్వాత లోకముల ద్వారా ప్రయాణించి ఆరోహించిన వీరగాథను, కవి తన కావ్యమునందు వర్ణించినాడు, అందుచే ఈ సంకేతము, విశ్వ పురోగతికొక గంభీర చిహ్నముగ నేర్పడుచున్నది, అశ్వపతి సాధించిన విజయములు. మానవుని పరిణామాత్మక ఆత్మయొక్క విజయములేయై. మానవజాతి, సత్యము కొఱకు కావించె పోరాటమునందు, ఈ విజయము, సమష్టి మానవజాతి విజయమే యగును.

అట్లే సావిత్రికూడ, ఒక రాజకూమారిగా నుండి పొవుటయేగాక, మానుష్యకము యొక్క అజ్ఞాన బాధలయందు, అంధకారము యొక్కయు మృత్యువు యొక్కయు శక్తులపై విజయము కాంచు శక్తిని అది పొందుటకుగా, పరాత్పరుని దివ్య ప్రసన్నతా ఆవిర్భావమే యైనది. సత్యవానుని జీవితమును కొనిపోవుటకు వచ్చిన యముని ఎదిరించి, సావిత్రి, ఈ విజయమును పొందినది, స్వకీయ అనంత్యముచె, అమృతత్త్వముచే, రక్షణాశక్తిచే. ఆమె సత్యవంతుని బ్రతికించెను.

ఆమె, మిగత జీవిత భాగమంతయు, పురాణగాధలో నుండినట్లు వలెనే, తన కావ్యమునందు కూడ, కవి వివరించినాడు. కాని, ఒక్క భేదమును చూపెట్టినాడు. పుట్టినది, మొదలు, కడపటివఱకు సావిత్రి, తనయందుగల దైవత్వమును కూడా, మానవత్వముతో పాటు, స్మరణయందె కలిగియుండెను. సావిత్రి విధిని గుఱించిన నారదోపాఖ్యానమునందు, మానవుని విశ్వజీవిత గమ్యముయొక్క ఉద్దేశ్యములను, తీవ్రతలను, ఆధ్యాత్మిక శిఖరములకు, కవి ఉన్నతించినాడు. పరాత్పర మాత అశ్వపతికిచ్చినవరము యొక్క గాంభీర్యతను, నాలుగు, ఐదు, ఆరుఖండములలో సావిత్రి గుణగణ వర్ణనయందు రక్షించినాడు. పురాణగాధయందు సావిత్రీయముల మధ్య జరిగిన సంభాషణ మత - నైతిక స్వభావము గలదై చప్పగనున్నది; కాని, ఈ వీర్య కావ్యమునందు, సావిత్రి, మానుష్యకము యొక్క ప్రతినిధి మాత్రమే కాదు, కదా. పరాత్పర దైవకృపను మూర్తీభవింప చేసికున్నది. అజ్ఞాన తత్త్వము పన్నగల చాతుర్యము, సూక్ష్మత, కౌశలము నంతటిని, యముడు ప్రదర్శించును; సావిత్రి సంభాషణ యంతయు, దివ్యావేశ విద్యుత్ - ప్రకాశములతో, ఉర్ధ్వలోకముల నుండి తేబడినట్లు జరుపబడినది - మానవాత్మ గమ్యమునకు పూర్ణార్థము, ఈ కావ్యమునందు దిద్ది తీర్చబడినది. మానవ జీవిత పరిణామమునందు, పురాణగాధను, ఆంతఃకరణిక సంఘటనగా, కవి మార్పుగావించినాడు, ఈ మహా ప్రభువు యొక్క రసాయనికశక్తి దీనినిట్లు రూపాంతర మందించుటయందే కలదు. పురాణ గాధయందు సావిత్రి సత్యవంతులు తమ రాజ్యమును చేరి, పృథ్వీరాజ్యమును పాలింతురు; కాని ఈ కవి సంకేతమందు. వీరు మృత్యురాజ్యమునుండి ఉద్భవించి, సత్యసూర్యుడు అస్తమించని, శాశ్వత రాజ్యమును చేరుదురు; ఇక్కడ అజ్ఞాన మృత్యువులకు తావులేదు. వీరు సత్యలోకము నందొకింతకాలము వసించి, పృథ్విపైకి దైవకార్యమును సాధించుటకొఱకేతించి, నవమానవ జాతిని సృష్టింతురు, ఈ విధముగ సావిత్రి పురాణగాధ. ప్రభువు, శ్రీ అరవిందుల సృష్ట్యాత్మక దృష్టియందు నొక విశ్వ సంకేతముగ రూపాంతర మొందినది. పురాణి.

---

## 6–వ అధ్యాయము

# జాతీయ విద్య

నిజమగు విద్యయననేమో. దాని సారార్థము ముఖ్యోద్దేశ్యము భావములను గ్రహించుటకొఱకు, వానినిగుఱించిన సందిగ్ధభావములను మొదలు గ్రహించి, వీనిని తొలగించుకొనుట అవసరము. అప్పుడుమాత్రమే, వీనినిగుఱించిన ప్రథమ సూత్రములు స్పష్టమైన నిజమగు విద్యకుగల పూర్ణ అర్థమును, దానికుండవలసిన నిజ స్థానమును భద్రపఱచగలము. మొదలు విద్యయననేమో తెలిసికొనిననే, జాతీయ విద్య యిట్టిదియనికాని, లేక యిట్టిదిగా నుండవలెననికాని చెప్పనగును. కనుక జీవ వంతమగు నిజవిద్య యిట్టిదియని నిర్వచించుటలో మరెవ్వరుకూడ విరోధించని విధ ముగ, ప్రారంభసూత్రమును నిర్ణయించనగును; అట్టి నిజవిద్య యేదియని గమ నించుట కొఱకు, ఈమూడు విషయములు అవసరము: ఒకటి, సర్వులతోడి తనకు గల సాధారణత యేదోదానిని కూడినట్టియు, అట్లే సర్వులనుండి తనకుగల ప్రత్యేక విశిష్టతయేదో వానినికూడినట్టియు నగు వ్యక్తి: రెండు, వ్యక్తి తనదియని చెప్పు కొనదగిన జాతి; మూడు, సమస్తజాతులను తనయందిముడ్చుకొన్న విశ్వ మానవ జాతి. ఏవిద్య, వ్యక్తియందుగల సర్వమును మానవజాతి జీవితమునకు పూర్ణోప యోగముగ సిద్ధపఱచునో, ఏవిద్య తానుచెందినట్టి జాతియొక్క జీవితముతో చింత నతో ఆత్మతో సత్యసంబంధము నేర్పఱచునో, యేవిద్య. వానివాని ప్రత్యేకత కలి గియు ఐక్యమునుపొందిన వివిధమానవజాతుల సమష్టియొక్క ఆత్మతో చింతనతో జీవనముతో సత్యసంబంధము నేర్పఱచునో, అట్టిదే జీవవంతమైన నిజమగువిద్య. ఇట్టి విశాల పూర్ణసూత్రము ననుసరించి వివేచించినచో మాత్రమే. విద్యను గుఱించియు, మన జాతీయవిద్యచే నెరవేర్చవలసినదానిని గుఱించియు స్పష్ట భావ మును తేల్చుకొనగలము. ఇప్పుడు భారతదేశమున కవసరమైనది, యిట్టి దృక్పథమే. యిట్టి విస్తృతమూలాధార విధానమే; వీనిచేమాత్రమే భారతదేశము పూర్ణజీవనీ శక్తిని పొంది, ఈ సందిగ్ధసమయమున దాని అవసరమును అది నెరవేర్చి, వ్యక్తి యందును జాతియందును నిజాత్మను నిర్మించి. అట్టి నిర్మింపబడిన నిజాత్మయొక్క శక్తిచే సమష్టి మానవజాతి జీవితమందు నిజస్థానమును గౌరవమును పొందగలదు.

కాని మానవుని గుఱించియు, మానవజీవితమును గుఱించియు పలువిధ భావములు కలవు; అట్లే జాతిని గుఱించియు, జాతిజీవితమును గుఱించియు, మఱి విశ్వమానవజాతిని గుఱించియు, దానిజీవితమును గుఱించియు కూడ పలువిధభావములు కలవు: ఈపలువిధ భావములయందుగల భేదముచేతనే మన విద్యావిధానమునందు కూడ భేదముండగలదు. ఈ విషయములను గుఱించి భారతదేశము కొన్ని విశిష్ట భావములను, నొక ప్రత్యేక దృక్పథమును కలిగియున్నది. మన దేశమునకు విద్యను గుఱించిగల యీ భావదృక్పథము, మూలమునందు చక్కని సామంజస్యతను కలిగి యుండుటలేదా యనియు, దానికి మన జాతీయస్వభావము చక్కగా కూడి యుండ లేదా యనియు, మనము గమనించవలయును. మనుజుడు, భౌతికప్రవృత్తిచే పరిణామము గాంచబడిన ప్రాణగత శరీరమనియు, – ఆ భౌతిక ప్రవృత్తినుండి కొన్ని ప్రాణిక ప్రవణతలు, అహంతయు, మనస్సుయు, సహేతుకతయు, నగునీయన్నియు వికసించిన నరపశువే అతడనియు,—స్వీయ అహంతయొక్కయు జాతి అహంతయొక్కయు లాభము కొఱకు వ్యక్తి తన మనస్సును బుద్ధిని శిక్షణ పఱచి, ప్రాణిక ప్రవణతలను తృప్తిపఱచ వలసిన దనియు, భారతీయ మనీషులు తలంచియుండలేదు. మనుజుడు, తార్కిక బుద్ధిని అధికముగా గలిగియుండు పశువు మాత్రమే యనియు లేక యింకను విశదముగా అనేకులు చెప్పుచుండునట్లుగ, అతడు భౌతిక ప్రకృతియొక్క మానసపుత్రుడే యనియు, చింతనావేగ సంకల్పముతో కూడిన యొక అస్తిత్వము మాత్రమే అతడనియు, లేక సంఘమునందును జాతియందును సుశిక్షితుడై కుశలుడై భౌతిక వస్తువులను నిర్మించు యొక రాజకీయ సాంఘిక ఆర్థిక పురుషుడు మాత్రమే అతడనియు, భారతాత్మ తలంచలేదు. ఈ వివరించిన అంశములన్నియు మానవుని ఉనికియందలి భాగములే అనియు, దాని విశాలతర దృక్పథమునందు వీనికిని కొంత ప్రాముఖ్యత కలదనియు, కాని యివి యన్నియు బాహ్యవిషయములే యనియు మనః ప్రాణములకును కర్మలకును, నివి యన్నియు ఉపకరణములేయనియు, నిజ మనుజుని పూర్ణతర విషయము అవి కావనియు భారతాత్మ పరిగణించెను.

వ్యక్తిగతమనుజుని, యొక ఆత్మగను, శరీర మనస్సులతో నావరింపబడిన యొక దివ్యాంశముగను, ప్రకృతియందు విశ్వాత్మయొక్క సచేతనావిర్భావముగను, భారతదేశము సర్వదా పరిగణించెను. మానవుని సర్వదా, మానసికము బౌద్ధికము నైతికము క్రియాత్మకము వ్యావహారికము రసాత్మకము సుఖాత్మకము ప్రాణికము

భౌతికము నగు సత్తగను గుర్తించి. వీని యన్నింటిని మానవునియందు కృషిసల్పి, వీని ద్వారమున మానవునియందు ఆత్మశక్తులను వికసింపచేయుచు, తద్వికాసముతో ఆత్మయు వికాసము పొందుట జీవితోద్దేశ్యముగా భారతదేశము పరిగణించెను; అయ్యును, ఈ వివిధాంశములన్నియు ఆత్మకాదు; ఏలయన వీని శిఖరమున, వీని యన్నింటికన్న యున్నతమగు ఆధ్యాత్మికసత్త యొక్కటి కలదనియు, దానికి అతడు అధిగమించవలెననియు, ఈ అధిగమించుటయందే మానవాత్మ తన పరమావిర్భావ మును, తన పరమార్థమును, తన యున్నత పురుషార్థమును పొందునని భారత దేశము తలంచెను. ఇదేవిధముగనే, జాతి జీవనము, లేక ప్రజాజీవనము అను శబ్ద ములచే, సువ్యవస్థితమగు రాజ్యమనికాని, లేక జీవిత పోరాటమునకు బాగుగా సం సిద్ధమై ఆయుధపాణియైయుండు ప్రజయనికాని, లేక జాతి అహంతను సేవించుటకు వీని నన్నింటిని యుపయోగించుటయే జీవితలక్ష్యమనికాని తలంచలేదు; అట్లు చేయుట, జాతీయాత్మను మలినపఱచి, బద్ధమొనరించి, లోహకవచమున మఱుగు పఱచుటయని తలంచెను; మఱియు జాతికి యొక సమష్ట్యాత్మయు నొక సమష్టి జీవ నము కలిగినవై, ఆజాతి ప్రత్యేక స్వభావ స్వధర్మములను కూడినదై, దాని బౌద్ధిక రసాత్మక నైతిక క్రియాత్మక సాంఘిక రాజకీయ రూపములందును శిష్టతయందును ఆధ్యాత్మికతను మూర్తిమంత మొనరించునవియు తలంచెను. అదేవిధముగనే, సమష్టి మానవజాతియొక్క శిష్టతనుగూర్చిన భావముకూడ, పై భావములననుసరించి, మానవజాతి సమష్టియందు విశ్వాత్మకతను అభివ్యక్త మొనరించుటయే ఆదర్శముగా గల పూర్వ హైందవభావము ననుసరించి, అంత్యమున చేరగల యున్నత ఆధ్యాత్మి కోద్దేశ్యమును సమష్టి జీవితమునందు ప్రాణమనస్సుల ద్వారమున వికసింపచేయు టయే మన గమ్యముగా నుండవలెను. సంవాద విసంవాదకర్మల ద్వారమున యేకత్వ మునకేసి పరుగిడునట్టియు, వివిధ ప్రజలయొక్క జీవితోద్దేశ్యములయు నానావిధ శిష్టతలయు ద్వారమున ఆవశ్యకమగు వైవిధ్యమును పోషించుకొనుచుండునట్టియు, వ్యక్తులయొక్క శక్తివికాసమూలమున పూర్ణత్వమును అన్వేషించుచు దివ్య జీవితాభి వృద్ధి కాంచుచుండునట్టియు, విశ్వమానవ జీవితమునకు కూడ నిదే విధముగ పూర్ణ త్వమును నిదానముగనే యైనను కావింప ప్రయత్నించుచుండునట్టియు నగు పరాత్ప రుని భావమే మనగమ్యమై యుండవలెను. ప్రత్యేక ప్రజయొక్కగాని విశ్వమానవ జాతియొక్క గాని జీవితవిధాన మిట్టిదిగనే యుండనగునా యని కొందరు వాదించ వచ్చును; కాని ఈ వివరణయే సరియైనదని ఒక్కసారి ఒప్పుకొంటిమేని జాతి యొక్క వ్యక్తియొక్కయు శరీర మనస్సులను నిట్టి ఆదర్శముతో దిద్ది తీర్చునట్టి

విధానమే సరియగు విద్యయనుట స్పష్టము. ఈ సూత్రము పైననే మనము నిర్మించవలసిన విద్యావిధానము కలదు: అదియే మన యేకైక ప్రేరణయు, పురోగాముక ఆదర్శము. అవిద్య, వ్యక్తికి సంబంధించినంతలో, అతనియందలి ఆత్మను, దాని శక్తులను సంభావ్యతలను వృద్ధికావించునట్టి ముఖ్యోద్దేశ్యమును కూడినదిగను, జాతికి సంబంధించినంతలో, జాతియొక్క ఆత్మను దాని ధర్మమును ప్రారంభమునుండి రక్షించుచు, బలపఱచుచు, సుసంపన్న మొనరించుచు తుదకు జాతిని వ్యక్తిని, రెండింటిని విశ్వమానవజాతియొక్క జీవితశక్తులలోనికి, ఉన్నతోన్నతుల కుద్గమించు మనస్సులోనికిని, దాని ఆధ్యాత్మిక స్వభావములోనికిని యున్నతింపచేయవలెను. ఎట్టికాల సందర్భములోకూడా మానవుని యీ యున్నతోన్నత ఉద్దేశ్యమును, అతని ఆధ్యాత్మిక జాగృతిని వికాసమును మరువనిదిగా ఆ విద్య యుండవలెను.

## 7_వ అధ్యాయము

# శ్రీ అరవిందులు : ఆంధ్ర విశ్వ విద్యాలయానికిచ్చిన సందేశము

(1948, డిశంబరు 11 వ తేదీన, ఆంధ్ర విశ్వ విద్యాలయ పట్ట ప్రదాన సభా సమావేశ సమయమున, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారి జాతీయ బహుమాన మును, ఆంధ్ర విశ్వ విద్యాలయము తరుపున, శ్రీ అరవిందులకు వారొసంగిరి. ఈ సందర్భమున శ్రీ అరవిందులీ సందేశమును వ్రాసంగిరి. ఈ సందేశము కేవల విశ్వ విద్యాలయమునకే గాక, ఆంధ్రులకు కూడ అన్వయించును.)

సందేశము నొకటి నివ్వుమని మీరు నన్ను కోరితిరి. నేనీ సందేశమును (ఇది ఆ పేరుతో పిలువబడ గలిగినచో), ఆంధ్ర విశ్వ విద్యాలయమున కిచ్చు చుంటిని గనుక, ఇది విశ్వవిద్యాలయ ఉద్యమమునకు, స్వభావమునకు, అది నెర వేర్చవలసిన కార్యమునకు సంబంధించి యుండవలెను. కాని, ఈ సమయమున మన జాతీయ ప్రభుత్వ స్వరూపము. విధానము. పరిపాలనా పద్ధతులను గుఱించి మాత్రమేగాక, మనజాతియొక్క విధి విధానము, స్వభావ నిర్మితి, ప్రపంచము నందితర దేశములతో గల సంబంధము నందు దీనికి గల స్థానము, దీని భవిష్య త్స్వరూపము, ఈ యన్నింటిని గుఱించి, అతిముఖ్య తీర్మానములు జరుగుచుండు, ఈ సమయమున నా దృష్టివి వీనిపై మఱలించకుండ వీలులేదు. ప్రస్తుతము మన జాతి నెదుర్కొను చున్న సమస్య, మన కందరికి సంబంధించిన ఈ సమస్య, నొకటిని గుఱించి, ఎంత అసంపూర్ణముగనే యైనను, ఇప్పుడిక్కడ వివరింతును: ఆంగ్లేయులచే మన దేశము కృత్రిమముగా విభజింప బడిన రాష్ట్రములను, ఐక్యత యందు వైవిధ్యమను సూత్రమును, (పూర్వ భారత జాతియొక్క ఆదర్శ ప్రయత్న ములుగా నుండిన ఈ సూత్రమును) _ ఆధారముగా చేసుకొని, నూతన విధానమున మార్పు గావించి రాష్ట్ర విభజన పునర్నిమిత కావలయునను ప్రజాభిమతమును గుఱించిన సమస్య. ఇది _ భారత దేశము, హిమవత్పర్వతముల చేతను, సము

ద్రము చేతను; చుట్టు ఆవరింపబడి, ప్రపంచమునందు గల తదితర దేశముల నుండి ప్రత్యేకింపబడి, మిగత ప్రపంచ జాతులన్నిటి నుండి స్వరూప స్వభావములందు వేరుపడి, ప్రత్యేక విశిష్ఠ నాగరకతను, జీవిత విధానమును, ఆత్మస్వభావమును, ప్రత్యేక సాంస్కృతిని, కళలను, సంఘ నిర్మాణమును కలదై యున్నది. ఈ దేశమునందు ప్రవేశించిన దానినంతటిని, తనలో జీర్ణించు కున్నది. జీర్ణించుకున్న దాని నంతటిపై, తన స్వభావమును ముద్రించినది. ప్రవేశించిన విభిన్న విషయము లన్నింటిని తన ఆధార భూతమైన ఐక్యతలోనికి రూపొందించు కున్నది. కాని, అది మొదటి నుండి ఈ నాటివఱకు, వివిధ ప్రజల, ప్రాంతీయ ప్రదేశముల యొక్కయు, రాజ్యముల యొక్కయు కూటమిగా నుండెను; పూర్వతర కాలము నందు, ఈ దేశము; వివిధ ప్రజా ప్రభుత్వములను కలదై, వివిధ మానవజాతులు, ప్రత్యేక స్వభావమును గల ఉపజాతులు, వేర్వేఱు నాగరకతలను, సంస్కృతులను కలదై, వేర్వేఱు కళా - శిల్ప విధానములను కలదై, ఈ యన్నింటిని భారతీయ నాగరకతా - సంస్కృతి స్వరూపములోనికి మార్చుకొనినదై యుండెను. భారతదేశ చరిత్రను బట్టి, భారతదేశము రాజకీయముగను, సాంస్కృతికముగను, ఒక్కటియై యుండుటకు ఈ వేర్వేఱు అంగములన్నిటిని వైవిధ్యమునందు ఐక్యము కావించు ప్రయత్నము, అనవరతము చేసినట్లు దృఢముగా చెప్పవచ్చును. మహమ్మదీయులు తమ విభిన్న మత, సంఘ నిర్మాణములతో, ఈ దేశము నందు ప్రవేశించి నపుడు భారత జాతియొక్క ఐకమత్యము లోపించినది అయ్యును, రాజకీయ ఐక్యతకే గాక, ఈ రెండు విభిన్న సాంస్కృతులు ఐక్యమై, పరస్పరము కలసి పోవుటకు ప్రయత్నములు జరిగెను. ఈ రెండు మతములను సమన్వయ పఱచి, ఒకే మత మును సృష్టించుట కొకవీర ప్రయత్నము కూడ కావింపబడి, పరస్పర ప్రభావ ములు కావించు కొనెను. కాని, భారతీయ చరిత్రను బట్టి, రాజకీయముగా, దేశ మంతయు ఒక్కటిగ యెన్నడును కాజాల దయ్యెను; ఇందుకు మొదటి కారణము; దేశము వికలమై, చాలినంత రహదారులు లేక పోవుటచే, ప్రజలను ఒక్కచోట గూర్చ సాధ్యము కాదయ్యెను. రెండవ కారణము ఈ ఐక్యమును సాధించు ప్రయత్నము యొక్క స్వభావము నందేగల లోపము, సైనిక బలముచే, ఒక్క ప్రాంతీయ ప్రజ, మఱితర ప్రాంతములపై సామ్రాజ్యత్వమును యేర్పఱచుటచే, శాశ్వతముగా నుండజాలని సామ్రాజ్యము లేర్పడెను. కడపటి కారణము, ఈ వేర్వేఱు ప్రజలను, రాజ్యములను రూపుమాపి, ఒకే యొక ప్రజగా నిర్మించు సంకల్పము, యెవ్వరికిని లేక పోవుట. ఇట్టి సందర్భము నందు, భారత దేశమున,

ఆంగ్ల సామ్రాజ్య మేర్పడి, తన పరిపాలనా సౌకర్యము కొరకు కృత్రిమ రాష్ట్రములుగ దేశమును విభజించుటలో, ప్రాంతీయ ప్రజల అభిమాన సూత్రమును బట్టి దేశమును ప్రజాప్రాంతములుగా విభజించక పోయెను. ఈ సమయమప్పటికి, దేశమంతయు స్వభావ స్వధర్మములతో గూడిన ఉపజాతులు, వారివారి భాషలతో వాఙ్మయములతో మరితర సాంప్రదాయములతో, నాలుగు ద్రావిడ జాతులు, వంగ, మహారాష్ట్ర, గుజరాత్, పంజాబు, సింధు, అస్సామ్, ఒరిస్సా, నేపాల్, ఉత్తర హిందీ భాషీయులు, రాజపుత్రము, బీహార్, దేశమంతట యేర్పడెను. ఆంగ్లేయ ప్రభుత్వము, తమ రాష్ట్ర పరిపాలనా విధానముతో, వీరిని ఐక్య మొనరించలేదు కాని, ఒకే ఒక పరిపాలన పద్ధతి, ఆంగ్లభాషద్వారా పరస్పర సంప్రతింపులను, ఒకే ఒక విద్యా విధానమును వీరికి ప్రయోగించుటచే, వీని వలన దృఢ జాతీయాభిమానము, స్వాతంత్ర్య వాంఛ. ఈ వాంఛను నెరవేర్చు కొనుటకు ఐకమత్యతను కలిగించెను. దేశమంతట కూడ స్వాతంత్ర్యమును పొందుటకు అవసరమైనంత ఐక్యత మాత్రమే యేర్పడెను. కాని, ఆ స్వాతంత్ర్యము కలిగిన తర్వాత జాతియంతయు పూర్ణైక్యతను పొందియుండ లేదు. ఇందుకుబదులు, రెండు జాతులనెడి తత్త్వముతో, దేశమును హిందూస్థాన్, పాకిస్థాణగా విభజన యేర్పడెను. వీని దుష్ఫలితములను మనము చూచుచునే యున్నాము.

ఆంగ్లేయుల నుండి దేశ పరిపాలనను స్వీకరించుటలో, అల్పసంఘర్షణా - విధానమననుసరించి, కృత్రిమ ఆంగ్ల నిర్మిత రాష్ట్రములను, తాత్కాలికముగనైన అవలంబించితిమి. ఈ విధానము, ఇపుడు దృఢపడునను సందియము కలుగుచుండ, కొందరు దీనినే ప్రోత్సహించు చున్నారు. ఏలయన, దీనిచే దేశము ఐక్యము కాగలదని, గత కాలమున, దేశమును ఐక్యము కావించుట కద్దు పడిన శ్రమయంతయు నిప్పుడు తొలగునని తలంచు చున్నారు. దేశము నంతటిని ఏక విద్య మొనరించుట యందే జాతికి ఐక్యత కలిగి, ఒకే జాతి నిర్మితయై సమాన పరిపాలన సమానభాషా - వాఙ్మయము, సమాన సంస్కృతి - కళ - విద్యా విధానము - ఈ యన్నియు ఒకే దేశభాషద్వారా జరుగ గలదని వారు తలంతురు. భవిష్యత్కాలములో, ఈ భావమెంత వఱకు సిద్ధించునో కాని, ప్రస్తుతమిది సాధ్యము కాదని, మఱి యాదేశమునకది ఆవశ్యకము కూడ కాదనియే సందేహించ వచ్చును. ఈ దేశము యొక్క పూర్వవైవిధ్యములు, అనుకూల ప్రతికూలముల రెండింటిని కలిగి యుండెను. ఈ వైవిధ్యములచే, దేశము యొక్క జీవనము, కళ, సంస్కృతి

తులు ఐక్యము నందును, సంపన్న వైవిధ్యముగల అనేక సజీవ - స్పందిత కేంద్రములకు యీ దేశము జన్మభూమిగా నేర్పడెను. కొన్ని రాష్ట్రముల ముఖ్యపట్టణములు మాత్రమే. దేశము నందలి సర్వమును ఆకర్షించి మిగత భాగమును నిర్వీర్య మొనరించ లేదు. ఇతర పట్టణములు, ప్రాంతీయ ప్రదేశములు కూడ అభ్యుదయ మార్గమున వర్ధిల్లెను. జాతియంతయు, అనేక భాగములందు, పూర్ణ జీవితమును జీవించుటచే, సర్వము యొక్క సృష్ట్యాత్మకశక్తిని ఈ పూర్ణ జీవితము అధికము కావించెను. అందుచే, ఇప్పుడు కూడ జాతియందు గల వైవిధ్యము జాతియైక్యతను నష్టపఱచునను భయములేదు. దూరదూరముగా నుంచబడిన విస్తృత ప్రదేశములు, భౌతిక విజ్ఞాన శాస్త్రాభివృద్ధి కారణముగ, రవాణా పద్ధతులు వేగమంతయు అధికము చేయబడి నందున, జాతి యైక్యతకవి అపాయకరములు కాజాలవు. సంయుక్త జీవిత భావము, దాని విధానములు సృష్టపఱచబడినవిగనుక, వీనిని ఉపయోగించుకొని, ఐక్యతను సంరక్షించుకొనవచ్చును. ఇంతకన్నముఖ్య విషయమేమన, జాతీయైక్యతా భావము ప్రజలయందు దృఢపడినది గనుక, ఉపజాతి యొక్క ప్రత్యేక. ప్రాంతీయ జీవితముచే, జాతియైక్యత భంగము కాజాలదు. జాతీయ మహాసభ కూడ, స్వాతంత్ర్యమునకు మునుపు, భాషా ప్రయుక్త రాష్ట్ర సూత్రమును అంగీకరించి, నిర్మించుటకు తీర్మానించి యుండెను. అందుచే, తక్షణము ఈ సూత్రము నాచరణ యందుంచుకున్నను, అవసరమని తలంచి నంతనే, దీనిని ఆచరింప చేయవలెను. అపుడు మాత్రమే భారత జాతీయ జీవనము ఏకత్వము నందు అనేకత్వమును, స్వభావ స్వధర్మములను బట్టి స్థాపితమగును.

ఈ స్థితి, భవిష్యత్తునందు అనివార్యముగా నేర్పడవలెను. ఏలయన ద్రావిడ ప్రదేశ ప్రజలు, స్వపరిపాలనా హక్కుమాత్రము కోరుచున్నారు. అట్లే మహారాష్ట్రము కూడ తమకు ప్రత్యేక రాష్ట్రమును కోరుచున్నది. అట్లే గుజరాత్ ప్రజలు కూడ కోరు చున్నారు. అట్లే జరిగినచో, ఆంగ్ల నిర్మిత, బొంబాయి రాష్ట్రములు అదృశ్యమగును. వంగరాష్ట్రమప్పటికే విభజనను పొంది, ఒరిస్సా, బీహార్, అస్సామ్ ప్రదేశములు, స్వపరిపాలన ప్రదేశములుగ నేర్పడినవి. కేంద్ర రాష్ట్రములు సంయుక్త రాష్ట్రములు కలసి, హిందీ - భాషా రాష్ట్రముగ నేర్పడ వచ్చును. భారత దేశము హిందుస్థాన్ పాకిస్థాన్‌గా కాబడిన విభజనను రద్దుచేసినను, ఈ భాషా ప్రయుక్త విభజనను, అది భంగపఱచదు. ఈ ప్రాంతీయ ప్రజల ప్రభుత్వములు కలసి, ఐక్యభారత ప్రభుత్వ రూపమును సిద్ధ పఱచును.

ఈ నూతన నిర్మాణ విధానమునందు మీ విశ్వవిద్యాలయము, దీని నిజోద్యమము సిద్ధిని కనుగొన గలదు. ఇతర భారతీయ విశ్వకళాశాలల నిర్మాణము వలెకాదు. దీనినిర్మాణమూలము. అవి, విదేశ ప్రభుత్వముచే, వారి నాగరకతను భారత దేశమున ప్రవేశపెట్టుటకు, రాష్ట్రి ముఖ్య పట్టణములలో, కేవలము విద్యా బోధకు యేర్పడిన సంస్థలు - వారణాసి, ఆలీఘర్ విశ్వవిద్యాలయములు సమస్త భారత జాతి దృష్టిపై, జాతియొక్క రెండు ముఖ్యమతముల దృష్టిపై నేర్పడినవి. ఆంధ్ర విశ్వవిద్యాలయము, ఆంధ్ర జాతీయ భావముతో ముఖ్యపట్టణమునందు గాక, ప్రాంతీయ ప్రజల ఉపయోగార్థము సచేతనముగ నిర్మింపబడినది. ఆంధ్రజాతి, దృఢ పౌరుష శక్తిమంతమగు జాతి; గత, భారత రాజకీయ జీవితమునందు ఉన్నత పాత్రను వహించినదై, కళలు, గృహనిర్మాణ విగ్రహ శిల్ప సంగీతము లందు ఉన్నతముగా జీవించినదై, జాతి నిర్మించిన సామ్రాజ్యమును, భారతదేశము నందధిక భాగమును చక్రవర్తులుగ పాలించిన వంశములలో తమకు గల స్థానమును స్మరింతురు. కడపటి హిందూ సామ్రాజ్యమగు, విజయనగర సామ్రాజ్యము యొక్క ఘనతను, కీర్తి కార్యములను వీరింకను మఱువలేదు. ఈ కార్యములే జాతికైనను ఘనతను కూర్చునవియే యగును. జాతిపితరులకు అర్హులగు నట్లు, విద్యార్థులకు సంస్కృతి విజ్ఞానమును, విద్యలను శిక్షణ నొసంగు ఉన్నత స్థానమును, ఈ విశ్వ విద్యాలయము అలంకరించ గలదు. ఈ జాతి యొక్కగత ఉన్నత కార్యములు, దీని భవిష్యత్తు యొక్క ఉన్నతతర జీవితమునకు దారి తీయ వలెను. భౌతిక విజ్ఞాన శాస్త్ర జ్ఞానము మాత్రమే కాదు, కళలు కూడ, అట్లే పుస్తక జ్ఞానము మాత్రమే కాదు, సాంస్కృతి యందును. స్వభావమునందున ఔన్నత్యము కూడ, విజయమగు విద్యయందు భాగములు; వ్యక్తి, తనశక్తిని వికసన పఱచుకొను కార్యమునందు సహాయపడుట, భవిష్యత్కాలచింతనులు గను, స్రష్టలుగను, సత్యద్రష్టలుగను, సత్యకర్మలుగను నిర్మించు కొనుటలో సహాయపడుట, ఈ విశ్వవిద్యాలయ కార్యము. ప్రాంతీయ ప్రజల జీవితము, తమకు మాత్రమే పరిమితింపబడ కూడదు. ఈ విద్యాలయ యువకులు, ఇట్టి యితర భారతీయ ప్రజలతో పరస్పర జీవితము నందు, పరిశ్రమలు, వ్యాపారము, మరితర జీవిత క్షేత్రములందే కాక, మనసాత్మల విషయములందు కూడ సంబంధము కలిగి యుండ వలెను. ఆంధ్రజాతి పౌరులుగ మాత్రమేగాక, భారత జాతి పౌరులుగ నుండుటకు వారు నేర్చుకొనవలెను. ఏలయన: సమిష్టి జాతి జీవితమే, తమ జీవితము. సమిష్టి భారత జాతి జీవితమును ఆంధ్రజాతి ప్రోత్సహించి అందు భాగస్వాములుగా వీరుండనట్లు

చేయుటకు, శక్తిమంతులును జ్ఞానవంతులునగు తమ ప్రతినిధులను జాతి సంఘము లందును, సమిష్టి జాతి జీవిత కార్యములందును పాల్గొనుటకు ఒక నిష్పవర్గ మేర్పడ వలెను. ఇంతకన్న విస్తృతమైన అంతర్జాతీయ క్షేత్రమునందు, భారత దేశము నందన్ని భాగములనుండి, గుణశీలురు శక్తిమంతులునగు భారతీయులు పాల్గొన వలసిన ఆవశ్యకత యుండును. ఈనాటికే అంతర్జాతీయ వ్యవహారములందు భారత జాతి ప్రాముఖ్యతను వహించినది. కాలము గడుచు కొలది ఈ కర్మక్షేత్రము భారత జాతికి అధికముగా గలదు; భారతవాణి ముఖ్యజాతుల వాణులలో యొకటిగ, ప్రపంచ భవిష్య జీవితమునే నూతన విధానములలో నిర్మించ శక్తి గల దినములు కొంత కాలమునకు కలుగును. ఈ కార్యములన్నింటికి, తగిన వ్యక్తులు, ధీశక్తిని, మేధస్సును, ప్రజ్ఞాశక్తిని కలవారు, అవసరమై యుండును. ఈ కార్యములన్నింటి యందును, మీ విశ్వవిద్యాలయము, అధిక ప్రాముఖ్యతను వహించి అత్యంత సేవను కావించ నగును.

భారత జాతి స్వాతంత్ర్యమును పొందిన ఈ రెండవ సంవత్సరమున, ఈ జాతి అనేక ప్రముఖ సమస్యలకును, విస్తృత అవకాశములకును, అట్లే కష్టముల కును అపాయములకును జాగరితము కావలెను; వీనిని వివేచనతో తీర్మానించనిచో, ఉత్తరోత్తర కష్టములు మరింత అధికమగును. ప్రపంచ యుద్ధ ఫలితముగ: ప్రపంచ వ్యవస్థితి, క్రమమును తప్పి, అనేక కష్టములతో, అవసర వస్తులోపము లతో, సంశయములతో మరియొక్క ప్రపంచయుద్ధ సంభవనీయతతో, ఎదుర్కొన బడియున్నది: ఇట్టి ప్రమాదము తప్పుటకు, సాన్‌ఫ్రాంసిస్కో పట్టణమందు భావింప బడిన విశ్వ – ఐక్య – సంఘముయొక్క ప్రయత్నముచే, ప్రపంచ ప్రజల సమష్టి ప్రయత్నములచే మాత్రమే సాధ్యపడును. ఈ ప్రపంచ సంఘ మిప్పటి కంత విజయవంతముగ ప్రవర్తించి యుండలేదు; అయ్యును, గత కాల ప్రమాదకర విభేదములు పోయి, సామరస్య – ప్రపంచక్రమత యేర్పడు వఱకే ప్రయత్నము సాగించ వలసినదే: లేనిచో, అనవరతముగ జరుగ గల వినాశము తప్పదు. భారత జాతికి, దానియందేదానికి, అగాధ తర సమస్యలు కలవు; ప్రమాదకర ఆశాభావములకు లోనై, ఇతర అనేక జాతులవలె, పరిశ్రమ–వ్యాపారములను, సాంఘిక – రాజకీయ జీవితమున శక్తివంతమగు వ్యవస్థను, బలయుత సైనిక శక్తిని, విజయవంతముగ ప్రయోగింప బడగల రాజకీయ శక్తిని, సురక్షితము కావింప బడిన స్వాలాభ స్వప్రయోజనములను, అధిక ప్రపంచ భాగముపై పొందిన ప్రభావమును పురస్కరించు

కొని. అందుచేతన ఆత్మను మఱచి స్వధర్మమును కోల్పోవు అవకాశములు కలవు. అట్టిచో, మన పురాణ భారతాత్మ విస్మృతమై, ఇతర జాతుల వలె, మనమొకజాతిగ నేర్పడినచో, అందువలన మనకు గాని ప్రపంచమునకు గాని లాభము కలుగక పోవచ్చును. నిరపాయమగు బాహ్య సమృద్ధ జీవితమును జీవించుటకు, తానింత కాలము సంపాదించిన ఆధ్యాత్మిక జ్ఞానమును, అనుభవమును పోద్రోయవలెనా, అనునది యే ప్రశ్నగా నేర్పడును. బాహ్యప్రపంచము భారత దేశము దిశకు మఱలి, అధికాధికముగ ఆధ్యాత్మజ్ఞాన భిక్షను కోరుచుండ, భారత దేశమే, తనంతట నదియే, అట్టి ఆధ్యాత్మిక జ్ఞానమునకు వెన్నుత్రిప్పుట, శోచనీయ మగును. ఇది జరుగ కూడదు, జరుగదు, కాని అట్టి అపాయము లేదనుటకు వీలుకాదు. నిస్సందేహముగ మనము జయింతుము, భారతజాతి నిజధర్మమును దాని విధిని నెరవేర్చవలయు నన్న, మన అంతర బాహ్యములు రెండును యుక్తిని, వృద్ధిని, మహోన్నతముగా పొందిననే, దీర్ఘకాల సేవావృత్తి యొక్క దుష్ఫలితముల నుండి తప్పించుకొనగల మనుట, మనము మఱవ కూడదు.

# మూడవ భాగము

## 1–వ అధ్యాయము

## భారత దేశమును గురించి శ్రీమాత

## (The Mother on India)

ప్రస్తుత క్లిష్టపరిస్థితి యందు ఈనాడు ప్రతి భారతీయుని కర్తవ్యమేమి?

నీ అల్ప అహంపూరిత వ్యక్తిత్వమును అతిశయించుము. భారతమాత అర్హ పుత్రుడవు కమ్ము. నీ ధర్మములను ఋజువుగా, సత్య పూరితముగ నొనర్చుము. సదా దివ్యకృపపై దృఢవిశ్వాసముతో, నిత్య సంతోషముతో నుండుము.

శ్రీమాత

* * * * *

నిజమైన ఆధ్యాత్మికత జీవితమును త్యజించుటకాదు; కాని, జీవితమును దివ్య పరిపూర్ణతతో పరిపూర్ణ మొనరించుటయే, అది.

దీనినే భారతదేశము ప్రపంచమునకు ఈనాడు చూపి తీరవలెను. 26–1–1963

* * * * *

భారత దేశమునకు ఈనాడు ప్రధమ సమస్య, తన ఆత్మను మరల కనుకొని దానిని ఆవిర్భవించుటయే.

* * * * *

భారత దేశము ప్రపంచ కల్యాణముకొరకు రక్షింపబడి తీరవలెను. ఏలయన, భారతదేశము మాత్రమే ప్రపంచమును శాంతికి నవప్రపంచ నిర్మాణమునకు కొనిపో గలదు.

* * * * *

దైవశక్తి మాత్రమే భారత దేశమునకు సహాయపడగలదు. దేశమునందు విశ్వాసము, సంఘటితత్త్వము నెలకొల్పినచో, ఇది మానవనిర్మిత శక్తులన్నిటి కన్న అధిక తమ శక్తిమంతమైనది.

* * * * *

భారత దేశమును, ప్రపంచమును సంరక్షించుటకు, ఆధ్యాత్మిక జ్ఞానముతో కూడిన సంఘటిత సంకల్ప దృఢ సంస్థగా ఏర్పడిన ఒక వర్గము ఉండితీరవలెను. భారతదేశమే ప్రపంచమునందు పరమ సత్యమును నెలకొల్ప గలుగునది. భారత దేశము దివ్య సంకల్పమును, దివ్య శక్తిని ఆవిర్భవింప చేయుటచే మాత్రమే ప్రపంచమునకు తన సందేశమును బోధించగలదు. కాని పాశ్చాత్య భౌతిక వాద మును అనుకరించుటచేకాదు. దివ్య సంకల్పమును అనుసరించుటచే భారత దేశము ఆధ్యాత్మక పర్వత శిఖరముపై ప్రకాశించి తీరును. ప్రపంచ ఐక్యతకుగా, సత్య ధర్మ మార్గమును చూపి వ్యవస్థీకరించ గలదు.

* * * * *

భారతదేశ భవిష్యత్తు బహు స్పష్టము. భారత దేశము ప్రపంచమునకు గురువు. ప్రపంచ భవిష్య నిర్మాణము భారత దేశముపై నాధారపడినది. భారత దేశము సజీవాత్మ. భారత దేశము ప్రపంచమునందుగల ఆధ్యాత్మిక జ్ఞానమును మూర్తిభవింప చేసుకొనుచున్నది. ఈ రంగమునందు భారత దేశమునకుగల ఆధ్యా త్మిక ప్రాముఖ్యతను భారత ప్రభుత్వము గుర్తించి తదను గుణ్యముగా తమ కార్యములను ప్రణాళీకరించుకొనవలెను.

* * * * *

(భారత సమాఖ్య అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాదునకు, ఆశ్రమమును సంద ర్శించిన సమయమున).

భారత దేశము తన ఆధ్యాత్మ సందేశ శిఖరము లందుకొని, సత్య ధర్మము లను ప్రపంచమునకు చాటించ వలెను. 11-11-1955

భారతీయ పౌరుడుగా నగుటకు, నా దీర్ఘకాల అకాంక్షిత అభిలాషను వ్యక్త పరచుటకు నేటి దివసమును ప్రత్యేకముగా గుర్తించ కోరుచున్నాను. భారతదేశము నందు 1914 లో ప్రథమము అడుగిడినప్పటినుండి, ఇదియే నా నిజ మాతృ దేశ మనియు, నా ఆత్మయొక్క స్వకీయ దేశమనియు నేను భావించితిని. ఈ నా ఇచ్ఛను

సిద్ధి గావించుటకు భారతదేశము స్వతంత్రమైనంతనే నిశ్చయించితిని. కాని నేను వేచి యుండక తీరలేదు.........

నేను జన్మచేతను, చిన్ననాటి విద్యాభ్యాసముచేతను, ఫ్రాంసుదేశ పౌరురాలను, నేను స్వీయాభిమానముచేతను, స్వకీయాదరణముచేతను, భారతీయురాలను. నా చేతస్సునందు ఈ రెండింటి మధ్య వ్యతిరిక్తతలేదు. ప్రత్యుత, ఈ రెండు సంయుక్తమై పరస్పరము పూరించుకొనును. నేను ఈ రెండింటికి సమానముగా ఉపక రించగలనని నాకు తెలియును. ఏలయన జీవితమునందు నాకు గల ఏకైక ఉద్దే శము శ్రీ అరవిందుల మహోన్నత ప్రబోధమునకు ధృఢ రూపము నొసంగుటయే. వారి ప్రబోధమందు వారు సకల జాతులు సారతః ఒకటీ అనియు, పృథ్విపై దివ్య ఐక్యతను వ్యవస్థీకరింపబడిన, సామరస్య వైవిధ్యముద్వార అభివ్యక్త పరచుటకు ఉద్దేశింప బడినదని వారు తెలపిరి. 15-8-1954

* * * * *

శ్రీ అరవిందులు తమ మాతృభూమిని సదా గాఢముగ ప్రేమించిరి. కాని వారు భారతదేశమును ప్రపంచమునందు తన దేశ మహోన్నత సందేశము, శుద్ధము, కులీనము, ఉన్నతము, అర్హమునై యుండవలెనని కోరిరి. అంధస్వార్థ తలకును, అజ్ఞాన దురభి మానములకును, అసభ్య లౌకిక స్థానమునకును, దిగజారుటకు నిరాక రించిరి, అందుకే, వారి సంకల్పమునకు పూర్ణాను గుణ్యముగా సత్య పతాకమును మానవజాతియొక్క రూపాంతరాభివృద్ధులను ఉన్నతికి ఎత్తుచున్నాము. 24-4-1954

* * * * *

గత భారత అద్భుతములు ఆమె సజీవ ఆత్మ ఆశీర్వాదములచే, సహాయముచే, ఆసన్న భవిష్యత్తు సిద్ధికొరకు పునః జనించుగాక. 23-8-1957

## ఆ హ్వా న ము

ఓ మా మాతా ! ఓ భారతాత్మా ! అగాధ మనోవ్యాకుల కాలమందు సహితము, నీ వాణి విముఖులై, ఇతర యజమానుల సేవించి, నిన్ను కాదని నపుడుకూడ నీ సంతానమును విడనాడని, ఓ మాతా ! వారు మేల్కొనిన ఈ విముక్త సమయము నందు, నీ యీ యుషఃక్కాలము, తేజస్సు, నీ ముఖముపై ప్రసరించుచుండు, యీ మహత్సమయమున, నీకు మేము నమస్కరించుచున్నాము. మా యెదుట తెలుచుకొను

స్వాతంత్ర్య దిగంగతము ప్రపంచ జాతుల సమితియందు నీ నిజ జీవన నిజౌన్నత్య దివంగతముగకూడ యగునటుల మాకు మార్గదర్శినివి కమ్ము. మేము సర్వదా మహదాశయముల పక్షముననుండి, విశ్వమానవులకు నీ ఆధ్యాత్మ జీవిత మార్గము నందు, మార్గదర్శినిగ మిత్రురాలుగ సాహాయ్యకురాలుగ నున్న నీ నిజస్వరూపము ప్రదర్శింపుము. 15-8-1947

భారతాత్మ ఏకైకము, అవిభాజ్యము. భారత దేశము ప్రపంచమునకు తా నొసంగవలసిన సందేశమును స్మరణయందు ఉంచుకొనియే యున్నది. దానిని ఆవిర్భవింపచేయుటకుగా బాహ్య ఉపకరణములకు ఆమె వేచియున్నది. 6-6-1947

* * * * *

(భారత రాజకీయ పక్షనాయకులకు రాజ ప్రతినిధిచే 2-6-1947 తేదీని రేడియోలో వచ్చిన ప్రకటనను శ్రీమాత వినినపుడు ఆమెకు స్ఫురించిన వాక్కులివి).

భారతీయ స్వాతంత్ర్యమును వ్యవస్థీకరించుటలో మన కష్టములను నివారించుటకుగా ఒక ప్రతిపాదన చేయబడినది. ఎంతో పశ్చాత్తాప పారుష్యములతోడను, హృదయాన్వేషములతోడను, భారతీయ నాయకులచే అంగీకరింప బడుచున్నది. కాని ఈ ప్రతిపాదన మనకెందుకు చేయబడినదో మీకు తెలియునా ? మన కలహముల అవివేకతను మనకే ఋజువు పరచుటకు.

ఈ ప్రతిపాదనలను మనమెందులకు అంగీకరించవలయునో మీకు తెలియునా? మన కలహముల అవివేకతను మనకే ఋజువు పరచుటకు.

స్పష్టముగా ఇది మన సమస్యకు పరిష్కారముకాదు. ఇది యొక పరీక్ష. ఈ పరీక్షనుండి మనము హృదయ పూర్వకముగా నెగ్గితే, దేశఐక్యతను, దాని ఉన్నతిని ముక్కలు ముక్కలుగా విభజించుటచే కాదని, మనకు ఋజువు పరచును. పరస్పర ప్రయోజన విరుద్ధముచే మనము దేశ సౌభాగ్యమును సాధించలేము. మన అంధ విశ్వాసములను పరస్పర విరుద్ధముగా నుంచుటచే సత్య ధర్మమును మనము సేవించలేము. ఏది ఎట్లున్నను, భారతదేశమునకు ఏకైకాత్మ కలదు. భారతదేశము ఏకము, అవిభాజ్యము అని చెప్పుకొనగల్గుటకు, మనము వేచియున్నంతవరకును

మన నినాదము "భారతాత్మ శాశ్వతముగ వసించుగాక!" అని యుండవలెను.
3-6-1947.

* * * * *

ఆసురిక దండయాత్రకు భారతదేశము బలియగు అపాయము ఒకానొకనాడు బొత్తిగా లేకుండెను. భారత దేశము సురక్షితముగ నుండిన సమయమది. కాని విషయములు మారినవి. భారతీయశక్తులు, ప్రజలు ఆసురిక ప్రభావములను భారత దేశముపై ఆహ్వానించు విధమున ప్రవర్తించిరి. ఈ ఆసురిక ప్రభావములు, ప్రమాద కరముగ పనిచేసి, స్థిరముగనున్న దేశభద్రతను భిన్న పరచినవి. 25-5-1941

# 2-వ అధ్యాయము

# శ్రీ మాతృ వాక్కులు
(4-వ మాల)

(The Words of The Mother)
(4 th Series)

## విషయ సూచిక

1. శాంతి - సమత
2. మనః పూర్వకత - విశ్వాసము
3. క్షమ - వినయత
4. ప్రేమ
5. నీవు, ఇతరులు
6. కష్టములు, సహాయము
7. భవిష్యత్తు

## శాంతి - సమత (1-వ అధ్యాయము)

నిజవిజయములు, నిశ్చల, దృఢ హఠాత్మక, శాంతిచే మాత్రమే జయింపబడగలవు.

*   *   *   *   *

స్థిమితము, స్థిమితము, ఒక అచల ఏకీకృత సమర్థత, దేనిని కూడ చలింపచేయజాలనట్టి స్థిమితము-ఇది పూర్ణసిద్ధికి అత్యావశ్యకమైన ఆధారము.

*   *   *   *   *

జ్ఞానము, శక్తియు నిజముగా క్రియాశీలమగునది - శాంతి యందే.

*   *   *   *   *

ఆంతరిక నిశ్చల నీరవతాశాంతుల యందు నీవు అధికాధికముగ అనవరత దైవసాన్నిధ్యమునకు సచేతనుడవగుదువు.

*   *   *   *   *

మనోస్థిమితము నందు, నీవు దివ్యశక్తి యొక్క సహాయము, రక్షణలు, సర్వదా నీతోకూడి యుండునట్లు అనుభవింతువు.

* * * * *

దివ్య బృహత్ శాంతి నీలో సంపూర్ణముగా చొచ్చి నీ సర్వ ప్రవృత్తులను ప్రారంభించు గాక.

* * * * *

నీ ఆంతరిక విశ్రాంతిని అధికపరచుము. నీ మహోన్నత కార్యముమధ్య కూడ ఈ విశ్రాంతి సర్వదా నీయందు ఆసన్నమై యుండవలెను. ఈ విశ్రాంతికి గల స్థిరతను చలింప జేయుటకు మరి దేనికికూడ శక్తి యుండకూడదు. అపుడే దైవావిర్భావమునకు నీవు పరిపూర్ణ ఉపకరణము కాగలవు.

* * * * *

శాంతి సమతలను సదానీయందు నిలిపి యుంచుకొనుటకు అప్రమత్తుడవై యుండుము. నీసత్తయందు అధికాధిక పూర్ణముగ సమగ్ర సమత తన్నుదా స్థాపించు కొననిమ్ము.

నీ మనస్సును అధిక క్రియాత్మక మొనరింపకుము. రభసలో జీవించ నివ్వకుము. విషయ బాహ్యదృష్టితో హఠాత్తుగా తీర్మానించ వద్దు. సదా సావధానముతో స్థిమితమునందు మాత్రమే ఏకాగ్రీకృతుడవై తీర్మానించుము.

పరమసత్య చేతస్సు నీ సమస్తసత్తకు వ్యాపింప వలెను. సమస్త ప్రవృత్తుల పైన ఆధిపత్యము వహించవలెను. అశ్రాంత భౌతిక మనస్సును స్థిమిత మొనరించ వలెను. ఇవి ఆవిర్భావమునకు ప్రాథమిక నియమములు.

* * * * *

ధ్యాన జన్యస్థిమిత మనస్సు నిజముగనే అల్పస్థాయి గలది. ఎందుకన, నీవు ధ్యానమునుంచి బహిర్గమించి నంతనే, అదే సమయమున కూడ మనోస్థిమితము నుండి బహిర్గమింతువు.

నిజ, శాశ్వత స్థిమితము, మనః ప్రాణ భౌతికములను, దైవమునకు పూర్ణ సమర్పణచే కలుగును.

నీ వెపుడు సర్వమును నీదికాదని, నిన్నుకూడ నీవుకాదని భావింతువో, నీ శరీరము, ఐంద్రియక సంవేదనలు, భావనలు, చింతనలు, ఈ సర్వము దైవమునకే

చెందినవని తలంతువో, అపుడే దైవము నీ సర్వస్వముపై పూర్ణ బాధ్యత వహించును. ఇక నీవు ఎంత మాత్రము బాధపడ నవసరముండదు.

* * * * *

మనమెపుడు విచరితులము కామో అపుడే మనము సర్వదా ఋత కార్యమును, ఋతసమయమున ఋత మార్గమున చేయగలము.

* * * * *

నిజముగనే శాంతి అత్యావశ్యకము_శాంతి లేనిదే సరళతమ విషయము కూడ తక్షణమే అతికోలాహలముగ మారిపోవును.

* * * * *

దివ్య శాంతి నీయందు అధికాధిక అనవరతముగ పూర్ణముగ ఆవిర్భ వింపనిమ్ము.

* * * * *

మనః పూర్వకత – విశ్వాసము (2-వ అధ్యాయము)

దివ్య ద్వారములను తెరచు బీగము. మనః పూర్వకతయే.

* * * * *

ప్రతియొకరికిని దివ్యఅవకాశము ఇవ్వబడినది. దాని వెనువెంటనే దివ్య సహాయము కూడ ఇవ్వబడినది. కాని ప్రతి యొకరికిని కలుగు ప్రయోజనము, అతని మనః పూర్వకతా నిష్పత్తిని బట్టియే యుండును.

* * * * *

మనః పూర్వకమైన పిలుపులు తప్పక దైవమును చేరును. మరి ఆ దైవము ఆ పిలుపులకు ప్రత్యుత్తరముకూడ వొసంగును.

* * * * *

ప్రతియొకరి అంతర్భావము పైనను, అతని దైవోన్ముఖతకుగల మనః పూర్వకత పైనను; సర్వము ఆధారపడును.

* * * * *

పరిపూర్ణ మనః పూర్వకతకు మహా శత్రువులు ఏవనగ _ స్వాయాభిరుచులు (మానసిక, లేక ప్రాణిక; లేక భౌతిక), పూర్వ సంస్కారములు అధిగమించ వలసినది ఈ అవరోధకములనే_

* * * * *

మనః పూర్వకతను కలవారిని, నేను సులభముగ దైవోన్ముఖులనుగ చేసి వారికి సహాయ పడగలను. కాని మనః పూర్వకత లేనివారికి నేను చేయగలిగినది అల్పము. నేనిదివరకే చెప్పిన విధముగ మనము ఓర్పుగలిగి విషయములు చక్కబడువరకు వేచియుండ వలెను. కాని నీవెందుకు క్షుబ్ధుడు కావలెనో, నీక్షుబ్ధిత విషయములను ఎట్లు చక్కబరచునో నాకు తెలియదు. అస్తవ్యస్త – అస్పష్టతల నుండి నీవు బయటపడు మార్గము ఒక్కటియే కలదని నీయనుభవముచే తెలుసు కుంటివి. అదేదన స్థిమితను, శాంతిని వహించి, సమత్వమునందు దృఢపడి, తుఫాను గడచి పోనివ్వడమే. ఈ అల్ప తగాదాలు, కష్టముల నుండి ఉద్గమించి, నిన్ను విడనాడి నా ప్రేమయొక్క శక్తి ప్రకాశములందు మేల్కొనుము.

* * * * *

ప్రతిక్షణమునను మనము చేయ గలిగిన దాని నంతటిని శ్రేష్ఠముగా చేయుట, దాని ఫలితమును దైవ తీర్పునకు వదలుట, – ఇవియే శాంతికి, సౌఖ్యమునకు, శక్తికి, అభివృద్ధికి, అంత్య పరిపూర్ణతకు నిశ్చిత తమ మార్గములు.

* * * * *

ఈ అచంచల విశ్వాసమును నీవు కలిగి యుండుట మంచిదే. నీ మార్గమును సులభతరము, హ్రస్వతరము కావించును.

* * * * *

అవిశ్వాసము నీచుట్టు పరివసించినప్పుడు, ఆ సమయమునే నీవు నిజ విశ్వాస పరుడవై, నీవాతుఫాను యందు అస్పృశ్యు డవై, అచలితుడవై యుండవలెను.

* * * * *

దైవ విజయమునందు సంపూర్ణ విశ్వాసము గలిగి యుండవలెను. సార్వ వర్తిక దివ్య విజయమూ దానియందే, విశ్వాసము గల వారందరి వ్యక్తిగత విజయమును, కూర్చుకొని యుండును.

* * * * *

## క్షమా – వినయతలు (3–వ అధ్యాయము)

క్షమా – వినయతలు శ్రేష్ఠరక్షకములు. ఇవి లేనిచో నీవు ముందుకు నడచు ఒక్కొక్క అడుగుయు అపాయకరము. ఇవియున్నచో విజయము తథ్యము.

* * * * *

నిజమనః పూర్వక వినయత యందు మనరక్షణ కలదు. అహంత యొక్క అత్యావశ్యక విలయమునకు, ఇది నిశ్చితతమమార్గము.

*　　*　　*　　*　　*

మనస్సు సర్వ సందర్భముల యందును, సంఘటనల యందును, స్థిమితముగ నుండుచో, క్షమ సులభతరముగ అధికమగును.

*　　*　　*　　*　　*

స్వీయ ప్రకృతిపై ఒక్కనాటితో విజయము గాంచలేవు, కాని క్షమా సహన సంకల్పములచే దివ్య విజయము తప్పక చేకూరును.

*　　*　　*　　*　　*

దివ్య విజయము యొక్క నిశ్చితత్వము గరిష్ఠశక్తితో కూడిన అనంతక్షమ నొసంగును.

*　　*　　*　　*　　*

స్థిమితముగ నుండుము. దేనితోను విక్షోభమును పొందక, మనము ఓర్పుతో పనిచేయవలెను. మరియు అనివార్య దివ్యవిజయము నందు అచంచల విశ్వాసము నుంచవలెను.

*　　*　　*　　*　　*

స్థిరముగ అగ్నినిజ్వలితముగ నుంచుము; మరియు నిశ్చిత ఫలితమునకు స్థిమితముగా వేచి యుండుము.

*　　*　　*　　*　　*

నిజఅగ్ని సదా అగాధశాంతి యందు జ్వలించుచునే యుండును. ఇది సర్వ విజయాకర సంకల్పశక్తి యొక్క అగ్ని నీ అగాధ సమతయందు దీనిని అభివృద్ధిగానిమ్ము.

*　　*　　*　　*　　*

## ప్రేమ (4-వ అధ్యాయము)

ప్రేమించువాడే ప్రేమను గుర్తించగలడు. మనః పూర్వక ప్రేయ యందు తమ్ముతాము అర్పించుటకు శక్తిలేనివారు ప్రేమను మరెచ్చటను గుర్తించలేరు. ఇట్టి వారు దివ్యప్రేమెంత అధికమో అనగా ఎంతనిస్వార్థమో అను విషయమును తెలుసుకొన లేక అంత తక్కువగా దీనిని గుర్తించెదరు.

*　　*　　*　　*　　*

స్వీయ కేంద్రీకరణము జరామృత్యువుల కూడి యుండును. దైవముపై కేంద్రీకరణము మాత్రమే జీవితమునకు వృద్ధిని, సిద్ధినికొని తెచ్చును.

* * * * *

దివ్యక్రియాపరత యొక్క రహస్యములను ప్రేమ మాత్రమే కనుగొనగలదు.

* * * * *

మనస్సు, ముఖ్యముగ భౌతిక మనస్సు, ఋజువుగ తెలిసికొన శక్యము లేని దైనను సర్వదా తీర్పుచేయుట కిష్టపడును.......

సత్తనుచైత్య పురుషుడు పాలించుటకు సమ్మతించిన మనస్సునందు, మనః పూర్వకమగు నిజ వినయత మాత్రమే మానవులను అజ్ఞానమునుండి రక్షించగలవు.

* * * * *

ప్రార్థింప బడవలసినది దివ్యకృప-న్యాయము మాత్రమే పాలింప వలసినచో, దివ్యకృప యెదుట నిలువ బడగలగినవారు చాలకొలదిమందే యగుదురు.

* * * * *

సర్వులు ప్రేమ సామరస్యతయందు కలువగల అగాధ పరమసత్య చేతస్సు యొకటి కలదు.

* * * * *

చేతస్సమతా ప్రేమల అభివృద్ధితో దైవసామీప్యత సదా వృద్ధి కాంచును.

* * * * *

నా అనవరత ప్రేమ సాన్నిధ్యము యొక్క జాగృతిని సదాస్మరణ యందుంచుకొనుము; సర్వము ఋజుత్వమును పొందును.

* * * * *

మానవసత్తకు కేంద్రము, అంతర్భూత దైవము యొక్క నివాస స్థానమగు చైత్యపురుషుడు. ఏకీకరణమన, సత్తయొక్క సర్వ భాగములు (మనః ప్రాణ భౌతికములు) ఈ కేంద్రము (చైత్య పురుషుని) చుట్టు వ్యవస్థీకరించుకొని సామరస్య పఱచు కొనుట. అందుచే సత్తయొక్క సర్వకర్మలు దివ్య సాన్నిధ్య సంకల్ప సరళాభి వ్యక్తముగ నుండును.

* * * * *

అసహ్యత మనసుయొక్క సంకుచితత్వముచే హృదయ దౌర్బల్యముచే కలుగును. అనేకులు వీనిచే ఆహుతులగుట శోచనీయము.

* * * * *

ప్రాణిక సంబంధములు సర్వదా అపాయకరము. దైవమునకు ప్రాణము యొక్క పూర్ణ, నిశ్శేష సమర్పణయే ఏకైక పరిష్కారము.

## నీవును, ఇతరులును (5-వ అధ్యాయము)

మనము సర్వదా తప్పక శాంతి సామరస్యతలను కోరి, దానికొరకు శక్తి కొలది పనిచేయవలెను-అందుకొరకు శ్రేష్ఠకర్మ క్షేత్రము సర్వదామనయందే కలదు.

*  *  *  *  *

ప్రజల ప్రతిభావములు ఎంత అసంతుష్టముగ నున్ననూ బాధపడవద్దు - ప్రాణికము సర్వదా, సర్వుల యందును మలినములతోను, భౌతికము యొక్క అచేతనతోను నిండియున్నది. ఈ రెండు అపరిపూర్ణతలను, అది దీర్ఘ కాలము పట్టినను బాగు పర్చుకొనవలెను. ఈ నిర్మాల కార్యమును ఓర్పుతో, ధైర్యముతో సాధించు కొనవలెను.

*  *  *  *  *

ఇతరులచే చేయబడిన, లేక తలంచబడిన, లేక చెప్పబడిన వానిచే గాయ పడుట సదాదౌర్భల్య సూచన, మరియు దైవదిశకు పూర్తిగ నీవు మరల నట్లును, దైవ ప్రభావమునకు పూర్తిగా లోబడనట్లును ఋజువు పరచును. అపుడు ప్రేమ, సహనము, సానుభూతి, క్షమలతో, కూడిన దివ్య వాతావరణమును తనతో పాటు తెచ్చుటకు బదులుగా, తన అహంకారమును ఇతరుల అహంతతో ప్రతిస్పందించి, పారుష్యమును, అసామరస్యతను పరస్పర భావాక్రందనను విషమింప చేయుట గలదు. దైవము వివిధ ప్రజల యందు వివిధ మార్గముల పని చేయునని అహంత ఎపుడును తెలుసుకొన లేదు, స్వీయా (అహంత) దృక్పధముచే విషయములను విమర్శించుట చాలపొరపాటు. ఇది అస్తవ్యస్తతను పెంపొందించక తప్పదు. అను దార బుద్ధితో, ఆవేశముతో, మనము చేయునది దివ్యమైనదిగ నుండదు - ఏలయన, దైవము శాంతి, సామరస్యతల యందే పని చేయును.

*  *  *  *  *

బాధపడ వద్దు, ఆతురత పడవద్దు - సమస్త అసామరస్యతలు తొలగును. కాని అహంక్రీడకు తావులేని ప్రకాశమాన చేతస్సు నందు స్థాపింప బడిన సత్య ఆధారముగ, అది యుండవలెను.

*  *  *  *  *

ప్రజలు తమ చేతస్సు మార్పు అగుటకు నిజముగా కోరినపుడు మాత్రమే వారి కార్యములు కూడ మార్పు గాంచును.

* * * * *

ప్రజలు అహేతుకము, కోలాహలములతో ప్రవర్తించుట నాకు తెలియును. కాని వారి చేతస్సుమారనంత వరకు వారినుండి మనము మరి దేనిని ఆశించ గలము.

* * * * *

సర్వమానవుల యందును, సదా అనృతము ఋతముతో కలసి యుండుట లేదా ?

* * * * *

అవును మనచేత స్థానమును, ఉన్నతతరసత్తయందు నిలిపి, అక్కడ నుండి మనము చేయవలసిన, చేయవలెను: మన కార్యమును నిమ్నతర: అంధ, స్వార్థ ప్రవృత్తి, ప్రతి క్రియలు మలిన పఱచుటకు అవకాశ మియ్యకూడదు.

* * * * *

ప్రతి విషయమును వ్యక్తిగత సమస్యగ మార్చుకొనక స్వీయాభి మానమును పూర్తిగ వదలి, చేయవలసిన కార్యము యొక్క శ్రేయస్సును గ్రహించ శక్తి కలిగినపుడే, కష్టము లన్నియు నివారణ యగును.

* * * * *

ప్రజలు చేయవలసిన కార్యమును స్వీయకార్యముగ వచించుట వదలినచో, అనేక కష్టములు తొలగును.

* * * * *

నీ మనస్సు నందు శాంతము మాత్రమేగాక, ఆతురనిష్కర్షణలను తీర్పులను నొసంగకుండచేయు క్షమాగత - వివేచన కూడ అవతరించ వలెనని నేను కోరు చున్నాను.

* * * * *

మానసిక అజ్ఞానము ఎంత అధికమో, దానికి తెలియని దాని నంతటిని, అర్థము చేసికొనలేని దాని నంతటిని అంత సులభముగా, నదినిర్ణయించును.

* * * * *

స్పష్టా - అవగ్రహణకు, సత్యదృష్టికి, సమ్యగ్ - కార్యమునకు. అధికము, అధికమునకు స్థిమిత మేధస్సు, అత్యావశ్యకము.

* * * * *

మనము నెరవేర్చ వలసిన ఉత్తమ ఆదర్శమును, కార్యమును సర్వదా మనస్సు నందుంచుకొన వలెను. అందుచే, మన అవధానమును ప్రక్కకు మఱలించు అల్ప వివరణలకు, విషయములకు అధిక ప్రాముఖ్యత నివ్వకూడదు; సువాతావరణమును కలుషితము గావించని గగన మేఘములవలె ఈ అల్ప వివరణా విషయములను రానివ్వుము, పోనివ్వుము.

* * * * *

అవును, ఈ సంఘర్షణలన్నియు దుఃఖకరము, - కార్యాచరణ యందివి భయం కరముగ ప్రవేశించి, ప్రతి విషయమును కష్టము గావించును.

* * * * *

ఇతరుల మూర్ఖతను గమనించకుము; నీదానిని నీవు గమనించుము.

* * * * *

నీ వితరులతో మాట్లాడునపుడు, నీ చుట్టూ సజీవదివ్య సాన్నిధ్యమును, రక్షణను నిల్పియుంచు కొనుటకు సదాజాగరూకుడువుగ నుండుము. సాధ్యమైనంత తక్కువగ నితరులతో మాట్లాడుము.

కష్టములు, సహాయము (6-వ అధ్యాయము)

దివ్య ప్రభావమును నీపై పడకుండ అడ్డగించుట చేతను, నీసత్త యొక్క ఒకానొక భాగముపై లేక కొన్నిభాగములపై ప్రవేశపెట్టబడు చేతశ్శక్తి ప్రకాశ ములను నిరాకరించుట చేతను కష్టములు కలుగుటకు సదా కారణమగును. ఈ కష్ట ములలోనేదేని ఒకదానిని ఎదుర్కొనకుండ దైవసంకల్పమునకు సంపూర్ణముగ ఎవ్వరేని సమర్పించు కొనగలుగుట చాల అరుదు. కాని ఉత్కాంక్షను దృష్టితో వహించి పరిపూర్ణ మనః పూర్వకతతో తన్నుదావిమర్శించు కొనుచుండినచో సర్వాంత రాయ ములను తొలగించు కొనుటకు అవితప్పని విధానముగ నేర్పడును.

* * * * *

నిజముగనే ఈ కష్టములన్నియు, రూపాంతర కార్యమును అడ్డగించు దేని నుండియో, నీయందెక్కడనో గల అవరోధము నుండి వచ్చును.

* * * * *

దైవసహాయము లేని యెడల, సాధన యెవ్వరికిని కూడ సాధ్యముకాదు. కాని సర్వదా సహాయము సులభ్యముగనే యున్నది.

* * * * *

దైవకృప సదా పనిచేయుటకు సిద్ధముగనున్నది. కాని నీవు దానికార్యము నడ్డగించకుండ, దానిని పనిచేయనియ్యవలెను. ఇందు కావశ్యకమైన నియమము, విశ్వాసము నీపైన అభియోగము జరిగినపుడు శ్రీ అరవిందుల యొక్కయు నా యొక్కయు సహాయమును ఆహ్వానించుము. నీ ఆహ్వానము మనః పూర్వకమైనచో (అనగా నీరోగ నివారణను మనః పూర్వకముగా నిచ్ఛగించినచో) నీ ఆహ్వానమును దైవ కృప అంగీకరించి, నీకు వ్యాధి నివారణ నొసంగును.

* * * * *

ఒక పక్షమున సహాయము కోరుచు, మఱియొక పక్షమున విశ్వాస ముంచకుండుట, అవివేకము; ప్రత్యుత, విశ్వాసమును కూడినచో సర్వము ఎంతయో సులభమగును.

* * * * *

నిజమే నిశ్చేతనము జయింపబడినపుడు, ఎట్టి నియమములతో కూడ నావశ్యకముండదని నా నమ్మకము; అప్పుడది యంతయు దివ్యకృప యొక్క స్వేచ్ఛా నిర్ణయము.

* * * * *

ఉత్కాంక్షించుట, సాహాయ్యమును ఆహ్వానించుట – ఇవి అత్యంత ఆవశ్యకములు.

* * * * *

ఆహ్వానించుటకును, బలాత్కారముగ లాగుటకును మధ్య గొప్ప భేదము నిజముగనే కలదు. నీవు దివ్య సహాయమును సదా ఆహ్వానింప వచ్చును; ఆహ్వానించవలెను కూడ. మిగత దంతయు, ఇందు కొసంకబడు ప్రసాదము, నీవు దీనిని అందుకొని జీవించుకొనగల నిష్పత్తిపై నీసాధన ఫలమంతయు ఆధారపడి యుండును. బలాత్కారముగ లాగుట స్వార్థ ప్రవృత్తి యగును. అందుచే అవతరించు శక్తులు నీ సామర్థ్యమును మించినవై హానికలిగించును.

* * * * *

దివ్యశక్తి, దివ్య ప్రభావమును పరిగ్రహించి ఉపయోగించు సంకల్పమును దివ్య చేతానాస్పర్శను గలిగి యుండుటకుగల అనవరతా కాంక్షతో సంయుక్తుడవై యుండుట. దివ్యశక్తి చేతస్సులు నీతోడను, నీ చుట్టును నీ యందును కలవనియు, వానిని నీవు గ్రహించుటకు నీయందేదియొ అడ్డురాకుండ చేయుటయే నీపని యని విశ్వసించుట – వీనినే దైవోన్మీలన యందురు.

* * * * *

దివ్యరక్షణ సర్వదా మనచుట్టు కలదనుట నిజమే. కాని అది అనివార్యమైన అపాయములు మనల నెదుర్కొనినప్పుడు మాత్రమే పూర్తిగా పనిచేయును; అనగా దైవము కొఱకె దైవకార్యమును చేయునపుడు, అపాయములు ఆకస్మాత్తుగ మార్గమున ఉత్పన్నమైనపుడు దివ్యరక్షణ శ్రేష్ఠముగ పనిచేయును. కాని, నిజముగా అత్యావసరముకాని పనిని, ప్రయోజనము లేని పనిని మరియు పూర్ణాపాయకరమగు పనిని చేకొని, సంభవించగల పరిణామము లన్నింటి నుండి రక్షింపబడుటకు, దివ్య రక్షణపై ఆధారపడినచో, ఇట్టి ప్రవృత్తి, దైవమును నీతో సంఘర్షించుటకు ఆహ్వానించుటయెయగును; దైవము ఇట్టి వానిని అంగీకరించదు.

* * * * *

పూర్ణస్థిమితను కలిగి నిర్భయముగ లున్న వానికి అపాయమేదియు సంభవించదు.

* * * * *

భయము, సర్వదా ద్వేషపూరిత ఉపదేశమునే బోధించును.

* * * * *

అనృత యొక్కసారి జయింపబడుచో సమస్త కష్టములు తొలగును.

* * * * *

తమశ్శక్తుల యొక్కయు, విధ్వంసక శక్తుల యొక్కయు సూచనలను అంగీకరించు నట్లు చేయునది, యొక మహా అజ్ఞానశక్తి; దైవము యొక్క అనంత కారుణ్యమును గుఱించిన నిజకృతజ్ఞతా భావముచే నిట్టి అపాయముల నుండి సంరక్షింప బడుదుము.

* * * * *

దైవ విజయము సత్యము; ఇట్టి నిశ్చాయకతతో క్షమను వహించి, ఎట్టి దుష్టసూచనలను, విద్వేష సంఘర్షణలను సహనముతో ఎదుర్కొనవచ్చును.

* * * * *

వ్యతిరేక శక్తులు తమ చెడు కార్యమును చేయుటకు మనమెట్టి అవకాశమును కూడ వానికి ఇవ్వకూడదు; ఎంతటి అల్ప - అచేతనా సమయమును కూడ, నవి తమ కార్యమునకు ఉపయోగించు కొనును.

* * * * *

కష్టములనుండి, ఆపాయములనుండి సంరక్షించు చున్నది: మనః పూర్వక ఆత్మార్పణయె.

* * * *

అవును, బాలా, దైవమే యేకైక శరణ్యమనుట, పరిపూర్ణ సత్యము: దైవమును కూడిన వారికి పూర్ణ రక్షణ కలదు.

*   *   *   *   *

## భవిష్యత్తు (7-వ అధ్యాయము)

యోగసాధకులకు జ్యోతిష్యము ప్రముఖ - విషయముకాదు; ఏలయన, నక్షత్ర ప్రభావములకన్న, యోగప్రభావము అధికశక్తి మంతము.

*   *   *   *   *

దైవావిర్భావము, సమస్త కష్టములను జయించును; ఏలయన, ఆవిర్భావమున అర్థము, సమస్త కష్టములపై కాంచు విజయమే.

*   *   *   *   *

---

## 3-వ అధ్యాయము

# అగ్నికుండము

## (Burning Brazier)

ఈ ప్రార్థనలు ముఖ్యముగా పృథ్వీచేతస్సుతో శ్రీమాత తాదాత్మ్యమును పొంది వ్రాయబడినవి.

నిమ్న ప్రకృతి యందు వసించు శ్రీమాత ఉన్నత ప్రకృతియందు వసించు శ్రీమాతను సంభోదించు చున్నది. ఈ రెండింటి యందును, శ్రీమాతయే ఈ శ్రీమాతయే పృథ్వీచేతస్సు యొక్క సాధనను తనపై వేనికేని, దాని రూపాంతరము కొరకు, పైభూమిక యందున్న తనను, క్రిందికి రూపాంతర శక్తులను అవతిరంప చేయుటకు ప్రార్థించినది.

శ్రీ అరవిందులు.

*    *    *    *    *

### అగ్నికుండము

ఓ ప్రభూ ! దివ్యప్రేమ - శక్తి మంతము, అనంతము అగాధము అగుప్రేమ ప్రతికర్మయందును, సత్తయొక్క సమస్త లోకముల యందుగల ఆ ప్రేమగా నుండుటకు, నేను నిన్ను మొరపెట్టు కొను చున్నాను. ప్రతికర్మ యందును, సత్త యొక్క సమస్త లోకములయందును, గల ఈ దివ్యప్రేమతో - నేను దగ్ధమై పోదునుగాక ! పృథ్వీయొక్క వాతావరణ మంతయు ఈ అగ్నిచే పరిశుద్ధమగుటకుగా నన్ను అగ్నికుండముగా రుపాంతరము గావించుము, ఓ, ఇది ! అనంతముగ నీదివ్య ప్రేమగా నుండుట గాదా !.

*    *    *    *    *

### అనవరతప్రేమ

ఓ దేవా ! ఏకైక సద్వస్తూ ! మా ప్రకాశము యొక్క దివ్యప్రకాశమా ! మా జీవనము యొక్క దివ్యజీవనమా ! పరమప్రేమా ! జగద్రక్షకా ! నీ అనవరత

సాన్నిధ్యము యొక్క జాగృతికి అధికాధికముగా పూర్ణ ప్రబుద్ధత పొందునట్లు ప్రసాదించుము. నాసమస్త కర్మలు నీ దివ్య ధర్మమునకు అనుగుణ్యముగ నుండు గాక ! నీ సంకల్పమునకు మధ్య ఎట్టి బేధము లేకుండును గాక ! నా మానసిక భ్రమలనుండియు, దాని భ్రాంత జగత్తు నుండియు నన్ను విముక్తి గావించుము. నాచేతస్సు నీ పరమచేతస్సుతో తాదాత్మ్యమునొందుగాక ! వెలయన అదియు, నీవే.

సంకల్పమునందు ఈ గమ్యమును చేరుటకు, అనవరతత్వమును నాకివ్వుము: సర్వతమస్సును, అలసతను, దులుపుటకు తగు దృఢత, శక్తి ధైర్యములను నా కొసంగుము.

సంపూర్ణ నిస్సంగతతో గూడిన శాంతిని, – నీసాన్నిధ్యము యొక్క మధ్యస్థమును క్రియాశీల మొనరించు శాంతిని, సమస్త దుష్టసంకల్పములను, సమస్త అస్పష్టతలను విజయము గాంచగల శాంతిని నాకు ప్రసాదించుము.

నాసత్తయందు గల సర్వము నీతో తాదాత్మ్య మొందుటకు, ప్రసాదించుమని నిన్ను ప్రార్థించు చున్నాను. నీ పరమ సాక్షాత్కారమునకు పూర్ణముగా ప్రబుద్ధముగా గల ప్రేమాగ్నిజ్వాలగా కన్న మరి తక్కువ యేదియునుగ నే నుండకుందుగాక !

* * * * *

## ఉషఃకాల ప్రార్థన

నీ దివ్య ప్రేమ, యందు జీవించుటకును, నీదివ్య ప్రేమ వ్యాపింప చేయుటకును, అందుచే, సర్వులు దృఢతను నవజన్మను, ప్రకాశ మానతను పొందునట్లుగా, సదాఇదే ఉత్కాంక్షతో, నా ప్రార్థన నీవైపునకు ఈ ఉదయము ఉద్గమించు చున్నది. జీవిత గాయమును బాగుపర్చుటకును, బాధను తొలగించుటకును, నిశ్చల విశ్వాసమును శాంతిని ఉద్భవింప చేయుటకును, దుఃఖమును తొలగించి దాని స్థానమున అదృశ్యము కానట్టియు నీతోటి ఐక్యమునందు స్థాపింప బడిన ఆ యేకైక సత్య సంతోష భావమును స్థిరపెట్టుటకునుగల శక్తి.....

ఓ ప్రభూ ! ఓ అద్భుతసఖా ! ఓ సర్వశక్తి మంతుడవగునాధా ! మాసర్వ సత్తయందు చొచ్చుము. మాయందు నీవు మాత్రమే, వసించునట్లుగా రూపాంతర మొందించుము.

## రాధా ప్రార్థన

ఓ దేవా ! నా ప్రథమ సందర్శనమునందే, నిన్నునా సత్త యొక్క ప్రభువుగను, నా దైవముగను తెలసికొనబడిన నీవు, నా అర్పణను అంగీకరింపుము.

నాసమస్త చింతనలు, నాసమస్త ఆవేశములు, నా హృదయము యొక్క సర్వభావములు, నాసమస్త ఇంద్రియక సంవేదనలు, నా జీవితము యొక్క సర్వ ప్రవృత్తులు, నాశరీరము నందలి ప్రతి జీవకణమును, నారక్తమందలి ప్రతి బిందువు ఈ సర్వము నీయవి. నేను సంపూర్ణముగా నీదాననే, నిశ్శేషముగా నీదాననే నీవు నాకేది సంకల్పింతువో, అదియే నేనగుదును. జీవితమునో, లేక మృత్యువునో, సంతోషమునో, దుఃఖమునో, సౌఖ్యమునో లేక బాధనో, నీవు నాకొరకు దేనిని ఇచ్ఛగింతువో, నీనుండి యేదేది వచ్చునో, ఆ సర్వము కూడ ఆహ్వాననీయమే. నీ ప్రదానములు ఒక్కొక్కటియు నాకు సర్వదా దైవ ప్రదానములేయగును. అదియే నాకు పరమానందమును కొనితెచ్చును.

* * * * *

## దైవమును సేవించ కోరువారికి ఒక ప్రార్థన

ఓ ప్రభూ ! సర్వాంతరాయములపై విజయము గాంచు నీకు మాస్తుతి.

నీ దివ్యకార్యము మాచే నిర్విఘ్నముగా కొనసాగుటకు ప్రసాదించుము.

నీ ఆవిర్భావమునకు యేదేదియు అంతరాయముగ నుండకుండ, ప్రసాదింపుము.

సర్వవిషయములందును, ప్రతిక్షణమునందును నీ దివ్య సంకల్పమే నెరవేరునట్లు ప్రసాదింపుము. మా యందుగల ప్రతి అంశము నందును, మాసత్త యొక్క ప్రతికార్యము నందును, మాశరీరము యొక్క పరమ శిఖరముల నుండి అల్పతమ జీవకణము వరకు కూడ నీ దివ్య సంకల్పమే సిద్ధించుటకుగా, ఇపుడు నీయెదుట నిలచి యున్నాము.

మేము సర్వదా సంపూర్ణముగా నీయందు విశ్వాసము కలిగి యుండునట్లుగా ప్రసాదింపుము. మేము నిశ్శేషముగా మీ ప్రభావమునకే, మరి ఇతర ప్రభావములకు దేనికికూడ లోబడక యుందుము.

మేము నీయందు ఒక అగాధ దృఢకృతజ్ఞతను కలగి, దాని నేక్షణమునను గూడ మరువ కుండునట్లు ప్రసాదింపుము.

అనుక్షణమునను నీవు మాకొసంగు ప్రదానములందు గల అద్భుత విషయములను, దేనిని కాని వ్యర్థము చేయకుండ ప్రసాదింపుము.

మాయందు సర్వము నీదివ్యకార్యమున సహకరించి, తద్సిద్ధకి సిద్ధముగా నుండునట్లు ప్రసాదింపుము.

ఓ ప్రభూ ! సర్వసిద్ధి యొక్క పరమ నాధా: నీకు మాస్తుతి !

నీ విజయమునకుగా క్రియా శీలము ఉత్సుకమునగు విశ్వాసమును-కేవలము. అచలమునగు విశ్వాసమును మాకు ప్రసాదింపుము.

* * * * *

## విద్యార్థి ప్రార్థన

మే మగుటకు ఆకాంక్షించు వీరసైనికులుగా మమ్ము గావింపుము. జనించనున్న భవిష్యత్తునకును స్థిరపడి యుండ నన్వేషించు గతమునకును మధ్యగల సంఘర్షణ యందు మేము విజయవంతముగా పోరాడుదుము గాక : అందుచే నూతన విషయములు ఆవిర్భవించి మేము వానిని అందుకొనుటకు సంసిద్ధులుగ నుందుముగాక.

* * * * *

## దివ్యమాతకు

ఓ దివ్య మాతా ! నీ సంకల్పమునకుగా పరిపూర్ణతర సమర్పణను ఈ దివసము నొసంగునట్లు ప్రసాదింపుము ; నీకార్యమునకుగా మమ్ము మేము అర్పించుకొను సమగ్రతర ప్రదానమును, ఉన్నతతర ప్రకాశమును, పూర్ణతర స్వీయ విస్మరణను, పరిశుద్ధతర ప్రేమను, ఈ దివసము మాకొసంగునట్లు ప్రసాదింపుము. అనవరత తరమును పూర్ణతరమును, అధికాధికమును అగు అంతరికాన్యోన్య సంబంధము నందు, అధికాధిక సామీప్యముగా నీతో తాదాత్మ్యమును పొంది నీ ఆర్హా సేవకులముగా నుండునట్లు ప్రసాదింపుము. మా నుంచి సర్వఅహంభావము తొలగించుము; సమస్తక్షుద్ర దాంచికము, అత్యాశ, తమస్సులను నిర్మూలించుము. మేము సర్వులము నీ దివ్యప్రేమతో జ్వలింతుముగాక ! ప్రపంచమునందు మమ్ములను నీజ్యోతులుగ నొనర్చుము.

## భారతాత్మకు ఆహ్వానము

ఓ మా మాతా, ఓ భారతాత్మా! తమోతమ జిగుప్సా దినములలో కూడ నీవాణి నుండి విముఖులై ఇతర ప్రభువులను కొలచినిన్ను త్యజించి నప్పుడుకూడా నీ సంతానమును విడువనట్టి నీవు, ఇప్పుడు నీ స్వాతంత్ర్య ఉషస్సమయమున నీముఖము ప్రకాశించు చుండ, వారు ప్రబుద్ధులైన ఈ సమయమున ఈ మహోన్నత సమయమున, మేము నీకు ప్రణమిల్లు చున్నాము. మా ఎదుట తెరచుకొను స్వాతంత్ర్య దిగంతము, ప్రపంచ జాతుల సంఘమునందు నీ నిజ మహోన్నతి యొక్కయు నీనిజ జీవితము యొక్కయు దిగంతముగ నుండునట్లు, మమ్ము పురోగ మింపుము. సదామేము ఉన్నతాదర్శ పక్షమున నుండునట్లును, మానవులకు నీ నిజ స్వరూపమును చూపునట్లును, అందుచే అధ్యాత్మ మార్గమున సమస్త ప్రజలకును సాహాయ్యకురాలుగ, మిత్రురాలుగ, నాయకురాలుగ, యుండునట్లు మమ్మునడి పింపుము. 15_8_1947.

* * * * *

## (శ్రీ అరవిందుల సమాధిపై లిఖింప బడినది)

మా ప్రభువుయొక్క భౌతికావరణముగ నున్న నీకు, మా అనంత కృతజ్ఞత, మాకొఱకెంతో కావించినట్టియు, పనిచేసినట్టియు, పోరాడినట్టియు, బాధపడినట్టియు, ఆశించినట్టియు, ఎంతో సహించి నట్టియు నగు నీయెదుట, మాకొఱకు సర్వము సంక ల్పించి నట్టియు, సర్వము ప్రయత్నించి నట్టియు, సర్వము సిద్ధపఱచి సాధించి నట్టియు నగు నీయెదుట, ప్రణమిల్లి మేమెప్పటికిని నిన్ను మఱువకుండునట్లు నీకు ఋణపడిన దానినంతటిని, ఒక్కనిమిషము కూడ మఱువకుండునట్లు ప్రార్థించు చున్నాము.

సమస్త పృథ్వీపై శాంతిః శాంతిః.

సాధారణ చేతస్సునుండియు భౌతిక వస్తువులపైగల అనురాగమునుండియు, సర్వులు విముక్తిని పొందుదురు గాక: మీదివ్య సాన్నిధ్యము యొక్క జ్ఞానమునకు వారు ప్రబుద్ధులై నీపరమ చేతస్సుతో ఐక్యమై, అందునుండి ఉద్భవించు శాంతి యొక్క సమృద్ధిని చవిచూచెదరుగాక. ఓ ప్రభూ! నీవు మాసత్త యొక్క పరమ నాథుడవు. నీధర్మమే మాధర్మము, మాసర్వ శక్తితో మేము మాచేతస్సునుమీశాశ్వత

చేతస్సుతో ఐక్య మొనరించి, ప్రతివస్తువునందును, ప్రతిక్షణమందును, నీ మహోన్నత కార్యమును, నెరవేర్చుటకుగా ఆకాంక్షింతుము.

ప్రభూ ! మమ్ము అకస్మాత్సంఘటనల భయము నుండి విముక్తి గావించుము; విషయములపై గల సామాన్య దృక్పథమునుండి విముక్తి గావింపుము. ఇప్పటినుంచి మీదివ్య చక్షువులతో మాత్రమే గుర్తించి నీసంకల్పముతో ప్రవర్తించునట్లు ప్రసాదింపుము. నీ దివ్య ప్రేమయొక్క సజీవ దీప్తులుగ మమ్ము రూపాంతర మొందింపుము.

పూజ్యభావముతో, భక్తితో, నాసత్తయొక్క సంతోషకర సమర్పణయందు, నన్ను నేను, ఓ ప్రభూ ! నీధర్మ సిద్ధి కొరకు అర్పించుకొనుచున్నాను.

సమస్త పృథ్వికి శాంతిః శాంతిః

## 4_వ అధ్యాయము

# సమిష్టి మానవజాతి గమ్యమునకు ప్రణాళిక

### (1912 వ సంవత్సరమున వ్రాయబడినదీ ప్రణాళిక)

గమనిక:_(శ్రీమాత 38 సం॥ముల వయస్సునందు 1912) పృథ్వీపై దివ్య సామ్రాజ్యమును స్థాపించుటకు, ఈ దిగువ వ్రాయబడిన ప్రణాళిక తప్ప మరొకటి లేదని గ్రహించి, ఈ ప్రణాళికను వ్రాసినది. దీనిని నెరవేర్చుటకు, శ్రీ అరవిందులను, 1914 - మార్చి 29న దర్శించినది. కొన్ని మాసములు పాండిచేరిలోనే, వేరె గృహమును బాడుగకు తీసుకొని వసించి, ఆతర్వాత కారణాంతములచే, జపానుకు పోయియు, తనజన్మ స్థానమగు పారిస్ పట్టణమునకు పోయియు, మఱల 1920 ఏప్రిల్ 24న పాండిచేరి చేరి, ఆనాటినుండి శ్రీ అరవిందులతో సహకరించి, ఈ క్రింద కనబరచిన తన 1912 వ సంవత్సర ప్రణాళికను, 1968 ఫిబ్రవరి 21 వ తేది నాటికి, సిద్ధింపచేయు చున్నదని, ఎంతటి గ్రుడ్డివాడైనను చూడవచ్చును.)

మనము సాధించ వలసిన సామాన్య లక్ష్యము,_క్రమాను గతమైన, విశ్వగత సామరస్యము పృథ్వీపై స్థాపించుట.

ఈ లక్ష్యమును పృథ్వీపై సాధించుటకు గల ఉపాయము,_ఏకైకమగు అంతరిక దివ్యమును సర్వులయందును మేల్కొలుపుటచే, సర్వులు దానిని అభివ్యక్తము చేసి, తన్మూలమున మానవైక్యతను సిద్ధింప చేసికొనుట.

మన యందఱిలోనున్న ఈశ్వర సామ్రాజ్యమును స్థాపించి, మానవైక్యతను స్థాపించుటయని, దీనిని మఱియొక విధముగ చెప్పవచ్చును.

కనుక, ఇందుకు మనము సాధించవలసిన అత్యంత ప్రయోజనమగు కార్యములివి;

1. ఒక్కొక్క వ్యక్తియు, తన యందున్న దైవసాన్నిధ్యమునకు సచేతనుడై, దానితో తాదాత్మ్యమును పొందుట.

2. మానవుని యందింత వఱకు జాగరితముకాని స్థితి విశేషములను, ప్రత్యేక పఱచి, ఈ స్థితి విశేషములతో, ఇంతవఱకు పృథ్వికి తెలియనట్టి, విశ్వశక్తియొక్క ఒకటిలేక కొన్ని నిర్ఝరులతో, పృథ్వికి సంబంధము నేర్పఱుచుట.

3. శాశ్వత వచనమును, ఆధునిక మనః స్వభాములకు అర్థమగు విధమున, నూతన రూపముతో వచించుట.

ఇట్లు చేయుటచే మానవుని సమస్త జ్ఞానమును, సముచ్చయ మొనరించుట యగును.

4. సాముదాయకముగ, ఒక నవ్యవంశము. ఈశ్వర కుమారుల వంశము, వికసించుటకొఱకు భవ్యస్థలమున నాదర్శ భూతమైన సంఘమును స్థాపించుట.

*　　*　　*　　*　　*

పృథ్వీజీవిత రూపాంతరము, సామరస్యతలను, పరస్పరము విరుద్ధముగ కనబడు ద్వివిధ విధానములచే పరస్పరముపై పనిచేసి, పరస్పరము పూరించు కొనవలెను.

అవి, యేవియన,

1. దైవ సాన్నిధ్యముతో నైక్యమును పొందగల అంతరికాభివృద్ధికిగా, వ్యక్తిగత రూపాంతరము.

2. వ్యక్తి వికాసాభివృద్ధుల కనుగుణ్యముగ నుండగల పరిసర స్థాపనకవసర మగు, సమిష్టి గత రూపాంతరము.

పరిసర ప్రభావము, వ్యక్తిపై ప్రతిక్రియ కావించుట చేతను, ఇందుకు ప్రతి రూపముగ, వ్యక్తికి గల విలువపై పరిసరము యొక్క విలువ ఆధారపడి యుండుట చేతను, ఈ రెండు కార్యములు ప్రక్క-ప్రక్కనే, ఒకేచోట జరుగవలెను. కాని ఇందుకు జీవితము నందలి కర్మలను విభజించుకొని, ఒక్కొ-క్కరును, వారి వారికి తగిన కర్మను చేయవలెను. కనుక, ఇందుకొఱక వర్గము, లేక సంఘ మేర్పడ వలెను. మఱి, ఈ వర్గము దైవప్రభుత్వమునకు లోబడి యుండవలెను.

ఈ వర్గ సభ్యుల కార్యము త్రివిధముగ నుండవలెను.

పొందవలసిన ఆదర్శమును వ్యక్తి తనయందు సిద్ధింప చేసికొనుట, దివ్య అచింత్యుని సకల గుణములను, ప్రకాశములను, విశేషములను, పృథ్వీపై వ్యక్తి తన యందు ప్రథమముగా నావిర్భవింప చేసికొను ప్రతినిధియై యుండుట.

2. ఈ ఆదర్శమును ప్రవచనముచేతను, ఇంతకన్న ముఖ్యముగ, ఉదాహరణము చేతను, బోధించవలెను; అందుచే ఈ లక్ష్యమును, ఆదర్శమును ఆకాంక్షించు వారందఱును, ఇతనిని, వెతకి, కనుగొని, ఆదర్శమును సిద్ధింపచేసికొని, తాముకూడ బోధింప కలుగుదురు.

3. ఈ ఆదర్శ సంఘమును నూతనముగ స్థాపించుట, లేక, ఇదివఱకే నున్న దానిని గుర్తించుట.

* * * * *

ఒక్కొక్క వ్యక్తియు చేయవలసిన పనులు రెండు కలవు; అవి రెండును, ఒకేసమయమున పరస్పరము సహాయము చేసికొనుచు, పరస్పరము పూరించుకొనును.

1. ఆంతరికాభి వృద్ధి, – దివ్యప్రకాశముతో క్రమానుగుణ్యమగు ఐక్యతస్థితి; ఇట్టి స్థితినుండి మాత్రమే, విశ్వజీవిత – మహా ప్రవాహములో: మానవుడు సర్వదా సామరస్యతను పొంది యుండగలడు.

2. ప్రతివ్యక్తియు తనశక్తి సామర్థ్యములను బట్టియు; స్వీయాభిరుచులను బట్టియు, నొక బాహ్యకార్యమును చేపట్ట వలెను. విశ్వగత సంగీత సామరస్యము నందతడు మాత్రమే ఆక్రమించగల తనస్థానము నతడు కనుగొనవలెను. దానికి తన్నుదా సంపూర్ణముగ అర్పించు కొనవలెను; కాని అందుచే నతడు, పృథ్వీపై నెరవేరవలసిన ఈ సంగీత సామరస్యము నందు తానొక స్వరమును మ్రాత మే వాయించు చున్నను, సర్వసామరస్యతకు అది అవసరమే అనుటను, ఈ కార్యమునకుగల విలువ యంతయు ఈ సామరస్యతపైననే కలదనుటను మఱవ కూడదు.

# నాలుగవ భాగము

## 1–వ అధ్యాయము

## శ్రీ అరవిందుల అపూర్వ దర్శనం

–రచన : కమలాకర వేంకటరావు

మానవుని ఆధ్యాత్మిక విజ్ఞాన వికాస చరిత్రలో శ్రీ అరవిందుల కొక విశిష్ట మైన స్థానం ఉన్నది. పరతత్వ నిరూపణమునందేమి, తదుపలబ్ధికై చేయదగు సాధన విధానము నందేమి, అపూర్వమైన ఒక ప్రత్యేక పంథా ఆయన త్రొక్కినారు. కేవల బుద్ధి వైభవంచేత ఇది ఆయన ఊహా కల్పనగా ప్రపంచించినది కాదనీ, అపారమైన ఆధ్యాత్మికానుభవ సంపత్తియే ఈ ప్రబోధమున కంతకూ మూలమైన దనీ ఇచట గుర్తించడం అవసరం.

శ్రీ అరవిందుల బుద్ధి పటిమ నిజమునకు సామాన్యమైనదికాదు. కౌమార వయస్సులో విద్యాభ్యాస మంతయూ ఇంగ్లాండులో జరిగిన కారణమున తొలుత ఆయన పాశ్చాత్య విజ్ఞానము నంతనూ ఆపోశనము పట్టినారు. కాని, జనానంతర సౌహృదయం అదేరీతిగా ప్రాచ్య విజ్ఞానమును సైతం ఆపోశనం పట్టడానికి అని వార్యంగా ఆయనను ప్రోత్సహించింది. ముఖ్యంగా భారతీయ విజ్ఞాన సంస్కృతుల వైభవానికి ఆయన హృదయం అయస్కాంతమునకు ఇనుమువలె ఆకర్షితమై పోయింది. భరతమాత దివ్య స్వరూపాన్ని ఆయన సాక్షాత్కరింప జేసుకొన్నారు. మానవజాతి ఉద్ధరణకై భరతవర్షం నిర్వహించవలసిన పాత్ర ఇంకనూ కలదని గుర్తించి, తదాశయ సిద్ధికై దేశదాస్య శృంఖలా విచ్ఛేదంకొరకు తహతహ చెందారు.

అయితే, భారతీయ విజ్ఞానము నుపాసించే సందర్భంలో ఆయనకు యోగ విజ్ఞాన సాక్షాత్కారంకూడా అయింది. బుద్ధి అందుకోజాలని సత్యజ్ఞానోపలబ్ధి

యోగం వలననే సాధ్యమని గ్రహించారు. గురువు నిమిత్త మాత్రంగా, యోగ మార్గ మందాయన నడక అప్రతిహతంగా సాగిపోయింది. అద్భుతావహమైన దివ్యానుభూతులతో ఆయన సాధన పరాభూమికల కెగసినది. మంత్ర ద్రష్టలైన వేదఋషి వాక్కులలో గర్భితములైన పరమ రహస్యము లాయనకు తేటతెల్లములై కనిపించాయి. భగవద్గీతలో బోధించబడిన ఈశ్వరాధీన కర్మయోగ సాధన మాయనకు ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రాయమైపోయింది. అహంకారమును విసర్జించి, స్వీయాభీష్టముల నావలకు పోద్రోలి, ఈశ్వరేచ్ఛానుసారముగా వర్తించుటెట్లో ఆయన తెలుసుకొన్నారు. దేశ స్వాతంత్ర్య సంపాదనార్థమై తానంతవరకూ సారథ్యం వహిస్తూవుండిన మహోద్యమాన్ని అవలీలగా వదలివేసి అలనాడాయన పుదుచ్చేరికి చేరుకొనడం ఈశ్వరాదేశ పూర్వకముగా జరిగినదే. ఉల్లంఘించగోరినా ఉల్లంఘించ వీలులేని ఆదేశమది.

ఎందుకిటుల జరిగినదో తరువాతి చరిత్రయే మనకు తేటతెల్లం చేస్తున్నది. భారతదేశమునకు స్వరాజ్య సంపాదనకంటె మహోతన్నతమైన మరొక లక్ష్య సాధనకు శ్రీ అరవిందుల జీవితం ఉద్దిష్టమయింది. భారతదేశమునకు స్వరాజ్యసిద్ధి నిశ్చయమె. దానిని సాధించుటకు ఇతరులు నిమిత్త మాత్రులుగా నిర్దేశించబడి ఉన్నారు. ఆధ్యాత్మిక సాధన చరిత్రలో – పృథ్వీతలంపై మానవజాతి వికాస పరిణామ చరిత్రలోనే – అపూర్వమైన ఒకానొక దివ్యప్రగతికి ప్రవర్తయై, తత్సంసిద్ధికి బాటలువేసే పని శ్రీ అరవిందులకు కల్పించబడింది. అపర ప్రకృతిలోనిదై అజ్ఞానమయమైన మనస్సుకంటె అతీతమగు పరాప్రకృతి యందలి విజ్ఞాన తత్వం పృథ్విపైకి అవతరించవలసి యున్నదనీ, అట్టిది సాధ్యమైనప్పుడు, అంత మానవులు పృథ్విపై విలసిల్లగలరనీ, మానవునిలో అట్టి దివ్యపరివర్తనం సాధించగల యోగ పద్ధతిని రూపొందించడమె తన లక్ష్యమని ఆయన వెల్లడించి, పుదుచ్చేరిలో 1914–1921 సంవత్సరముల నడిమికాలమున తాను ఆంగ్లమున నిర్వహించిన "ఆర్య" పత్రికద్వారా వివిధ మహా రచనల రూపమున దీనినే అనేక విధములుగా విస్తరించి లోకమునకు చాటినారు.

నిజమున కిది చాల ఆశ్చర్యకరమైన విషయమే, – కొందరికి సందేహాస్పదమైన విషయముకూడ. తెలిసినంతవరకు యుగయుగములుగా పృథ్విపై మానవుని పూర్వ చరిత్రను సింహావలోకనం చేసి చూచుకొన్నప్పుడు, మనకు స్పష్టముగా

కనిపించునది మనోరాజ్యం మాత్రమే. తొలిపలుకునైన వేదములనాటి నుండియూ మనస్సు నతిక్రమించెడి సాధనలు మానవుడు చేయక పోలేదు. మనస్సు నతిక్ర మించుటలో అత్యద్భుత ప్రజ్ఞలనే అతడు తరచుగా ప్రదర్శిస్తూ వచ్చినాడు. మన స్సున కతీతంగా దివ్యభూమిక లెన్నియో ఉండడం అతడు కనుగొన్నాడు. అనృత - జడ దుఃఖాత్మకమైన యీ సమస్తసృష్టికీ మూలమై సచ్చిదానంద లక్షణోపేతమైన పరతత్వం ఉన్నదని ప్రత్యక్షానుభవ పూర్వకంగా తెలిసికోగలిగినాడు. ఒక మార్గం కాదు. అనేక మార్గములు దానిని చేరడాని కున్నవని సైతం దర్శించి, లోకమునకు నాటినాడు. కాని, అవి ఇహజీవనము నతిక్రమించి చనుటకే కాని, దీనినికూడ రూపాంతరము చెందించుటకుగాదు. ఇహజీవన మెప్పటికీ, అజ్ఞానపు టంతస్తులోనిదే. అది దివ్య జీవనంగా పరివర్తనం చెందడం పొసగదు. ఆధ్యాత్మిక సాధనలన్నీ దివ్య భూమికల కధిరోహించి దివ్యత్వము నందుకొనుటకేగాని, ఆ దివ్యత్వమును క్రింది కవరోహింపజేసి ఇహజీవనమును సైతం దివ్యం చెయ్యడానికికాదు. కడచిన ఆధ్యాత్మిక సాధన పద్ధతులన్నీ ఈ ధోరణిలో కొనసాగుతూ వుండగా శ్రీ అర విందులు చాటిన నూతన పంథా కొందరికి సందేహములు జనింప జేయడం సహజమే.

కాని, అత్యంత ప్రబలములైన తన దర్శనానుభవముల కారణమున అనివార్య ముగా శ్రీ అరవిందు లీ తత్వ నిశ్చయమునకు వచ్చినారు. ఆయన దృష్టిలో జగత్తు మిధ్యకాదు, అర్థ రహితమైన మాయా కల్పనయుకాదు. అయ్యది సత్యవస్తువు యొక్క అభివ్యక్తి అగుటచే, అదికూడ సత్యమే - శ్రీ అరవిందుల దర్శనం అద్వైత దర్శనమేకాని, అయ్యది మాయాద్వైతంకాదు, సత్యాద్వైతం. ఏకమునకు అనేకమునకు పరస్పర వైరుధ్యము లేదని ఆయన హెచ్చరిక. ఏకత్వ నిరూపణకు అనేకత్వమును తుడిచిపెట్టి. దాని అస్తిత్వమునే నిరాకరించ వలసిన పనిలేదు. ఏకత్వమునందలి అభేదత్వ మెటుల సత్యమో, అనేకమునందలి భేదములుకూడ అటులనే సత్యము. కాని, అనేకము ఏకమునందు నిష్ఠమై ఏకము వలననే మను చున్నవి. సృష్టియందు కానవచ్చు భేదములు అభేద వస్తువుయొక్క అభివ్యక్తిలో కాననగు వైవిధ్యము మాత్రమే. ఏకత్వమునందు అంతులేని నానాత్వము జగత్తు నందు మనకు ప్రత్యక్షమగుచునే యున్నది. ఉదాహరణకు. మానవజాతి ఒకటే అయినా, నానారూప మానవులు మనకు కానవచ్చుచున్నారు. ఆకు అనేదికాని, పూవు అనేదిగాని ఒకటే అయినా, పలువిధములైన రూపములలో, తీరులలో, రంగులలో

ఆకులను, పూవులను మనము చూచుచున్నాము. దీని ననుసరించి సృష్టి మూలము లోనికి మనము దృష్టి సారించే యెడల, సృష్టి రహస్యములోని ఒక రహస్యము మనకు తెల్లమై బోడగట్టక మానదు. ఏకమైన సత్యవస్తువునందే గర్భితమైయున్న రహస్యమది. సత్య జ్ఞానాందుని ఏకత్వము తన ఏకత్వమునకు బద్ధమై పరిమిత మైనదికాదు. అనంతమైన నానత్వమునకు సైతం అందు తావున్నది. పరమ సత్యముయొక్క స్వరూపం అటు ఏకత్వమునకుగాని, ఇటు అనేకత్వమునకుగాని పరిమితమై యున్నదికాదు. ఏక కాలమున రెంటినీ గర్భితమొనర్చుకొన్న వస్తువది. ఏకత్వము మూలమై. అనేకత్వము ఆ ఏకత్వముపైన ఆధారపడివున్నా, రెండునూ ఆ పరమ సత్యపు భిన్న ముఖములే.

సత్యాద్వైతంలో, సగుణం నిర్గుణంనుండి ఆవిర్భవించినదనిగాని, నిర్గుణం ప్రధానమైనదికాగా సగుణం అప్రధాన మైనదనిగాని, భావింపనక్కరలేదు. అవి ఒకే సత్యముయొక్క భిన్నముఖాలు. ఒకటి స్థితి లక్షణాత్మకం, వేరొకటి గతి లక్షణాత్మకం, ఒకటి అచలం, రెండవది సచలం. నిత్యమైన అచలస్థితి నిత్యమైన సచలగతి కాధార భూతమై ఉంటున్నది. పరమ సత్యము ఈ రెండింటిలో దేనికిని పరిమితమైనదికాదు. రెండింటినీ అది తనలో భుక్తమొనర్చుకొని ఉన్నది. ఏకత్వ నానత్వములకు భేదాభేదములకు ఎట్లు వైరుధ్యములేదో సగుణ నిర్గుణములకునూ అట్లే వైరుధ్యములేదు. రెండునూ నిత్యములే. రెంటిలో ఏది లేక పోయిననూ జగత్సృష్టి కవకాశములేదు. కనుక, జగత్తుగా అభివ్యక్తమైన పరమ సత్యమున కవి రెండునూ భిన్నముఖములని అంగీకరించడం యుక్తం. స్థూల దృష్టికి పరస్పర విరుద్ధములుగా కనిపించే యీ రెంటిలో ఏదో ఒకదానిని మాయగా కొట్టివేసి, యీ వైరుధ్యాన్ని తొలగించుకోవచ్చుననే మాట నిజమే. కాని, నిత్యమైన పరమ సత్యం తన కెట్టి సంబంధమూలేని ఒక నిత్యమైన మాయను అంగీకరిస్తున్నదనిగాని, లేక ఒక నిరర్థకమైన మాయావిలసనమున కాధార భూతం కావడం తప్ప మరే ఇతర సార్థక కార్యనిర్వహణ శక్తిదానికి లేదనిగాని, తలపోయడం హేతుబద్ధంగా కనిపించదు. నిత్యశక్తి సమన్వితమైనది, ఆ పరమసత్యం. స్థితియందు గతియందు కూడ ఎల్లప్పుడూ అది ఉండనే ఉన్నది. స్థితియందది అచలం, గతియందలి సచలం. జగత్తు ఈ గతియందే అభివ్యక్తమౌతున్నది. బ్రహ్మాండమైన ఒక అన్ృతసృష్టిని—మిథ్యాసృష్టిని—చేసే శక్తి తప్ప ఇంకే శక్తీ ఆ పరమ సత్యానికి లేదనుకోడం యుక్తంకాదు.

సత్యాద్వైతంలో జగత్తు ఈ రీతిగా పరమ సత్యపు అభివ్యక్తి కావడంవలన, అదికూడ సత్యమే అవుతున్నది. పరమసత్యం అనంతుడు, సచ్చిదానందాత్మకుడు అయిన పురుషోత్తముడు. అతడే యీ జగత్తును తన అనంత స్వరూపమునందు, అభివ్యక్త మొనర్చినాడు. అట్టడుగు భౌతిక జగత్తులో - తన స్వరూపానికి విరుద్ధముగా కనిపించే అసత్ - అచిత్ - అనానందముల మాటున దాగుకొని వున్నాడు. ఈ అసత్ - అచిత్ - అనానందరూపమైన అచేతనవస్తువే తన జడశక్తిచేత యీ భౌతిక జగత్తును సృష్టించినట్లుగా స్థూలదృష్టికి కనిపిస్తూవున్నది. కాని, లోతుగా పరిశీలించి చూచినయెడల, చాటున దాగుకొనియున్న ఒక మహా విజ్ఞాన కార్య ఫలితంగా తప్ప, జగత్తులోని యీ వ్యవస్థలన్నీ యీ రీతిగా వ్యవస్థీకరించబడడం సాధ్యం కాదని, బోధగట్టకపోదు. పైన పేర్కొన్న శూన్యప్రాయమైన అచేతనం చాటున దాగికొనియున్న చేతనారూపుడైన పురుషుడే జగత్తులో మొదట జడద్రవ్యంగాను, పిమ్మట ప్రాణంగాను, అటుపిమ్మట మనస్సుగాను, తుదకు ఆత్మ చైతన్యంగాను అభివ్యక్తమౌతూ వస్తున్నాడు. జగత్సృష్టికి మూలంగా, స్థూలదృష్టికి తోచే జడశక్తి, వాస్తవానికి పరమ పురుషుని చిచ్ఛక్తియే. ఆ చిచ్ఛక్తి విశేషమే జడద్రవ్యములో దాగివుండి, పిమ్మట క్రమంగా ప్రాణంలో అభివ్యక్తమౌతూ, అటుపిమ్మట మనస్సులో మరింతగా వికసించి, అనంతరం ఆధ్యాత్మిక చేతనలో నిజాత్మను గుర్తించుకొని, కడకు మనస్సునకతీతమైన విజ్ఞాన చేతన ద్వారమున తన పరమసత్య సాక్షాత్కారమునంది దానితో ఏకత్వమును పొందుతున్నది. ఇదియే సృష్టియందు గోచరించెడి క్రమ వికాస పరిణామము. ఇది బయటకు కనిపించే వివిధ జాతుల స్థూలదేహముల క్రమ వికాస పరిణామమేగాక, ఆ దేహములందలి ఆత్మవికాస పరిణామమూ, చైతన్య వికాస పరిణామమూ అని కూడ గుర్తించడం అవసరం, చైతన్యమెట్లు ఈ రీతిగా వికరిస్తూ వస్తున్నదో అట్లే సత్యవస్తువునందలి ఆనంద లక్షణముకూడ తొలుత అనానందములో దాగివుంటి, పిమ్మట సుఖదుఃఖముల రూపమున అభివ్యక్తమై తుదకు ఆత్మానందమున - ఉపనిషత్తులు పేర్కొనే బ్రహ్మానందమున స్వస్వరూపమును పొందవలసివున్నది. అదియే శ్రీ అరవిందులు 'దివ్యజీవన' మనుపేర తాము రచించిన మహనీయ దర్శన గ్రంథంలో జగత్సృష్టి తత్వమును గురించి వివరించినదాని సారాంశము.

జగత్తు ఈ రీతిని మాయగాక సత్యమై, పరమపురుషుని అభివ్యక్తియై, అందు ఆత్మ చైతన్యం మొదట అచేతనముగ సంకోచమునుపొంది, పిమ్మట జడపదార్థ

ముగ వ్యవస్థీకరించబడి, అట్టి జడమునందే క్రమముగా ప్రాణము, మనస్సు వికాసము పొందుతూ రావడం సృష్టి విధానమై గోచరించగా, ఈ వికాస పరిణామమింతటితో ఆగిపోనేరదనీ, మనస్సు పై అంతస్తునుగూడ అందుకోవలసి యున్నదని, శ్రీ అరవిందులకు వారి యోగసాధనానుభూతుల అనుక్రమణికలో పొడగట్టినది. దానినే తైత్తిరీయోపనిషత్తులో పేర్కొనబడిన కోశముల పద్ధతిలో చెప్పవలసివస్తే, పృథ్వియందు అన్న, ప్రాణ, మనోమయ పురుష చేతనా వికాసం తద్వారా జరిగినట్లే. మనోమయ కోశంపైనున్న విజ్ఞానమయకోశంకూడా ఇచట వ్యవస్థపొంది, విజ్ఞానమయ పురుష చేతనా వికాసంకూడా ఇచటనే అవశ్యం జరుగవలసియున్నది. శ్రీ అరవిందుల దృష్టిలో ఈ విజ్ఞానమయచేతన బుద్ధికాదు. బుద్ధికంటె అతీతమై సృష్టికి మూలమైయున్న అవిద్యా రహితమైన సత్యచేతన.

ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, — అని వేదములో సప్తవ్యాహృతులు పేర్కొనబడి ఉన్నవి. ఈ ఏడునూ భూలోక, భువర్లోక – స్వర్లోక – మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములకు, అందలి చేతనా విశేషములకు సంజ్ఞలు. బ్రహ్మాండమున భూర్భువస్స్వర్లోకములను అపరార్ధముగను, మహర్జన తపస్సత్య లోకములను పరార్ధముగను శ్రీ అరవిందులు పేర్కొని ఉన్నారు. అపరార్ధ పరార్ధముల సంధిలో నున్నది మహస్సు. భూర్భువస్స్వర్లోక చేతనలు అన్నప్రాణ మనోమయ చేతనలకు, సత్య తపోజనలోక చేతనలు సత్–చిత్–ఆనందములకు సంకేతనములుకాగా, నడుమనున్న మహస్సు విజ్ఞానమయ చేతనకు సంకేతం. అపరార్ధ సృష్టికి బీజభూతమైనది యీ విజ్ఞానమేయని చెప్పవచ్చు. అవిద్యావరణం లేని అభేదదర్శనం దీని లక్షణం. దీని దిగువ భూమికలనుండియే భేదదర్శనం ప్రారంభమైనది. కనుకనే, పృథ్వి లోనికి మనస్సు అవతరించిన దాని ఫలితంగా భేదదర్శనులైన మానవులు రూపొందినట్లే – విజ్ఞానం అవతరించినపుడు అభేద దర్శనులైన అతి మానవులు పృథ్విపై విలసిల్లగలరని శ్రీ అరవిందులు చాటినారు.

సృష్టి విధానంలో పరచేతన అచేతనగా సంకుచితమై, అందుండి జడపదార్థ సృష్టిజరుగుటకు ఎన్నికల్పములు పట్టినదో చెప్పలేము. పిమ్మట ఆ జడములోనికి ప్రాణము, అనంతరము మనస్సు అవతరించుటకు ఇంకెన్ని యుగములు కావలసి

వచ్చినదో ఊహించలేము. విజ్ఞానమవతరించుటకు సైతం అట్లే పెక్కుయుగములు పట్టక తప్పదు. కాని, మానవుడు తన యోగసాధనద్వారా అశుభావ తరణను సన్నిహితం చేయగలదని శ్రీ అరవిందులు వక్కాణించారు. ఏలనంటే, ప్రాణమనస్సుల అవతరణ సందర్భములలో వలెగాక, ఇచట మానవుడు ప్రయత్న పూర్వకముగా ఆ విజ్ఞానావతరము నాహ్వానించి ఆకర్షించుటకు సైతం వీలున్నది. క్రిందినుండి పిలుపునకు పైనుండి ఒత్తిడి తోడుకాగా, విజ్ఞానావతరణం ప్రకృతి సహజంగా పట్టేకాలం కంటె తక్కువకాలంలోనే సాధ్యపడుతుందనేది యుక్తమే. శ్రీ అరవిందుల యోగసాధన మంతా అపూర్వమైన యీ మహా ప్రయత్నానికే అంకితమైపోయింది.

పృథ్విపై విజ్ఞాన చేతనా విలసనమున కనువుగా మన ప్రాణదేహముల దివ్య పరివర్తన మీ యోగములో ముఖ్యముగా సాధించవలసి యున్నది. ఇతర యోగ సాధనలకిది లక్ష్యంకాదు. దేహప్రాణ మనస్సుల నతిక్రమించి మనస్సున కతీతమైన పరమోపలబ్ధిని పొందుటయే వాటిలక్ష్యం. ఆరోహణమేకాని అవరోహణం వాటియందు లేదు. జీవితమును పరిత్యజించుటే వాటి చరమలక్ష్యమైనందున, జీవితోపకరణములైన దేహప్రాణమనస్సుల పరివర్తనంతో వాటికి పనిలేదు. ఉన్నత భూమికలకు ఆరోహించడంలో లభ్యమయ్యే ఆధ్యాత్మికానుభూతుల ప్రభావం వాటిపైన కొంత ప్రసరిస్తే ప్రసరించవచ్చు. అంత మాత్రమున వాటి అపర ప్రవృత్తులు, నిర్మూలమై అవి రూపాంతరం చెంద నేరవు. ఆరోహణంతో పాటు అవరోహణం తోపాటు అవరోహణంద్వారా జీవితానికి పూర్ణసాఫల్యం సాధించడం శ్రీ అరవిందుల యోగలక్ష్యము. గనుక ఇచట మనః ప్రాణ దేహముల దివ్యపరివర్తనం కూడా జరుగ వలసిన ఆవశ్యకత ఉన్నది. కనుకనే దీనికి పూర్ణయోగమని పేరు.

పూర్ణయోగ సాధన అహంకారముతో చేసెడిది కాదని ప్రప్రథమముగ గ్రహించడం అత్యంతావశ్యకం. అహంకారం లవలేశంకూడ ఈ సాధనలో ఉండరాదు. అహంకారమును పరిత్యజించి సర్వాత్మనాపరమేశ్వరునికి తనను తానధీన మొనర్చుకొనుచూ కొనసాగించ వలసిన సాధన ఇది. అహంకారం దేహంలో, ప్రాణంలో, మనస్సులో,-అపర ప్రకృతియందలి అన్ని అంతస్తులలోనూ, నిష్ఠమై ఉన్నది. అది పూర్తిగా నిర్మూలమైనప్పుడే ఈశ్వరేచ్ఛా విలసనమున కనువైన విశుద్ధిని దేహ

ప్రాణ మనస్సులు పొందగలుగును. ప్రారంభదశలో ఈ యోగసాధన పురుషాకార ముతో సాగిననూ పోనుపోను సర్వమూ ఈశ్వరాధీనముగనే ప్రవర్తిల్లడం ఈ యోగంలో పరిపక్వతకు లక్షణ మౌతుంది. కావుననే యోగలక్ష్యమైన పరమార్థో పలబ్ధికై తీవ్రమైన ఆకాంక్ష, దానికి ప్రతి బంధకములై సాధనను వక్రింప జేయ జూచెడి అపర ప్రవృత్తుల అనవరత నిరాకరణము, ఏకోశమునందునూ అహంకార మున కనుమాత్రమైననూ తావీయని సర్వ సమర్పణ భావము. ఈ యోగసాధన ముఖ్యాంశములుగా పేర్కొనబడియున్నవి.

పూర్ణయోగ సాధకులకు మార్గ దర్శకంగా ఉండుటకై శ్రీ అరవిందులు వివ రించిన మానవ సత్తలోని వివిధ భాగములను, భూమికలను సంక్షేపంగా ఇచట కొంచెం ప్రస్తావించటం అవసరం. పూర్ణమైన పరమ సత్యం ఏకకాలముననే సగు ణము నిర్గుణము కూడ అని ఏకము అనేకము కూడ అని శ్రీ అరవిందులు ప్రవచిం చిన సంగతి ఈ వ్యాసంలో వెనుక సూచించి వున్నాను.

పరమపురుషుడు ఒక్కడయ్యీ నానా కేంద్ర విలసితుడు. 'సహస్రి శీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్'. కావున పరమాత్మలో నిత్యాంశగా విలసిల్లు తున్నవాడే జీవాత్మ. 'పరాప్రకృతిర్జీవభూతా' అని భగవద్గీత వర్ణించింది. పర మేశ్వరాభి వ్యక్తి రూపమైన యీ జగత్తులో; నానాత్వం ఈ జీవాత్మ కేంద్రములను బట్టియే వచ్చింది. సృష్టి విధానంలోని సంకోచ వికాస కార్యక్రమంతా వీటి మూలముననే నడుస్తూవున్నది. జీవాత్మ సృష్టికి అతీతుడై సృష్టివికాస కార్యక్రమమునకు అధ్యక్షం వహించి వుంటాడనీ, సృష్టియందు అతని ప్రతినిధి రూపములు ప్రవేశించి క్రమవికాసము నందుతూ వుంటాయని శ్రీ అరవిందులు వక్కాణించారు. అపర జీవరాసులలో ఆత్మ, ఆ జీవాత్మ ప్రతినిధియే. మానవునిలోని అన్నమయ, ప్రాణ మయ, మనోమయ పురుషులు - వీరికి వెనుకగా హృదయాంతరాళమున గల చైత్య పురుషుడు జీవాత్మ ప్రతినిధులే, వీరందరిలో, చైత్య పురుషుడు అత్యంత ప్రధానుడు. హృదయాం తర్వర్తియై మరుగున ఉన్న ఈ చైత్యపురుష జీవులకు వచ్చి సాధ నను చేపట్టినప్పుడే సాధన త్వరితగతి నందు కొంటుందనీ, అన్న, ప్రాణ, మనో మయ ప్రకృతుల విశుద్ధి పూర్వకంగా చైత్యపురుషుని ఊర్ధ్వగమనమే, సాధనను పరిపక్వం చేయగలదనీ, శిరస్సునకు పైగా, ఈ పరిణామమున కంతకూ అధ్యక్షత వహిస్తూ విశుద్ధరూపంలో జీవాత్మ విరాజిల్లు తున్నదనీ శ్రీ అరవిందులు వివరించారు.

బహిరంతర్వి భాగములతో దేహప్రాణ మనస్సులను ఆయన రెండుగా విడదీశారు. అంతర్విభాగమైన సూక్ష్మదేహంలోనే మూలాధారాం నుండి సహస్రారం వరకూ ఆయాస్థానాలలో అన్నప్రాణ మనోమయ చేతనలు నెలకొని వున్నాయన్నారు. మనస్సునకు పైనిదై, విజ్ఞానమయ చేతన శిరస్సున కూర్థ్వమున కలదనీ, మనోమయ చేతనలో, పై అంతస్తులుగా ఉన్నతమనస్సు - ప్రదీప్తమనస్సు - ప్రబుద్ధ మనస్సు కలవనీ, మనోవిజ్ఞానమయ చేతనల మధ్యమున సరిహద్దులో అధిమనస్సు ఉన్నదనీ అన్నారు. ఈ వివరాలన్నిటిలోకీ పోవడానికిచట తావులేదు. ముఖ్యంగా గమనించ వలసిన దేమంటే - ఇవన్నీ ఆయన తన సాధనానుభవంలో కనుగొని వివరించినవి గాని, ఊహించి చెప్పినవికావు. సాధన క్రమంలో ఒకప్పుడాయన నిరవధికశాంతి రూపమైన నిర్వాణాను భవంలో దీర్ఘకాలముండి, పిమ్మట అంతకంటె ఉన్నతమైన అను భూతులలోని కెట్ల ప్రయాణించినదీ ఒకచోట పూసగ్రుచ్చి నట్లు వర్ణించారు. చిత్ర విచిత్రములైన అనుభూతులకు తబ్బిబ్బై పోక - ఏ అనుభూతితోనూ ఆగిపోక, ప్రతిదానిని నిశితంగా పరిశీలించి విలువ కట్టి - సూక్ష్మ తాంశములతో సైతం వాటిని వాక్చిత్రాలతో చిత్రించి చూపే ఆయనబుద్ధి విశేషం నిజంగా అత్యంతాశ్చర్యకరం.

భవిష్యత్తులో ఆయన దర్శించిన విజ్ఞానమయ అతిమానవులతో పృథ్వి ఎప్పటికైనా విలసిల్లుతుందా, ఆయన లక్షించిన సిద్ధికి ఆయన జీవిత మెంతవరకు ప్రమాణ భూతమవుతుందా అను మొదలైన విషయాలు మనబోటుల ఊహకందనివి. ఈశ్వర సంకల్పం దుర్జ్ఞేయం - శ్రీ అరవిందులు పరమేశ్వరునికి పూర్తిగా సర్వసమర్పణం చేసుకొన్న మహనీయులని మాత్రం ఇచట గుర్తించుకోడం అవసరం. కాలమనంతం గనుక, ఈ పూర్ణయోగ లక్ష్యసిద్ధికి కాలమే ప్రయాణం కావలసి వుంటుంది. కాని శ్రీ అరవిందులు నాటిన యీ బీజం మాత్రం మొలిచి మొక్కయై, వృక్షమై శాఖోపశాఖలుగా కాలక్రమమున విస్తరిల్లక మానదు. ఆరోహణమే ముఖ్యాశయంగా గల ఇతర దర్శనములు, యోగములు జగత్తులో ఎప్పటివలె ప్రాబల్యం వహిస్తూనే వుంటాయి. ఈ పూర్ణయోగ దర్శనం వాటిని ఖండించదు. ఆరోహణంతో పాటు అవరోహణంకూడా సాధించవలసి వున్నదనీ, పృథ్విపై మనస్సున కతీతమైన విజ్ఞాన చేతనావతరణ సృష్టివిధానంలో గర్భితమైయున్న

రహస్యమును మాత్రం అది సందేశమిస్తున్నది. యోగపద్ధతికి ఆకర్షితు లయ్యేవారు సహజంగా కొద్దిమందే వుంటారు. కాయమును, అహంకారమును పూర్తిగా విడనాడి సర్వాత్మనా పరమేశ్వరునకు సర్వ సమర్పణ మొనర్చుకొన సిద్ధమగువారే ఈ యోగమునకు ఉత్తమాధికారులని మాత్రం గుర్తించవలసి వుంటుంది. ఆ మాట ఎట్లున్ననూ భక్తి జ్ఞాన కర్మలు మూడింటి సమన్వయము తోనూ నిర్మించబడిన యీ బాటలో సహజంగా గొప్పవైశిష్ట్యం లేకపోలేదు. అంతశ్శుద్ధి అనుసరిస్తే, 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్'.

# 2_వ అధ్యాయము

## పూర్ణయోగము - పరిచయము

(విద్వాన్. బి. నరసింహయ్య)

అరవిందబాబు, పాల్ పాండిచ్చేరి వెళ్ళినారు. అరవిందబాబు ఇదివరకు మూడు పర్యాయములు శ్రీమాతృదర్శనమునకై శ్రీ అరవిందాశ్రమమునకు వెళ్ళి యుండిన వారు. అతనికి శ్రీ అరవిందుల సారస్వతముతో పరిచయమున్నది. పాల్ విద్యావంతుఁడే కాని శ్రీమాతారవిందుల సారస్వతముతో పరిచయము కలవాఁడు కాదు. పైగా అతఁడు పాండిచ్చేరి వెళ్ళుట అదే మొదటిసారి. అచటి వాతావరణము వారికి హాయి గొల్పినది.

ఆ మఱునాటి యుదయము వారు శ్రీ అరవిందుల మహాసమాధిపై కుసుమ గుచ్ఛముల నిడి ప్రణమిల్లినారు. ఆ రమణీయ ప్రశాంతస్థానమున కొంతకాలము ధ్యానము సల్పినారు. ఆ తరువాత ఆశ్రమ కార్యదర్శిని కల్సికొని ఆశ్రమమునకు చెందిన పలుసంస్థల దర్శించుట కనుమతి పత్రము కొన్నారు. తొలుత "గోలు కొండ" భవనమును చూచినారు. ఆ పై శ్రీ అరవింద అంతర్జాతీయ విశ్వ విద్యాలయమును సందర్శించి ఆ సాయంత్రము ఆశ్రమ గ్రంథాలయమున గడపినారు.

మఱునాఁడు వారు శ్రీ అరవిందాశ్రమశాఖలైన వ్యవసాయక్షేత్రములు, కుక్కుట క్షేత్రము, పశుశాలలు, భారీ పరిశ్రమాగారములు, కుటీర పరిశ్రమలు, కళాక్షేత్రము, వంటశాల, ముద్రణాలయము, గ్రంథ ప్రచురణాలయములు, ఆయుర్వేద ఔషధాలయము మున్నగు వానిని నేత్రపర్వముగా తిలకించినారు.

ఆ సాయంత్రము వారు సముద్రపు టొడ్డున కూర్చొని ఇట్లు సంభాషించుకొన్నారు.

పాల్ :_ మిత్రమా ! శ్రీ అరవిందాశ్రమమును గూర్చి మీకెట్టి భావన కల్గినదో తెలిసికొన వచ్చునా ?

బాబు :- ఆశ్రమ మనగానే భారతదేశమందలి పూర్వపుటాశ్రమములు. ఆ పద్ధతుల మనస్మృతి పథమున మెదలుట సహజము. ఆ దృష్టితో - అపూర్వ నిర్ణీత భావాలతో మనము నేడు దర్శించు ఆశ్రమపు తీరుల కొలిచి చూచుట మనకు సహజ ప్రవృత్తి. బహుశ మీరట్టి భావనతో ఈ ప్రశ్న వేసియుందురని నేనను కొందును.

పాల్ :- ఔను, చక్కగా నూహించినారు.

బాబు :- శ్రీ అరవిందుల పూర్ణయోగము భౌతికమును తృణీకరించి కేవలము పారమార్థికమున కెగబ్రాకుట కాదు. ఏలయన ఈ దృశ్యజగత్తు సత్యవస్తువునకు - పూర్తిగా భిన్నమైనది కాదనియు, భౌతిక జీవితము ఆధ్యాత్మిక జీవితమునకు పునాది యనియు శ్రీ అరవిందుల భావన. అటులని పారమార్థిక జీవనమును విడనాడి కేవల భౌతిక భోగములకు లాలసులగుట వారంగీకరించిరని భావింప తగదు. భౌతిక జీవితమును దివ్యజీవనముగా పరివర్తన మొందింప వలెననుట వారి యాశయము. అపుడు యోగమునకు కర్మ విరుద్ధము కాక సహకారియగును. "Work is the bodys best Prayer to the Divine"- అనుట వారి కంగీకృతము" యోగః కర్మసు కౌశలం" అనియేకదా గీతాచార్యులు కూడ బోధించినది.

పాల్ :- కాని కొంతకాల మేకాంతమున నియమనిష్ఠలతో తపస్సాధన చేయనిదే సంస్కార జనితమైన మనస్సు నశించి ముక్తిచేకూరునా ?

బాబు :- తీవ్ర తపస్సు ద్వారా శరీరమును కృశింప చేయుట కాక యుక్తాహార విహారముల మూలమున భగవత్ప్రసాదిత జీవితమును మాధుర్యయుతముగను, భగవదుపకరణముగను సాగించుట యుక్తమని శ్రీ అరవిందులు తెల్పియున్నారు. కాని యిదియు నంత సులభ సాధ్యము కాదు. ఏలయన నిదియోగ సమన్వయ పద్ధతి. ఇందు భక్తి - జ్ఞాన-కర్మలు మూడింటికి ప్రాముఖ్యత గలదు. అసలు యేయోగమైనను కష్టమైనదే. అందును ఈ పూర్ణయోగము మరింత కష్ట సాధ్యమైనదని శ్రీ అరవిందులే నుడివి యున్నారు. సాధకుండు దివ్య చైతన్య శక్తిలో లీనమగుట మాత్రమే చాలదు. అతిమానస చైతన్యము అధోముఖమై సాధకుని యందలి యెల్లభూమికలలోను, తుదకు జడమయమైన శరీరమునందు కూడ ప్రసరించి వానిని దివ్యజీవనమునకు తగిన దివ్యసాధనములుగా పరివర్తన మొందింప వలెను. అందువల్లనే ఈ యోగము పూర్ణయోగమని పల్కిరి.

పాల్ :- "అతిమానసము" (Super - mind) అనునది శ్రీ అరవిందులు సృష్టించినది కాదా !

బాబు :- ఈ అతిమానసమును ఉపనిష దృషులు విజ్ఞానమనియు, వేద ఋషులు సత్యము, ఋతము, బృహత్తు అనియు పేర్కొని యున్నట్లు శ్రీ అరవిందులే తెల్పి యున్నారే !

పాల్ :- అయిన వీరొనర్చిన ప్రత్యేక కార్యమేమి ?

బాబు:- ఈ అతిమానస చేతనమును పార్థివ చేతన స్థాయికి అవతరింప చేయుట.

పాల్ :- అదివారు సాధించి యున్నారా ?

బాబు :- అవును. సాధింప బడినది. 1956 ఫిబ్రవరి 29వ తేదీన పై కార్యము జరిగియున్నట్లుగా శ్రీమాత 1960 పిబ్రవరి 29వ తేదీనాటి దివ్య సందేశమున ప్రకటించి యున్నారు.

పాల్ :- అటులైన ఈ భూతల మంతయు నిక స్వర్గధామముగా నగునట్టి సమయము సమీపములో నున్నట్లు భావింప నగునా ?

బాబు :- శ్రీ అరవిందులు గొప్ప ఆశావాదులు. ఈ విశ్వమంతయు దివ్య ధామము కాక తప్పదనుట వారి పరిపూర్ణ విశ్వాసము. కాని, విశ్వమంతయు నొక్కుమ్మడిగా దివ్యపరివర్తనము పొందగలదని తలంచుట భావ్యము గాదు. పరిణామ మనునది నత్తనడక వంటిది గదా ! ఈనాడు ప్రపంచము జడము మొదలు మనోగత ప్రాణియైన మానవుని వరకు ననేకదశలుగా నుండుట లేదా ? ఇట్లే అతిమానసము నందు కొన్నవారు "Super - men" కొందఱున్నను క్రిందితరగతుల ప్రాణి సమూహము నుండక పోదు. అనగా ఆ అతిమానస చేతనము పరిపక్వ స్థితిని పొందిన అర్హులైన వారి కుపయుక్తమగును. కాని అట్టి అత్యున్నత స్థితి నాశించుట, అందుకై సాధన సల్పుట ప్రతిమానవునికిని కర్తవ్యమనుట మఱువరాదు.

పాల్ :- ఈ పూర్ణయోగాభ్యాసమున సాధకుని ప్రాథమిక విధులేవి ?

బాబు :- 1. తృష్ణ (Aspiration) - అనగా దివ్యత్వమును పొందవలెననెడి తీవ్రమగు నుత్కంఠ సర్వదా కల్గి యుండవలెను.

2. తిరస్కారము. (Rejection) - అనగా దైవీతత్త్వము నుండి మఱల్చు ఆసురీభావముల పట్ల నాంతరము విముఖత చూపుట.

3. సమర్పణము (Surrender) - అనగా దివ్యజననికి సంపూర్ణముగా నాత్మార్పణము గావించు కొనుట. ఇవి దీని ప్రాథమిక విధులు.

పాల్ :- శ్రీ అరవిందుల పూర్ణయోగమునకును ఇతర యోగములకును గల ముఖ్య భేదమే మందురు ?

బాబు :- ఇతర యోగముల ధ్యేయము- సాధకుఁడు పరబ్రహ్మలో లీనమగుట; ఇది వారికి పరాకాష్ఠ. కాని శ్రీ అరవిందుల పూర్ణయోగమున కీదశ మొదటి మెట్టు (పూర్వార్ధము).

పాల్ :- అయినచో శ్రీ అరవిందులు పరబ్రహ్మానందాను భూతిబడసి ముందుకు సాగిరన్న మాట.

బాబు :- సందేహమేమి ? వారు ఒక్క సంవత్సరము కారాగారమున నున్నప్పుడే శ్రీకృష్ణ సాక్షాత్కారము పొందియున్నారు; బ్రహ్మానందానుభవమును బడసినారు. పరిణామము నిలకడలేక ముందుకు సాగు చుండునది కదా ! అందువలన మొత్తము విశ్వపరిణామముననే యొక నూతన దశను శ్రీ అరవిందు లందు కొన్నారు. అదియే అతిమానసము. (Super - mind), ఆ మహాచైతన్యశక్తిని - మనస్సు, ప్రాణము, శరీరము నను క్రింది భూమికలకు దెచ్చి దాని దివ్య స్పందనలచే వానిని కూడ దివ్యములుగా జేయుట వారి యాశయము.

పాల్ :- అయినచో శ్రీ అరవిందుల తపస్సు వారి వ్యక్తిగత ముక్తికి గాక మొత్తము విశ్వమునే దివ్యపథమున పురోగమింప జేయుట కన్నమాట !

బాబు :- ఆహా ! అక్షరాలా అంతియే.

పాల్ :- మరి...సాధనలో కూడ, ఇతరయోగ సాధకులను ఈ పూర్ణ యోగ సాధకులకును భేదముండును కదా ! దానిని కూడ కొంత స్థూలముగా వివరింపుడు.

బాబు :- నాకు తెలిసినంతవరకు వివరింతును. ఇతర సాధకులు - "అన్నమయ - ప్రాణమయ - మనోమయ" కోశములను, వాని యందలి వివిధ సూక్ష్మ భూమికలను వీడి నేరుగా ఆత్మచైతన్యమున లీనమగుటకు యత్నింతురు. భౌతికము

మాయాకల్పితమై అశాశ్వతమైన దని వారెంతురు. కాని పూర్ణయోగ సాధకులు భౌతికము కూడ యథార్థమైనదని విశ్వసించి, తమయందలి యే సూక్ష్మ భూమికలను గూడ వదలక క్రమముగా దివ్యత్వముతో వానిని పరివర్తన మొనర్ప యత్నింతురు.

పాల్ :- అయినను - భౌతికమును దివ్యత్వముతో మిళిత మొనర్చుట సాధ్యమా యనిపించు చున్నది.

బాబు :- వాస్తవమునకు జడము, చైతన్యము భిన్నములు కావని నేడు శాస్త్రజ్ఞులే అంగీకరించు చున్నారు కదా! పరిణామ వాదము మేరకు జడము నుండి వృక్ష జాలము, ప్రాణికోటి, బుద్ధి గతప్రాణియైన మానవుడు క్రమముగా అభివృద్ధి చెందిరన్నచో - తొలుత ఆ జడమున ప్రాణమనశ్శక్తులు దాగి యుండక తప్పదనుట అంగీకృతముకదా! వాస్తవమునకు దివ్యత్వము జడమున చొచ్చుకొని పోవుటయె తిరోభావము. అది మరల జడమునుండి మరలుటయే పరిణామము. అంతియేకదా!

పాల్ :- (సహర్షముగా) - బాబూ! నా సందేహమును తొలగించితిరి. నిజముగా శ్రీ మాతారవిందుల కృషి అద్భుతము అపూర్వము నైనది. ఈ బ్రహ్మాండ కార్యక్రమమున మనము నిర్వహించ దగు పాత్రయేమి?

బాబు :- శ్రీ అరవిందులు తెల్పిన సూక్ష్మ మార్గము సమర్పణము. మనము భక్తి ప్రపత్తులతో మనల శ్రీ మాతారవిందులకు సమర్పించు కొనుటయే. మన సమర్పణము నందలి సత్యహృదయత, తీవ్రతల ననుసరించి వారే మిగిలిన కార్యము నిర్వహింతురు.

పాల్ మహాశయుని మనస్సున "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ." అన్న గీతాశ్లోకభావము స్ఫురించినది.

"అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతంగమయ!
తత్సత్.

---

## 3_వ అధ్యాయము

# ప్రపంచ సమైక్యము - విద్యా విధానము

డి. వీరయ్య

ఈ ప్రపంచమున మానవ జీవిత మన్ని రంగములయందును సంఘర్షణలు ఎన్నియో కానవచ్చుచున్నవి. ఈ సంకట స్థితిని తొలగించుకొనుటకు భౌతికాధ్యాత్మిక శాస్త్ర సమ్మేళనమే మార్గమని బుద్ధిమంతులు వచించుచున్నారు. అందుకు తగు విద్యా విధానము, దాని సాధనయు ఆవశ్యకములు. విద్యకుగల నిజప్రయోజనముల దృష్టిలో నుంచుకొని శ్రీ అరవిందులు, శ్రీమాతయు అంతర్జాతీయ విద్యా కేంద్రము స్థాపించి బాల బాలికలకు విద్యా శిక్షణ నొసగుచున్నారు. సమస్త మానవ ప్రకృతి సంకీర్ణతను దృష్టిలో నుంచుకొని విద్యా విధానమును నిరూపించిరి. అందుచే దానికి "సంపూర్ణ విద్య" యని పేరు. విద్యా విధానమును 5 భాగములుగ విభజించి వాని శిక్షణా నియమములను ప్రపంచించిరి. మానవుని వ్యాపారమునకు ప్రధాన రంగములు అయిదు – దేహము, ప్రాణశక్తి, బుద్ధి, చిత్, అధ్యాత్మ. ఈ విద్యా దశలు అయిదును కాలక్రమమున వ్యక్తి వృద్ధి ననుసరించును. అవి జీవితాంతము వరకు అన్యోన్య పూర్ణముగా కొనసాగవలెను.

### శారీరక విద్య

సమస్త సంస్కృతికి సంపూర్ణతయే వాస్తవ లక్ష్యము. వ్యక్తి సాముదాయక సంపూర్ణతయే లక్ష్యమగుచో ఈ విద్యా భాగమును విడువరాదు. శరీరము భౌతికాధారము, ధర్మాచరణమునకు సాధనము. దివ్య జీవితమునకు 'సాముదాయక సంపూర్ణత' లక్ష్యము గావున శరీరముకూడ పరివర్తనము నందవలెను. దానివలన అయిదు విధముల ప్రయోజనములు గలవు.

1. దృఢారోగ్యవంత శరీరము : దేహ లోపములను, సమరూపమునలేని అవయవములను ఉచిత పద్ధతులచే సరిదిద్దుకొనవచ్చును.

2. బలము, సమర్ధత, కండరముల పుష్టి శారీరక సత్త్వము మాత్రమేకాక ప్రాణ శక్తిని ఆవశ్యక మగునపుడు ఉపయోగింప యోగ్యముగఁ జేయును.

3. ఇంద్రియ శిక్షణ : నేత్ర శ్రవణముల సూక్ష్మబోధ.

4. బలముతోపాటు దేహమునకు లావణ్యము, సౌందర్యము, సామరస్యము కలుగును. భౌతిక ప్రపంచమునకు ఆంతర్యము సౌందర్యము.

5. ఆత్మాధి పత్యము, శిక్షణ, ధైర్యము, విశ్వాసము, కలుగును. క్రీడా వ్యాయామాభ్యాసముచే తన ప్రవృత్తులను ప్రతిక్రియలను దౌర్బల్యములను నిగ్రహించుట సులభమగును. ఇవి లైంగిక శక్తి సంయమునకు తోడ్పడును.

6. సహకారము, నిష్పక్షపాతము, ఋజువ్యవహార శీలమును కలుగును.

శారీరక వ్యాయామములు, క్రీడలు – ప్రాణశక్తి, మానసిక రంగములపై తమ సత్ప్రభావమును జూపును.

## ప్రాణ—శక్తి విద్య

ప్రాణ–శక్తి పరస్పర క్రియా ప్రతి క్రియా శక్తిమయమగు విశాల సామ్రాజ్యము; మానవ జీవితమునకు, క్రియోద్దేశ శక్తికి కూడలి.

ప్రాణ–శక్తి జీవ స్వభావము. ఇందు కోర్కెలు, భావములు, ఇంద్రియ ప్రవృత్తులు, సంవేదనలు, క్రియాశక్తులు, కామేచ్ఛ, దాని ప్రతిక్రియలు, క్రోధము, లోభము, భయము, కాముకత మొదలయిన మానసిక ప్రవృత్తులుండును. ఈ సంకీర్ణ శక్తులను శిక్షించి వ్యవస్థీకరించుట శీల నిర్మాణమున కతి ముఖ్యమైనది. ఋజు సామరస్యవంత శీలమును పెంపొందించుకొనుటకు, తన దౌర్బల్యములను జయించి లోపములను తొలగించుకొను ఇచ్ఛను విద్యార్థికి బాల్యదశనుండియే మేల్కొల్పవలెను.

బాహిరమగు శిక్షణకై బాలుని బలాత్కరించిన యెడల వంచనచేయ యత్నించును. పాఠశాలయందు గృహమునందుగల నియమములకు తాత్కాలికముగ వశపడినను సమయము చిక్కినపుడు ఇచ్ఛానుసారముగ వర్తించును. ప్రాణ–శక్తి సమ్మతిలేనిచో బాహిర శిక్షణచే శీల నిర్మాణము చక్కబడదు. బాలుడు తప్పుచేసినపుడు, దాని నప్రయత్నముగ బాహాటముగా అంగీకరింపజేయుము. ఒప్పుకొనినపుడు

దయతో అనురక్తితో జూచి అతడు తిరిగి చేయకుండుటకై అతనియందు దోష మెచటనున్నదో చెప్పుము. అతనిని దూషింపరాదు. భయపెట్టినచో అసత్యమునకు త్రోవ చూపుటయగును. ఆచరణమున తప్పులను, జ్ఞానమున పొరపాటులను చేయుటకు కూడ స్వాతంత్ర్య మావశ్యకము. ఇట్లయినచో తప్పులనుండి పొరపాటుల నుండి విడివడుటకు స్వేచ్ఛవచ్చును. తనయందే తన క్రియకు ఒక యున్నత నియమ భావములను కనుగొనుటచే శక్తివంతమైన ప్రాణమయ పురుషుని సుగుణములు వెలువడగలుగును.

శీల నిర్మాణ శిక్షణ పిమ్మట సౌందర్య జిజ్ఞాస శిక్షణ ముఖ్యమైనది. ఇంద్రియములకు వాని వ్యాపారములకు చెందిన సామాన్య శిక్షణ పిమ్మట కళాసౌందర్య జ్ఞానమును విచక్షణను పెంపొందించుట ప్రారంభింపవలెను. సుందరము, సంగతము, సరళము, స్వచ్ఛమునగు వానిని ఎన్నుకొని పెంపొందించు సామర్థ్యము అలవరచవలెను. యదార్థమగు కళాసౌందర్య సంస్కృతి లాఘవకారియగు ప్రభావముల నుండి సంరక్షించును. ఈ సంస్కృతి, శీలముపై సత్ప్రభావమును కలిగియుండును. సౌందర్యము ద్వార దైవమును గాంచుటయే కళలకు ఉన్నత లక్ష్యము.

## మానసిక విద్య

విద్యయనగా మానసిక శక్తి శిక్షణయేకాదు. దివ్య జీవితమునకు మానవుని సంసిద్ధమొనర్చునది బుద్ధి విద్య ఇది ప్రధానదశల నైదెంటిని కలిగియుండును.

1. ఏకాగ్రతాశక్తి వృద్ధి – అవధానతా సామర్థ్యము.

2. విస్తారతా – విశాలతా – సంకీర్ణతా – సమృద్ధతా సామర్థ్యముల వృద్ధి.

3. జీవితమునకు మార్గదర్శకముగానుండు ఒక అతిదేదీప్య మానభావము, లేక యొక యున్నతాదర్శము, లేక యొకప్రధాన భావము చుట్టును భావముల సంఘటించుట.

4. చింతనా సంయమనము. అవాంఛనీయ చింతలను నిరాకరించుట. తాను కోరిన దానిని తానుకోరినపుడు మాత్రమే చింతింపగలుగుట.

5. మానసికమగు నీరవతావృద్ధి, సమగ్ర నిశ్చలత, ఉనికియొక్క యున్నత భూమికలనుండి వచ్చు ప్రబోధముల సమగ్రముగా గ్రహింప గలుగుట.

బాలుని నిరంతర భావ విక్షేపము విద్యాభ్యాసమున కొక యాటంకము. అతని కాసక్తికరమగు విషయముపై మనసు సావధానమగును. బాలుడు నేర్వవలసిన

విషయమునందు ఆశక్తిని కలిగించి కృషియందు అభిరుచిని కలిగించి పురోగతిని గూర్చి ఇచ్చను మేల్కొల్పుటయే సర్వశ్రేష్ఠ నియమము.

రెండవ దశయందు బుద్ధిని విస్తృతము, సమృద్ధము నొనర్పవలెను. బాలుడు పురోగమించిన కొలది ఎల్ల విషయములు ఎట్లు ఆసక్తికరములగునో చూపవలెను. దైనందిన జీవితమే విద్యా క్షేత్రము అగును; అది ఎల్ల పాఠశాలల కంటె ఉత్తమము. బాలురకు ఆరోగ్యకరమగు జిజ్ఞాసను కలిగించుటకు వారడిగిన ప్రశ్నలకు సదుత్తరము లీయవలెను. ఆసక్తికరములగు సమాధానములు బాలుని దృష్టినాకర్షించి అప్రయత్నముగా విద్యనార్జించుటకు దోహదముచేయును. జాగ్రత్తగా ఎంచిన పాఠ్య భాగములు ఆకర్షణీయముగానుండి, భావనాశక్తిని మేల్కొలిపి, సృజనాత్మక మానసిక శక్తిని వృద్ధిపొందించును. భావనాశక్తిచే పఠనము సజీవమగును. మనస్సు ఆనందమున అతిశయించును.

## చైత్య విద్య—ఆధ్యాత్మిక విద్య

ప్రతి మానవుడును తన సామాన్య జీవితావరణమును అతిశయించిన మహత్తర చైతన్య సంభవతను తనయందు గూఢముగా వహించును; నిత్య జీవితము ద్వార యాయున్నత విశాల జీవితమున పాల్గొనును. నిజముగా అసాధారణ వ్యక్తుల యందు ఈ చైతన్యమే యెపుడును వారి జీవితమును, పరిస్థితులకు తద్వ్యైయక్తిక ప్రతి క్రియను, వారి జీవిత పరిస్థితులను పరికల్పించును. అది బాహ్యచైతన్యాచ్ఛాదనముగుండ ప్రసరించుచు వ్యక్తికేంద్రమున దివ్యజ్యోతివలె ప్రకాశించును. చైత్య విద్యతో మానవ జీవితయదార్థ ప్రయోజనమును గూర్చి భూమిపై మనయునికి హేతువును గూర్చి తెలిసికొనవలెను. తన చైత్య సత్తను, హృత్పురుషుని, కనుగొని తద్వారా అనంత తత్త్వమునకు, ఆద్యంతములులేని దివ్యతత్త్వమునకు అర్పించుకొనుటయే మానవ జీవితపు పరమోద్దేశము. ఆ శిక్షణకు దోహదమొసగునదియే చైత్య విద్య.

రూప సహిత ప్రపంచమున అవిచ్ఛిన్నాఖండత్వము, ఎపుడును పురోగమించు మార్పు, నిరవధికావకాశము, అనంత కాలముగల అమృత జీవితమే చైత్య జీవితము. అయితే సృష్టిలో లేకుండ దేశకాలములకు అతీతముగనుండి శాశ్వతానంతత్వముల వసించుటయె ఆధ్యాత్మిక చైతన్యమునకు అర్థము. చైత్య పురుషుని

సమగ్రముగా నెరిగి చైత్య జీవితమును గడపుటకు స్వార్థపరతను నశింపఁజేసి కొనవలెను; ఆధ్యాత్మిక జీవితములో స్వ-రహితముగా నుండవలెను.

రూపము నతిక్రమించిన సీమలయందు ఒక నూతన శక్తి, ఒక నవచైతన్యము ఉత్పత్తియగును. దానిచే సంఘటనల మార్గము మారును. ఒక నవజగత్తు జన్మించును. అజ్ఞానము, క్లేశము, మృత్యువు-వీనికి పరిష్కారమునకు పరమాత్మలో విలీనమగుటకాదు; ప్రపంచమును పరివర్తన మొందింపవలెను. సంపూర్ణతను గూర్చి ప్రకృతి పురోగమనమున ప్రకృతి యారోహక ప్రస్థానముయొక్క సయుక్తికావిచ్ఛిన్నతచే, ద్రవ్య సమగ్ర పరివర్తనముచే నవరీతి వ్యక్తి ఆవిర్భవించును. అదియొక నూతనశక్తిని, ఒక నవచైతన్యమును, ఒక నవ ప్రభావమును కలిగించును.

ఇంతవరకును అయిదు రీతుల విద్యావిధానము గురించి చెప్పబడినది. విద్యాశిక్షణమున ఆత్మప్రయత్నము మాత్రమే చాలదు. సాధకులలోనికి దివ్యశక్తి అవతరణము కూడ ఆవశ్యకము. దివ్య పరిణామ యోగమార్గమును లోకమున శ్రీ అరవిందాశ్రమము వ్యాపింపఁజేయుచున్నది. తదనుబంధితమగు శ్రీ అరవింద అంతర్జాతీయ విద్యాకేంద్రము అందలి అంతర్జాతీయత సమస్త ప్రపంచ సంస్కృతుల సమ్మేళనముచే ఏర్పడినది. శ్రీ అరవింద నగరమునకు శంకుస్థాపన కూడ జరిగినది. బహు సంస్కృతుల సమావేశముచే వ్యక్తులయెడ, వారి సంస్కృతులయెడ, వారియెడ అన్యోన్య గౌరవమేర్పడును. వారి నందరిని నిరతిశయ సత్యమేశాసించును. అందరు శాంతితో సమరస భావముతో జీవింతురు. భాషలు, నాగరకతలు, సంస్కృతులు, మతములు, జాతులు, దేశములు, ఖండములు వేరువేరుగ బాహిరమునకు కానవచ్చినను అందు ఏకత్వము సహజముగా కలదు. భౌతిక శాస్త్రజ్ఞులు ద్రవ్యమునకు శక్తికి ఐక్యమునుసాధించిరి. రాజ్యాంగవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు ప్రపంచ సమస్యలను అఖండముగా పరిష్కరింపవలెనని, ఖండముగా పరిష్కరించుట అసాధ్యమని గ్రహించిరి. కళాకారులకు కవులకు సౌందర్యము ఎల్లయెడలను నిత్యముగా నున్నదని వచింతురు. పైకి కానవచ్చు మానసిక భావములకు వెనుక ఆధ్యాత్మికపు పునాదులపై ఆనందసామరస్యములున్నవి. అన్నియును నొకే యునికిచే ప్రకాశించుచున్నవని యోగులు స్వానుభవముచే వచింతురు.

ఈ ఐక్య భావము స్వతఃసిద్ధముగా నున్నది. మానవుని అహంకారముచే స్వార్థపరతచే వేరుగా కానవచ్చుచున్నది. కావున మరచిన యైక్యమును మరల

స్మరింపఁజేసి శాంతి మార్గమున ప్రపంచమును నిలిపి ఒక నవయుగోదయమునకు మానవులు, దేశములు తోడ్పడవలెను.

మానవులు సత్యమును ప్రత్యక్షముచేసికొనుటకు వస్తూత్పత్తి, ఐశ్వర్యము కొఱకు మాత్రమేగాక సమగ్ర క్రియానందనము కొఱకు ఉద్దేశింపఁబడును. తన యందు ఆత్మను సాక్షాత్కరింపజేసికొనినవాడు ఎల్లయెడలను ఆత్మ రూపమునే గాంచును. కావున అతడు పరమేశ్వరునే సేవించును. అపుడు మానవుడు తన వ్యక్తిత్వమును విశ్వ జనీనతయందు గాంచును.

మానవునకు వ్యక్తిత్వమెట్లో దేశమునకును వ్యక్తిత్వముండును. ప్రతి దేశమునకు జాతికి, భాష, నాగరకత, సంస్కృతి సామాన్యమగు ప్రతిభ, మతము, వాఙ్మయముండును. విశ్వ సమాఖ్యయందు వాని వ్యక్తిత్వమును కోల్పోకయే పరమ సత్య దర్మకత్వమున శాంతితో ఐకమత్యముతో పరస్పర గౌరవముతో జీవింపవచ్చును. ఈ మహాశయమును సాధించి జీవింప మానవులు సన్నిద్ధులగుటయే నేటి కర్తవ్యము.

---

## 4-వ అధ్యాయము

# శ్రీ అరవింద యోగస్వరూపము

—డా. దివాకర్ల వేంకటావధాని

బ్రహ్మసృష్టిలో మానవుఁ డుత్కృష్టుఁడుగ పరిగణింపఁ బడుచున్నాఁడు. ఇతర జీవులయందు లేని జ్ఞానమాతనియందుండుటయే యిందుకుఁ గారణము. ఆ జ్ఞానము సాహాయ్యమున నతఁడుత్తమస్థితి నందుటకు యత్నింపవలయును. అట్లు యత్నింపనిచో భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన జ్ఞానము నాతఁడు దుర్విని యోగము చేసిన వాఁడగును. మానవులు సాధారణస్థితి కతీతమైన యధ్యాత్మికౌన్నత్య మును బడయుటకై పూర్వులు పెక్కుమార్గములు కనుఁగొని యుండిరి ఆ మార్గ ములే మతములని పిలువఁబడు చున్నవి. వాని స్వరూపమును వివరించి చెప్పునవె దర్శనములు, స్థూలదృష్టికవి భిన్నములుగా గోచరించినను వాని యన్నింటికి లక్ష్యమొక్కటే, ఇది గ్రహింపఁ జాలక మానవులు తామనుసరించుమతమే ఉత్తమమనియు, దాని ననుసరించు వారే మోక్షమును బొందఁజాలుదు రనియుఁ జెప్పుచు నజ్ఞానముచే నొక్కొక్కప్పు డితర మతములను తదను యాయులను నిందించు చుందురు. దీని వలన పరస్పర ద్వేషములును, ధనమాన ప్రాణముల కపాయము కలిగించు మతకలహములును ఉప్పతిల్లు చుండును. నిజము పరికింప మానవులకు వాంఛనీయమైన యా యుత్తమ స్థితిలో మతములకుఁగాని ద్వేషములకుఁ గాని తావులేదు. అందుచే మానవు లితరు లనుసరించు మతములలో మార్గములనో నిరసించుటకు యత్నింపక తమకు మేలని తోఁచిన మార్గమును త్రికరణ శుద్ధిగా సక్రమముగా ననుసరించి తరించుటకు యత్నింప వలయును.

భారత దేశమందే కాక ప్రపంచమందలి యితర ప్రదేశములందును పెక్కు మతములున్నవి. అవన్నియు సత్యతత్త్వము యొక్క యేకదేశమును మాత్రము దర్శించి తాము కాంచినదే సత్యమనియుఁ దద్భిన్నమైన దసత్యమనియు ఘోషించు చున్నవి. మూల తత్త్వము చైతన్యమే యను విషయమున వివిధమతముల వారి

కైకమత్యమున్నను ఆ చైతన్యము ప్రపంచము నెట్లు సృష్టించు చున్నది? బహుత్వ భిన్నత్వము లెట్లు కలుగుచున్నవి? అను సంశయములందు వానికి వివాదము కలుగుచున్నది. మతము లన్నియుఁ గలిగించు ననుభూతి యేకైకమే యయ్యును దదనుభూతిని వర్ణించు పట్ల భిన్నమార్గములననుసరింపఁబడుటచే వానియందు భిన్న మేర్పడు చున్నది. ఇది మానవ బుద్ధి భేదముచేఁ గల్గిన విపర్యయము. ఏకత్వ నానాత్వములకు సామంజస్యము కల్పించి అనుయాయులకు సంపూర్ణ దృష్టి నొసంగఁ జాలు మతమే యుత్తమ మతము. అట్లే సగుణ నిర్గుణత్వములను, సక్రియత్వ నిష్క్రియత్వములను సమన్వయము చేసి పరిపక్వము నిర్వికల్పము నైన యనుభూతిని కలిగింపఁజాలునది ఉత్తమ యోగము. అట్టి యుత్తమ యోగమును ప్రపంచమునకుఁ బ్రసాదించిన మహనీయుఁడు శ్రీ అరవిందయోగి.

శ్రీ అరవిందుఁడు పలురంగములలోఁ గృషిచేసి వాని యన్నింట నపారమైన యనుభవము గడించిన మహామనీషి. ఆయన రాజకీయముగనే కాక ఆధ్యాత్మిక మునఁగూడ నొక నూతన సంప్రదాయమును బ్రవర్తింపఁ జేసిన ప్రతిభాశాలి. భారత దేశమునకు స్వాతంత్ర్యము చేకూరిన ఆగష్టు 15 వ దినముననే ఆయన కూడ నుద్భవించుట కేవలము యాదృచ్ఛికముకాదు. అది భగవత్సంకల్పము. భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించిన పిమ్మటఁ చేయఁ దగిన కార్యము ప్రపంచమునకు విజ్ఞాన ధర్మతత్త్వములను బోధించుటయే యని తలంచి భగవంతుఁ డాయనను పుదుచ్చేరికిఁ గొనివచ్చెను. భగవదభిష్టానుసారముగా నాయన యచ్చట మహాతపస్సు కావించి తాను సిద్ధుఁడై మానవలోకమున కంతకును సిద్ధిమార్గమును బ్రదర్శించెను. బాహ్య ప్రపంచములోవలె నాంతర ప్రపంచమునఁ గూడ విప్లవ మునకుఁ దావున్నదనియు, సమస్త భూమండలము నందును దివ్యజీవనమును స్థాపింప వలయుననియు బోధించుటకే శ్రీ అరవిందులవతరించి యున్నారు. వారి రచనలో భాషాప్రౌఢిమ యెంత గోచరించునో భావపాటవమును అంతగా గోచ రించును అవి సర్వకాలికములు, సర్వజనీనములు. ఉత్తమ జీవనము కాంక్షించు వారెవ్వరైనను వర్ణాశ్రమలింగ వయోభేదముతోఁ బనిలేకుండ వారి యోగము ననుస రించి తరింపవచ్చును.

మానవ ప్రకృతి యందన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానంద కోశములను నైదుకోశములున్నవి. వీనిలో మొదటి మూఁడింటిలో సచ్చిదానంత చైతన్య మభివ్యక్తము కానందున నవి లోపభూయిష్ఠములని చెప్పవలయును. ఉన్న

తములైన విజ్ఞానానంద మయకోశముల నధోగతములైన వీని కడకవరోహింపఁ జేసి వీనిని గూడ నున్నతములను గావించుటయే యోగముయొక్క లక్ష్యము. స్వభావము నంతను విజ్ఞానమయ మొనర్చి అతీత మానవ శక్తులను అధోభూమికలవఱకును గొనివచ్చుట ద్వారా వానిని గూడ దివ్యములుగా నొనరించుటయే మానవుని చరమసిద్ధినరుఁడు నారాయణుఁడగుట అరవిందయోగము యొక్క లక్ష్యము. ఇది యాత్మ సమర్పణముతో నారంభించి ఆత్మనివేదనముతో నంతమగును. ఇందలి జీవితము ప్రపంచమున నభివ్యక్తమగు దివ్యైక్యము యొక్క మాటరూపమే. మానవ జీవిత మంతయు నాత్మయొక్క యాధిపత్యమున నడవ వలయును. మానవులు తాము స్వర్గమున నెగఁ బ్రాకుటకుఁగాక స్వర్గమును మానవ లోకమున కవతరింపఁ జేయుటకు తీవ్రయత్న మొనర్ప వలయును. మరణానంతరము ప్రాప్తించునని చెప్పఁబడు ముక్తికిఁ గాక దివ్య విజ్ఞానమయముగా జీవితమును బరివర్తింపఁ జేయు నిట్టి పునర్జన్మమునకే నిరంతర సాధన జరుగ వలయును. మానవులు విజ్ఞాన భూమికను జేరినంత మాత్రమునఁ దృప్తినందక ఆ భూమిక యొక్క తేజచ్చైతన్య శక్తుల నవరోహింపఁ జేసి భౌతిక ప్రకృతిని మార్పఁజాలినపుడే అతిమానవులు కాఁజాలుదురు.

సగుణ నిర్గుణ బ్రహ్మములొకే పరబ్రహ్మము యొక్క రెండంశములే కాని కేవల భిన్నములుకావు. వానిని సమన్వయపఱిచి యాధ్యాత్మిక ప్రకాశము నందుటలో నాక్షేపమేమియు నుండఁజాలదు. ఆధ్యాత్మిక ప్రకాశ విద్యోత మానమగు సంఘమే దేశమునకును బ్రపంచమునకును శాంతి చేకూర్పఁ జాలును. అదిలేనిచో నది కేవల జడశక్తులతోఁ గూడిన యంత్రమేయగును గాని సంఘము కాఁజాలదు. ఆధ్యాత్మిక ప్రకాశమునకును సత్త్వగుణ స్ఫూర్తికిని నిలయములైన వ్యక్తులతోఁ గూడిన సంఘమభ్యుదయము నవలీలగా సాధించును. మానవుఁడు స్వకీయ మోక్షమునకే కాక సంఘ మోక్షమునకును బ్రయత్నము చేయవలయు. సమష్టి కల్యాణమునకై వ్యక్తి సౌఖ్యమును ధారవోయుట మహాపురుషుల ధర్మమని రామావతారము బోధించుచున్నది. వ్యక్తి సౌఖ్యముకంటె సమష్టి సౌఖ్యమును, భౌతిక సౌందర్యముకంటె నైతిక సౌందర్యమును ఉదార తరములనుటలో విప్రతిపత్తిలేదు. ముక్త జీవన మనఁగా జగమును విడిచి మఱేలోకమునందో వర్తించుటకాదు. ప్రపంచమంతయు భగవన్మయ మనియుఁ దాను భగవద్భిన్నుఁడు కాఁడనియుఁ దెలిసికొన్న ముక్తజీవుఁడు సంఘమును వీడిపోవనవసరము లేదు. ముక్తజీవులే నిజమైన సామ్యవాదులు.

సంఘమునందును, సంసారమునందును ఉండియు నప్రమత్తుఁడుగాక గుణాతీతుఁడై వర్తింపఁ జాలువాఁడే ధీరశబ్ద వాచ్యుఁడు. నీతి నియమరహితములైన బాహ్య సామ్యవాద సిద్ధాంతములు ప్రపంచమున శాంతి నెలకొల్పఁ జాలవు.

అమృతత్వమనఁగా జిరజీవిత్వముకాని మరణరాహిత్యము కాని కాదు. సర్వ లౌకికాభీష్ట సంసిద్ధి సహితమైన దీర్ఘజీవిత మమృతత్వమనుకొనుట భ్రాంతి మూల కము. నిజమున కది. కొంతకాలమునకు విసుగు పుట్టించును. భగవన్మయము దివ్య తేజోమయము నైనస్థితియే అమృతత్వము. ఇది స్వల్పకాల భోగ్యమైనను చింత లేదు. భౌతికశరీరమును గూడ దివ్యతా శోభితము కావించి దానిని దివ్యకర్మముల కును దివ్య జీవనమునకును సాధనముగాఁ జేయుట నిజమైన అమృతత్వము. విజ్ఞానమయ పరివర్తనమువలన అమృతత్వసిద్ధి చేకూరును. ఆత్మ ప్రభావముచే మానవ స్వభావమును బవిత్ర మొనరించుటకు దివ్యపరిణామమని పేరు.

శ్రీ అరవిందుల యోగమీ దివ్యపరిణామమునకు రాచబాట. దీనివలన జీవ న్ముక్తి భగవదుప లబ్ధులు మాత్రమే కాక అనిర్వాచ్యశక్తి సంభరితమైన దివ్య చైతన్యము కూడ చేకూరును. మానవ చైతన్యమును దివ్యచేతనతో సమప్రకాశ మొనరించుటయే దివ్యపరిణామము. మనః ప్రాణభౌతిక చేతనలకుఁ బైనిదివ్యచేతన పరిస్ఫుటముగాఁ బ్రకాశించు చున్నది. దీనిని క్రిందికవరోహింపఁ జేయవచ్చునని పలువురు మహనీయులను భావపూర్వకముగా నిరూపించిరి. ఏతద్దివ్య చేతనావతర ణము తప్ప దివ్యపరిణామమునకు వేఱుమార్గము లేదని శ్రీ అరవిందుల యోగ ముద్ఘోషించు చున్నది. ఇది సంపూర్ణమున సర్వలోక శాంతి సంధాయకమునగు విజ్ఞాన యోగము.

# 5–వ అధ్యాయము

## శ్రీ మాత

—రచయిత : శ్రీరాములు

మహాపురుషుల జీవితములను గుఱించి వ్రాయుట సాహసము. గంగావాహిని యందలి నిగూఢ మర్మములను మహాత్ములను తటి పైనుండి పరిశీలించినంత మాత్ర మున కనిపెట్టుటకు ఎవరికి శక్యము ? కాని గట్లను దాసిసాగునిండు జలప్రవాహమును కనులార గ్రోలహృదయములో నుండి ఆనందము వెల్లివిరిసి భావప్రకటనకై మనయందొక అప్రయత్న ప్రేరణము కలుగును. అప్పుడు మనము తెలిసీ తెలియని మాటలలో మన భావములను ప్రకటించుటకు పూనుకొందుము. జలములు జరజర ప్రవహించుట నీటిపై నురుగులు తేలియాడుట చెట్లుచేమలు కొట్టుకొని పోవుట మొదలు గాగల యనేక బాహ్య విషయములను గమనించి వివరింతుము, కాని అంత ర్వాహినిలోని లోతుపాతులనుగాని అందలి జీవరాశులను గాని, వాని మాహాత్మ్యమును గాని మనము గ్రహించలేక పోవుటయేగాక గమనింపను గూడలేము, ఆ ప్రవాహము ఎచ్చట – ఎందుకు మందగించి, ఎచ్చట – ఎందుకు మేటవేయు చున్నదో – ఎక్క డెక్కడి మణులను ఎక్కడెక్కడకు కొట్టుకొని పోవుచున్నదో ? ఏ ప్రదేశములను దాకి ప్రపూతములను చేయుచున్నదో ఏ ప్రదేశముల నంటకయఘమయములను చేయుచున్నదో బాహ్య పరిశీలకులకు తెలియదుగదా ! అటులనే అంతర్ముఖ దివ్య జీవనమున నున్నత శిఖరముల నందిన మహాత్ముల జీవితములు నిగూఢములై సాధారణ మానవుల కందుబాటులో లేక జ్ఞానవాహిని యంతర్వాహినివలె సాగిపోవు చుండును. ఒకానొక సమయములో శ్రీ అరవిందులను ఒక ఆశ్రమవాసి వారి జీవిత చరిత్ర వ్రాయుటకు అనుమతి కోరగా వారిట్లునుడివిరి. "నీకుగాని మరియెవరికి గాని నాజీవితము గురించి యేమియు తెలియదు. ఏలయన, నదిపూర్తిగా నంతర్ముఖము, ఇందలి సత్యము ప్రతి మహాత్ముని జీవితమునకును వర్తించును. అటులనే శ్రీ అర విందాశ్రమము నందలి మాతృశ్రీ యొక్క జీవితముకూడా మహోత్కృష్టమైన ఆధ్యాత్మిక జీవితమై యున్నది. తల్లిగారు తన జీవితమును గురించి బాహ్యముగా

చూచుటకు అతిసాధారణమైన దనియే చెప్పుకొని యున్నది. కాని అంతర్దృష్టితో పరిశీలించిన అందు గంగా ప్రవాహమునందు వలె మహిమోన్నతమైన విషయములు అల్పులకగోచరములైనవి కలవు.

## శ్రీ మాత

2. శ్రీమాత ఫ్రాన్సు దేశమునకు చెందిన సంపన్న గృహస్థులయింట పుట్టి విద్యావంతురాలైన సాధ్వీమణి. ఆమె చిన్ననాటి నుండి ఉన్నత స్థాయినందిన ఆధ్యాత్మిక అనుభూతులను పొందెను. అవి, తన వ్యక్తిత్వమునకు సంబంధించినవే గాక, యావత్ప్రపంచమునకును చెందినవై యున్నవి. ఆమెతన 13వ యేటనే ఒక సంవత్సరకాలము ప్రతిరాత్రియు ఈ దిగువ వివరించిన అనుభూతిని పొందుచుండెను.

3. తాను శయ్యపై పరుండి నంతనే తన అంతరాత్మ తనశరీరము నుండి వెలికి వచ్చి గృహోపరిభాగమునకు, అటునుండి గ్రామోపరిభాగమునకు నెగసి అక్కడ ఒక దీర్ఘమైన చక్కని బంగారు వన్నెగల దుస్తులను కల్గి, ఆ బంగారు అంబరము తన చుట్టును విశాలమైన ఆవరణకు విస్తరిల్లగా నలుమూలలనుండి పెద్దలు, పిన్నలు, రోగులు, దుఃఖితులు, మగవారు, ఆడవారు ఆ విస్తరించిన చెరగు క్రిందకు చేరి మ్రొక్కుకొనినట్లును ఆ వస్త్రమువారి నాచ్ఛాదించి వారి బాధలను నివారించి సుఖసంతోషములతో నిండినవారినిగా మార్చి పంపివేసినట్లును కార్యకలాపము లనుభూతములగు చుండెను. ఆ సమయములో ఆమె ప్రక్కనున్న ఒక ముదుసలి మహానుభావుడు దీర్ఘమైన ఊదారంగు దుస్తులలో నుండి ప్రోత్సహించుట కూడ జరుగు చుండెను.

4. అట్లు ఆమె తెలియకయే అపూర్వమైన ప్రేమ మూర్తిగా భాసిల్లి అలౌకికానుభూతులచే తీర్చిదిద్దబడి దీనమానవోద్ధరణకు నాయకురాలుగ రూపొందింపబడుటకు నాంది జరిగెను. చిన్ననాడే దుఃఖభూయిష్ఠమైన భూభార విమోచనమే ఆమెకు ప్రధాన కర్తవ్యముగా గోచరించెను.

5. ఆమె ఫ్రాన్సు దేశములో నున్న కాలములో అక్కడి జిజ్ఞాసువులతో జేరి ఒకచిన్న సంఘముగా ఏర్పడి తత్వవిచారములు చేయుచుండెడిది. ఆ సంఘమున కామెనాయకురాలుగా, పరిశోధనలను, సాధన కార్యక్రమములను సాగించినది. ఆమెతో సంభాషణ భాగ్యము కల్గి సందేహనివృత్తికై అనేకులు వచ్చు

చుండిరి. ఆమె చక్కని ఉపమానములతో, చిన్నకథలతో, మృదుమధురమైన మాటలతో వారి మనసులను వికసింపజేసి పంపుచుండెడిది.

6. శ్రీమాత ఫ్రాన్సు దేశములో నున్న కాలములోనే, యమనియమాదుల నాచరించి, ధ్యానతత్పరత గల్గి, చిత్తవృత్తుల నిరోధించి, ప్రశాంతతను పొందిన సిద్ధమూర్తియయి యుండెను. ఆమె ఆచరణకు నిత్యజీవితమొక సమ్మెగా, దినచర్య యందలి ప్రతిజీవితాంశ మొకసుత్తి దెబ్బగా, యోగాభ్యాసముచేసి అసిధారావ్రతముగా జీవితము ననుష్ఠించి, సిద్ధిని సాధించిన మహావ్యక్తి; ఆమె సర్వతోముఖ పరమేశ్వర సాక్షాత్కార నిత్యత్వము సాధించవలెనను ఆకాంక్షతో సర్వతోముఖ సాధనసాగించిన దిట్ట. ఆమె తన ప్రార్థనలను, ధ్యానములను వాచాపల్కుటయేగాక వాటిని లిఖించుటకు ప్రేరేపింపబడి అట్లు కొన్ని సంవత్సరములు తేటతెల్లములైన మాటలలో తన భావపరంపరను చెక్కు చెదరని ముద్రలలో నిమిడ్చినది. అవి ప్రథమములో ఫ్రెంచి భాషలో పుస్తక రూపమున వెలువడినవి. వానియందు ఆమెయొక్క ఆధ్యాత్మిక సాధనమందలి క్రమత్వము, సంపూర్ణత్వము గోచరించును అదిగాక ఆమెకు సాధనయందు సంభవించిన క్లిష్ట పరిస్థితులు వాటిని ఆమె ఎట్లు - ఎదుర్కొనినదియు తెలియనగును. ఆ పొత్తము శ్రీమాత ఆధ్యాత్మిక జీవితమునందు అందుకొనిన ఉన్నత స్థాయిలకును, ఆ తపశ్శక్తులతో దిగివచ్చి మానవ దైనందిన జీవితరంగములలో తీర్చిదిద్దిన విధానములకును, ఎనలేని నిదర్శనమై యున్నది. అందు ఆమెహృదయముయొక్క ఆర్ద్రత, వైశాల్యము, ఆమె మేధయొక్క సూక్ష్మత, విషయవిమర్శనానిపుణత, ఆమె ఆధ్యాత్మిక దృష్టి ఆదర్శముల యొక్క సమగ్రత సర్వతోముఖ సమన్వయము కాననగును. మరియు ఆమె పరమేశ్వరునితోతాదాత్మ్యము, సర్వసృష్టితో ఐక్యముకల్గి విరాజిల్లు దైవీసంపత్తితో నిండిన మహావ్యక్తిగా ప్రతివారికిని చెప్పకయే చెప్పుచుండును.

7. శ్రీమాతకు మనదేశమన కడుప్రేమ. 1914 వ సంవత్సరములో ప్రాచ్య దేశయాత్రలు చేయుచు మార్చినెల 29 వ తేదీన పుదుచ్చేరిచేరినది. శ్రీ అరవిందులను దర్శించినంతనే, తాను కలలుగన్న ఆధ్యాత్మికపరిణామము సిద్ధించగలదను నమ్మకము, ఈ ప్రపంచముపై ఆ మహానుభావుని ఉనికిచే, జడత్వము, అజ్ఞానములతో కరడుగట్టిన యీ భూమి దివ్యతేజస్సుతో ప్రకాశించ గలదను మనోధైర్య మామెకు చిక్కెను. శ్రీ అరవిందుల సందర్శనముతో ఆమె జీవితము నందొక మేలిమలుపు తిరిగెను. అప్పటిలో ఆమె శ్రీ అరవిందుల సాన్నిధ్యములో కొంతకాలముండి

తిరిగి 1920 వ సంవత్సరం ఏప్రియల్ 24 వ తేదీన వచ్చి శ్రీ అరవిందుల ప్రత్యక్ష గురుత్వములో స్థిరముగ నుండెను. తదాది ఆమె యోగసాధనచేసి వెనుకటి అనుభవములకు విభిన్నమైనట్టియు, అపూర్వమైనట్టియు, నూతన స్థాయిలనందుకొని. ఆమె ఆధ్యాత్మిక జీవితము క్రొంగ్రొత్త చిగుళ్ళను తొడగెను. ఆమె శ్రీ అరవిందుల బాహ్య వ్యాపారములలో బాధ్యత వహించుచు ఆశ్రమస్థాపనకు తోడ్పడెను.



8. శ్రీ అరవిందులును, మాతృశ్రీ తపశ్శక్తిని, ఉత్కృష్టమైన దైవీగుణ సంపత్తిని గుర్తించి, తనను ఆశ్రయించిన శిష్యులకు జిజ్ఞాసువులకును, ఆమె వెలుగుబాటలు తీర్చిదిద్దునట్లు ఏర్పాటు చేసెను. ఆమె వ్యష్టి, సమష్టి, ద్వంద్వా తీత చైతన్యమూర్తియై ఆశ్రమవాసులయొక్క వ్యష్టిసమష్టి జీవితములను సువిశితముగా తీర్చిదిద్ది శ్రీ అరవిందుల యోగసమన్వయ సూత్రములను ఆశ్రమ జీవితము నందమర్చి సత్యశోధన సాగించుచుండెను. శ్రీ అరవిందులును మాతృశ్రీయొక్క ఆధ్యాత్మికమూర్తిని, దేదీప్యమానమగు దివ్యమంగళతేజోమూర్తిగా నిరూపించి ప్రకటించుట కాయన ఇట్లు "మాత" (The mother) అను శీర్షిక క్రింద ఒక మహత్తరమైన ఉద్గ్రంథమును క్లుప్తముగ సూత్రప్రాయమైన భాషలో రచించెను. అది ఆశ్రమవాసులకు యోగసమన్వయ ఉపాసనను విశదీకరించుటయేగాక, ఉపాసనా లక్ష్యలక్షణము లైన మాతృదేవియొక్క సర్వతోముఖ దివ్యవక్తిత్వమును వివరించి వర్ణించెను. అందుపరిపూర్ణమైన యోగశక్తితో మూర్తిభవించిన మాతయే, ఆశ్రమ పీఠమునధిష్ఠించి నడిపించుచున్న శ్రీమాత.

9. శ్రీ అరవిందులకును, వారి ఆశ్రమవాసులకును, జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో, శ్రీ అరవిందులు అనేక సందర్భములలో శ్రీమాతను గురించియు తనను గురించియు తెలిపియున్నారు.

## 6–వ అధ్యాయము

# దివ్య జీవితము, అర్థవంతమైన సృష్టి

—డి. అర్క సోమయాజి

సృష్టి అర్థవంతమైనది; మానవ జీవితముకూడ అర్థవంతమైనది. దేహబద్ధమైన చైతన్యము దేహముతో నశింపదు. ''ఉన్నతిం నిఖిలాజీవాః ధర్మేణైవ క్రమాదిహ, విదధానా స్వావధానాలభంతేంతే పరం పదం'' సమస్త జీవులు నిసర్గము చేతనే జన్మ పరం పరలో ఔన్నత్యమును సంపాదించుకొను చుండుట. ఉద్భిజ్జములు, స్వేదజములు, అండజములు, జరాయుజములు క్రమ క్రమముగా ఉన్నతిని సాధించిన జీవులు – మానవుఁడు కూడ జరాయుజములలోని వాఁడె – మానవుడై పుట్టినను, అతనియందు కొంత పాశవాంశము, కొంత మానవాంశము, కొంత దైవాంశము నుండును. పాశవాంశమును అనగా ఆహారనిద్రా భయమైథున మాత్ర పరత్వమును క్రమముగా పరిహరించుకొని, మానవాంశమును, దాని కంటె నిద్రాణమైన దైవాంశమును పెంపొందించుకొనువాఁడే ప్రాజ్ఞుఁడు. మానవులలో పెక్కుమంది కేవల జీవితైకరతిలో పర్యవసన్నులగుటకు హేతువు వారికి జీవితములో సాధ్యాంశమున్నదను జ్ఞానము లేకపోవుటయే. జీవితము బుద్బుద ప్రాయమైనను, అందు సాధనీయాంశమున్నదని గ్రహించువాడు అర్థవంతమైన జీవితమును జీవించును – కేవల మనఃప్రవృత్తి ప్రకారమే జీవితముగడుపువాఁడు పశుభిన్నుఁడు కాడు. "కావ్యశాస్త్రవినోదేన కాలోగచ్ఛతి ధీమతాం, వ్యసనేనచమూర్ఖాణాం నిద్రయా కలహేన వా'' కావ్య హస్త్రాదిజ్ఞాన సంపాదనా పరత్వము తద్ద్వారా ఆధ్యాత్మిక జీవన వాంఛా బుద్ధిమంతుని లక్షణములు. వ్యసన నిద్రా కలహాది ప్రవృత్తి మూర్ఖ లక్షణము – విద్యా సంపాదనము మానవత్వ లక్షణము – ఆధ్యాత్మిక విద్యా సంపాదనము దైవాంశ లక్షణము – సృష్టి రహస్యములను, అనగా సృష్టి హేతువులను, సృష్టి ప్రయోజనమును, సృష్టి పరమావధిని జిజ్ఞాసించు వానిలో దైవాంశముద్బుద్ధమైనది – నేనెవఁడను, నాకీ జీవితములో కర్తవ్యమేమి, నాకును జగత్తునకు సంబంధమేమి, దారాపుత్రాదులెవరు, ఈ జీవితమునకు పూర్వాపరములేవి, మరణాంతరము

నా చైతన్య మేమగును'' ఇట్టి జిజ్ఞాసతో జీవించువాఁడు సార్థక జీవుఁడు – అట్టి జిజ్ఞాసకే బ్రహ్మజిజ్ఞాస అనిపేరు–ధర్మ జిజ్ఞాస, తదనంతరము బ్రహ్మజిజ్ఞాస ఆధ్యాత్మిక జీవిత లక్షణములు – ఎంతటి విద్వాంసునికైనను దేహాభిమానము, మృత్యుభీతి తప్పవు – మృత్యుభయములేని వానికే దేహాభిమానము సడలును – మృత్యుభయములేనివాడు అమరుఁడన దగును – అట్టివాఁడు మృత్యువును మోహమనియే భావించును – శుకయోగిని జనక మహారాజు 'సంధ్యా వందనముచేయని బ్రాహ్మణుఁడవా నీవ'ని ప్రశ్నింప 'మృతా పితామహే మాయా, జాతో విజ్ఞాన బాలకః, సూతకే పాతకే ప్రాప్తే కథం సంధ్యా ముపాస్మహే హృదా కాశే చిదాదిత్యోభాసతే హినిరంతరం నాస్తమేతి, నచోదేతి కథం సంధ్యాముపాస్మహే'' అని సమాధానము చెప్పినాఁడట! అనగా, మా నాయనమ్మ అగు మాయ చనిపోయినది. విజ్ఞానమను కొడుకు పుట్టినాఁడు, పురుడు మైలి వచ్చినదికదా! సంధ్యావందన మెట్లుచేతుము? అదియుఁగాక నా హృదయాకాశమందు చైతన్య స్వరూపమైన సూర్యుఁడు ఉదయాస్తమయములు లేక ప్రకాశించుచున్నాఁడు. కావున ఉదయకాలిక సంధ్యావందనము, అస్తీకాలిక సంధ్యావందనము, అందుచేత మాధ్యాహ్నిక సంధ్యావందనము అర్థరహితములే గదా!'' అని వాక్రుచ్చినాఁడట! అట్టి శుకయోగిని కన్న భారతమాత ధన్యమైనది – వ్యాస శంకరాదులను, వాల్మీక్యాది మహాకవులనుగన్న భారతమాత ధన్యమైనది. నేటి భారతీయులలో ఎంతవరకు భారతీయత్వమున్నదో మృగ్యము – ఆదిభౌతిక జీవితమే జీవితమనిభావించుట అవిద్వల్లక్షణము – ఇంద్రియ జ్ఞానైకపర్యవ సన్నత పశుత్వ భిన్నముకాదు – అతీంద్రియలోకములు గలవనియు, అతీంద్రియ జ్ఞానమున్నదనియు తద్విషయక జిజ్ఞాసయు మహాత్ముల లక్షణము – అతీంద్రియ జ్ఞానోదయమైనవారు 'ఆవిర్భూత ప్రకాశు'లనఁబడుదురు (Men to whom the eye of Intuition has opened)- వారికి అతీతానాగత జ్ఞానము ప్రత్యక్ష భిన్నముగాదు. వారు ఆర్షనేత్రముతో అతీంద్రియ అసంవేద్య విషయములను గూడ జూడగలరు. ''అవ్యాహతజ్యోతి రార్షంతే చక్షుః ప్రతీభాతి' అని భవభూతి వాల్మీకి విషయములో చెప్పిన వాక్యమున కర్థమిదియే.

నేటి పాశ్చాత్య శాస్త్రజ్ఞులు చాలమంది అజ్ఞేయవాదులు (Agnostics) – వారి అభిప్రాయమేమన మానవుఁడు సృష్టిరహస్యమునుఁగాని, జీవిత రహస్యమునుగాని పూర్తిగా తెలిసికొనఁజాలడు – ఎంతటి విద్వాంసుఁడైనను 'A Child crying in the night, A child crying for the Light, only with a cry' అను

నట్లు దీపము కొఱకు విలపించు పసి పిల్లవాఁడు మాత్రమే. అంధకార మందుంచఁ బడిన బాలుఁడు దీపము చూపించగానే ఊరకొనును, అనగా వానికి దీపము కావలయునన్నమాట. కాని దీపము కావలయునని వాక్కుచేతగాని, మనస్సుచేతగాని తెలిసికొనలేదు - వాని యందు గుహా నిహితమైన జీవాత్మ దీపము కొఱకు విలపించినది. ఆ విషయము వాని మనస్సునకు గూడ తెలియదు - మానవులందరు అట్టి వారే గదా! ఆనంద భ్రాంతితో మానవుఁడు జీవితమును వ్యయీకరించుచున్నాఁడు - ఆ ఆనందమెట్టిదో తెలియదు - ఏది శాశ్వతానందమో ఎరుగ జాలడు - నశ్వరములైన ఆనందములలో మృగతృష్ణికాభ్రాంతిలో పడినవాఁడగును - మానవుఁడు చెంగల నీటిలోనికి తోలఁబడిన పశువువంటివాఁడు - మేయవలసిన కాలమందు నెమరు వేయుచున్నవాడు - సద్వినియోగము చేయవలసిన జీవితమును వ్యర్థము చేయుచున్నవాఁడు- "There are many more things in Heaven and Earth than our philosophy dreams of" అతీంద్రియ విషయములెన్నియేనిగలవను విషయము ఎంతమందికి తెలియును. మనకు కనిపించు ప్రపంచమే ప్రపంచమనియు, మనము జీవించు జీవితమే జీవిత మనియు భావించువారెందరోఁగలరు. అట్టి భావన సంకుచితమైనది. నేటి పరమాణుశాస్త్రము, జగత్తు అంతయు తరంగాత్మక శక్తియని చెప్పుచున్నది - మనకు కనిపించు ఘట పటాదులు వాస్తవము అట్టివికావు. అవి పరమాణు పుంజములు. ఆ పరమాణువులు ఘన పదార్థములుగావు. తరంగాత్మిక శక్తి స్వరూపములు - మానవునికి సూక్ష్మదర్శనము (Microscopic vision) ఉన్నచో మనకు కన్పట్టు ఘట పటాదులు ఘట పటాదులవలె కన్పట్టవు - కావున జగత్తు జగత్తువలె భాసించుచున్నను దాని యథార్థ స్వరూపమట్టిదికాదు. మన ఇంద్రియ జన్య జ్ఞానము అయథార్థ జ్ఞానమన్నమాట (Refracted Consciousness) వస్తువుయొక్క యథార్థానుభవము ఇంద్రియ జన్యజ్ఞానమువల్ల పుట్టదు.

మానవుఁడు బాహ్యార్థజ్ఞాన ప్రవృత్తిలోనే పర్యవ ధానన్నుఁడగు చున్నాఁడు. పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః ఇంద్రియములను బాహ్యార్థ జ్ఞాన ప్రవృత్తములనుగా విధి సృజించెనట! అంతర చైతన్య ప్రకాశమునకు మానవుని నేత్రము అంధమైనది - ఇట్టి అంతర చైతన్య విషయక జిజ్ఞాసయే బ్రహ్మ జిజ్ఞాస - ఒకానొకప్పుడు ప్రచారములోనున్న యీ బ్రహ్మజిజ్ఞాస నేటి భారత దేశములో నామ మాత్రమై యున్నది - ఇట్టి మార్గమును మనకుపదేశింప నవతరించిన శ్రీ అరవింద యోగి, శ్రీమాతృదేవి మన జాతికి వందనీయులు.

## మానవ పఠన సంస్థయొక్క ప్రచురణములు

1. శ్రీ దివ్యమాత : శ్రీ మాతయొక్క 90 వ జన్మదిన సంచిక
2. శ్రీ మాతారవిందుల గురించి శ్రీ అరవిందుల ప్రవచనములు
3. శ్రీ అరవిందులను గురించి శ్రీ మాత ప్రవచనములు
4. అగ్ని కుండము—శ్రీమాత
5. శ్రీ మాతృ వాక్కులు 4-వ మాల
6. భారతదేశమును గురించి శ్రీ మాత ప్రవచనములు
7. Sapphires of Solitude (Poems in English) by Dr. V. Madhusudan Reddy,
8. Sri Aurobindos' Philosophy of Evolution by Dr. Madhusudan Reddy
9. The Flame of Truth : Edited by Prof. V. K. Gokak and Dr. V. Mandhusudan Reddy
10. History As The Future by Sisir Kumar Mitra

## మానవ పఠన సంస్థయొక్క త్రైమాసిక పత్రికలు

1. New Race (in English)
2. సువర్ణ యుగము,

ఈ గ్రంథములను కావలసినవారు ఈక్రింది అడ్రెసుకు వ్రాయగలరు.

ప్రచురణ శాఖా మేనేజరు
మానవ పఠన సంస్థ
ఉస్మానియా విశ్వవిద్యాలయ క్యాంపెస్
హైద్రాబాదు - 7